Islam ki Daawat
(Telugu)

# ఇస్లాం పిలుపు

మూలం:

**మౌలానా సయ్యిద్ జలాలుద్దీన్ ఉమరి**

అనువాదం:

**ఎస్.ఎమ్. మలిక్**

# విషయసూచిక

# ఉపోద్ఘాతం

ఇస్లామ్ దైవం అవతరింపజేసిన ధర్మం. నేటి మానవుడు పరమ ప్రభువు పట్లను, ఆయన ధర్మం పట్లను ప్రమత్తుడయి ఉన్నాడు. అయితే ఇది చరిత్రలో కొత్తదేమీ కాదు. ఇది చాలా పురాతన వ్యాధి. మానవుడు ఎన్నో సార్లు అల్లాహ్ నుండి విముఖుడయ్యాడు, ఆయన ధర్మం పట్ల ఏమరుపాటుతో వ్యవహరించాడు. ఇది కూడా ఒక సత్యమే. మానవుడు ఏమరుపాటుతో వ్యవహరించినప్పుడల్లా అతన్ని జాగరూకపరిచేందుకు దేవుని సదాచారులయిన దాసులు ప్రయత్నం చేశారు, అతన్ని ధర్మం వైపునకు మరల్చడానికీ కృషి చేశారు. కాని ఈ యుగంలో ఎదురయిన పెద్ద దురవస్థ ఏమిటంటే, మానవుణ్ణి తట్టి లేపడానికి ఏ సముదాయానికి బాధ్యత అప్పగించబడిందో, దైవధర్మం మానవులందరికీ అందజేసే ఆదేశం ఇవ్వబడిందో అది తన విధిని గుర్తించలేకపోతోంది. నిజానికి ఈ సముదాయానికి దీని స్పృహ కూడా లేదు. దైవాన్ని మరచిన ఈ ప్రపంచంలో తాను ఎంత ఘనమయిన కార్యభారం నిర్వహించవలసి ఉందో అది గుర్తించడమూ లేదు. అది దాదాపు మరణశయ్యపై నిద్ర పోతోంది. దానితోపాటు లోకమంతా దైవం పట్ల ఏమరుపాటుకు లోనయి మృత్యు లోకంలో పడిపోయింది.

ఈ సముదాయానికి ఒక గతం ఉంది. అప్పుడు పరమ ప్రభువు అల్లాహ్ చివరిసారిగా తన ధర్మం అవతరింపజేసి దాన్ని తన దాసులయిన మానవులందరికీ అందజేయమని ఆదేశించాడు. దాన్ని సమున్నతపరచమని, దానికి సర్వాధిక్యత లభించేలా కృషి చేయమని ఆజ్ఞాపించాడు. జనులను ప్రసిద్ధ మేళ్ళ కొరకు పురికొలపాలని, చెడులన్నింటి నుండి నిరోధించాలని, శుభమార్గం చూపమని చెడుల నుండి ఆపమని, ప్రపంచం నుండి అక్రమాన్ని, దుర్మార్గాన్ని, దౌర్జన్యాన్ని నిర్మూలించమని, న్యాయాన్ని, సమతను స్థాపించమని పురమాయించాడు. ఈ సముదాయం అల్లాహ్ ఇచ్చిన ఈ ఆదేశాన్ని మనఃపూర్వకంగా విన్నది. దాని పరిపూర్తికి సన్నద్ధమయింది. ప్రతీపశక్తులు దాన్ని అణగద్రొక్కడానికి ప్రయత్నించాయి. అన్ని విధాలా దాన్ని ఎదిరించాయి. కాని అది దృఢ సంకల్పంతో రంగంలో నిలకడను రుజువు చేసింది - దైవేచ్ఛనయినా నెరవేర్చాలి లేదా తన సర్వస్వాన్నీ ఈ మార్గంలో ధారపోయాలి, ప్రాణాలను సయితం సమర్పించాలి అన్న సంకల్పంతో నిలబడింది. అది దాని ఈ సంకల్పంలో తన సత్యతను రుజువు చేసుకుంది. అందువల్ల ప్రతీపశక్తులు కడకు పరాజయాన్ని స్వీకరించక తప్పలేదు. తిరస్కారం, మిథ్యావాదుల పతాకం తలవాల్చింది. దైవధర్మం జయమొందింది. చెడు చీకట్లు పరారయ్యాయి. మంచి పొద్దుపొడిచింది. ఇదీ ఈ సముదాయానికి చెందిన సరయిన స్థితి.

చాలా కాలం వరకు ఈ సముదాయం ఈ స్థితిలో నిలకడగా ఉండింది. తరువాత దీనికి పతనావస్థ ఆవహించింది. ఇందులోని అసహనం, మిథ్యకు ఎదురుగా నిలబెట్టిన అసహనం, దీని దృఢసంకల్పం, ఉత్సాహం అణగారిపోయాయి, ఈ గుణాల వల్లనే దైవధర్మానికి సమున్నతి లభించింది; ఇప్పుడు దీని ఉద్వేగం, ఉద్రేకం చల్లారిపోయాయి, ఈ గుణాల కారణంగా ఒకప్పుడు యావత్ ప్రపంచంలో అలజడి మొదలయింది; తప్పుడు భావాలు, ఆలోచనలు, వక్రమయిపోయిన నాగరికత, సామాజిక వ్యవస్థ, భంగమయిన నైతికత, మురిగిపోయిన రాజకీయ వ్యవస్థ– వీటి కేంద్రాలు కంపించిపోయాయి. కాని నేటి ఈ పరిస్థితి ఏర్పడిన తరువాత ఇస్లామ్ ఇతర స్థానాల్లో వ్యాపించడం అలా ఉంచి స్వయంగా ఈ ఉత్తమ సముదాయంలోనూ ఇస్లామ్ ప్రభావాలు సన్నగిల్లసాగాయి. ఇంత జరిగినా మొత్తానికి ఈ సముదాయంలో ఇస్లామ్ సిద్ధాంత సూత్రాలపైన విశ్వాసం తగ్గలేదు. దీని చట్టాల ఔన్నత్యాన్ని అది అంగీకరిస్తుంది. ఇస్లామ్ మాత్రమే మానవుని జీవితం మొత్తాన్ని, దాని వ్యవహారాలను నిర్దేశించగలదన్న విషయం పట్ల ఈ అనుచర సముదాయానికి ఎలాంటి తిరస్కార భావం లేదు, ఇక్కడ ఇస్లామ్ పరిపాలన మాత్రమే సాగాలన్న విషయాన్నీ అది తిరస్కరించదు. ఈ సముదాయం లోపల అంతర్గతంగా ఈ ధర్మం సర్వోన్నతంగా అలరారడానికి అవతరించిందా లేదా అది ఇతరులకు లొంగిపోయి కూడా మనగలదా అన్న చర్చలు జరగవు; ఇది సమున్నతమవడం అవసరమా లేదా ఇది ఇతరుల పాలనాధికారాన్ని అంగీకరించాలా అన్న వాదనలు తలెత్తవు; ఇది అసత్య వాదాలను ఎదురొడ్డి పోరాడటం సరయినదా లేదా మిథ్యావాదాలతో సంధి చేసుకోవడం సమంజసమా?

మనం నివసిస్తున్న కాలం బహుశా ఈ అనుచర సమాజం పతనావస్థకు చేరిన అధమాతి అధమ కాలమేమో. ఈ కాలంలో సముదాయం ఆచరణాత్మకంగానే కాదు సిద్ధాంతపరంగానూ పతనావస్థకు చేరింది. ఇందులో ఇస్లామ్‌కు ఆధారభూతాలయిన సిద్ధాంతాలూ, సూత్రాల పట్లనే అనుమానాలు ఆశంకలు ఉన్న వ్యక్తులు ఉన్నారు, కాదు అతి శీఘ్రగతిన వారు అధికమవుతూ ఉన్నారు కూడా. ఈ అనుచర సముదాయాన్ని దైవం ఏ మహోన్నత కార్యం కొరకు నియోగించాడో వీరు దాని మహత్తును అర్థం చేసుకోవడంలో కూడా విఫలురయ్యారు. ఇస్లామ్ ధర్మం వైపునకు పిలుపునివ్వడం, దాన్ని సంస్థాపించ డానికి, సమున్నతపరచడానికి ఎటువంటి కృషి జరపడం కూడా వీరి దృష్టిలో మతిచలిం చిన పని. వీరి కార్యక్రమాలలో ప్రపంచంలోని ప్రతి పనికి చోటుంది, వారు దాని కొరకు ప్రయత్నమూ చేస్తారు కాని ధర్మసందేశానికి, దాన్ని సమున్నత పరిచే కృషికి అందులో ఎటువంటి స్థానం ఉండదు. మిథ్యావాదాన్ని కదలించడం, దానికి వ్యతిరేకంగా

నిలబడటం వీరి సిద్ధాంతాలకు వ్యతిరేకం. తిరస్కార భావానికి ప్రియమయిన విషయాలను విమర్శించడానికి వారు అంగీకరించరు. సమకాలీన అధికార సత్తాకు అయిష్టమయిన ప్రతి చర్యకు దూరంగా మెలగాలని వారు కోరుకుంటారు, అదే శ్రేయస్కర మార్గమని భావిస్తారు. దైవం ఏ శుభాన్నయితే ప్రపంచంలో సర్వసామాన్యం చేసేందుకు ఆదేశించాడో దాని భావనే వారి మస్తిష్కాలకు దూరమయిపోయింది. అంతేకాదు, ఇప్పుడు ఈ సముదాయంలో ఇస్లామ్ పేరిట దాన్నే రూపుమాపుతున్న వ్యక్తులూ ఉన్నారు. ఈ సముదాయానికి దాని జీవిత పరమార్థం వైపునకు మరలమని మీరు పిలుపునిస్తే ఇందులో మిమ్మల్ని ధర్మం పట్ల అజ్ఞానులని, ఏమీ తెలియని మూర్ఖులని ఎత్తిపొడిచే 'ఉత్తమ పురుషులు' ఉన్నారు. దైవధర్మాన్ని అన్ని వైపులా వ్యాపింపజేయాలని, దాన్ని సమున్నత పరచాలని, దానికి మీ సర్వశక్తులు ధారపోయాలని సముదాయాన్ని మీరు కోరినట్లయితే, మిమ్మల్ని ధర్మంలో ప్రక్షిప్తాలకు పాల్పడుతున్నారని చెప్పే మేధాసంపన్నులూ ఉన్నారు. ఖుర్ఆన్‌లో ఇటువంటి పరివర్తనకు, మార్పుకు మార్గం చూపే ప్రతి వచనానికి మరో వ్యాఖ్యానం చేయగల పరిశోధకులూ ఇందులో నేడున్నారు. ముస్లిమ్ సముదాయంలో ధర్మాన్ని పునరుజ్జీవింపజేసేందుకు చేసే, అపమార్గంతో సంఘర్షణకు సిద్ధపరిచే ప్రతి కృషిని ధర్మంలోనే పరివర్తనగా పరిగణించే ప్రబుద్ధులున్నారు. వాస్తవానికి దైవధర్మం నేడు ఎంతగా బాధలకు పీడనలకు గురయి ఉందో అంతగా బహుశా మరే జీవన సిద్ధాంతమూ లేదేమో. దీనిపైన దౌర్జన్యం జరిపే వారు, దీన్ని తిరస్కరించేవారు మాత్రమే కాదు, దీన్ని నమ్మేవారు సయితం దీనిపైన అత్యాచారానికి పాల్పడుతున్నారు. అది పరుల ఘోరాలనూ భరిస్తోంది తన వారి దుర్మార్గాలనూ సహిస్తోంది.

ఈ సముదాయంలో ఆదర్శవంతమయిన కాలం ఎప్పటి వరకు గడిచింది మరెప్పుడు, ఎలా పతనం ప్రారంభమయింది అన్న చారిత్రక ప్రశ్న ఇప్పుడు చర్చనీయాంశం కాదు. దీని తొలి దశ ఎంత కాలం, మలిదశ చరిత్రలో ఎప్పుడు సంభవించింది, నేటి సైద్ధాంతిక, ఆచరణాత్మక పతనానికి గతంతో ఏమయినా సంబంధం ఉందా, దీని చిహ్నాలు చాలా కాలం మునుపే ప్రారంభమయ్యాయా లేదా అవి ఈ కాలపు ఆలోచనలు, సిద్ధాంతాల ప్రభావమా, రాజకీయ, సాంస్కృతిక లొంగుబాటు ఫలితమా? అన్న ప్రశ్నలన్నీ పరిశోధించవలసిందే, అది ప్రయోజనకరమే కాగలదు. కాని వాస్తవానికి ఈ సముదాయం ఉన్నతి తరువాత అకస్మాత్తుగా పతనానికి లోనవలేదు, అది ఒక క్రమంలో పతనావస్థకు చేరింది. దీన్నే ఇక్కడ కొన్ని దశల్లో వివరించడం జరిగింది.

దీనితోపాటు మరో యదార్థం ఏమిటంటే, ఇస్లామీయ చరిత్రలో ప్రతి కాలం లోనూ, సముదాయంలో ఉత్పన్నమయిన సంక్షోభాలను పరీక్షా విపత్తులను ఎదుర్కొన్న వ్యక్తులు, సంఘాలూ ఉండేవి. ఏ తప్పుడు ఆలోచనలు తత్వాలు తలెత్తినా వాటికి సమాధానంగా హేతుబద్ధ, చారిత్రక ఆధారాలతో ఇస్లామ్ సత్యతను వారు నిరూపించారు,

సమాజ సంస్కరణ ప్రయత్నాలను కొనసాగించారు. ధర్మప్రచార బాధ్యతనూ నిర్వహించారు, దాని సమున్నతి, ఆధిక్యతా భావాలను సజీవంగా ఉంచారు. నేటికీ సముదాయం ఒడిలో ఇటువంటి వ్యక్తులు, సంఘాలకు కొదువ లేదు. ధర్మసందేశ కార్యం కొనసాగుతోంది. ఇస్లామ్‌ను సమున్నతపరిచే తపన ఆంతర్యాల్లో ప్రజ్వలిస్తోంది. ఈ ఉద్దేశ్యంతో రచయితలు బాగానే వ్రాశారు. ప్రామాణికమయిన, విలువయిన సేవలు అందజేశారు. ప్రస్తుత రచన విషయం కూడా అదే. ఇది చాలా అల్పమయిన ప్రయత్నమే అయినా ఈ పుటల్లో ఈ విషయానికి చెందిన ప్రతి కోణాన్నీ చర్చించడం జరిగింది. ఈ విషయంలో ఉత్పన్నమయ్యే దాదాపు ప్రశ్నలన్నింటికీ సమాధానమివ్వడం జరిగింది. అందువల్ల అనేక ఘనమయిన వేర్వేరు గ్రంథాల్లో ఉన్న సమాచారం ఇందులో ఒక్కచోటనే ప్రాప్తమవుతుందన్న నమ్మక ముంది. ఇంకా ఇందులో కొన్ని కొత్త కోణాలూ దర్శనమిస్తాయి. అలా ఇదొక సమగ్రమయిన రచనగా రూపొందింది. ఇందులో ముఖ్యంగా నాలుగు చర్చలున్నాయి. మొదటిది, దైవసందేశహరుల విధుల వివరణ. దైవసందేశహరులు ప్రపంచంలో ఎందుకు ప్రభవిస్తారో తమ మహత్తర విప్లవాత్మక కార్యాన్ని ఎలా నిర్వర్తిస్తారో చెప్పడం జరిగింది. దైవసందేశహరుల ధ్యేయమే ఈ ముస్లిమ్ సముదాయం ధ్యేయం గనక ఇది తెలుసుకోవడం చాలా అవసరం. ఈ ధ్యేయాన్ని సాధించేందుకు దైవప్రవక్తల ఆదర్శం వెలుగులోనే ముందుకు సాగవలసి ఉంది. రెండవది, ఇస్లామ్ సందేశానికి సంబంధించింది. ఇందులో తొలుత ఈ కార్యం ఎటువంటిదో, దాని స్థానం ఏదో విశదపరచడం జరిగింది. ఆ తరువాత ఇస్లామ్ అనుసరణను గురించి బలంగా బోధించడం జరిగింది, ఎందుకంటే, అదే లేకపోతే సందేశకార్యం నిష్ఫలమయిపోతుంది. ఆ తరువాత సందేశక్రమం, దాని సూత్రాలు, నియమాలు, మర్యాదలు, దాని సఫలతానిష్ఫలతల భావనలను గురించి చర్చించడం జరిగింది. చివరన దైవధర్మాన్ని ఎందుకు తిరస్కరించడం జరుగుతుందో చెప్పడం జరిగింది, ఎటువంటి వారికి దైవధర్మం ప్రాప్తమవుతుందో అన్న విషయాలు సూచించబడ్డాయి. మూడవది, మానవుణ్ణి ఈ సందేశ కార్యానికి అర్హుణ్ణిగా చేసే లక్షణాలను పేర్కొనడం జరిగింది. అవి మనిషిలో పాదుకొనడం ఈ కార్యసిద్ధికి అవశ్యమయినవి. నాలుగవదీ చివరిదీ అయిన చర్చ, సందేశానికీ సంస్థకూ గల సంబంధాన్ని తెలుపుతుంది. అలాగే ఈ ఇస్లామీయ సంస్థను పటిష్ఠం చేసే సుగుణాలేవో అవి ఏ విధంగా బలపడతాయో తెలుపుతుంది.

నేను ఈ పుస్తకంలో ఏ సమస్యపైనా పూర్తిగా శాస్త్రీయ, పరిశోధనా రీతిలో చర్చ జరపలేదు. నా అభిప్రాయాలను చాలా సీదాసాదాగా సరళమయిన భాషలో ముందుంచడానికి ప్రయత్నించాను. దైవం తన అనుగ్రహంతో దీన్ని స్వీకరించాలని, దీని ద్వారా ఆయన దాసులకు లాభం ఒనగూడాలని వేడుకుంటున్నాను.

**జలాలుద్దీన్**

**8-11-1968**

# ఉపోద్ఘాతం (ఏడవ ముద్రణ)

ఇస్లామ్ పరమ ప్రభువు తన దాసులకు పంపిన సందేశం. అది భూతలాన ఉన్న సకల మానవులకు ఒక పిలుపు. దివ్యఖుర్ఆన్, ఈ పిలుపునకు లక్ష్యం, దాని విధానం, ఇహపర లోకాలలో దాని ఫలితాలను చాలా విశదంగా, వివరంగా తెలిపింది. దైవసందేశ హరులు ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లమ్) పవిత్ర జీవిత చరిత్రలోను, ఆయన ప్రవచనాలయిన హదీసుల్లోనూ ఈ విషయంలో అత్యుత్తమ మార్గదర్శనం ఉంది. నేను ఖుర్ఆన్, హదీసుల వెలుగులో ఈ విషయాన్ని ఎంతగా ఏ విధంగా అర్థం చేసుకోగలిగానో దాని విభిన్న కోణాలను ఈ పుస్తకంలో వీలయినంత ఉత్తమ రూపంలో సమర్పించ ప్రయత్నించాను. నేను ధర్మసందేశాన్ని ఓ సజీవ విషయంగా దర్శించాను, అదే రూపంలో దాన్ని ఇక్కడ ముందుంచాను. ఈ పుటల పఠనం వల్ల ఇస్లామ్ పిలుపునకు సంబంధించిన విశదమయిన భావన ప్రస్ఫుటమవుతుందన్న నమ్మకం నాకుంది. ఇంకా సందేశ కార్యం కొరకు ఉత్సాహం, ఉద్వేగం, ప్రజ్వలన కూడా ఏర్పడుతుంది. ఈ పుస్తక శైలిని బట్టి కొందరు మిత్రులు దీన్ని మన సాహిత్యంలో బలమయిన పుస్తకంగా పేర్కొన్నారు. ఎప్పుడయినా నేను దీని పుటలు తిరగవేసినప్పుడు అక్కడక్కడ నా కళ్ళు చెమ్మగిల్లుతాయి, బిడియం చోటు చేసుకుంటుంది, నా చిన్న నోటితో ఇంతేసి మాటలు చెప్పానా, ఒక బలహీన, అశక్త వ్యక్తి ఇంతటి సంకల్పం, సుస్థిరతల పాఠం చెప్పడమా అనిపిస్తుంది.

ఈ పుస్తకం నేటికి ముప్ఫయి నాలుగు సంవత్సరాల ముందు 1968లో రచించ బడింది. మన దేశంలో ఇప్పటి వరకు ఆరు ముద్రణలు వెలువడ్డాయి. ఇతర దేశాల్లోనూ ప్రచురణ జరిగింది. కొన్ని చోట్ల సందేశ కార్యం నిర్వహించే కార్యకర్తల ప్రణాళిలో దీన్ని చేర్చడం జరిగింది. దీని తెలుగు అనువాదం చాలా కాలం ముందే ప్రచురించబడింది.★ ఇప్పుడు పునఃపరిశీలన తరువాత ఈ పుస్తకం ప్రచురించాలని నేను కోరుకున్నాను. ఈ కారణంగా కొన్నేళ్ళుగా దీని ప్రచురణ జరగలేదు. దైవానుగ్రహం వల్ల ఆ సేవ కాస్తా పూర్తయింది. నేను పూర్తి పుస్తకాన్ని పునఃసమీక్షించాను. భాష భావాల రీత్యా మెరుగు పరచడానికి ప్రయత్నించాను. చర్చనీయాంశాల్లోనూ ఎంతో కొంత సవరణ జరిగింది, కొన్నింటి క్రమాన్ని మార్చడమూ జరిగింది, కొన్నింటిని సరికొత్తగా వ్రాయడం జరిగింది, ముఖ్యంగా సందేశ కార్యకర్తల లక్షణాల భాగంలో కొత్త అంశాలను చేర్చడం జరిగింది. నా మరో రచన 'ఇస్లామ్-ఏక్-దీనె దావత్' లోని కొన్ని భాగాలను ఇందులో చేర్చడం

★ *ఇది మరో అనువాదం. (అను)*

జరిగింది. పుస్తకం ఇప్పుడు ముందుకన్నా ఎంతో మెరుగయిపోయింది. దీని పుటలూ పెరిగాయి. మనిషి చేసే ఏ కార్యమయినా తప్పులు దొరలనిది కాజాలదు. జ్ఞానులు ఇందులోని కొరతలను గురించి తెలుప ప్రార్థన. ముమ్ముందు దీన్ని సంస్కరించడం సాధ్యమవుతుంది. పరమ ప్రభువు సత్ఫలితాన్నిస్తాడు. నేనూ కృతజ్ఞుణ్ణి అవుతాను.

కొందరు దీన్ని అనువదించాలని కోరారు, పునఃపరిశీలన తరువాత అలా చేయవచ్చని నేను వారిని కోరాను. ఇప్పుడు వారు దీన్ని అనువదించవచ్చు.

'దావత్' (ధర్మసందేశం) అన్న ప్రధాన విషయంతో మరో ఉద్గ్రంథం రచన జరుగుతోంది. అందులో ఇస్లామ్ పిలుపునకు సంబంధించిన కొన్ని శాస్త్రీయ, ఆలోచ నాత్మక కోణాలను వెలుగులోకి తెచ్చే ప్రయత్నం జరుగుతుంది. శైలి కూడా శాస్త్రీయ, విశ్లేషణాత్మకమయిందిగా ఉంటుంది. అది చాలా వరకు పూర్తయింది. మిగిలిన భాగం కూడా త్వరగా పూర్తి కావాలని దైవాన్ని వేడుకుంటున్నాను, మీరున్నూ దుఆ చేయాలని అభ్యర్థిస్తున్నాను. దైవం దానికి తగిన సద్బుద్ధి ప్రసాదించుగాక. ఆయన సకల విషయాలపైనా అధికారంగలవాడు.

**జలాలుద్దీన్**
**24-9-2002**

పరమ ప్రభువు ప్రత్యేక దయ వల్ల ఈ పుస్తకానికి జనంలో స్వీకృతి ప్రాప్తమయింది. దీని అనువాదం పట్ల కూడా కొందరు మిత్రులు పూనుకున్నారు. దీని పునఃపరిశీలిత ముద్రణకు కన్నడ భాషలో అప్పుడే ముద్రణ జరిగింది. ఇంగ్లీషులోనూ Inviting to Islam అన్న పేరుతో అనువాదం జామిఅ దారుస్సలామ్, ఉమరాబాద్ వారు ప్రచురిం చారు. కొన్ని ఇతర భాషల్లోనూ అనువాదం జరుగుతోంది. ఈసారి నేను పుస్తకం పైన మరోసారి దృష్టి సారించి మరిన్ని మెరుగులు దిద్దడానికి ప్రయత్నించాను. దైవం ఈ ప్రయత్నాలనన్నింటినీ స్వీకరించుగాక.

**జలాలుద్దీన్**
**20-1-2007**

# విన్నపం

ఒక కాలంలో ఇస్లామ్ అపార్థాల కారుమబ్బుల్లో మసకబారిన చంద్రునిలా కానవచ్చేది. నేడు మబ్బుల్లో నుంచి బయటపడి అపవాదాల బాణాలకు రక్తసిక్తమయి దర్శనమిస్తోంది. ఎవరికి ఇష్టం వచ్చినట్టు వారు దాని రూపాన్ని వికృతం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఇటువంటి అవస్థ ఇస్లామీయ వ్యవస్థకు కొత్తేమీ కాదు, మునుపు కూడా ఇస్లామ్ పరిశుద్ధ రూపానికి చేతనయినంత మురికి పులమడానికి పూనుకున్న వారు లేకపోలేదు. ఏ కాలంలో ఎన్నెన్ని అపార్థాలు, అపోహలు, అపవాదులు, అపనామాలతో అపకీర్తిపాలు చేయడానికి ప్రయత్నించినా ఈ దాడులన్నింటినీ తట్టుకుని, అప్పుడప్పుడు త్రిప్పికొట్టి నిలకడగా నిలువగలిగింది ఇస్లామ్ ఇంత కాలం. ఇప్పుడూ అంతే. రెండవ ప్రపంచ యుద్ధానంతరం నిద్రాణమయి ఉన్న ముస్లిమ్ జగత్తు మేల్కొని, కళ్ళు నులుము కుని, ఆవులించి అంగలు చాచే వరకు దాదాపు యాభయ్యేళ్ళు ఇట్టే గడిచిపోయాయి. సముదాయాల చరిత్రలో యాభయ్యేళ్ళకు అంతగా ప్రాముఖ్యత లేకపోయినప్పటికీ రాకెట్లు, కంప్యూటర్ల ఈ యుగంలో ఈ స్థితి అంతగా అభిలషణీయం కాదు. ఇంతకూ చెప్ప వచ్చిందేమిటంటే, ముస్లిమ్ ధర్మవేత్తలు, మేధావులూ జాగరూకులయ్యే వరకు తమను తాము గొంతు దాకా మురికి కూపంలో ఇరుక్కున్నట్టు గమనించారు. ఆదరాబాదరగా తాము అంతా తుడుచుకుని అభ్యంగన స్నానం చేయడంతోపాటు ఇస్లామ్ శ్వేతాంబరాలకు అంటిన బురదను, ఇస్లామ్ తనువుకు తగిలిన గాయాలను మాన్పడానికి ప్రయత్నాలు ముమ్మరంగా కొనసాగించారు.

మన నాట కూడా ఈ ప్రయత్నాలు బహుముఖంగా జరుగుతున్నాయి. ఎన్నో ప్రచురణాలయాలు ప్రారంభమయ్యాయి. ఇస్లామ్ సందేశ కార్యక్రమాలు ఎందరెందరో ఎన్నెన్నో విధాలుగా చేస్తున్నారు. సంతోషకరమయిన విషయమే. ప్రతి ఒక్కరూ తమకు తోచిన రీతిలో ఈ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

కార్యక్రమాలు ఉధృతంగా సాగుతున్నాయి. సందేశం అందరికీ అందజేయాలన్న తపన, అభిలాష, ఉత్సాహం, ఉద్వేగం మాత్రం ఆంతర్యంలో ఉత్తుంగ తరంగమానమయి పొంగుతోంది. ముస్లిమ్ సముదాయంలో ఈ నవ చైతన్యం జాగృతమవడానికి ప్రేరణ

కల్పించిన బాహ్య, అంతర్గత పరిస్థితుల అధ్యయనం వేరే ఒక ప్రత్యేక రచన ద్వారానే సాధ్యం. ఈ విన్నపంలో దానికి అవకాశం లేదు. అయితే ప్రస్తావిత ప్రయత్నాలకు దిక్కూ లేదు, ముక్కూ లేదు అని ఒక్కోసారి అనిపిస్తుంది. ఇస్లామ్ సందేశం ఖుర్‌ఆన్ నిర్దేశించిన దిశలో, దాని సందేశహరులు ప్రబోధించిన మార్గాన ప్రస్థానమవ్వాలి. ఎవరో నడిచిన, మరెవరో నడుస్తున్న బాటన అడుగులు వేయటం ఈ సందేశానికి పొసగని విధానం. ఈ పుస్తకంలో ఇస్లామీయ సందేశంతోపాటు ఈ విషయాలన్నీ చర్చించబడ్డాయి.

ఈ అనువాదం 27-10-2007కే పూర్తయింది. దీన్ని మళ్ళీ పరిశీలించే అవకాశం నాకు దొరకలేదు. భాషా దోషాలు ఏమన్నా దొరిలాయో ఏమో చెప్పలేను. విజ్ఞులు ఎత్తి చూపితే మలిముద్రణలో సవరించగలము. భావాలన్నీ మౌలానా సయ్యిద్ జలాలుద్దీన్ ఉమరీ (ప్రస్తుతం జమాఅతె ఇస్లామీ హింద్ అధ్యక్షులు) గారివి. నేను కేవలం వాటికి తెలుగు మాటల బట్టలు తొడిగాను. ఇది అనుకున్న ప్రయోజనాలను సాధిస్తుందని, మన నాట సాగుతున్న ఇస్లామ్ పిలుపు కార్యకర్తలకు దిశానిర్దేశన చేయగలదని, ఎవ రయినా దివ్యఖుర్‌ఆన్, ప్రవక్త సున్నత్‌కు అతకని విధానాలను తెలియక పాటిస్తున్నట్లయితే వారికి కనువిప్పు కలుగజేస్తుందని ఆశిస్తున్నాను.

ఈ అనువాదం పూర్తయిన తరువాత ఒక సత్కార్యం చేశానన్న సంతృప్తి, ఆనందానుభూతి నాకు కలిగాయి. దైవం మనందరికీ సద్బుద్ధినీ, ఉభయ లోకాల సఫలతనూ ప్రసాదించుగాక.

**మలిక్**
**22-2-2009**

# దైవప్రవక్తల బాధ్యత

## దైవప్రవక్తల ఆగమనం

ఈ లోకం పరీక్షా స్థలం. మానవుడు పరీక్షా స్థితిలో ఉన్నాడు. పరమ ప్రభువు ఇతన్ని రేయింబవళ్ళు నిరంతరాయంగా పరీక్షిస్తున్నాడు - దైవ విధేయుడెవడు, అవిధేయుడెవడు అని పరీక్షిస్తున్నాడు. మరో మాటలో మనిషి ఇస్లామ్ స్వీకార తిరస్కారాల మధ్య నిల్చొని ఉన్నాడు. ఇస్లామ్ దైవభక్తి మార్గం, తిరస్కారం దైవ ధిక్కార మార్గం. మనిషి ఈ రెండు దారుల్లోనే ఏదో ఒక దారి ఎన్నుకోవాలి, మరో మార్గమేదీ లేదు.

మానవుణ్ణి ఇంత పెద్ద పరీక్షకు గురిచేసే ముందు అల్లాహ్ తన సందేశహరుల ద్వారా అతనికి సరయిన పద్ధతి ఏదో, తప్పుడు పద్ధతి ఏదో తెలిపాడు. అతను సఫలత పొందే విధానమేదో, దేని కారణంగా నిష్ఫలతకు లోనవుతాడో చెప్పాడు. ఇక దైవాన్ని ప్రసన్నపరచుకునేవాడు ప్రసన్నపరచుకోగలడు, వినాశం కాగోరేవాడు స్వయంగానే వినాశం కాగలడు.

إِنَّ عَلَيْنَا لَلْهُدَىٰ ۝ وَإِنَّ لَنَا لَلْآخِرَةَ وَالْأُولَىٰ ۝ (الليل:١٢،١٣)

నిస్సందేహంగా దారి చూపడం మా బాధ్యత. మా చేతుల్లోనే ఉంది ప్రపంచం, పరలోకం కూడా. *(అల్ లైల్ : 12,13)*

అల్లాహ్ మనిషికి అసంఖ్యాకమయిన వరప్రసాదాలనిచ్చాడు. కాని ఆయన వరప్రసాదాల్లోకెల్లా ఘనమయినది ఆయన ప్రసాదించిన ధర్మం. మానవునికి ప్రపంచం లోనూ, పరలోకంలోనూ సాఫల్యాన్ని చేకూర్చే మార్గం ఆయన చూపాడు. దైవం ప్రసాదించిన ఈ మహావరం ఆయన సందేశహరులే మానవునికి చేరవేశారు. దైవసందేశహరులు రాకపోతే మానవునికి అతని ధర్మం దొరికేది కాదు, అతను మార్గబోధనకు వంచితుడయ్యేవాడు.

అలా జరిగి ఉంటే మానవుడు దైవానికి ఫిర్యాదు చేసేవాడు, దేవా, నీవు నన్ను

పుట్టించావు కానీ ప్రసన్నత పొందే దారి ఏదో, నీ ఆగ్రహాన్ని ఎలా తప్పించుకోవాలో తెలపకుండానే వదిలేశావు. నీవు ప్రసన్నుడవయ్యే పనులేవో నాకు తెలియదు, నీవు అప్రసన్నుడవయ్యే విషయాలేవో నేను ఎరుగను. ఈ పరిస్థితుల్లో నేను నీ ఆమోదాన్ని ఎలా పొందగలను, నిన్ను ఎలా సంతోషపెట్టగలను. నాకు సాఫల్య మార్గమే తెలియనప్పుడు నిష్ఫలతను ఎలా తప్పించుకోగలను?

కాని ఇప్పుడు ఈ సాకులు ఇక దైవం సమక్షంలో వినిపించుకోబడవు. దేవుని సందేశహరులు ప్రతి యుగంలోనూ వచ్చారు, మానవునికి సత్యమార్గాన్ని చూపారు.

رُسُلاً مُّبَشِّرِيْنَ وَ مُنْذِرِيْنَ لِئَلاَّ يَكُوْنَ لِلنَّاسِ عَلَى اللّٰهِ حُجَّةٌ ۢ بَعْدَ الرُّسُلِ
(النساء:١٦٥)

**దైవం మానవుల వద్దకు తన సందేశహరుల్ని పంపాడు. వారు మానవులకు స్వర్గ శుభవార్తనిచ్చారు, నరకం పట్ల భయ పెట్టారు. తద్వారా దైవసందేశహరుల రాక తరువాత దైవం (చేసే నిర్ణయానికి) ప్రతిగా మానవులవద్ద గట్టి వాదన ఏదీ మిగులదు.**

***(అన్ నిసా : 165)***

## దైవసందేశహరులు ఎప్పుడు వస్తారు?

దైవం భువిపై సృష్టించిన తొలి మానవుడు ఆయన సందేశహరుడు కూడా. మార్గబోధనను, మార్గ భ్రష్టతను దైవమే అతనికి నేరుగా విశదపరిచాడు. తొలి మానవుడు తనను ఆదేశించిన విధంగానే జీవితం గడిపాడు. కాని ఆ సజ్జనుని సంతానం ప్రపంచ మంతా వ్యాపించి దైవం ప్రసాదించే బహుమానానికి అర్హత పొందే మార్గాన్నే సదా అవలంబించలేదు. అది అనేక పర్యాయాల్లో దేవుని అవిధేయతకు పాల్పడింది; ఆయన ఆగ్రహాన్ని ఆహ్వానించింది.

వాస్తవానికి మానవుడి అశ్రద్ధ, అజాగ్రత్తలు హద్దులు మీరినప్పుడు అతను ధరణి పైన భారమయిపోతాడు, తన వినాశానికి యోగ్యత సంపాయించుకుంటాడు! కాని దేవుని కారుణ్యం ఆయన ఆగ్రహాన్ని పరవేష్టించి ఉంది. ఆయన తన దాసుల్ని యాతన నుండి తప్పించాలని చివరి క్షణం వరకూ కోరుకుంటాడు. మానవుడు దైవాన్ని ధిక్కరించి ఆయన అభీష్టాన్ని కాలరాచినప్పుడల్లా ఆయన తన సందేశహరుల్ని పంపాడు. తన శిక్ష చుట్టుముట్టే ముందే మానవుణ్ణి హెచ్చరించాడు. తాను వెళ్ళవలసింది ఏ దారో, తాను వెదుతున్నది ఏ దారో మనిషికి తెలిపాడు.

ఆపైన మనిషి తన తప్పుడు కార్యకలాపాల ఫలితాలను బాగా గ్రహించిన తరువాత అతని తప్పిదాలకుగాను అతన్ని పట్టుకోవడం జరుగుతుంది. దేవుని సందేశహరులు అన్ని కాలాల్లోనూ, అన్ని జాతుల్లోనూ ఆవిర్భవించారు, దారితప్పిన మానవునికి అతని అంతిమ పరిణామం గురించి హెచ్చరించారు. అతడు అవలంబిస్తున్న తిరుగుబాటు వైఖరిని ఆర్ద్రతతో విమర్శించారు. తలబిరుసుతనం అతనికి శోభించదని నచ్చజెప్పారు. దేవుడు అతన్ని తన దాస్యం కొరకు పుట్టించాడని బోధించారు. అతను తన ఈ వైఖరిని మానుకోక పోతే దేవుని ఆగ్రహం అతన్ని పట్టుకుంటుంది. అతనికి ఎక్కడా రక్షణ ప్రాప్తం కాదు అని ఉపదేశించారు.

ఈ సత్యాన్ని దివ్య ఖుర్‌ఆన్ ఇలా తెలిపింది :

وَمَا كُنَّا مُعَذِّبِينَ حَتَّىٰ نَبْعَثَ رَسُولًا ۝ (بنی اسرائیل:١٥)

**ఒక జాతి వద్దకు మా సందేశహరున్ని పంపనంత వరకు మేము దాన్ని శిక్షించము.** *(బనీ ఇస్రాయీల్ : 15)*

## ప్రవక్తల మహోపకారం

దేవుని ప్రవక్తల దృష్టాంతం పారే సెలయేరులాంటిది. దాని ద్వారా వేనవేలు, లక్షలాది మానవులు సంతృప్తి చెందుతారు. మానవతావనం ఎప్పుడు సస్యశ్యామల మయినా వీరి కారణంగానే అయింది. వారే ఆవిర్భవించకపోయినట్లయితే మానవత ఎప్పుడో మాడి మసి అయిపోయేది. ప్రపంచం వారికి ఇచ్చేది ఏమీ లేదు, అదే వారి నుండి గ్రహిస్తుంది. భౌతికంగా చూసినట్లయితే వారి ఉనికి తమకన్నా పరులకే అంకితమయి ఉంటుంది. వారు ఎవరి నుండీ ఏదీ గ్రహించడానికి రారు, అందరినీ 'సుసంపన్నం' చెయ్యడానికి వస్తారు.

విచిత్రం ఏమిటంటే, ఈ కృషిలో వారు తమ సర్వస్వమూ ధారపోసి మానసిక ఉల్లాసాన్ని, నెమ్మదిని ఆస్వాదిస్తారు. దైవం తమకు అనుగ్రహించిన శక్తిసామర్థ్యాలు వ్యర్థం కాలేదన్న తృప్తి, సరయిన చోట వినియోగమయ్యాయన్న తృప్తి వారికి కలుగుతుంది. తమ కృషి పట్ల ఈ తృప్తి దైవసందేశహరులకు, వారి అనుసరణలో శ్రమించేవారికి తప్ప ఈ లోకంలో మరెవ్వరికీ ప్రాప్తం కాదు. వారు అందజేసే సేవలకు ఇహలోకంలో ప్రాప్తమయ్యే నిజమయిన బహుమానం ఇదే.

సర్వసాధారణంగా మానవాళికి హితైషులుగా పరిగణించబడే వారిని అనుసరించి ప్రపంచ ప్రజలు గర్వపడతారు కూడా. వారు ఏదో ఒక విధంగా మానవుల ప్రాపంచిక ప్రయోజనాన్ని కాంక్షించేవారే. వీరిలో ఒకరు ఆర్థిక పథకంతో ముందుకు వస్తే మరొకరు

విద్యా లక్ష్యంతో వస్తారు. ఒకరు స్వేచ్ఛా స్వాతంత్ర్యాల ఉద్యమం నడిపితే, మరొకరు వైజ్ఞానిక సంస్కరణను ప్రతిపాదిస్తే, మరొకరు వైజ్ఞానిక ప్రగతిని కాంక్షిస్తారు. ఒకరు నాగరిక సామాజిక సాంఘిక సముద్ధరణ కోరుకుంటారు.

దేవుని ప్రవక్తలు ఇటువంటి కోవకు చెందిన ఏ ఉద్యమం, ఏ పథకం తీసుకుని బయలుదేరరు. వారు మానవులకు కేవలం వారి ప్రభువు సందేశాన్ని అందజేయడానికి వస్తారు. మానవులంతా దేవుని దాసులన్న సత్యాన్ని గురించి తెలుపడానికి వస్తారు. మానవులు తమ వ్యవహారాలన్నింటిలో ఆయన విధేయతనే పాటించాలని బోధిస్తారు. ఈ సందేశాన్ని స్వీకరించినవాడు దేవుని వరప్రసాదాలకు అర్హుడవుతాడని, తిరస్కరించిన వాడు ఆయన కారుణ్యానికి దూరమవుతాడని తెలుపుతారు. దేవుని ప్రవక్తలు ఈ సందేశాన్ని అందజేసి చేసే ఈ మహోపకారం అనన్యమయినది. వాస్తవంగా దాన్ని సరిగ్గా గ్రహించి గుర్తించడం కూడా మన శక్తికి మించిన పని.

## దైవప్రవక్తలు మానవుని నిజ సమస్యను పరిష్కరిస్తారు

ప్రపంచంలో ఆర్థిక సంతులనం నెలకొనడం మానవుని అసలు అవసరం కాదు. ప్రతి వ్యక్తి చదవడం, వ్రాయడం నేర్చుకునేలా విద్య వ్యాపించడం కూడా నేటి అవసరం కాదు. పరిశ్రమలు, చేతి పనులు బాగా వృద్ధిచెంది సౌలభ్యాలు, సౌకర్యాలు సమృద్ధిగా ప్రాప్తమవడం కూడా మానవుని అసలు ఆవశ్యకత కాదు. పోనీ దారిద్ర్యం బీదరికం నిర్మూలన చెంది ఏ వ్యక్తీ మరో వ్యక్తిపై ఆధారపడకుండా సంపన్నుడవడం కూడా మానవుని ప్రాథమిక ఆవశ్యకత కాదు. ఈ అభిప్రాయాలు విచిత్రంగా ఉన్నాయి కదూ. ఏదో ఇంగితజ్ఞానం లేని వ్యక్తి, ప్రపంచ వ్యవహారాలు ఎరుగని వ్యక్తి అభిప్రాయాలని కొట్టిపారేసినా ఆశ్చర్యపడనవసరం లేదు.

నిజమే, ప్రపంచం సదా ఈ సమస్యలనే మానవుని మౌలిక సమస్యలని భావిస్తూ, ప్రపంచాన్ని నమ్మిస్తూ వచ్చింది. నేటికీ ఇవే అన్నింటికన్నా ముఖ్యమయిన సమస్యలని పరిగణిస్తుంది కూడా. వాస్తవంగా ఈ సమస్యలు ఎంతో ప్రముఖమయినవి, సందేహం లేదు. కాని ఇవన్నీ స్వల్పస్థాయి సమస్యలు, మూల సమస్యలకు శాఖోపశాఖలు. ఈ శాఖల్ని కత్తిరించి, సింగారించి, తీర్చిదిద్దడంలో నిమగ్నులయినవారు నిజానికి పై పూతలలో తలమునకలయి ఉన్నారు. వారి దృష్టి ఈ శాఖల మూలస్థానం మీద లేదు.

ఈ శాఖలు పుట్టే అసలు స్థానం వేరు. అక్కడే ఇవి పుడుతున్నాయి, జీవితం మొత్తాన్ని ఆక్రమించుకుంటున్నాయి. ఈ మూలస్థానాన్ని చూడగలిగేది బహుధా అంత శ్చక్షువులు గల దృష్టి మాత్రమే. ఆ దృష్టి మూలస్థానాన్ని పసిగడుతుంది, అక్కడ జీవితపు

చివరి దశ వరకూ పరిశీలిస్తూ ఉంటుంది. అటువంటి దృష్టి దైవపీడితమైనది. అటువంటి అంతర్ దృష్టి ప్రాప్తమయినవారు నిజానికి ప్రపంచ నాయకులు, దైవికంగా నేతలయి పంపబడినవారు. వీరినే మనం ప్రవక్తలని, దైవసందేశహరులని అంటాము.

నిజం చెప్పాలంటే, మానవుని మూల సమస్య అతను తనను గురించి తెలుసుకోవడం. తన ఆది ఏదో, అంతం ఏదో గ్రహించగలగటం. తన సృష్టికర్త అయిన దైవాన్ని, తాను ఎవరి వద్దకు మరలిపోవలసి ఉందో ఆ దైవాన్ని మరవకపోవడం.

కాని మనిషి తన్ను తాను స్వేచ్ఛాజీవిగా భావిస్తాడు. బంధనాలేవీ తనకు వర్తించవని అనుకుంటాడు. అలాగే స్వతంత్రంగా సర్వత్రా వ్యవహరిస్తుంటాడు. తాను ఎవరికీ జవాబు చెప్పుకోవలసిలేదని, ప్రళయమనేది అసలు రానేరాదని అనుకుంటూ జీవిస్తున్నాడు.

దైవాజ్ఞల్ని ఉల్లంఘించడం, దైవాగ్రహాన్ని ఆహ్వానించడమే. కాని మానవుడు దైవాగ్రహానికి, దైవిక శిక్షకు మరీ చేరువయిపోతున్నాడు. దైవాగ్రహాన్ని తప్పించుకోవడం పోయి, అతను తన ఆచరణల వల్ల ఆయన ఆగ్రహాన్ని కొనిదెచ్చుకుంటున్నాడు. నిరంతరం అందులోనే మునిగి తేలుతున్నాడు. తన కర్త, తన ప్రభువు విషయంలోనే అత్యంత హానికరమైన వైఖరినవలంబిస్తున్నాడు. ఇది అతనికేమాత్రం తగదు, అతణ్ణి తీవ్ర నష్టానికి, పశ్చాత్తాపానికి గురిచేస్తుంది.

## ప్రవక్తల సందేశం

ఇహలోకంలో సఫలత అయినా పరలోకంలో సాఫల్యం అయినా సర్వత్రా మానవునికి విజయం చేకూర్చే ఆధారం ఒక్కటే. మానవుడు దేవుని దాసుడయి, ఆయనకు బానిసగా జీవించడాన్ని అంగీకరించాలి. దీని ద్వారానే మానవుని పారలౌకిక జీవితం చక్కబడుతుంది. దీనివల్లనే ఇహలోక జీవితపు చిక్కుముడులు విచ్చుకుంటాయి. దైవాన్ని విశ్వసించడం, సర్వ విధాలా విశ్వసించడం ఇదే మానవ జీవితానికి అత్యుత్తమ ప్రాతిపదిక. దైవాన్ని విశ్వసించకపోవడమే చెడులన్నింటికీ మూలం.

దైవవిధేయతకు విముఖత చూపిన వ్యక్తి భాగ్యరేఖలో, నిష్ఫలత వ్రాయబడుతుంది. ఆయన పట్టు పట్ల ఉపేక్షాభావం కనబరచినవానికి అపజయమే ప్రాప్తమవుతుంది. ప్రపంచంలో మానవుడు దౌర్జన్యానికి, దుర్మార్గానికి ఒడిగట్టడానికి కారణం దైవాన్నీ, పరలోకాన్నీ గట్టిగా నమ్మకపోవడమే. ఆర్థిక రాజకీయ రంగాల్లో దౌష్ట్యం పెరగడానికి కారణం మనిషి దైవిక చట్టానికి దూరమయి స్వేచ్ఛాయుతంగా సాగిపోవడం. ప్రజల్లో నీతిరాహిత్యం, లజ్జారాహిత్యం వృద్ధి చెందడానికి మూలం వారిలో దైవం ప్రసాదించిన

మార్గదర్శకత్వం పట్ల గౌరవాదరణలు లేకపోవడం. అక్షరాస్యత ఎంతగా ప్రాచుర్యం పొందినా అజ్ఞానం తొలగక సామాన్యమయిపోవడానికి కారణం మానవుడు దైవం అనుగ్రహించిన కాంతికి దూరమయి జీవించడం.

అందువల్లనే దైవప్రవక్తలు సదా ఒకే ప్రాథమిక సమస్యను స్పర్శించి చర్చిస్తారు. దైవాన్ని విశ్వసించాలని, ఆయన విధేయత పాటించాలని కోరుతారు. వారి సందేశం, పిలుపు అంతా ఇంతే:

يَآيُّهَا النَّاسُ اعْبُدُوْا رَبَّكُمُ الَّـذِىْ خَلَقَكُمْ وَالَّذِيْنَ مِـنْ قَبْلِكُمْ لَعَلَّكُمْ تَتَّقُوْنَ٥ اَلَّذِىْ جَعَـلَ لَكُمُ الْاَرْضَ فِرَاشًا وَّ السَّمَآءَ بِنَآءً وَّ اَنْزَلَ مِنَ السَّمَآءِ مَآءً فَاَخْرَجَ بِـهٖ مِنَ الثَّمَـرَاتِ رِزْقًا لَّـكُمْ فَلاَ تَجْعَلُوْا لِلّٰهِ اَنْدَادًا وَّ اَنْتُمْ تَعْلَمُوْنَ٥

(البقرة:٢١،٢٢)

మానవులారా! మిమ్మల్నీ, మీకు పూర్వం వారినీ సృష్టించిన మీ ప్రభువును ఆరాధించండి. దీని ద్వారానే మిమ్మల్ని మీరు రక్షించుకునే అవకాశం ఉంది. మీ కొరకు భూమిని పాన్పుగాను, ఆకాశాన్ని కప్పుగాను సృష్టించినవాడూ, పైనుండి వర్షాన్ని కురిపించి, తద్వారా అన్ని రకాల పంటలు పండే ఏర్పాటు చేసి మీకు ఉపాధి కల్పించిన వాడూ ఆయనే! ఇది మీకు తెలిసినప్పుడు ఇతరులను అల్లాహ్‌కు సమానులుగా నిలబెట్టకండి. *(అల్ బకరా: 21,22)*

దేవుని ప్రవక్తలకు అవతరించే వహీ (దైవవాణి) దాని వెలుగులో వారు మానవులకు అందజేసే బోధనలను దివ్య ఖుర్‌ఆన్ ఇలా అభివర్ణించింది :

وَمَـآاَرْسَلْنَا مِنْ قَبْلِكَ مِنْ رَّسُوْلٍ اِلَّا نُوْحِىْٓ اِلَيْـهِ اَنَّهٗ لاَ اِلٰهَ اِلَّا اَنَا فَاعْبُدُوْنِ٥ (الانبياء:٢٥)

మేము నీకు పూర్వం ఏ ప్రవక్తను పంపినా అతనికి వహీ ద్వారా ఇదే సందేశం పంపాము – నేను తప్ప మరో ఆరాధ్యుడు లేడు, కనుక మీరు నన్నే ఆరాధించండి అని. *(అల్ అన్బియా : 25)*

వారు చెప్పేది ఒక్కటే; దైవదాస్యం, ధర్మనిష్ఠను అవలంబించాలని వారు పిలుపునిస్తారు. దీని వల్ల మీ జీవితాలలోని అశాంతి, అలజడి సమసిపోతుంది. దైవ ధిక్కారులను, తలబిరుసు గలవారిని అనుసరించడం మానుకుని దైవసందేశహరులను అనుసరిం చండి, వారు మిమ్మల్ని విజయ గమ్యం దాపునకు చేరుస్తారు అని అంటారు.

فَاتَّقُوا اللّٰهَ وَ اَطِيْعُوْنِ ○ وَلَا تُطِيْعُوْٓا اَمْرَ الْمُسْرِفِيْنَ ○ الَّذِيْنَ يُفْسِدُوْنَ فِي الْاَرْضِ وَلَا يُصْلِحُوْنَ ○

(الشعراء:۱۵۰-۱۵۲)

కాగా అల్లాహ్‌కు భయపడండి, నా మాట నమ్మండి. భువిలో కలతలను రేపే, సంస్కరణ చెయ్యని అత్యాచారులను అనుసరించకండి. *(అష్షూరా :150-152)*

ఇది దైవప్రవక్తల సందేశం. దీన్నే వారు ప్రపంచం సమక్షంలో నిరంతరాయంగా అందజేస్తారు. ఈ చింతనలోనే వారి రేబవళ్ళు గడుస్తాయి. దీని కోసమే శుభశ్రేయాల వారి జీవితం అంకితమయి ఉంటుంది.

## ప్రవక్తలే ఆధిక్యత పొందేవారు !

దివ్య ఖుర్ఆన్‌లో ప్రవక్తల విషయంలో ఈ నియమం ప్రకటించబడింది:

كَتَبَ اللّٰهُ لَاَغْلِبَنَّ اَنَا وَ رُسُلِيْ ؕ اِنَّ اللّٰهَ قَوِيٌّ عَزِيْزٌ ○

(المجادلة:۲۱)

అల్లాహ్ వ్రాసి పెట్టాడు, నేను నా ప్రవక్తలు తప్పనిసరిగా విజయం సాధిస్తాము అని. నిస్సందేహంగా అల్లాహ్ శక్తి సంపన్నుడు, ఆధిక్యత గలవాడున్నూ. *(అల్ ముజాదిల : 21)*

అంటే అల్లాహ్ తన సందేశహరులను వారి ప్రత్యర్థులపైన తప్పక ఆధిక్యత ప్రసాదిస్తాడన్న మాట. ఇది ఆయన నిర్ణయం. ఆయన నిర్ణయాన్ని ఎవ్వరూ మార్చలేరు.

ఇక్కడ ప్రవక్తల ఆధిక్యతను గురించి చెప్పిన విషయానికి రెండు విధానాలున్నాయి. ఒకటి బౌద్ధికమయింది, నిదర్శన, వాదనలతో కూడుకున్నది. రెండవది భౌతికమయింది, రాజకీయమయింది. కాస్త విశదంగా పరిశీలిద్దాము.

## ఆధారాలు, వాదనలతో ఆధిక్యత

దైవసందేశహరులు, తాము ఆవిర్భవించిన జాతులకు ఆధారాలతో, వాదనలతో, దేవుడున్నాడన్న యదార్థాన్ని, ఆయన ఒకడేనన్న సత్యాన్ని బోధపరుస్తారు; విజయవంతంగా బోధపరుస్తారు. ఆయన్ని విశ్వసించాలని, ఆయన్ని తిరస్కరించరాదని ఉపదేశిస్తారు. దైవాన్ని నమ్మడం వల్ల అది ఇహపరలోకాల్లో సాఫల్యాన్ని చేకూర్చుతుందని, ఆయన్ని కాదనడం తీవ్ర వినాశానికి హేతువని వారు నచ్చ చెప్పుతారు.

మానవులు చింతనాపరంగా, ఆచరణ రీత్యా వక్ర విధానాలకు పాల్పడి దేవుని ఆగ్రహాన్ని ఆకర్షిస్తారు. దైవప్రవక్తలు వాటిని విమర్శిస్తారు. దైవానికి ప్రియమయిన జీవన

సూత్రాలను పరిచయం చేస్తారు. వాటిని అవలంబించి తమ జీవితాలను చక్కదిద్దుకొమ్మని బోధిస్తారు. ఈ విషయాలను రూఢీపరుస్తూ బలమయిన ఆధారాలు, వాదనలు ముందుంచుతారు. వ్యతిరేకించే వారిపైన వారి చింతనాపరమయిన ఆధిక్యత స్థిరపడి పోతుంది.

## ప్రవక్తలు వాదనను పరిపూర్ణం చేస్తారు

ప్రవక్తలు బాధ్యత నిర్వహణలో ప్రత్యేకమయిన దైవసహాయం పొంది ఉంటారు. మరే మానవునికీ ప్రాప్తంకాని కొన్ని ప్రత్యేకతలు వీరికి దైవం ప్రసాదిస్తాడు. ఈ ప్రత్యేకతల వల్ల వారు ఈ మహత్తర కార్యాన్ని, ఏ కోణంలో చూసినా ఎటువంటి లోపం లేకుండా నిర్వర్తిస్తారు.

వాటిలో తొలి ప్రత్యేకత ఏమిటంటే, దైవప్రవక్తలు, బుద్ధి, ఆలోచన, నీతి, శీలం రీత్యా ఎంతో ఉన్నతులుగా అలరారుతారు. ఈ విషయంలో మానవాళిలోని ఏ వ్యక్తి కూడా వారికి సరితూగలేదు. ఈ కారణంగానే వారిని బాగా ఎరిగిన ఒక వ్యక్తి వారిని అబద్ధాలాడుతున్నారని, వారు తమ సందేశం ద్వారా మోసం, వంచనలకు పాల్పడుతున్నారని చెప్పే సాహసం చెయ్యలేదు. ఎవరయినా ఇలా చెయ్యడానికి దుస్సాహసం చేసినా అతని అంతర్యం అతన్ని లోలోనే అధిక్షేపిస్తుంది.

రెండవ ప్రత్యేకత, సామాజికంగా, సాంఘికంగానూ వారి స్థానం ఎంతో ఉన్నతమయినది కావడం. వారు సమకాలీన పాలనా పాశాలు చేపట్టిన వారిని, సామాజికంగా అత్యున్నత స్థానంలో ఉన్నవారిని నేరుగా సంబోధించగలరు. వారికి దైవధర్మాన్ని అందజేయడానికి వారు ఏ మాత్రం జంకరు.

మూడవది, తమ కార్యనిర్వహణలో వారికి ప్రత్యక్షంగా దైవ మార్గదర్శకత్వం, మార్గబోధన ప్రాప్తమవుతుంది. ప్రతి సున్నితమయిన సమయంలో వారు ఎటువంటి చర్య తీసుకోవాలో, ఎలా దాన్ని నిర్వర్తించాలో దైవం వారికి తెలుపుతాడు. ఈ మార్గదర్శకత్వం, మార్గబోధనల వల్ల వారి కార్యకలాపాలన్నీ మానవీయ లోటుపాట్లన్నింటికీ దూరంగా పరిశుద్ధంగా రూపొందుతాయి.

నాల్గవ ప్రత్యేకత, వారికి మహిమలు అనుగ్రహించబడటం. వాటిని చూసిన తరువాత వారు దైవసందేశహరులే అని, దైవాజ్ఞతోనే జనులను, వారి అంతిమ పరిణామాన్ని గురించి హెచ్చరిస్తున్నాడని అవి సునాయాసంగా విశ్వసించడం సాధ్యమవుతుంది.

అయిదవ విషయం, వారికి దైవం ప్రసాదించే వచనం. ఆయన వారికి తన సందేశ వాణిని అందజేసే భాష ఎంతో శుద్ధమయినది. అది తత్వవేత్తల భాషలా సమస్యా భూయిష్టమయి ఉండదు, అర్థం చేసుకోవడమే సాధ్యంకాని చిక్కుముడుల భాష కాదు. మరీ దిగజారిన సామాన్య భాషా కాదు; దాన్ని చదవడానికి, వినడానికి కూడా ఒక నాగరిక, సౌమ్యశీల వ్యక్తికి మనసొప్పని భాష కూడా కాదు. అది ఎంతో పరిశుద్ధ మయినది, ఆకర్షకమయినది, మనోజ్ఞమయినది, భావగర్భితమయినది, భావస్ఫోరక మయినదిగా ఉంటుంది. మనస్సులు, మస్తిష్కాలు వాటంతట అవే దాని వైపునకు మ్రొగ్గుతుంటాయి.

ఆరవ ప్రత్యేకత ఏమిటంటే, అల్లాహ్ వారికి ఆమోఘమయిన భావాన్వయ శక్తిని ప్రసాదిస్తాడు. వారు ఆ దైవ వచనంలోని హేతువులను, విజ్ఞతలను, సుగుణాలను పూర్తిగా విడమర్చి తెలుపుతారు. దాని ఏ కోణమూ అగోచరంగా మిగులదు.

ఈ ప్రత్యేకతలతో దైవసందేశహరులు అత్యుత్తమ ఆకర్షక ప్రేరణ ద్వారా, ఎంతో భయంగొలిపే హెచ్చరిక ద్వారా దైవానికి దూరమయిన మానవుల్ని దైవం వైపునకు పిలుపునిస్తారు. మానవులు తమ అంతిమ పరిణామం గురించి తెలుసుకోగలగాలని, పరలోకపు యాతన నుండి తప్పించుకునే ఏర్పాట్లు చేసుకోగలగాలని తమ వంతు ప్రయత్నంగా శాయశక్తులా కృషి చేస్తారు.

దైవప్రవక్తలు, మానవుల మోక్షం కొరకు, తమ అనన్య శక్తులను అసాధారణ సామర్థ్యాలను వెచ్చిస్తారు. వారి సమక్షంలో పటిష్ఠమయిన వాదనలు ముందుంచుతారు. దైవధర్మం వారికి బాగా మనోగతమవ్వాలని యత్నిస్తారు. వారి అంతరాత్మలను పురికొలుపుతారు. వారు గత కాలం ద్వారా గుణపాఠం గ్రహించాలని, గతించిన జాతులు, వర్గాలు అంతమయిపోవడానికి కారణమయిన తప్పిదాల నుండి తప్పించుకోగలగాలని చూస్తారు.

ఇది ఎంతో సహనం అవసరమయిన పని. దీన్ని దైవసందేశహరులు సుదీర్ఘకాలం వరకు నిర్వర్తిస్తూ ఉంటారు. మానవ మోక్షానికి ఏకైక మార్గం దైవదాస్యంలోనే ఇమిడి ఉందన్న యదార్థాన్ని బాగా ప్రస్ఫుటపరచే వరకు తమ బాధ్యతను నిర్వహిస్తారు.

ఆ తరువాత వారి సందేశానికి వ్యతిరేక వైఖరినయితే అవలంబించడం సాధ్యమే కాని, ఎవరయినా సరే వాదన, ఆధారాల రంగంలో వారిని ఓడించలేదు. వారు ఎంతగా తమ మాటలోని సత్యాన్ని నిరూపిస్తారంటే వారి విరోధుల అంతర్యాలు కూడా దాని సత్యతను కాదనలేక వాటికి సాక్ష్యం పలుకుతాయి :

وَ جَحَدُوْا بِهَا وَاسْتَيْقَنَتْهَآ اَنْفُسُهُمْ ظُلْمًا وَّ عُلُوًّا (النمل:١٤)

వారు కేవలం దౌర్జన్యం, తలబిరుసుతనం ఆధారంగా అల్లాహ్ ఆయత్‌లను తిరస్కరించారు. నిజానికి వారి అంతర్యాలు గట్టి నమ్మకంతో చెబుతున్నాయి, ఇదే సత్యమని! *(అన్ నమ్ల్ : 14)*

## దైవప్రవక్తలు తమ లక్ష్యాన్ని సాధిస్తారు

దైవసందేశహరుడు మానవులకు వాదనను సంపూర్ణం చేసి చూపెడతాడు. అంటే ఆయన తన విధి నిర్వహణలో సఫలుడయ్యాడన్న మాట. భువిలో ఆయన తన కార్యకలాపాలను ఒంటరిగానే నిర్వహిస్తూ, ఒక్క ప్రాణి కూడా అతనికి తోడ్పాటునివ్వకుండా ఉన్న స్థితిలోనే తన ప్రభువు సన్నిధికి చేరినప్పటికీ ఆయన కృతకృత్యుడయినట్లే. ఆయన నిదర్శనాలతో, విజ్ఞతతో దైవధర్మాన్ని మానవుల వరకు చేరవేసినట్లయితే దైవం ఆయనకు అప్పగించిన ప్రచార బాధ్యతను నెరవేర్చినట్లే. ఆయన సాఫల్యానికి మరే విషయమూ ఇక అవసరం లేదు.

దైవప్రవక్త ప్రచారం తరువాత కూడా ఎవరూ ఆయన వైపునకు మరలకపోయినట్లయితే ఇది ఆ వ్యక్తి దౌర్భాగ్యం. మనిషి మేల్కొలిపిన తరువాత కూడా ఏమరుపాటులో పడి నిద్రపోతూ ఉన్నట్లయితే ఏమనగలం? సఫలతా అసఫలతల మార్గం అతనికి తేటతెల్లమయిపోయింది. అయినా అతను అసఫలతనే కోరుకున్నాడు. ఎవరయినా తెలిసీ సత్యాన్ని స్వీకరించకపోతే అది సత్యాన్ని అందజేసేవాని లోపం కాదు, అది అంగీకరించకపోయే వారి మంకుపట్టు, మొండితనం. దానికి వారే బాధ్యులు, దైవసందేశహరుల్ని దీన్ని గురించి ప్రశ్నించడం ఎంతమాత్రం జరగదు.

దైవప్రవక్త ముహమ్మద్ (స) ఇలా సెలవిచ్చారు: "ప్రవక్తల చరిత్రలో కొందరు ప్రవక్తల విషయంలో వారి జాతి ప్రజల్లో ఒక్క వ్యక్తి మాత్రమే వారిని ధ్రువీకరించాడు" (ముస్లిం). అయితే వీరు ప్రపంచం నుండి పోతూ అసఫలురయిపోయారని ఎవరనగలరు? వారు దైవమార్గంలో తమ శక్తులన్నీ ధారపోశారు. తమ వంతు కృషిలో ఎటువంటి లోటు లేకుండా శ్రమించారు. అందువల్ల వారు సంపూర్ణ సాఫల్యం పొందే అర్హుల య్యారన్నది, వారు పూర్తిగా సఫలురయ్యారన్నది సుదృఢమయిన విషయం.

## దైవమార్గంలో సంహరించబడ్డారు కూడా

ప్రవక్తలు నిస్వార్థమయిన, నిష్కల్మషమయిన కృషి ఎంత జరిపినా వారి సందేశాన్ని పూర్తిగా తృణీకరించడమేకాక వారిని బాధపెట్టడానికి ఒడిగట్టిన జాతులు ప్రపంచంలో ఎన్నో ఉన్నాయి. కొన్ని దౌర్భాగ్యపు జాతులయితే వారిని కత్తులతో సంహరించాయి. యూదుల చీకటి కార్యకలాపాలలో వాటి ఉదాహరణలెన్నో.

اَفَكُلَّمَا جَآءَ كُمْ رَسُوْلٌ بِمَا لاَ تَهْوٰى اَنْفُسُكُمُ اسْتَكْبَرْتُمْ فَفَرِيْقًا كَذَّبْتُمْ وَ فَرِيْقًا تَقْتُلُوْنَ ٥

(البقرة:٨٧)

ఏ ప్రవక్త అయినా మీ వద్దకు వచ్చినప్పుడు, మీరు ఆయన పట్ల తలబిరుసుతనంతో ప్రవర్తించారు. కొందరిని తిరస్కరించారు. మరికొందరిని చంపారు.

*(అల్ బకర: 87)*

దివ్యఖుర్ఆన్ కేవలం ఈ ఒక్క చోట మాత్రమే కాదు ఇంకా ఎన్నో చోట్ల దీన్ని ప్రస్తావించింది. యూదుల చేతులు ప్రవక్తల రక్తంతో ఎరుపెక్కిన గాథలున్నాయి. (ఆలి ఇమ్రాన్:181), (అన్ నిసా : 155)

## భౌతిక ఆధిక్యత కూడా ప్రాప్తమవుతుంది

దీనితోపాటు దైవసందేశహరులకు అల్లాహ్ సహాయ సహకారాలు సయితం ప్రాప్తమయిన వివరాలూ దివ్య ఖుర్ఆన్ ద్వారా ద్యోతకమవుతాయి. ప్రత్యర్థులు, విరోధులు ప్రవక్తల మార్గంలో అవాంతరాలు సృష్టిస్తారు. ఎన్నో యాతనలకు గురిచేస్తారు. వారికి వ్యతిరేకంగా కుట్రలు పన్నుతారు. కాని వారికి ప్రతిగా ఏదయినా తీవ్రమయిన చర్య తీసుకోవడంలో విజయం సాధించలేరు. పరమ ప్రభువు వారిని విరోధుల బారి నుండి కాపాడతాడు.

اِنَّا لَنَنْصُرُ رُسُلَنَا وَالَّذِيْنَ اٰمَنُوْا فِى الْحَيٰوةِ الدُّنْيَا وَ يَوْمَ يَقُوْمُ الْاَشْهَادُ ٥

(المؤمن:٥١)

మేము మా ప్రవక్తలకు, వారితోపాటు విశ్వసించినవారికీ సహాయపడతాము, ప్రపంచ జీవితంలోనూ, సాక్ష్యం పలికే వారు నిలుచునే రోజున కూడా.

*(అల్ మూమిన్ : 51)*

ప్రవక్తల చరిత్ర మరో విషయం చెబుతుంది. దైవప్రవక్తలు ఎంత కృషి సలిపినప్పటికీ, నిరంతరం శ్రమించినప్పటికీ ఒక జాతి సత్యం వైపునకు మరలకపోయినట్లయితే, సత్యవాక్కును అణచడానికి, దాన్ని అంతమొందించడానికీ ప్రయత్నాలు చేసినట్లయితే వారు దైవాన్ని వేడుకుంటారు. "ప్రభూ, నేను వారిని నీ వైపునకు పిలువడానికి నా వంతు

ప్రయత్నాలన్నీ చేశాను, వీరి మనోకవాటాలు తెరచుకోలేదు. వీరు నీ ధరిత్రికి బరువై పోయారు. ఇక తుదముట్టించడానికే వీరు యోగ్యులయ్యారు" అని అర్థిస్తారు.

ఒక ప్రవక్త తన జాతిని సంస్కరించడం పట్ల ఈ మేరకు నిస్పృహ చెందినప్పుడు ఆ జాతికి ముప్పు మూడినట్లే. ఇక అల్లాహ్ దానికి మరీ గడువునివ్వడు. వారు దైవప్రవక్తకు ప్రతిగా ఏదయినా తీవ్రమయిన కుతంత్రం పన్ని దాన్ని ఆచరణలో పెట్టే అవకాశం ఇవ్వడు. ఆయన తన సందేశహరునికి ఆదేశిస్తాడు. ప్రవక్త తన సహచరులతో కలసి తన జాతికి దూరంగా వెళ్ళిపోవాలని, మరో చోటికి వలస (హిజ్రత్) పోవాలని ఆజ్ఞాపిస్తాడు. ఆ విధంగా ప్రవక్త, ఆయన సహచరులు హిజ్రత్ చేసినప్పుడు అల్లాహ్ ఏదయినా శిక్షను పంపి ఆ జాతిని నిర్మూలిస్తాడు. దైవసందేశహరుడు, ఆయన సహచరులూ ఆ యాతన నుండి తప్పించుకుంటారు.

ثُمَّ نُنَجِّىْ رُسُلَنَا وَالَّذِيْنَ اٰمَنُوْا كَذٰلِكَ ۚ حَقًّا عَلَيْنَا نُنْجِ الْمُؤْمِنِيْنَ۝
(یونس:۱۰۳)

మేము మా ప్రవక్తలనూ, విశ్వాసులనూ కాపాడుతూ ఉంటాము. మా విధానం ఇదే. విశ్వాసులను రక్షించటం మా విధి.

***(యూనుస్ : 103)***

ఒక జాతి ఇలా అంతమయిపోయిన తరువాత దైవసందేశహరుడు, ఆయన సహచరులు ఆ గడ్డకు వారసులయిపోతారు, లేదా వారికి మరో భూభాగం ప్రాప్తమవు తుంది. అక్కడ వారు స్వేచ్ఛగా సంతృప్తికరంగా దైవధర్మాన్ని అమలుపరచగలుగుతారు. ఈ మాటనే ఇబ్రాహీమ్ సూరాలో ఇలా ప్రస్తావించడం జరిగింది.

وَ قَالَ الَّذِيْنَ كَفَرُوْا لِرُسُلِهِمْ لَنُخْرِجَنَّكُمْ مِنْ اَرْضِنَا اَوْ لَتَعُوْدُنَّ فِيْ مِلَّتِنَا فَاَوْحٰى اِلَيْهِمْ رَبُّهُمْ لَنُهْلِكَنَّ الظّٰلِمِيْنَ۝ وَ لَنُسْكِنَنَّكُمُ الْاَرْضَ مِنْۢ بَعْدِهِمْ ذٰلِكَ لِمَنْ خَافَ مَقَامِىْ وَ خَافَ وَعِيْدِ۝
(ابراهیم:۱۳،۱۴)

చివరకు తిరస్కారులు తమ ప్రవక్తలతో ఇలా అన్నారు: "మీరు మా మతంలోకి తిరిగి రావాలి. లేకపోతే మేము మిమ్మల్ని మా దేశం నుండి బహిష్కరిస్తాము." అప్పుడు వారి ప్రభువు వారికి ఇలా "వహీ" ని పంపాడు. "మేము ఈ దుర్మార్గులను నాశనం చేస్తాము. వారి తరువాత మిమ్మల్ని భూమిపై వసింపజేస్తాము. నా సాన్నిధ్యంలో సమాధానం చెప్పుకోవలసి ఉందని భయపడుతూ నా శిక్షకు భయపడే వ్యక్తికే ఈ బహుమానం."

***(ఇబ్రాహీమ్ : 13,14)***

జాతి మొత్తం, లేదా అందులోని జనం అధిక సంఖ్యలో దైవసందేశహరుని సందేశాన్ని తిరస్కరించినప్పుడు, కేవలం వ్రేళ్ళపై ఎన్నదగ్గ కొందరు మాత్రమే దాన్ని విశ్వసించిన సందర్భంలో జాతులు నాశనమయ్యే పరిస్థితులు ఎదురవుతాయి. అవే కాక పరిస్థితులు మరో విధంగా ఉన్నట్లయితే, ఎన్నదగ్గ సంఖ్యలో జనం ఆ సందేశాన్ని విశ్వసించినప్పుడు, తిరస్కారుల వినాశానికి ఏదయినా అజ్ఞాత శిక్ష అవతరించదు. దైవం తన ప్రవక్త ఆయన సహచరులచేత సుదీర్ఘ కాలంలో దాన్ని అంతమొందిస్తాడు.

ఈ వ్యవధిలో ప్రవక్తను నమ్మేవారికీ, ఆయన్ని తిరస్కరించిన వారికీ మధ్య తీవ్ర మయిన సంఘర్షణ సాగుతుంది. ఈ సంఘర్షణ కాలంలోనే, ప్రవక్త సందేశాన్ని స్వీకరించ గల ఏ మాత్రం యోగ్యత ఉన్నవారయినా అంతా క్రమంగా ఆయన్ని విశ్వసించడం మొదలెడతారు. వారి సంఖ్య బాగా పెరిగి, వారి ద్వారానే తిరస్కారుల బలాన్ని త్రుంచడం సాధ్యమయినటువంటి సందర్భంలో పరమ ప్రభువు వారిని ఆదేశిస్తాడు, వారినెదిరించి చర్య తీసుకోవాలని, నాలుగయిదుసార్లు మార్కొన్న తరువాత ఒకానొక నిర్ణయాత్మక పోరులో దైవం తిరస్కారుల్ని పూర్తిగా వివశులు, ఆధీనులుగా చేసివేస్తాడు. భువిలో అధికారం విశ్వసించేవారికే అప్పగించబడుతుంది. ఆ తరువాత దైవసందేశహరులు ధరిత్రిని తిరస్కారం, బహుదైవారాధనల మాలిన్యం నుండి పరిశుద్ధపరచి దైవధర్మాన్ని పూర్తిగా అమలుజరుపుతారు. అప్పుడు ఎల్లెడలా దేవుని అభీష్టం రాజ్యమేలుతుంది.★

## ప్రవక్తల కార్యకలాపాల విధానం

ప్రవక్తలకు సంబంధించిన చర్చ ముగించే ముందు ఒక సత్యాన్ని స్పష్టపరచడం తప్పనిసరి. అప్పుడే ప్రవక్తల కార్యకలాపాల సరయిన స్థాయి, విధానం ఏదో విశదం అవుతుంది.

ఒక జాతి ప్రవక్తను వ్యతిరేకించినా, లేక ఆయన్ని విశ్వసించి ఆయన చూపెట్టిన విధేయతా వ్యవస్థను స్వీకరించినా ఉభయ సందర్భాలలోనూ ప్రవక్త ఆ జాతి నడుమ సందేశ ప్రచార కార్యమే చేస్తూ ఉంటాడు. ఆయన తన సందేశం, పిలుపును వదలి మరే విధమయిన చర్య కూడా తీసుకోడు. ఆయన చేసే ఏ పని అయినా సందేశ దాతగా ఆయన బాధ్యతల్లో, ఆయన సందేశంలో భాగమయి ఉంటుంది. దీని ప్రస్ఫుటమయిన దృష్టాంతం మహనీయ ముహమ్మద్ (స) దైవదౌత్య చరిత్రలో మనకు గోచరిస్తుంది.

---

★ వివరాలకు చూడండి వచ్చే చర్చ, *"ముహమ్మద్ (స) మహత్పూర్వక సందేశం"*లో ఉంటుంది.

ఒక జాతి ఆయన సందేశాన్ని చివరి వరకూ అంగీకరించకపోతే, తన తిరస్కారం పట్ల స్థిరంగా మొండిగా నిలబడి ఉన్నట్లయితే ఆయన ఆధారాలతో, తన సచ్చరితతో, తన చిత్తశుద్ధి, ప్రేమ భావాలతో ఆ జాతికి తన వాదనను పూర్తి చేస్తాడు. అది అనుసరించే మార్గం తప్పయినదని నచ్చజెపుతాడు, దాని అంతిమ పరిణామం వినాశకరంగా రూపొందుతుందని హెచ్చరిస్తాడు.

అలాకాక ఒక జాతిలో ప్రవక్తను నమ్మేవారు పుట్టినట్లయితే దాని నడుమ ఆయన కార్యకలాపాల పరిధి చాలా విస్తృతమయిపోతుంది. అయితే ఈ విస్తృతి వల్ల ఆయన స్థానంలో, కార్య విధానంలో ఎటువంటి మార్పూ సంభవించదు. ఆయన ప్రారంభంలోనూ చేసేది సందేశ కార్యమే, చివరన చేసేదీ సందేశ కార్యమే.

ఒక సిద్ధాంతం, ఒక సమగ్రమయిన సిద్ధాంతం, ఒక ఆలోచన, తత్వ స్థాయిని దాటి కార్యరంగంలో ప్రవేశించినప్పుడు ఎన్నో ప్రశ్నలు ఉత్పన్నమవుతాయి. అటువంటి ప్రశ్నలు అంతకు ముందెన్నడూ ఉత్పన్నమయి ఉండవు. ఒకవేళ ఉత్పన్నమయినా అప్పుడు వాటికి ప్రాముఖ్యత ఉండదు. ఈ ప్రశ్నల్లో సిద్ధాంతపరమయినవీ, ఆచరణాత్మకమయినవీ ఉంటాయి. ఆ సిద్ధాంతాలను నమ్మేవారు సహజంగానే ఆ ప్రశ్నలకు స్పష్టమయిన సమాధానం కావాలని కోరుకుంటారు. పోతే, వాటిని నమ్మనివారు కేవలం సైద్ధాంతికంగానే కాక ఆచరణాత్మకంగా కూడా అనుభవపూర్వకంగా వాటిని అర్థం చేసుకోవాలని కోరుకుంటారు. ఆ సిద్ధాంతాల వైపునకు పిలుపునిచ్చేవారు వాటికి సంబంధించిన ఆలోచనాత్మక, క్రియాత్మక ప్రశ్నల సమాధానాలు ఇవ్వడం వారి బాధ్యత.

అటువంటి పరిస్థితిలో ఆ సిద్ధాంతాల సందేశ దాతలు వాటికి టీకా కారులుగా మారి ప్రజల ఆలోచనాత్మక చిక్కుల్ని విడదీయవలసి ఉంటుంది. రాజకీయ వేత్తలయి వారి వ్యవహారాలను ఆ సిద్ధాంతాల వెలుగులో పరిష్కరించడమూ అవసరమవుతుంది. అలాగే సంస్కృతీ నిర్మాతలయి ఓ కొత్త సంస్కృతి నిర్మాణంలో నిమగ్నమవడమూ తప్పదు. వారి ఈ కృషి యావత్తు ఆ సిద్ధాంతం సమున్నతి కోసం, దాని సందేశ ప్రచారం కోసమే జరుగుతుంది. ఈ పనులన్నీ నిర్వహించడం వల్ల సందేశ దాతలుగా వారి స్థానం ఏమాత్రం తగ్గదు. పైగా ఎంతో దృఢతరమవుతుంది. ఇది ప్రవక్తల కార్యకలాపాలను అర్థం చేసుకోవడంలో మౌలికమయిన విషయం!

దైవప్రవక్తల సందేశం విస్తృతమయినప్పుడు కొంగ్రొత్త సమస్యలు తలెత్తుతాయి; సరిక్రొత్త పరిస్థితులు ఎదురవుతాయి. ఉదాహరణకు, ఈ సందేశాన్ని నమ్మేవారు ఇప్పటి వరకు అవలంబించిన సంస్కృతీసభ్యతలు, సామాజిక విధానాలు, నైతికతా ప్రమాణాలు,

అలవాట్లు, వ్యవహారాలు – వీటిలో ఈ సందేశానికి ఏది అనుగుణమయినది, ఏది విరుద్ధమయినది అన్న ప్రశ్న తలెత్తుతుంది. ఇంకా దీన్ని నమ్మేవాడు అనుసరించవలసిన సరయిన జీవిత పథకం ఏదీ, తప్పయినదేది? అనేది మరో ప్రశ్న.

అనుదినం ఈ సందేశాన్ని నమ్ముతూ ఈ నవ సమాజంలో చేరుతున్న వారి ఎడల ఏ విధంగా వ్యవహరించాలి, మరెవరయితే దీన్ని వ్యతిరేకిస్తున్నారో వారి పట్ల వ్యవహరించవలసిన తీరు ఏది? అలాగే జాతీయ స్థాయిలో ఒక సుసంఘటిత సమాజం ఏర్పడినప్పుడు అది అనుసరించే రాజకీయ ఆర్థిక విధానాలెలా ఉంటాయి? యుద్ధంలో అనుసరించే నీతి ఏది? సంధిలో పాటించవలసిన సూత్రాలేవి?

దైవప్రవక్త ఈ ప్రశ్నల్ని వట్టిగా వదలివేయడు. ఇందులో ప్రతిదానికీ సంతృప్తికరమయిన సమాధానం ఇస్తాడు. అప్పుడు అతని సందేశంలో నైతికత, సామాజికతకు సంబంధించిన మార్గనిర్దేశనలూ చోటుచేసుకుంటాయి. ఇచ్చిపుచ్చుకునే విధానాల వివరణ వస్తుంది. రాజ్యపాలన, రాజకీయ వ్యవహారాల వివరాలు ముందుకు వస్తాయి. శిక్షాస్మృతి, శాసనాలు, బోధనలూ వస్తాయి. యుద్ధం, సంధి ఇత్యాది వ్యవహారాల ఆదేశాలు దర్శనమిస్తాయి. ఈ దశలో దైవప్రవక్త దైవం పక్షాన, సంస్కృతీ నాగరికతలు, జీవన వ్యవహారాలన్నింటికి ఓ పూర్తి పథక రచన ముందుంచుతాడు. అదే విధంగా దైవప్రవక్త పాల్గొనే కార్యకలాపాల్లోనూ వైవిధ్యం కూడా చోటు చేసుకుంటుంది.

దైవప్రవక్త ఒక వైపున ప్రజల్ని హెచ్చరించడం, శుభవార్తలు అందించడంతోపాటు తన అనుయాయుల్ని సంఘటితపరచి వారి ద్వారా తన సందేశాన్ని ఇతర ప్రజల వరకు చేరవేయడానికీ కృషి సలుపుతాడు. ఆయన తన అనుయాయుల మధ్య న్యాయస్థానం నెలకొలపడంతోపాటు శత్రువులతో సంధీ ఒడంబడికలు, యుద్ధ వ్యవహారాలను సయితం చూసుకుంటాడు.

ఆయన మునుపు ఒక విధంగానూ ఇప్పుడు మరో విధంగానూ తయారయ్యాడని అర్థం కాదు. ఈ పనులన్నీ అతను ఒక సందేశ దాతగానే నిర్వర్తిస్తున్నాడు. ఆయనది మునుపు ఒక స్థానం, ఇప్పుడు మరో స్థానం కాజాలదు. ఎల్లప్పుడూ ఆయన స్థితి ఒక్కటే. దైవసందేశహరుడు సందేశ ప్రచారకునిగాను, న్యాయనిర్ణేతగాను, పాలనాధికారిగాను, నీతిబోధకుడుగాను, సంస్కృతీ నిర్మాతగాను, సేనా నాయకునిగాను, రాజకీయ నాయకునిగాను అన్ని స్థితుల్లో ఆయన దేవుని సందేశహరుడే, సందేశ దాతయే.

ఆయన సందేశం వేయి రూపాలు ధరించినా, ప్రతి రూపంలోను సందేశం

జీవమయి, ప్రాణమయి నిలుస్తుంది. అతని పిలుపునకు ఒక్క మానవమాత్రుడు కూడా సకారాత్మకంగా స్పందించకపోయినా, అతను సంహరించబడినా, అతను సందేశ కార్యం నిర్వహిస్తూనే ప్రపంచం వీడిపోయినట్లు పరిగణించబడతాడు. అతను న్యాయమూర్తిగా ప్రజల మధ్య దైవాభీష్టం మేరకు తీర్పులు చేస్తున్నప్పుడు కూడా సందేశ ప్రచార కార్యమే నిర్వహిస్తూ ఉంటాడు.

ఏ సందేశమయినా, ఏ దశలోనయినా సందేశంగా దాని ఉనికి లేకపోతే అది దాని మౌలిక స్థానాన్ని కోల్పోయినట్లే. అలా జరిగిన పక్షంలో దానిముందు ఆ లక్ష్యం, అది ఆవిర్భవించడానికి కారణమయిన లక్ష్యం, ఇక లేదన్న మాట.

చాలా మంది దైవసందేశహరుణ్ణి కేవలం ప్రచారకుడుగా, అతని సందేశాన్ని కేవలం బోధన, ఉపదేశాలుగా భావించేవారున్నారు. అంటే నిజానికి వారు సందేశం ఏమిటో సరిగ్గా అర్థం చేసుకోలేదన్న మాట. దాని విస్తృత అవసరాలు వారి సమక్షంలో లేవన్న మాట. అలాంటి వారు సందేశం ఏమిటో, దాని నిజభావం ఏమిటో, దాని విస్తృత అవసరాలేమిటో బాగా క్షుణ్ణంగా పరిశీలించాలి.



# ముహమ్మద్ (స) మహత్పూర్వక సందేశం

## దైవదౌత్య ప్రకటన

కాస్త గతంలోకి తొంగిచూస్తే, అప్పటికి మహనీయ క్రీస్తు ప్రపంచం నుంచి నిష్క్రమించి అయిదు వందల ఏళ్ళకన్నా అధికమయింది. ప్రవక్తల బోధనలు సమసి పోయాయి. నాడు దైవభక్తి దాదాపు అంతమయి చిల్లర దేవుళ్ళ ఆరాధన సాగుతోంది. మానవుడు దైవాన్ని విస్మరించాడు. ఒకే దైవానికి దాస్యం చేయాలని అతన్ని ఆజ్ఞాపించడం జరిగింది. కాని మానవుడేమో అసంఖ్యాక దేవుళ్ళ దాసుడయిపోయాడు. దేవుడు మానవుణ్ణి తన దాస్యం తప్ప ఇతరులందరి దాస్యం నుండి విముక్తం చేశాడు, స్వతంత్రుడిగా పుట్టించాడు. కాని అతని కాళ్ళకు పాలకుల, పురోహితుల బానిసత్వపు సంకెళ్ళు పడ్డాయి.

దైవం మానవునికి సృష్టిలో అత్యున్నత స్థానాన్ని ప్రసాదించాడు. కాని అతను పతనావస్థలో అధమ స్థాయికి చేరుకున్నాడు. అతనికి తన స్థాయి, స్థానం ఏదీ గుర్తు లేదు. భూమి, ఆకాశం, సూర్యుడు, చంద్రుడు, నీళ్ళు, కూరలు, అన్నం, వాయువు-ప్రతి వస్తువూ అతనికి పూజనీయమయిపోయింది. అతను ప్రతిదాని సమక్షంలో తలవంచడానికి సిద్ధమయ్యాడు.

ఇటువంటి పరిస్థితుల్లో మహనీయ ముహమ్మద్ (స) తన దైవదౌత్యాన్ని ప్రకటించారు. ప్రపంచం చూస్తూ ఉండగానే మహోన్నత కార్యాన్ని సాధించారు. చరిత్రలో దాని దృష్టాంతమేదీ కానరాదు, ఆ తరువాత దానికి సమానమయిన మహత్తర కార్యమేదీ ముందుకు రాలేదు. దాన్ని ప్రపంచం మొత్తాన అన్నింటికన్నా గొప్పదయిన విప్లవకార్యం అన్నా తప్పు లేదు.

ముహమ్మద్ (స) సందేశం దైవదాస్య సందేశం. ఇది మానవుని ఘనత, ఔన్నత్యాల సందేశం. ఇది అతన్ని పతన స్థాయి నుండి లేవనెత్తి ఉన్నత స్థానం వరకు చేర్చే సందేశం. మనిషి తన స్థాయి, స్థానాల పట్ల ఏమరపాటుకు లోనయ్యాడు. అతని సరయిన నిజ

స్థానమేదో అతనికి తెలిపారాయన. మానవుడు సుదీర్ఘకాలంగా నిద్రావస్థలో ఉన్నాడు. ఆయన అతన్ని జాగృతపరిచారు. అతను తన స్థితి ఏమిటో ఎరుగకపోతే ఆయన అతన్ని అతని నిజ స్థితిని గురించి ఎరుకపరిచారు.

అతని చుట్టూ మిథ్యా దేవుళ్ళ మంద ఒకటి ఉండగా ఆయన అతనికి, అతని దేవుడు ఒక్కడే అని తెలిపారు. అతను ఒకే దైవాన్ని ఆరాధించాలని బోధించారు. దేవుని సృష్టిలోని మానవులు కొందరు దైవత్వపు దావా చేసే వారయితే కొందరిని స్వయంగా మానవులే దేవుళ్ళుగా చేసి పెట్టుకున్నారు. ఆయన ఈ రెండు విధాల దేవుళ్ళకు ఛాలెంజి చేశారు. దైవత్వపు దావాదారు ప్రతి ఒక్కరూ చెప్పేది అబద్ధమే అని ప్రకటించారు. దైవత్వపు స్థానం, ఒక్క భూమ్యాకాశాలన్నింటికీ సృష్టికర్త అయిన స్వామికి తప్ప ఎవ్వరికీ లేదని చెప్పారు. మానవుడు ఏ ఏ వస్తువును దైవంగా చేసి పెట్టాడో, దానికి అధర్మపు స్థానం అంటగట్టాడో అతను ఈ అబద్ధపు దేవుళ్ళకు వ్యతిరేకంగా తిరుగుబాటు చెయ్యనంత వరకు, విముక్తి పొందలేడు అని చాటారు.

ఈ మహా అద్భుతమైన విశ్వాన్ని సృష్టించిన నిజ దైవం దాస్యాన్ని వదలిపెట్టి మానవుడు, ఏ విధంగానూ దైవత్వపు అధికారం లేని చిల్లర దేవుళ్ళ దాస్యం చెయ్యడం మొదలుపెడతాడు. అప్పుడు అతను జీవన రంగంలో ఓ తప్పుడు స్థానాన నిలబడతాడు. అతని ప్రతి అడుగు తప్పుడు దిశలో పడుతుంది. ఇలా జీవితాంతం తప్పుడు దారుల్లో పరుగిడిన వ్యక్తి అంతిమ పరిణామం, సవ్యంగా రూపొందుతుందని ఆశించలేము.

మానవునికి సరయిన వైఖరి ఒక్కటే. అతను ఈ విశ్వంలో దైవం తప్ప మరొకరెవరి ఆధిపత్యాన్నీ అంగీకరించరాదు, ఎవరినీ సృష్టికర్తగా, స్వామిగా భావించరాదు, మరెవరినీ అధికారిగా, పాలకుడిగా, ఆరాధ్యునిగా ఎంచరాదు. ఎవరినీ ఉపాధినిచ్చేవానిగా నమ్మరాదు, మరెవరినీ లాభనష్టాలు చేకూర్చే వానిగా భావించరాదు. సకల దాస్య శృంఖలాలను త్రెంచేసి కేవలం ఒకే దేవుని దాస్యాన్ని అవలంబించాలి. విశ్వంలోని ప్రతిదీ, ఏదయినా, దేవుని సృష్టియే. దానికి దైవత్వపు స్థానాన్ని ఇవ్వడం ఒక ఘోరమయిన అపరాధం, దాన్ని ఎన్నడూ క్షమించడం జరగదు.

మహనీయ ముహమ్మద్ (స) అందజేసిన ఈ సందేశం ఆనాటి సామాన్య వైఖరికి వ్యతిరేకంగా యుద్ధ ప్రకటన. దీని భావం, దైవమయి కూర్చున్నవారు దైవత్వపు స్థానాన్ని వదలిపెట్టాలి. మరెవరయితే స్వయంకల్పిత దేవుళ్ళను పూజిస్తున్నారో వారు ఈ పూజను విరమించుకుని పశ్చాత్తాపంతో తమ వైఖరిని మార్చుకోవాలి.

అనేక దేవుళ్ళ దైవత్వం అంతమొందించి కేవలం ఒకే దేవుని సామ్రాజ్యం నెలకొలుపుకోవాలి. ఆయనకే దాస్యం చెయ్యాలి, ఆయన్నే ఆరాధించాలి, ఆయన ఆదేశాలనే పాటించాలి, ఆయనకే భయపడాలి; ఆయనపైనే ఆశలు పెట్టుకోవాలి; ఆయన ఆజ్ఞనే శిరసావహించాలి; ఆయన్నే అనుసరించాలి; ఆయన ప్రసన్నతనే బడయాలి; ఆయన అయిష్టతకే దూరంగా మెలగాలి. ఈ సందేశాన్ని వినగానే అసంఖ్యాక దైవాల సమక్షంలో తలవంచే ప్రపంచం పెడబొబ్బలు పెట్టింది:

اَجَعَلَ الْاٰلِهَةَ اِلٰهًا وَّاحِدًا ۚ اِنَّ هٰذَا لَشَیْءٌ عُجَابٌ ○ [صٓ:۵]

**ఇతనేమిటీ అనేక దేవుళ్ళను ఒకే దైవంగా చేశాడా? నిస్సందేహంగా ఇది ఎంతయినా వింతయిన విషయం!** ***(సాద్ : 5)***

## ప్రతిక్రియ

ముహమ్మద్ ప్రవక్త (స) అందజేసిన సందేశం పిడుగుపాటయి ఆ వాతావరణం పైన పడింది. దాని గర్జనకు ఆలోచనలు, సిద్ధాంతాల పాత కట్టడాలన్నీ నేలకొరిగాయి. ఆ కట్టడాలలో మిథ్యాదేవుళ్ళు, వాళ్ళ పూజారులు ఎందరో ఆశ్రయం పొంది ఉన్నారు. ఆ సందేశాన్ని ఎవరు విన్నా దానికి ఆకర్షితులయ్యారు. దాని సంబోధిత ప్రజలు దాని శక్తి ధాటిని ఉపేక్షించలేకపోయారు.

ఇది చాలా బలమయిన సందేశమని వారు గ్రహించారు. దాని ప్రభావాలు దేశ కాలాల దృష్ట్యా సుదూరాలకు ప్రాకి పోతాయని, చాలా లోతుగా సుస్థిరమవుతాయని తెలుసుకున్నారు. ఇది వారి మతభావనలపై దాడి అని అనుకున్నారు; ఇది వారి నమ్మకాలకు, సిద్ధాంతాలకు గొడ్డలిపెట్టని ఊహించారు, వారి సంస్కృతీ నాగరికతలకు, సామాజిక వ్యవస్థకు మృత్యు సందేశమని తలపోశారు.

ఈ సందేశం పురోగమించడమంటే వారు ఏర్పరచుకున్న పవిత్ర లోకానికి నిప్పు అంటించి మరో ప్రపంచాన్ని నిర్మించడమే అన్న సత్యాన్ని తెలుసుకున్నారు. ఈ ప్రమాదం గ్రహించగానే వారు ప్రవక్త ముహమ్మద్(స)కు వ్యతిరేకంగా కత్తులు దూయసాగారు. ఆయన అందజేసే సందేశాన్ని ఎదిరించేందుకు రంగంలోకి దిగారు. ప్రతి మిథ్యాదేవుడు తన దైవత్వాన్ని కాపాడుకునేందుకు సన్నద్ధుడవసాగాడు. మనోమయ జగత్తులో, భావలోకంలో ప్రతిష్ఠించుకున్న ప్రతి విగ్రహ పూజారి తన 'విగ్రహాన్ని' కాపాడుకునేందుకు నడుంబిగించసాగాడు. అన్ని వైపుల నుంచి ఒకే అరపు:

اَنِ امْشُوْا وَاصْبِرُوْا عَلٰٓی اٰلِهَتِكُمْ ۚ

**పదండి స్థిర చిత్తంతో మన ఆరాధ్యులకు (బాసటగా) నిలువండి. (ఈ సందేశం**

إِنَّ هٰذَا لَشَيْءٌ يُرَادُ ۝ مَا سَمِعْنَا بِهٰذَا فِي الْمِلَّةِ الْاٰخِرَةِ إِنْ هٰذَا إِلَّا اخْتِلَاقٌ ۝ (ص:٦،٧)

నిష్కారణంగా లేవలేదు) దీనికి ఏదో (రహస్య) లక్ష్యముంది. ఇటువంటి విషయం మేమయితే మునుపటి ఏ ధర్మంలోనూ వినలేదు. నిశ్చయంగా ఇది ఏదో కాల్పనిక విషయంలా ఉంది.

*(సాద్ : 6, 7)*

ఇటువంటి వాతావరణంలో ముహమ్మద్ (స) సందేశం ముందుకు వచ్చింది. తీవ్రమయిన సంఘర్షణ మొదలయింది. ప్రవక్త(స), ప్రవక్త సహచరులు అత్యంత కఠిన మయిన పరీక్షలకు గురయ్యారు. వాటిని ఒక్క దైవభక్తులే తట్టుకుని నిలబడగలుగుతారు.

ఇది ధన సంపదల పోరు కాదు. ఇది ఆస్తిపాస్తుల జగడం కాదు. ఇది తెగల మధ్య ఏర్పడిన రగడ కాదు. ఇక్కడ ఒక వర్గం అధికారం పొందడం, మరో వర్గం అధికారాన్ని కోల్పోవడం వంటి వాదులాట కూడా కాదు. ఈ సంఘర్షణ ఆ సందేశం మూలంగా ఏర్పడింది. మనిషి ఒకే దైవాన్ని ఆరాధ్యునిగా నమ్మి మనోమస్తిష్కాలతో ఆయన సమక్షంలో తలవంచాలన్నదే ఆ సందేశం.

మానవుడు దేవుని దాసుడన్నది, ఆయనకే దాస్యం చెయ్యాలన్నది ఒక యదార్థం. మహనీయ ముహమ్మద్ (స), ఆయన సహచరులు ఈ యదార్థాన్ని అంగీకరిస్తున్నారు. ఆయన విరోధులు దాన్ని తిరస్కరిస్తున్నారు. ఇది సత్యాసత్యాల సంఘర్షణ. ఇది ఒక నిర్ణీత వాదానికీ, మరో నిరాధారమయిన మాటకు మధ్య పోటీ!

ప్రవక్త సందేశం మానవ నైజానికి సరిగ్గా అతికేది. అది మనస్సులను ఆకర్షిం చింది. తీవ్రమయిన ఎదురు గాలుల మధ్య వ్యాపించింది. జనం అన్ని వైపుల నుంచి వచ్చి అందులోకి చేరిపోయారు. చివరికి అతిహేయమయిన శత్రువుల ఇండ్లల్లో ఆ సందేశానికి ఆప్తులో, సమర్థకులో పుట్టారు. ఈ విధంగా దేవుని వచనాన్ని సమున్నతపరచడానికి స్వయాన దైవధిక్కారుల ముస్ముందు వరుసల నుండి సైనికులు ప్రాప్తమయ్యారు.

## దైవ వచనం సమున్నతపరిచేవారు

మహనీయ ముహమ్మద్ (స) అనుయాయుల ముందు ఒక మహోన్నత లక్ష్య ముంది. వారు ఓ మహత్కార్యం సాధించాలని నిలబడినవారు. వారికి మహోజ్వల మయిన బాధ్యత అప్పగించబడింది. తాము సత్యధర్మంగా నమ్మే ధర్మానికి సత్యసాక్షులుగా

నిలువాలన్న బాధ్యత వారిది. ఆ ధర్మసందేశాన్ని వ్యాపింపజేయడం, దైవం తరఫున అందిన సందేశాన్ని సర్వసామాన్యం చేయడం వారి విధి.

వారిని ఆదేశించడం జరిగింది : ప్రపంచం దైవాన్ని విస్మరించింది, వెళ్ళండి, వెళ్ళి ప్రపంచానికి దైవాన్ని జ్ఞాపకం చెయ్యండి. జనం తమ అంతిమ పరిణామాన్ని గురించి నిశ్చింతగా ఉన్నారు, లేవండి, లేచి వారి అంతిమ పరిణామాన్ని గురించి ఎరుకపరచండి. మానవుడు తన వినాశం వైపునకు పరుగిడుతున్నాడు అతన్ని వినాశం నుండి కాపాడండి. ప్రపంచం నుండి న్యాయం, ధర్మం సమసిపోతున్నాయి, పరుగెత్తండి, దాన్ని పునరుజ్జీవింప చేయండి. మంచి అంతమవుతోంది, చెడు వ్యాపిస్తోంది, మంచిని సంస్థాపించడం, చెడును నిర్మూలించడం మీ విధి.

## అనన్య సముదాయం

ముహమ్మద్ (స) నాయకత్వంలో ఒక అనుచర సమూహం రూపు దిద్దుకుంది. ఇది ప్రపంచంలోని సముదాయాలన్నిటికన్నా పూర్తిగా భిన్నమయింది. ప్రపంచంలోని ప్రతి వర్గం తన స్వంత ఆశయాల చుట్టూ పరిభ్రమిస్తూ ఉంటుంది. వీరు మాత్రం దైవ ధర్మం కొరకు తమ ప్రయోజనాలను బలిగొంటున్నారు.

వీరిది వ్యాపారుల వర్గం కాదు. తమ వ్యాపారవృద్ధి వీరి లక్ష్యం కాదు. ఇది శ్రీమంతుల వర్గం కాదు, దీనికి తమ ధనాన్ని పెంచుకునే చింత లేదు. ఇది ఏదో హక్కుల కోసం పాకులాడే వర్గం కాదు, అధికారంలో ఉన్నవారు హక్కుల భిక్ష పెడితే తృప్తి చెందాలని దీని ఉద్దేశ్యం కాదు, ఇది తన ప్రయోజనాల పరిరక్షణకు పాటుపడటం లేదు, దీనికి ఆరక్షణ పొంది తృప్తి చెందాలని లేదు.

ఇది దైవధిక్కారులతో ఎటువంటి సయోధ్యను కోరుకునే వర్గం కాదు, ఆ సయోధ్య కుదిరితే ఆశయం నెరవేరుతుందని వీరు ఆశించడం లేదు, ఆ తరువాత సుఖ నిద్ర పొందాలన్న ఆకాంక్ష కూడా లేదు. ఇది దేవుని విశ్వాసపాత్రులు, విశ్వసనీయుల వర్గం. ముస్లిములు (దైవ విధేయులు), మోమినులు (విశ్వాసులు) అయిన మానవుల వర్గం. ఇది పరలోకాన్ని కోరుకునే, దైవాన్ని ప్రేమించే వర్గం.

ఇది ప్రపంచానికి దైవభక్తి సందేశాన్ని అందజేసేందుకు ఆవిర్భవించిన సముదాయం. దేవుని దాసులయిన మానవులకు దేవుని సందేశం చేరవేయడం తప్ప మరో సమస్య ఏదీ వీరి ముందు లేదు. వీరు తమ కృషిలో ఇంతకన్నా తక్కువ విషయానికి దేనికీ సిద్ధంగా లేరు. మానవులు దైవేతరశక్తుల దాస్యం వదలి దైవదాస్యాన్ని

స్వీకరించాలన్నది వీరి అభిమతం. ఈ సముదాయంలో ప్రతి వ్యక్తీ దేవుని సిపాయి. అతను దైవధర్మాన్ని సంస్థాపించే ఉత్తమ భావాలతో మత్తుగొన్నవాడు. అతను ఈ ఆశయం కొరకే జీవిస్తున్నాడు, ఈ ఆశయం కొరకే ప్రాణాలర్పిస్తాడు.

## పరీక్షలు మొదలయ్యాయి

పరిస్థితుల ఈ స్వరూపం వాతావరణాన్ని అతలాకుతలం చేసివేసింది. ఈ సందేశానికి ఊతమిచ్చిన వారిపైకి విపత్తుల పర్వతాలు విరుచుకుపడ్డాయి. మిత్రులు శత్రువులయ్యారు. ప్రేమ ద్వేషంగా మారింది. చిరునవ్వులు చిందించే పెదాలు విద్వేషాన్ని క్రక్కసాగాయి. తిరస్కార శక్తులు పిచ్చి పట్టిన ఉద్వేగంతో దాడి చేయసాగాయి.

ఈ సందేశం కారణంగా చెల్లెలిపైన అన్నయ్య చెయ్యి చేసుకోసాగాడు. తల్లిదండ్రులు సంతానాన్ని మట్టుపెట్టాలని చూడసాగారు. భార్య, భర్త దౌర్జన్యాలకు కేంద్రమయింది. ఆప్త బంధువులు ప్రాణ శత్రువులుగా రూపొందారు. కాని ఖుర్ఆన్ సందేశం హృదయాలలో స్థానమేర్పరచుకున్న వారు గాయాలు తిని చిరునవ్వులు పంచిపెడుతున్నారు. శత్రువు అంబుల పొదికి వారు తమ రొమ్ములు తెరచి పెడుతున్నారు.

మలమల మాడే ఇసుక నేలపైన వారిని ఈడ్చుకుపోతున్నారు. మండే నిప్పు కణాలపైన వారిని పరుండబెడుతున్నారు. వారి స్థైర్యం సడల లేదు. పక్షులయినా చల్లని నీడలో ఆశ్రయం పొందగలవు కాని వారికి ఎక్కడా నీడ దొరకదు. అడవి జంతువులు స్వేచ్ఛగా తిరగగలవు కాని వారి కళ్ళకు వీరు సత్య ప్రేమికులు, ప్రపంచం వారిని సత్య ప్రేమ అపరాధానికి శిక్షిస్తోంది.

ఈ సత్య ప్రేమికులు ప్రవక్త మహనీయుని సందేశాన్ని స్వీకరించారు. అంతా అర్థం చేసుకునే స్వీకరించారు. స్వీకారం తరువాత ఇక తమదంటూ ఏదీ లేదని, సర్వం అల్లాహ్‌కు చెందినదే అని తెలుసుకుని మరీ స్వీకరించారు. తమకు చెందిన ప్రతిదాన్నీ అల్లాహ్ ఆజ్ఞ అయిన చోటనే జంకు గొంకు లేకుండా వెచ్చించదానికి సిద్ధపడ్డారు. దైవ ప్రసన్నతకు ప్రతిగా వారు తమ్ముతాము దైవానికి అమ్ముకున్నారు. వారు తమ ప్రాణాలకు ప్రతిమూల్యం వసూలు చేసుకున్నారు. ఇక మృత్యువు ఎక్కడ, ఎప్పుడు, ఏ స్థితిలో వస్తుందో అన్న బెంగ వారికి లేదు.

వాస్తవానికి ఈ సందేశానికి తోడ్పాటు ఇవ్వాలంటే నేడయినా ఇలాంటివారే కావాలి. వారికి జీవితంకన్నా మృత్యువే ముద్దు. వారికి భార్యాబిడ్డలకన్నా దైవధర్మమంటేనే ప్రేమ. సత్యం కోసం బంధుత్వాలను తెంచుకోగలవారు, వృద్ధిలో ఉన్న వ్యాపారాన్ని

నష్టపరచుకునేందుకు సిద్ధమయ్యేవారు, తమ సుఖభోగాలను బలిగొనగలవారు, వీరే ఈ సందేశానికి ఆప్తులు.

అలాకాక ప్రాణమన్నా, సంతానమన్నా, సంబంధాలన్నా పడిచచ్చేవారు, తమ విలాసాలను వదలుకోలేనివారు, తమ వ్యాపారం ధన సంపాదనల ప్రేమను కాదనలేని వారు ఈ సందేశ అవసరాలను ఏనాటికీ తీర్చలేరు. ఇది మహనీయ ముహమ్మద్ (స) సందేశం. దీనికి ఆయన తన జీవితాన్ని, తనకు చెందిన ప్రతి వస్తువునూ ధారపోశారు. ఖుర్ఆన్ స్పష్టంగా చెబుతుంది :

قُلْ اِنْ كَانَ اٰبَآءُكُمْ وَ اَبْنَآءُكُمْ وَ اِخْوَانُكُمْ وَ اَزْوَاجُكُمْ وَ عَشِيْرَتُكُمْ وَ اَمْوَالُ ۨاقْتَرَفْتُمُوْهَا وَ تِجَارَةٌ تَخْشَوْنَ كَسَادَهَا وَ مَسٰكِنُ تَرْضَوْنَهَا اَحَبَّ اِلَيْكُمْ مِّنَ اللّٰهِ وَ رَسُوْلِهٖ وَجِهَادٍ فِيْ سَبِيْلِهٖ فَتَرَبَّصُوْا حَتّٰى يَاْتِيَ اللّٰهُ بِاَمْرِهٖ ؕ وَاللّٰهُ لَا يَهْدِى الْقَوْمَ الْفٰسِقِيْنَ۝

(التوبة:٢٤)

**(ముహమ్మద్) జనులకు చెప్పివెయ్యి, మీ తండ్రులు, మీ కుమారులు, మీ సోదరులు, మీ భార్యలు, మీ వంశం, మీ తెగలవారు, మీరు సంపాదించుకున్న మీ ధన సంపదలు, మీరు మందగిస్తుందని భయపడే మీ వ్యాపారం, మీరు బాగా ఇష్టపడే మీ గృహాలు- అల్లాహ్, ఆయన సందేశహరులు, ఆయన మార్గంలో సతత పోరాటంకన్నా అధికంగా మీకు ప్రియతమమయినట్లయితే ఇక నిరీక్షించండి, దైవం తన తీర్పు విధించే వరకు. వాస్తవం ఏమిటంటే అల్లాహ్ నేర అపరాధులకు సన్మార్గం చూపడు.** ***(అత్ తౌబా:24)***

## పరీక్షలు!

మహనీయ ముహమ్మద్ (స) తన అనుయాయులకు తొలి అడుగు వేసేటప్పుడే స్పష్టంగా తెలిపారు, ఈ దారి సులువయినదని తలపోయకండి. దీని బాధల్ని సుఖప్రదమయినవిగా, ఆనందదాయకమయినవిగా భరించేవారే ఈ త్రోవ తొక్కగలరు. ఎంత విపత్కరమయిన విఘాతం తగిలినా తనకు లెక్కలోకి రానట్టిదే అని భావించేవారే ముందుకు సాగగలరు. ఇది సత్యమార్గం, కాని ఇది కొత్త మార్గం కాదు. ఈ దారిన ప్రవక్తలు, వారి అనుయాయుల అడుగుజాడలు ప్రాప్తమవుతాయి. ఈ అడుగుజాడలే మీకు ఆదర్శాలు.

ప్రవక్తలు, వారి అనుయాయులు తమకున్నదంతా ధారపోశారు. కాని సత్యమార్గం నుండి తప్పుకోలేదు, వెనుకడుగు వేయలేదు, నీవు ఈ దారినే నడవాలి, ఇదే తప్ప నీకు మరో దారిలేదు. అలాంటప్పుడు దారులను గురించి అడుగుతావెందుకు? ఈ దారే బండరాళ్ళ దారి, ఎదురు దెబ్బల దారి, దేవుని ముళ్ళు నిండిన బాటలో అడుగువేసి ముళ్ళలెక్క కడతావేమిటి? జాగ్రత్త! విశ్వాసం నీ వాదనయితే నోటిపై ఫిర్యాదేమిటి? ఇది నీకు అనుమతి లేదు. నోరు విప్పలేవు!

ఈ మార్గాన గమ్యం చేరాలంటే అపారమయిన సంకల్ప బలం అవసరం. అనన్య మయిన సాహసం అవసరం. అనంతమయిన త్యాగం అవసరం. అఖండమయిన బలి దానం అవసరం. ప్రపంచంలోని ఏ ఆకర్షణకయినా ఇట్టే బందీకాగల వ్యక్తి, మనసులోని ఏ కోరికకయినా ఇట్టే బానిస అయిపోయే వ్యక్తి, ఈ గమ్యాన్ని ఎన్నటికీ చేరలేడు. సత్యం నీ ప్రాణాల బలిదానం కోరుతుంది. మరయితే నీవు ఎదురు దెబ్బలకే జడిసిపోతున్నావా?

విశ్వాసి మార్గంలో అతని మనోకాంక్షలు అవాంతరాలుగా నిలువలేవు. అతని దారిలో భార్యాపిల్లలూ, ధనసంపదలు, హోదాపదవులు అడ్డంకులు కాజాలవు. వీటికి తలొగ్గడమంటే విశ్వాసాన్ని వదలుకోవడమే అన్నమాట, సత్యమార్గాన్ని కాదనడమే అన్నమాట. మరణ సమయం నిర్ణయమయి ఉంది. ఆ సమయాన మరణం తథ్యం. అలాంటప్పుడు దైవమార్గాన ఎందుకు మరణించకూడదు?

జీవితం ఒక పెట్టుబడి. దీని ద్వారా ప్రపంచ ప్రయోజనాలు కొనుక్కోవచ్చు. ఏదయినా సాఫల్యం కొనుక్కోవచ్చు. అంతంకాని పరలోకానికి సదృశంగా నశ్వరమయిన ప్రపంచాన్ని బలి ఇచ్చే వ్యక్తి ఎంత సౌభాగ్యవంతుడు! రేపటి దైవ వరప్రసాదాలన్నీ అతనికే!

**అల్లాహ్ అనుమతి లేనిదే ఏ ప్రాణి కూడా చావజాలదు. మరణకాలం వ్రాయబడే ఉంది. ప్రాపంచిక ప్రతిఫలం పొందే ఉద్దేశ్యంతో పనిచేసే వాడికి మేము ప్రపంచాన్నుండే ఇస్తాము. పరలోక ప్రతిఫలాపేక్షతో పనిచేసే వాడు పరలోక ప్రతిఫలాన్ని పొందుతాడు. కృతజ్ఞతలు తెలిపే వారికి మేము వారి ప్రతిఫలాన్ని తప్పకుండా ప్రసాదిస్తాము. ఇంతకు పూర్వం ఎంతో మంది ప్రవక్తలు గతించారు. వారితో కలసి**

**وَ مَا كَانَ لِنَفْسٍ اَنْ تَمُوْتَ اِلَّا**
**بِاِذْنِ اللّٰهِ كِتٰبًا مُّؤَجَّلًا ؕ وَمَنْ يُّرِدْ**
**ثَوَابَ الدُّنْيَا نُؤْتِهٖ مِنْهَا وَ مَنْ يُّرِدْ**
**ثَوَابَ الْاٰخِرَةِ نُؤْتِهٖ مِنْهَا وَ**
**سَنَجْزِى الشّٰكِرِيْنَ۝ وَ كَاَيِّنْ مِّنْ**
**نَّبِيٍّ قٰتَلَ مَعَهٗ رِبِّيُّوْنَ كَثِيْرٌ ۚ فَمَا**

وَهَنُوْا لِمَآ اَصَابَهُمْ فِىْ سَبِيْلِ اللّٰهِ وَمَا ضَعُفُوْا وَمَا اسْتَكَانُوْا وَاللّٰهُ يُحِبُّ الصّٰبِرِيْنَ۝

(آل عمران:۱۴۵،۱۴۶)

దైవభక్తులు యుద్ధం చేశారు. అల్లాహ్ మార్గంలో ఎదురయిన కష్టాలకు వారు క్రుంగిపోలేదు, బలహీనత కనబరచలేదు, (అసత్యం ముందు) తలవంచలేదు. అలాంటి సహనశీలురనే అల్లాహ్ ప్రేమిస్తాడు. *(ఆలి ఇమ్రాన్ : **145–146**)*

ముహమ్మద్ (స) సందేశాన్ని స్వీకరించిన వారు దృఢ విశ్వాసంతోనే దాన్ని స్వీకరించారు. ఇహపర లోకాల సాఫల్యం దీనితోనే ముడివడిందన్న నమ్మకంతో దాన్ని స్వీకరించారు. ఆయన సత్యం అని ధ్రువపరచినదే సత్యం అనీ, ఆయన మిథ్యగా ప్రకటించింది ఏదయినా మిథ్యే అని వారు విశ్వసించారు. ఆయన చూపుతున్న దారిలోనే ముక్తిమార్గముందనీ దానికి భిన్నంగా ఉన్న మార్గాలన్నీ రుజుమార్గం నుండి తప్పించి పెడదారి చూపేవే తప్ప మరేమీ కావని వారు నమ్మారు. ఈ విశ్వాసంతోటే వారు మిథ్యను, అసత్యాన్ని ఎదిరించారు.

పరీక్షలు మిన్నంటాయి, కాని వారి నమ్మకం సడలలేదు. అసత్యం తన శక్తినంతా ధారపోసింది. కాని వారిని దారి తప్పించలేకపోయింది. వారి తలను వంచలేకపోయింది. వారి దృష్టిలో నిజమయిన దైవదాసుల వజ్రసంకల్ప గాథలున్నాయి. వారు ప్రాణత్యాగాలు చేసి, అనన్యమయిన బలిదానాలు చేసి చూపిన ఘనకార్యాల గాథ ఉంది. వారి భక్తి పరాయణత, సాహసోపేత వజ్రసంకల్పాల చరిత్ర ఉంది. తదనుగుణంగా వారు తమకున్నదంతా ఈ సందేశ వ్యాప్తికి అర్పిస్తున్నారు. అయినా వారు, తమ భక్తితత్పరతకు సరయిన నిరూపణ అర్పించలేకపోతున్నామని బాధపడుతున్నారు.

## హిజ్రత్

ముహమ్మద్ (స) అందించిన ఈ సందేశం ప్రారంభమయి పదమూడు ఏళ్ళు గడిచాయి. దైవం పేరు పలికేవారు దెబ్బతిన్న దేహాలతో, గాయపడిన గుండెలతో సత్యానికి సాక్ష్యం పలుకుతూనే ఉన్నారు. వారు ఆసాంతం పీడితులే. వారు ఎవరికీ అన్యాయం చేయలేదు. ఎవరి సొమ్మూ దోచుకోలేదు. ఎవరి పట్లనూ చెడుగా ప్రవర్తించలేదు. ఎవరి మానమర్యాదలపైనా దాడి జరుపలేదు. ఎవరికీ బాధ కలిగించలేదు. వారు దేవుని దాసులు, దైవభక్తులు. వారు చేసిన నేరం ఒక్కటే, తాము కేవలం దైవానికే దాసులమని ప్రకటి స్తున్నారు; ఇతరులను దైవదాస్యం వైపునకు ఆహ్వానిస్తున్నారు.

దైవాజ్ఞ అయింది, ఇక వారు దుర్మార్గులుండే ఆ ప్రదేశం వదలిపెట్టాలి. వారు

ఆ నగరం వదలిపెట్టారు. అక్కడి ఒక్కొక్క గోడ, ఒక్కొక్క తలుపు వారికి ప్రియమయినదే. దాని కొండలు, చెలమలు వారికి ప్రేమప్రదమయినవే. దాని వీధులంటే, సందులంటే వారికి ప్రాణప్రదమే. దాని మట్టితోను, గాలి తెరలతోనూ వారికి అనురాగముంది. కాని వారు ఒక కొత్త బస్తీని తమ సొంతం చేసుకున్నారు. వారు ఏమీ లేని దుస్థితిలో మక్కా పవిత్ర భూభాగం వదలి మదీనా ప్రకాశ నగరంలో ప్రవేశించారు.

ఇది స్వదేశాన్ని వదలి వెళ్ళిపోవడం కాదు. ఇది దైవమార్గంలో వలస. కొత్త నగరం ఆనందోత్సాహాలతో, ఉద్వేగంతో స్వాగతం పలికింది. దైవధర్మం ఆ నగరవాసుల్లో సమగ్రంగా వ్యాపించింది. కాని విరోధులకు ఇది కంటకప్రాయమయింది. వారంతా దాన్ని సహించలేకపోయారు, భరించలేకపోయారు. అసహనంతో తల్లడిల్లిపోయారు. విద్వేషం అన్ని వైపుల నుండి అంబుల వర్షమయి కురియడం మొదలయింది, శత్రుత్వం పెరిగింది.

కాని విరోధులు సృష్టించిన ఆ తుఫానులోనే, దైవధర్మ సమున్నతికి కావలసిన ధీరోదాత్త వ్యక్తులు సన్నద్ధమవసాగారు. వారిని పరీక్షాగ్నిలో మేలిమి బంగారుగా మార్చే పని జరుగుతోంది. వారి హృదయాలు దైవసంస్మరణతో ఉజ్వలమవసాగాయి. వారి ముఖాలు ఆరాధనా నిదర్శనాలతో శోభించసాగాయి. వారి ఆలోచనల్లో ఇతరుల ఆలోచనలకు భిన్నమయిన జ్యోతులు, వారి నైతికతలో ఇతరుల నీతికి భిన్నమయిన పరిశుద్ధతలు, వారి శీల స్వభావాలలో ఇతరులకు భిన్నమయిన ఉత్కృష్ట లక్షణాలు పొడసూపనారంభించాయి. వారి ఆచరణలు ఇతరుల ఆచరణలకు పూర్తిగా భిన్నంగా, ఉన్నతంగా గోచరించసాగాయి.

## జిహాద్!

ఖుర్ఆన్‌ని విశ్వసించిన మహనీయుల ఒక వర్గం ప్రముఖంగా తయారయింది. వారు సత్యధర్మాన్ని చిత్తశుద్ధితో అవలంబించే సత్యప్రియులు. తాము అనుసరించే ధర్మం కొరకు ఎటువంటి త్యాగాలకయినా కాదననివారు. ఎటువంటి పరిస్థితుల్లోనూ ముందుకు సాగడానికి సన్నద్ధులయినవారు. కాల గమనాన్ని మార్చగల యోధులు. ఖుర్ఆన్ వారిని ఆదేశించింది. అన్యాయకర్తనుల నుండి అధికార శక్తిని హస్తగతం చేసుకుని న్యాయాన్ని నిలబెట్టవలసిన అవసరం వచ్చిందని చెప్పింది. దైవం పేరు పలకడం ఇక నేరం కాదని వక్కాణించింది. దైవదాసుల్ని బాధపెట్టే పర్వం ముగియాలని ధైర్యం చెప్పింది. వారిని ఇండ్ల నుండి తరిమివేసే కాలం చెల్లిపోయిందని ప్రకటించింది.

ఇక విశ్వాసులు అవిశ్వాసుల దౌర్జన్యాలకు భయకంపితులయ్యే ఘడియలు అంతమయ్యాయని ఖుర్ఆన్ వెల్లడించింది. ఇక సత్యం అసత్యానికి తలవంచే అవసరం లేదు. పీడనకు తావులేదు. సత్యధర్మం విజయ పథాన సాగవలసిన అవసరం ఆసన్న మయింది. దైవసహాయం, విజయం సత్యం పక్షాన నిలుస్తాయి. ఖుర్ఆన్ విశ్వాసులను మేల్కొలిపింది, లేచి నిలబడమన్నది. సత్య విజయానికి కృషి సలిపేందుకు సన్నద్ధమవ్వాలని కోరింది. ప్రపంచం నిరీక్షిస్తోందని, మీరు ముందడుగువేస్తే దైవసహాయం ఆదుకొనడానికి సిద్ధంగా ఉందని అభయమిచ్చింది.

اُذِنَ لِلَّذِيْنَ يُقٰتَـلُوْنَ بِاَنَّهُمْ ظُلِمُوْا، وَ اِنَّ اللّٰهَ عَلٰى نَصْرِهِمْ لَقَدِيْرُo ۨالَّذِيْنَ اُخْرِجُوْا مِنْ دِيَارِهِمْ بِغَيْرِ حَقٍّ اِلَّاۤ اَنْ يَّقُوْلُوْا رَبُّنَا اللّٰهُo

(الحج:۳۹،۴۰)

**సత్యప్రియులను పీడించడం జరిగిన కారణాన సంఘర్షిస్తున్న తిరస్కారులతో తామూ సంఘర్షించవచ్చని సత్యప్రియు లకు అనుమతించబడుతోంది. నిస్సం దేహంగా అల్లాహ్ వారికి సహాయం చెయ్య గల శక్తిసంపన్నుడే. అధర్మంగా తమ ఇండ్ల నుండి గెంటివేయబడినవారు వీరు. వారి నేరం ఒక్కటే, వారు కేవలం అల్లాహ్ మాత్రమే తమ ప్రభువని ప్రకటిస్తారు.**

***(అల్ హజ్జ్ : 39, 40)***

అన్యాయానికి ఎదురుతిరిగి సంఘర్షించమని ఆదేశించినది ఎవరికి? రేయంతా దైవసంస్మరణలో నిష్ఠతో గడిపి పగలు గుర్రాలనెక్కి సత్యరక్షణకు శ్రమించేవారికి! వారు దైవ వచనాన్ని సమున్నతపరచాలని నడుంకట్టుకుని రంగంలోనికి దిగినవారు. దైవ ధర్మాన్ని ఎట్టి పరిస్థితుల్లోనూ సమర్థించాలని నిర్ణయించుకున్నవారు. బలహీనులపైన విరుచుకుపడుతున్న పీడనకొండలు ఇకపై ఆగిపోవాలని, ప్రపంచం నుండి దౌర్జన్యకాండ సమసిపోవాలని, మనిషి స్వేచ్ఛగా దైవారాధన చేసుకోగలగాలని ఈ అనుమతి వారికి ఇవ్వబడింది. దైవదాసులు దైవారాధన చేసుకుంటున్న కారణాన ఇక పీడించబడరాదని, దైవధర్మాన్ని దేవుని దాసులయిన మానవులందరికీ చేరవేయాలని కోరుతున్నందుకు బాధించబడరాదని వారికి ఈ అనుమతి ఇవ్వబడింది.

وَمَا لَكُمْ لَا تُقَاتِلُوْنَ فِىْ سَبِيْلِ اللّٰهِ وَالْمُسْتَضْعَفِيْنَ مِنَ الرِّجَـالِ

**అసలు మీరు, నిస్సహాయులైన ఆ పురు షులు, స్త్రీలు, పిల్లల కొరకు అల్లాహ్ మార్గంలో పోరాడకపోవటానికి కారణం**

وَالنِّسَاءِ وَالْوِلْدَانِ الَّذِيْنَ يَقُوْلُوْنَ رَبَّنَآ اَخْرِجْنَا مِنْ هٰذِهِ الْقَرْيَةِ الظَّالِمِ اَهْلُهَا وَاجْعَلْ لَنَا مِنْ لَّدُنْكَ وَلِيًّا وَّاجْعَلْ لَّنَا مِنْ لَّدُنْكَ نَصِيْرًا○

(النساء:٧٥)

ఏమిటీ? బలహీనులవటంచేత అణచబడి, వారు, "మా ప్రభూ! దుర్మార్గులైన ఈ నగరవాసుల నుండి మాకు విమోచనం కలిగించు. మా కొరకు నీ తరఫు నుండి ఒక సహాయకుణ్ణి, ఒక రక్షకుణ్ణి పంపించు" అని వేడుకుంటున్నారే.

*(అన్ నిసా : **75**)*

ఈ విధంగా బలహీనులకు, నిస్సహాయులకు, నిరాధార జీవులకు అండదండగా నిలిచి, ప్రపంచంలో తొలిసారిగా అన్యాయాన్ని, అక్రమాన్ని ఎదిరించి సంఘర్షించడం జరిగింది. ఈ సంఘర్షణ ప్రపంచంలో మహత్తరమయిన విప్లవానికి, మానవుల్లో అతి ఘనమయిన పరివర్తనకు తొలిపలుకు పలికింది. ఇది తరువాతి కాలంలో విశ్వచరిత్ర గతినే మార్చివేసింది. ఈ సంఘర్షణ ప్రపంచంలో జరిగే ఇతర సంఘర్షణల్లాంటిది కాదు. దీని వెనుక ప్రేరణలో ఉన్నవి అతి సాధారణంగా పనిచేసే హేయమయిన ప్రేరణలు కావు. ఇది నిజంగానే పవిత్రమయిన సంఘర్షణ. ఎంతో ఉన్నతమయిన ధ్యేయసాధనలకే ఈ సంఘర్షణ.

ఈ సంఘర్షణ కేవలం ధనం, ధాన్యం, సంపదలకు జరిగే సంఘర్షణ కాదు. హక్కులు, అధికారాల కోసం సాగుతున్న సమరం కాదు. పగ తీర్చుకోవడానికి రేగిన మంటలు కావు. ద్వేషం, వైషమ్యం వల్ల ఏర్పడిన స్పర్థలు కావు. దేశాలను జయించడానికి ప్రారంభమయిన పోరు కాదు. ఇటువంటి సంఘర్షణ ప్రపంచానికి అపరిచితం. దైవభక్తిని ప్రతి గుండెదివిలో వెలిగించడానికి బయలుదేరిన కాంతి, ప్రపంచంలోని చీకట్లతో సాగించే సమరం. ఇది దైవధర్మ సంస్థాపన కోసం జరిగే పోరు. ప్రపంచం 'ఔనా!' అని ఆశ్చర్యంతో చకితురాలయి చూస్తున్న సమరం.

దైవతిరస్కారాన్ని రూపుమాపడానికి, బహుదైవారాధనను సత్యం కాదని ప్రపంచానికి చాటడానికి జరుగుతున్న సంఘర్షణ. ఇది సరికొత్త పోరు. పీడనను, కలతలను, కల్లోలాలను, అన్యాయాన్ని, అత్యాచారాన్ని అంతమొందించడానికి మొదలయిన ఘర్షణ. ఇది పవిత్రమయిన లక్ష్యంతో, పవిత్ర మనస్కులయిన వారు సాగిస్తున్న సమరం. దేవుని పేరెత్తే వారు– షైతాన్ వద్దకు పిలుపునిచ్చేవారు ఇరువురికీ మధ్య సాగే సమరం. ఒక ప్రక్కన దైవభక్తులు, దైవప్రేమికులు, సత్యకాముకులుంటే, మరో ప్రక్కన దైవవిరోధులు,

దైవ తిరస్కారులు, అసత్య ప్రేమికులు. ఒక ప్రక్కన సత్యాన్ని సమున్నతపరచాలని కోరుకునేవారయితే, మరో ప్రక్కన అసత్యానికి ఆధిక్యత ఇవ్వాలని ఆకాంక్షించేవారు. ఒక ప్రక్కన నైతికపు విలువల ప్రాబల్యానికి కృషి సలిపేవారు, మరో ప్రక్కన నీతి బాహ్యతకు, సంస్కార శూన్యతకు దాసోహమనేవారు. ఒక వైపున పరలోకాన్ని ప్రేమించే వారయితే, మరో వైపున ప్రపంచానికి కట్టుబానిసలయినవారు.

ఈ సంఘర్షణలో దైవసన్నిహితులే సాఫల్యం, విజయం సాధించగలరన్నది దైవ వాగ్దానం. ఆ వాగ్దానం నెరవేరింది. దాన్ని ప్రపంచంలోని ఏ శక్తీ అడ్డుకోలేక పోయింది.

اَلَّذِيْنَ اٰمَنُوْا يُقَاتِلُوْنَ فِىْ سَبِيْلِ اللّٰهِۚ وَالَّذِيْنَ كَفَرُوْا يُقَاتِلُوْنَ فِىْ سَبِيْلِ الطَّاغُوْتِ فَقَاتِلُوْۤا اَوْلِيَآءَ الشَّيْطٰنِۚ اِنَّ كَيْدَ الشَّيْطٰنِ كَانَ ضَعِيْفًا۝ (النساء:٧٦)

**విశ్వాస మార్గాన్ని ఎన్నుకున్న వారు అల్లాహ్ మార్గంలో పోరాడతారు. అవిశ్వాస మార్గాన్ని ఎన్నుకున్నవారు తాగూత్ మార్గంలో పోరాడతారు. కనుక షైతాన్ సహచరులతో పోరాడండి. వాస్తవంగా షైతాన్ జిత్తులు ఎంతో బలహీనమైనవని నమ్మండి.** ***(అన్ నిసా : 76)***

## సత్యధర్మం!

మహనీయ ముహమ్మద్ (స) ఇచ్చిన సందేశం–దైవం వైపునకు మరలాలన్న సందేశం. మానవ కళ్యాణానికి, మోక్షానికి అంతకన్నా ఉత్తమమయిన సందేశం మరొకటి లేదు. ఈ సందేశం ఆధారంగా సంస్కారవంతమయిన మహోన్నత విప్లవం వెలిసింది. చరిత్ర, ఇటువంటి పరిశుద్ధమయిన విప్లవం, ఇంత ఘనమయిన విప్లవం మరొకటి చూడలేదు. అదొక జ్యోతి స్థంభం. ఆసూర్యచంద్రతారార్కం వెలుగు చూపే స్థంభం. మానవుని ఉనికి భువిపైన ఉన్నంత కాలం, మానవుల శుభశ్రేయాలు కాంక్షించేవారు, మానవునికి దైవధర్మ సందేశం అందజేసేందుకు దారి చూపే స్థంభం. మానవులకు, సన్మార్గగాములకు ధైర్యసాహసాలు, సంకల్ప శక్తులు ప్రదానం చేసే స్థంభం, విజయ ద్వారాలు తెరిచే స్థంభం.

ధర్మం ఆధిక్యత పొందిన వేళ సత్యసందేశం, బలహీనమయిన చిన్న మొక్క నుండి ఎదిగి పెద్ద వ్రూనయింది. ఇది అతి శీఘ్రగతిన సంభవించింది. దీని నీడలో అసంఖ్యాక

సముదాయాలకు, జనవాసాలకు పరిశుద్ధమయిన జీవితం ప్రాప్తమయింది. శాంతి, సుఖం ప్రాప్తించాయి. సత్యప్రేమ, దైవభక్తి, దైవభీతి సంపదలు లభించాయి. మక్కా కొండలపైన ఉవ్వెత్తున లేచిన సందేశ కెరటం క్రమంగా మొత్తం అరేబియా ద్వీపకల్పాన్ని ఆవరించింది, ఎడారి మైదానాలు కొండ శిఖరాలపై ఎల్లెడలా ప్రతిధ్వనించసాగింది.

విశ్వాసులకు పీడితులయ్యే, పరీక్షలకు గురయ్యే కాలం అంతమయింది. ప్రాబల్యం, అధికారాల పర్వం ప్రారంభమయింది. భయవిహ్వల వాతావరణం సమసి పోయింది. శాంతి, నెమ్మది జీవితంలో రాజ్యమేలసాగాయి. మిథ్యాబలం నశించింది. దైవధర్మాన్ని అనుసరించడం తేలికయింది. బాధలు ఇబ్బందులు ముగిశాయి. సుఖాలన్నీ స్వంతం కాకపోయినా శాంతిగా శ్వాస పీల్చే అవకాశాలు మెండుగా దొరికాయి.

సత్యసందేశ కార్యం ఇలా ఇరువయి మూడేళ్ళు సాగింది. దైవప్రవక్త (స), ఆయన అనుచర సహచరుల ద్వారా పరిపూర్ణమయింది. ఈ మహత్కార్యం ఎప్పుడు నెరవేరినా ఇటువంటి దైవభక్తులు, సజ్జనులు, సంస్కార ప్రియుల ద్వారానే నెరవేరుతుంది. ప్రవక్త ద్వారా ఈ కార్యసిద్ధి జరిగిన తరువాత దైవం తరఫున ధర్మం పరిపూర్ణమయినట్లు, వరప్రసాదం పూర్తయినట్లు ప్రకటన జరిగింది. తిరస్కారానికి సత్యధర్మం పట్ల ఏ ఆశా మిగులూ లేదు. పైగా దానిపైన నిరాశాఛాయలు ఆవహించాయి.

اَلْيَوْمَ يَئِسَ الَّذِيْنَ كَفَرُوْا مِنْ دِيْنِكُمْ فَلَا تَخْشَوْهُمْ وَاخْشَوْنِ ۚ اَلْيَوْمَ اَكْمَلْتُ لَكُمْ دِيْنَكُمْ وَ اَتْمَمْتُ عَلَيْكُمْ نِعْمَتِيْ وَ رَضِيْتُ لَكُمُ الْاِسْلَامَ دِيْنًا (المائدة:٣)

నేడు తిరస్కారులు మీ ధర్మం విషయంలో నిరాశా నిస్పృహలకు లోనయ్యారు. ఇక మీరు వారికి భయపడరాదు, నాకు భయ పడండి. నేడు నేను మీ కొరకు మీ ధర్మాన్ని పరిపూర్ణంగావించాను. నా వరప్రసాదా లను మీ కొరకు పూర్తి చేశాను. మీ కొరకు ఇస్లామ్ ధర్మాన్ని మీ జీవన ధర్మంగా, జీవన విధానంగా ఆమోదించాను.

*(అల్ మాఇద : 3)*



 ఇస్లాం పిలుపు

 సందేశం, దాని అనుసరణ

 సందేశం, సంస్కరణల క్రమం

 సందేశ వ్యాప్తి - సూత్రాలు, మర్యాదలు

 సందేశకుడు సఫలుడయ్యాడు

 ధర్మతిరస్కారం - కారణాలు

 దైవధర్మం పొందేవారు

# ఇస్లాం పిలుపు

## సత్యధర్మం-సాక్ష్యం

ఇదంతా ఎలా సాధ్యమయింది? దివ్య ఖుర్‌ఆన్‌లో అతి స్పష్టంగా ఉంది. దైవ ప్రవక్తలు ప్రపంచంలో మానవాళి సమక్షంలో సాక్ష్యం పలికే విధి నిర్వహిస్తారని. అంటే ఏ జాతిలోనయితే ప్రవక్తలు ప్రభవిస్తారో వారు ఆ జాతి ప్రజలకు, దైవధర్మం సత్యమయి నదన్న వాదనను ఆధారసహితంగా నిరూపిస్తారు. ఆ తరువాత దాన్ని తిరస్కరించే సమంజసమయిన, సహేతుకమయిన ఆధారమేదీ మిగులదు. వాదన పూర్తవుతుంది. ఈ భావంలో దేవుడు తన సందేశహరుణ్ణి 'షహీద్' (సాక్షి)గా పేర్కొన్నాడు.

وَ نَزَعْنَا مِنْ كُلِّ اُمَّةٍ شَهِيْدًا فَقُلْنَا
هَاتُوْا بُرْهَانَكُمْ فَعَلِمُوْٓا اَنَّ الْحَقَّ لِلّٰهِ
وَ ضَلَّ عَنْهُمْ مَا كَانُوْا يَفْتَرُوْنَ ٥

(القصص:٧٥)

**మేము ప్రతి సముదాయం నుండి ఒక 'షహీద్' (సాక్షి)ని రప్పిస్తాము. అప్పుడు (దైవ తిరస్కారులకు) చెబుతాము, మీ వద్ద ఉంటే ఏదయినా ఆధారం, తెచ్చిచూపండి అని, అప్పుడు తిరస్కారులు తెలుసుకుం టారు, దైవ వచనమే సత్యమయినదని. వారు చేస్తున్న కల్పితపు బూటకపు వాదన లన్నీ ఒక్కసారిగా మటుమాయమయి పోతాయి.** ***(అల్ కసస్ : 75)***

ఒక జాతి పట్ల మానవాళి సమక్షంలో సాక్ష్యం బాధ్యత పూర్తయినట్లయితే, దానికి వాదన ముగిసినట్లయితే, ఇక దాని విషయంలో తుది నిర్ణయం అయిపోతుంది. దైవ సందేశహరులకు తోడ్పాటు అందజేసేవారు బహుమానాలకు అర్హులవుతారు. వారిని ఎదిరించిన వారు శిక్షకు పాత్రులవుతారు.

وَ لَقَدْ اَرْسَلْنَا مِنْ قَبْلِكَ رُسُلاً اِلٰی قَوْمِهِمْ فَجَاءُوْهُمْ بِالْبَيِّنٰتِ فَانْتَقَمْنَا مِنَ الَّذِيْنَ اَجْرَمُوْا، وَ كَانَ حَقًّا عَلَيْنَا نَصْرُ الْمُؤْمِنِيْنَo (الروم:٤٧)

మేము నీకు పూర్వం కూడా సముదాయాల వద్దకు వారి ప్రవక్తల్ని పంపాము. వారు తమ సముదాయాల సమక్షంలో స్పష్టమయిన ఆధారాలు చూపెట్టారు. ఆ తరువాత మేము అపరాధులయిన జాతులకు ప్రతిగా ప్రతీకారం తీర్చుకున్నాము. (విశ్వాసులయిన వారికి సహాయపడ్డాము). విశ్వాసులకు సహాయపడటం మా బాధ్యత. *(అర్ రూమ్ : 47)*

ప్రళయ దినాన కూడా ఈ 'సాక్ష్యం' ఆధారంగానే సముదాయాల తీర్పు జరుగుతుంది.

فَكَيْفَ اِذَا جِئْنَا مِنْ كُلِّ اُمَّةٍ، بِشَهِيْدٍ وَ جِئْنَا بِكَ عَلٰی هٰٓؤُلَآءِ شَهِيْدًاo يَوْمَئِذٍ يَّوَدُّ الَّذِيْنَ كَفَرُوْا وَ عَصَوُا الرَّسُوْلَ لَوْ تُسَوّٰی بِهِمُ الْاَرْضُ، وَلَا يَكْتُمُوْنَ اللّٰهَ حَدِيْثًاo (النساء:٤١،٤٢)

అప్పుడు ఏమవుతుందో, అప్పుడు మేము ప్రతి సముదాయంలో నుంచి ఒక సాక్షిని తీసుకువస్తాము. నిన్ను (ముహమ్మద్), వారికెదురుగా సాక్షిగా నిలబెడతాము. ఆ రోజున (ప్రపంచంలో) తిరస్కారులయిన వారు, అయ్యో, నేల చీలుకుపోయి మేము అందులో కూరుకుపోతే ఎంత బావుండేది అని కోరుకుంటారు. వారు అల్లాహ్ సమక్షంలో ఒక్క మాటనూ దాయలేరు. *(అన్ నిసా: 41,42)*

## సత్య సందేశం

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ (ర) ఉటంకించిన ఒక ఉల్లేఖనం: "ఒక రోజున దైవసందేశహరులు (స) మస్జిద్‌లో మిమ్బర్ (వేదిక)పైన కూర్చుని ఉన్నారు. నన్ను ఖుర్ఆన్ వినిపించమని కోరారు. 'నేను మీకు ఖుర్ఆన్ వినిపించడమా? ఖుర్ఆన్ అవతరించింది మీకే కదా' అని నేను ఆశ్చర్యం వ్యక్తం చేస్తే ఆయన ఇలా సెలవిచ్చారు, 'నేను ఇతరుల ద్వారా వినాలని కూడా ఆశపడతాను.' అప్పుడు నేను నిసా సూరా పఠనం ప్రారంభించాను. నేను నిసా సూరాలోని 41,42 ఆయత్‌లకు చేరుకోగానే ఆయన, "చాలు,

ఇక చాలించు" అని అన్నారు. నేను ఆయన వైపునకు వింతగా చూశాను. ఆయన కళ్ళ నుండి అశ్రువులు రాలుతున్నాయి. (బుఖారి, ముస్లిమ్)

ఈ అశ్రువులకు కారణం, ఒకటి, ఆయనపైన పెద్ద భారం మోపడం, మరో బాధ్యత తన జాతి ఈ ధర్మాన్ని ఒకవేళ సాంతం తిరస్కరిస్తే దాని గతేంకాను? అన్నది. అలా కూడా ఆయన ఆంతర్యం తల్లడిల్లిపోతోంది.

పరమ ప్రభువు దైవసందేశహరునిపైన ధర్మప్రచార బాధ్యతను మోపాడు. ఆయన ప్రపంచానికి ధర్మసందేశాన్ని అందజేశారు. మానవుడు ప్రాథమికంగా దైవానికి దాసుడని, దైవదాస్యంలోనే మానవ మోక్షం ఇమిడి ఉందని ఆయన చాటారు. దైవ భక్తులయినవారే సాఫల్యం పొందగలరని, దైవ ద్రోహులయినవారు నిషిద్ధులవుతారని కూడా ఆయన చాటి చెప్పారు. దైవాదేశం ఇలా అయింది:

يَآيُّهَا الرَّسُوْلُ بَلِّغْ مَآ اُنْزِلَ اِلَيْكَ مِنْ رَّبِّكَ ؕ وَ اِنْ لَّمْ تَفْعَلْ فَمَا بَلَّغْتَ رِسَالَتَهٗ ؕ وَاللّٰهُ يَعْصِمُكَ مِنَ النَّاسِ ؕ اِنَّ اللّٰهَ لَا يَهْدِى الْقَوْمَ الْكٰفِرِيْنَ ○

(المائدة:٦٧)

ప్రవక్తా, నీ ప్రభువు పక్షాన నీకు అవతరించిన దాన్ని ఇతరులకు చేరవెయ్యి. నీవు ఇలా చెయ్యకపోతే దైవదౌత్య బాధ్యత నెరవేర్చలేదని అర్థం. అల్లాహ్ స్వయంగా ఇతర జనుల బారి నుండి మిమ్మల్ని రక్షిస్తాడు. నిస్సందేహంగా అల్లాహ్ తిరస్కార కాముకులకు రుజుమార్గం చూపడు.

*(అల్ మాఇద : 67)*

ఈ ఆయత్ అవతరించినప్పుడు మదీనాలో ప్రవక్త మహనీయులు (స) తీవ్ర ప్రతిఘటనను ఎదుర్కొంటున్నారు. ఒక వైపున దైవధర్మం పరిపూర్ణమవుతోంది. మరో వైపున బహుదైవారాధకులు, యూదులు, కపటులు, ఈ ధర్మం ఎలాగయినా ఆధిక్యత పొందకుండా, ఉన్నతం కాకుండా శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. దీనికి సకల ఉపాయాలు, కుతంత్రాలు పన్నుతున్నారు. దైవసందేశహరుల వ్యక్తిత్వం, శత్రుత్వానికి ప్రత్యేక కేంద్రమయింది. ఆయన్ని హతమార్చాలన్న కుట్రలూ కుతంత్రాలూ సాగుతున్నాయి.

ఇటువంటి సున్నితమయిన సమయంలో నిర్దేశించడం జరిగింది, దైవధర్మాన్ని ఎటువంటి హెచ్చుతగ్గుల్లేకుండా, ఉన్నది ఉన్నట్టుగా ప్రజల ముందుంచాలని. దైవ ధర్మానికి సంబంధించిన ఒక్క ఆదేశం, ఒక్క నిర్దేశన కూడా దైవదాసులయిన మానవులకు చేరకపోతే దైవదౌత్య సందేశం అసంపూర్ణంగా మిగిలిపోతుంది. దైవధర్మం పూర్తిగా దైవదాసులకు అందదు.

అందువల్ల మీరు ఎటువంటి భయభ్రాంతులకు లోనవకుండా, పరిస్థితుల్ని ఖాతరు చేయకుండా ధర్మ ప్రచార కార్యాన్ని సాగనివ్వండి. దీని వాతన ఏది పడినా సరే, దానికి హాని కలిగినా సరే, ప్రజల నమ్మకాలకు, ఆచార వ్యవహారాలకు, జీవన విధానాలకు, వారి శీల స్వభావాలకు, దేనికయినాసరే, ఎటువంటి విఘాతం కలిగినాసరే, వారు మీకు వ్యతిరేకంగా ఎన్నెన్ని పథకాలు, పన్నాగాలు పన్నినా సరే. మీ కర్తవ్యాన్ని నిర్విరామంగా నిర్వహిస్తూ ముందుకుసాగండి. దైవం మీకు రక్షణ కల్పిస్తాడు. శత్రువు మీకు ఎటువంటి హానీ కలుగచేయలేడు.

ఉల్లేఖనాల వల్ల తెలిసేదేమిటంటే, అప్పటి పరిస్థితులు ఎంతో తీవ్రంగా, సున్నితంగా తయారయ్యాయి, ప్రయాణ సహచరులు రాత్రిళ్ళల్లోనూ ఆయన రక్షణకు కాపలా కాసేవారు. ఈ ఆయత్ అవతరించినప్పుడు ఆయన తన గుడారం నుండి బయటికి వచ్చి ఇక మీరు (కాపలాదారులు) వెళ్ళిపోవచ్చని, దైవం స్వయంగానే తన రక్షణ బాధ్యత తీసుకున్నాడని ప్రకటించారు. (తఫ్సీర్ ఇబ్నుకసీర్ : 2/89)

## సత్యానికి సాక్ష్యం

దీన్నిబట్టి, దైవసందేశహరులు (స) ఎటువంటి హెచ్చుతగ్గుల్లేకుండా, మార్పులూ చేర్పులు లేకుండా, దైవధర్మాన్ని మానవాళికి అందజేశారు అన్న విషయం తెలుస్తోంది. ఆ తరువాతనే ఆయన ఇహలోకాన్ని వీడి పరం వైపునకు నిష్క్రమించారు. కాని ఆయన ద్వారా మానవాళికి అందిన ధర్మం యధాతథంగా నేటికీ భద్రంగా ఉంది, ప్రళయ దినం వరకూ భద్రంగానే ఉంటుంది.

ఇక ఈ ధర్మాన్ని నమ్మేవారి బాధ్యత మన ఎదుటికి వస్తుంది. ప్రపంచ ప్రజల మధ్య దైవధర్మాన్ని ప్రచారం చెయ్యడం, వారికి దాన్ని ఎటువంటి హెచ్చుతగ్గుల్లేకుండా అందజెయ్యడం విశ్వసించేవారి బాధ్యత, కర్తవ్యం. ఈ విధి నిర్వహణ వారు సక్రమంగా నిర్వర్తించినట్లయితే వారు దైవ ప్రేమకు అర్హులవుతారు. అలాకాక వారు ఈ బాధ్యతను, విధి నిర్వహణను మరచిపోయి దీని పట్ల ఉపేక్ష కనబరచినట్లయితే దైవాగ్రహానికి పాత్రులవుతారు, దైవం పట్టునుండి వారిని ఎవ్వరూ తప్పించలేరు.

దివ్య ఖుర్ఆన్ స్పష్టంగా తెలిపింది. మానవుల సమక్షంలో సాక్ష్యమిచ్చే బాధ్యత ప్రవక్త ముహమ్మద్ (స) తరువాత ఆయన అనుచర సమాజంపైన తారసిల్లుతుంది. వారు ఈ బాధ్యతను, విధిని తప్పక నిర్వర్తించవలసి ఉంటుంది. ప్రవక్త మహనీయులు (స) నిర్వహించిన ఈ బాధ్యత ఇకపైన ఆయన అనుయాయులయిన విశ్వాసులదే. ఆయన

తన అనుచర సమాజం సమక్షంలో ధర్మానికి ఎలా సాక్ష్యం పలికారో, ఎలా ధర్మాన్ని పాటించి చూపారో అదే విధంగా దాన్ని పాటిస్తూ ఆయన అనుచరులు, అనుయాయులు ఇతర మానవుల సమక్షంలో దానికి సాక్ష్యం పలకాలి.

وَكَذٰلِكَ جَعَلْنٰكُمْ اُمَّةً وَّسَطًا لِّتَكُوْنُوْا شُهَدَآءَ عَلَى النَّاسِ وَيَكُوْنَ الرَّسُوْلُ عَلَيْكُمْ شَهِيْدًا (البقرة:١٤٣)

**ఈ విధంగా మేము మిమ్మల్ని మధ్యస్థ సమాజంగా చేశాము, మీరు జనులకు సత్యానికి సాక్ష్యం ఇవ్వాలని, దైవ సందేశ హరుడు మీ సమక్షంలో సాక్ష్యం ఇవ్వాలనీను.** ***(అల్ బకర: 143)***

జాతుల సౌభాగ్య దౌర్భాగ్యాలు ఈ అనుచర సమాజంతో ముడిపడి ఉన్నాయన్న భావం దీని వల్ల ప్రస్ఫుటమవుతోంది. ఈ అనుచర సమాజం, సత్యధర్మానికి సాక్ష్యంగా నిలిచి, ఆ బాధ్యతను నెరవేర్చి జాతుల మార్గదర్శకత్వం కోసం మార్గం సుగమం చేయాలి. అప్పుడే అది తన బాధ్యతను నెరవేర్చినట్లు. అప్పుడే దైవం సన్నిధిలో అది సత్ఫలితానికి అర్హత పొందుతుంది. కాని ఒకవేళ అది ఈ బాధ్యత పట్ల ఏమరుపాటుగా వ్యవహరించి నట్లయితే, ప్రపంచం మార్గవిహీనతకు లోనయినందుకుగాను ఇది అతి వివరంగా, అతి నిశితంగా జవాబు చెప్పుకోవలసి ఉంటుంది. ఒక సందర్భంలో ప్రవక్త మహనీయులు (స) తన అనుచర సమాజం గురించి ఇలా సెలవిచ్చారు:

اَنْتُمْ شُهَدَاءُ اللّٰهِ فِى الْاَرْضِ

**మీరు భువిలో దైవానికి సాక్షులు.**

***(బుఖారీ, ముస్లిం)***

ఇదొక ప్రకటన. ఈ అనుచర సమాజం దైవం తరఫున ప్రపంచం సమక్షంలో సత్యానికి సాక్ష్యం పలకవలసి ఉందన్న మాట. ప్రపంచంలో ఈ బాధ్యత కేవలం ఈ ఒక్క సముదాయానికే అప్పజెప్పబడింది.

అంతేకాదు, కేవలం ముస్లిమ్ సముదాయం ఒక్కటే దైవానికి చేర్చే రుజు మార్గమేదో, దైవం నుంచి దూరం చేసే దారి ఏదో, ఏది సత్యమో, ఏది అసత్యమో, ఎవరు రుజుమార్గాన ఉన్నారో, ఎవరు అపమార్గం పట్టారో చెప్పగల స్థాయి ఉంది.

ఈ ముస్లిమ్ సముదాయం దైవధర్మం అప్పజెప్పబడిన సముదాయం. దేవుని అంతిమ ప్రవక్త అంతిమ దైవధర్మాన్ని ఈ సముదాయానికే అప్పజెప్పారు. నేడు దైవ

ధర్మం సురక్షితంగా దీనివద్దనే తప్ప మరే వర్గం వద్ద కూడా లేదు. అందువల్ల ఈ ధర్మాన్ని, దైవధర్మాన్ని మానవులందరికీ అందజేయడం ఈ సముదాయం బాధ్యత, ఒకవేళ ఈ కార్యం ఈ సముదాయం వల్ల నెరవేరకపోతే మరే విధంగానూ నెరవేరే మార్గం లేదు.

ఈ విషయాన్ని ప్రవక్త మహనీయులు (స) ఇలా వ్యక్తం చేశారు. బద్ర్ మైదానంలో బహుదైవారాధకులు ఈ సముదాయాన్ని అంతమొందించాలని సంకల్పించి సమావేశమయినప్పుడు ఆయన దైవాన్ని ఇలా వేడుకున్నారు.

اَللّٰهُمَّ اِنْ تَهْلِكْ هٰذِهِ الْعِصَابَةُ مِنْ اَهْلِ الْاِسْلَامِ لَا تُعْبَدْ فِي الْاَرْضِ

**అల్లాహ్! ఇస్లామ్ అనుయాయులయిన ఈ వర్గం ఒకవేళ అంతమయిపోయినట్లయితే ఇక భువిలో నీ ఆరాధన అసలే జరుగదు.**

***(ముస్లిమ్)***

హజ్జతుల్ విదా (వీడ్కోలు హజ్జ్) సందర్భంలో ధర్మం పరిపూర్ణమయినట్లు ప్రకటించినప్పుడు మహనీయ ముహమ్మద్ (స) తన అనుయాయుల్ని సంబోధిస్తూ ఇలా పలికారు:

لَعَلِّي لَا اَلْقَاكُمْ بَعْدَ عَامِي هٰذَا

**బహుశా ఈ సంవత్సరం తరువాత నేను మిమ్మల్ని కలుసుకోవడం జరగదు.**

ఇలా పలుకుతూ ఆయన తన సహచరుల్ని ఇలా ప్రశ్నించారు : నేను మీకు దైవధర్మాన్ని చేరవేశానా?

అక్కడున్న జనులందరూ ముక్తకంఠంతో, "అవును, మీరు ధర్మం మాకు చేరవేశారు" అని బదులు పలికారు. దానికి ఆయన మళ్ళీ ఇలా అన్నారు:

اَنْتُمْ تُسْئَلُوْنَ عَنِّيْ فَمَا اَنْتُمْ قَائِلُوْنَ

**రేపు ప్రళయదినాన మిమ్మల్ని నన్ను గురించి ప్రశ్నించడం జరుగుతుంది అప్పుడు మీరు ఏమని సమాధానమిస్తారు?**

జనులు ఇలా పలికారు:

نَشْهَدُ اَنَّكَ قَدْ بَلَّغْتَ فَاَدَّيْتَ وَ نَصَحْتَ (بخاری ومسلم)

**మేము సాక్ష్యం పలుకుతాము, మీరు ధర్మం చేరవేసే మీ విధిని సమగ్రంగా నెరవేర్చారని, ధర్మం పూర్తిగా అందజేశారని, మా పట్ల అత్యంత శ్రేయోభావంతో మెలిగారనీను.** ***(బుఖారీ, ముస్లిం)***

అప్పుడు ఆయన తన వ్రేలు పైకి చూపి మూడుసార్లు ఇలా సెలవిచ్చారు:

| | |
|---|---|
| اَللّٰهُمَّ اشْهَدْ | అల్లాహ్! నీవే సాక్షి! |
| اَللّٰهُمَّ اشْهَدْ | అల్లాహ్! నీవే సాక్షి! |
| اَللّٰهُمَّ اشْهَدْ | అల్లాహ్! నీవే సాక్షి! |

భావం ఏమిటంటే, దేవా! నీ ఈ దాసులు అంగీకరిస్తున్నారు, నీవు నాకు అప్ప జెప్పిన ధర్మాన్ని నేను వీరికి చేరవేయడంలో ఎటువంటి కొరత రానివ్వలేదు, తు.చ. తప్పకుండా దాన్ని వారికి అందజేశాను అన్నది. ఆ తరువాత ఆయన అక్కడ సమావేశ మయిన వారిని సంబోధించి ఇలా అన్నారు:

اَلاَ فَلْيُبَلِّغِ الشَّاهِدُ الْغَائِبَ

ప్రస్తుతం ఇక్కడ ఉన్నవారు, ఇక్కడ లేని వారికి దీనిని అందజేయాలి.

ఈ వాక్యం గురించి మహనీయ అబ్దుల్లా ఇబ్ను అబ్బాస్ (ర) ఇలా అన్నారు:

فَوَ الَّذِىْ نَفْسِىْ بِيَدِهٖ اِنَّهَا لَوَصِيَّتُهٗ اِلٰى اُمَّتِهٖ

నా ప్రాణం ఎవరి గుప్పెట్లో ఉందో ఆ ప్రభువు సాక్ష్యం, తన అనుచర సముదాయానికి ఈ ప్రవక్త హితోపదేశం, వీలునామా వంటిది. *(బుఖారి)*

రబీ బిన్ అనస్ ఇలా అభిప్రాయపడ్డారు:

حق على من اتبع رسول الله صلى الله عليه وسلم ان يدعو كالــذى دعــا و ان ينــذر بالذى انذر

ఎవరయితే దైవసందేశహరులను అనుసరించాలని కోరుకుంటాడో అతని విధి ధర్మం ఏమిటంటే, ఏ విధంగానయితే దైవ సందేశహరులు (స) ధర్మ సందేశాన్ని అందజేశారో అదే విధంగా అతను సందేశం వైపునకు పిలుపునివ్వాలి. మరాయన (స) గ్రంథం ద్వారా జనుల్ని దైవశిక్షను గురించి ఎలా భయపెట్టారో ఆ విధంగానే గ్రంథం ద్వారా అతను సయితం దైవశిక్షను గురించి భయపెట్టాలి.

*(ఇబ్నుకసీర్)*

## బాధ్యతా భావం!

మహనీయ ముహమ్మద్ (స) ద్వారా అందిన ధర్మం ఇస్లామ్‌ను, దాని సందేశాన్ని దాన్ని ఎరుగని మానవాళికి అందజేయడం దాన్ని ఎరిగిన ముస్లిముల కర్తవ్యం అన్న విషయం అతి స్పష్టంగానే బోధపడుతోంది. దైవదాసులయిన మానవులకు ఈ సందేశాన్ని అందజేసి ప్రపంచం నుంచి నిష్క్రమించినప్పుడే ముస్లిములు తమ కర్తవ్యాన్ని నెరవేర్చిన వారవుతారు. అప్పుడే దేవుని దృష్టిలో ముస్లిములకు అప్పజెప్పబడిన బాధ్యత తీరుతుంది.

నేడు సత్యధర్మం ముస్లిములయిన మీ వద్ద భద్రంగా ఉంది. మీరు ప్రపంచం సమక్షంలో దీని సాక్ష్యం ఇవ్వకపోయినట్లయితే ప్రపంచం చిరకాలానికి ఉపేక్షించబడినట్లే. ఈ ఉపేక్షకు మీదే బాధ్యత. దాని శాస్తి కూడా మీరే అనుభవించవలసి ఉంటుంది. ఇటువంటి పరిస్థితుల్లో ప్రళయ దినాన పరమ ప్రభువు మిమ్మల్ని గురించి ప్రపంచ ప్రజల్ని ప్రశ్నిస్తాడు. ముస్లిములనబడే ఈ ప్రజల వద్దనే నేను అవతరింపజేసిన సత్యధర్మం సురక్షితంగా ఉండేది. నా మార్గదర్శకత్వం పొందిన జనులు వీరే. వీరు ఆ ధర్మాన్ని గురించి మీకు తెలిపారా లేదా? అని ప్రశ్నిస్తాడు.

మీరు వారిని నేడు ఉపేక్షిస్తున్న కారణాన, మీ ఏమరుపాటు వల్ల వారు దైవానికి ఇచ్చే సమాధానం ప్రమాదభరితమయింది: దేవా, వీరు నీ ధర్మం తమ వద్ద ఉంచుకున్నప్పటికీ నిద్రపోతూ ఉండేవారు, మమ్మల్ని అపమార్గాన వదలివేశారు. మాతోపాటే జీవించేవారుకాని, మా పట్ల ఎటువంటి శ్రేయోభిలాషను కనబరచలేదు. మా హితవు కోరేవారిలా వ్యవహరించలేదు. నీ ధర్మాన్ని మాకు చేరవేయలేదు. దాన్ని గురించి మాకు ఏమాత్రం ఎరుకపరచలేదు.

మీ గురించి వారు ఇచ్చే ఈ సమాధానం పూర్తిగా సరయినదే. దీన్నిబట్టి మీరు మానవాళి వినాశానికి కారకులన్న ఆరోపణ పూర్తిగా రుజువయిపోతుంది. మీ నేరం దాగదు. మీరు ఏ విధంగానూ దాన్ని దాచిపెట్టలేరు. అప్పుడు మిమ్మల్ని దేవుని పట్టు నుండి తప్పించగలిగేది ఏదీ ఉండదు. నేడు మీరు మీ ఈ నేరంలోని తీవ్రతను, ప్రమాదాన్ని గ్రహించడం లేదు. దాన్ని గ్రహించగలిగితే మీరు రాత్రిళ్ళు నిద్రపోలేరు, ప్రశాంతంగా ఒక్క క్షణం గడపలేరు. మీ జీవితంలో నెమ్మది అన్నది పూజ్యమయిపోతుంది.

వాస్తవానికి దైవంతో తన బాంధవ్యాన్ని వ్యక్తం చేసే, దైవంపట్ల ప్రేమను, భక్తిని కనబరచే, అటువంటి దావా చేసే ప్రతి వ్యక్తి, ఈ పరమ ప్రభువు కార్యాన్ని చేయాలని అభిలషిస్తాడు. తన భక్తుడు, దారితప్పిన మానవులకు సన్మార్గం చూపించాలని ఆయన

కోరుకుంటాడు. అందువల్లనే ఇస్లామ్ ధర్మమార్గాన్ని తమ జీవన వ్యవస్థగా స్వీకరించిన ప్రతి ఒక్కరి భాధ్యత, ఎల్లరి శాశ్వత బాధ్యత దాన్ని ఇతరుల వరకు చేరవేయడం. ఈ బాధ్యతా భావం ముస్లిములయిన మిమ్మల్ని ప్రశాంతంగా నిలువనీయదు. రేయింబవళ్ళు ఆ చింతనే మిమ్మల్ని ఆవహించాలి. దైవవిధేయతా మార్గాన నడవవలసిన మానవుడు దానికి దూరమయి తిరగడం పట్ల మీ ఆంతర్యం వ్యాకులమయిపోవాలి, అవిశ్రాంతంగా కృషి చేసేందుకు మీరు కదలాలి. అయితే ఈ కార్యం, ఇస్లామ్ సందేశం అందరికీ అందజేసే మహత్కార్యం, దేవుని సందేశహరులు ఏ విధంగా నిర్వర్తించారో అదే విధంగా నిర్వహించబడాలి. దీనికి ఆ సజ్జనులలోని చిత్తశుద్ధి, మానవాళి పట్ల ఆదే ప్రేమ, అదే సానుభూతి, ఆ మహనీయులలోని కార్యదీక్ష, త్యాగనిరతి కావాలి. అది మన జీవితపు అత్యుత్తమ కార్యక్రమంగా మన కృషికి నిజ లక్ష్యంగా రూపొందాలి. నేటి ప్రపంచం దాని అత్యంత అంధకార దశలో ఉంది. అది అజ్ఞానపు అంధకారం. దాన్ని కాంతితో నింపవలసిన అవసరముంది. దానికి దైవజ్ఞాన కాంతి కావాలి.

ఈ పని ఏదో తీరిక సమయంలో చేసే పని కాదు. మన సమయాన్నంతటినీ అది కోరుతోంది. మన శ్రద్ధాసక్తులన్నింటినీ అది కాంక్షిస్తోంది. దీని కోసం మనం ఇతర కార్యక్రమాల నెన్నింటినయినా వదలివేయవచ్చు. కాని ఇతర పనుల కోసం దీన్ని వదలడం మటుకు జరగరాదు. ప్రముఖమయిన పనికి జీవితంలో ప్రముఖమయిన స్థానముంటుంది. సందేశ కార్యక్రమం మన సర్వ కార్యక్రమాలలో ప్రముఖమయినదయితే మనం ఆ బాధ్యత పట్ల ఉపేక్షాభావం కనబరచడం లేదన్న మాట. దాని ప్రముఖ స్థానం దానికి ఇవ్వడంలో కృతకృత్యులమయ్యామన్న మాట.

అలాకాక ఇతర కార్యక్రమాలు మన కాలాన్ని ఆక్రమించుకున్నట్లయితే, ఈ బృహత్తర బాధ్యత కోసం మనం సమయం కేటాయించలేకపోయినట్లయితే దీనికి మన వద్ద ఎటువంటి ప్రాముఖ్యం లేదన్న మాట. నోటితో మనం దాని ప్రాముఖ్యాన్ని పదివేల సార్లు బహిరంగంగా చాటినా లాభంలేదు. ఈ కార్యం నెరవేరాలంటే దాని పట్ల మన ఆంతర్యంలో చోటుండాలి, ప్రేమ ఏర్పడాలి, దీనికి వెచ్చించే సమయాన్ని వృధా పోయిందని భావించకుండా అది మన జీవిత పరమార్థమని భావించాలి. ఇదొక అనవసర భారం అన్న భావన కలగరాదు. దానికి బదులు ఈ కార్యాన్ని నిర్వహించి నెమ్మది, సుఖాలు అనుభవించాలి.

ఈ కార్యం సాధారణమయినది కాదు. ప్రతి యుగంలోను సజ్జనులు, మహనీయులు, దైవం ఎన్నుకున్న మానవోత్తములు నిర్వహించిన సత్కార్యం. ప్రవక్తలు, దైవ సందేశహరులు, సమాజ సంస్కర్తలు, దైవజ్ఞులయిన పెద్దలు నిర్వహించిన పని. దేవుని

ప్రీతిపాత్రులయిన ఈ మహాపురుషులు దైవంతో సన్నిహిత సంబంధంగలవారు. ఆయన ప్రేమపాత్రులు, ఆయన్ని అమితంగా ప్రేమించేవారు. ఆయన వీరిని గాఢంగా ప్రేమించే వాడు.

వారు ఈ ధర్మసందేశ కార్యక్రమంలో తమ ప్రాణాలను పణంగా పెట్టారు. ఎత్తిపొడుపులు భరించారు, తిట్లు విన్నారు, సుఖాలు, సౌకర్యాలు, సౌలభ్యాలు విలాసవంతమయిన జీవితం వదలుకున్నారు. కఠినమయిన కష్టాలు సహించారు. ఇల్లూ వాకిలికి దూరమయ్యారు. ఒక్కోసారి ఉరికంబాన్ని ఎక్కారు. అయినప్పటికీ పరమ ప్రభువు వీరి ద్వారానే ఈ కార్యక్రమాన్ని ముందుకు సాగనిచ్చాడు.

ప్రపంచంలో తనకు ప్రియులయినవారికి కష్టాలు కలగటం ఎవరు సహించ గలరు? అల్లాహ్ మాత్రం ఎందుకు సహించాలి? అల్లాహ్ కోరినట్లయితే తన ప్రీతిపాత్రులయిన వారిని అసలు సందేశ వ్యాప్తి కార్యక్రమం నిర్వహించకుండానే ఆపివేయగలడు. లేదా వారి ఈ మార్గంలో వచ్చే విపత్తులు, ఆపదల నుండి రక్షించగలడు. కాని ఆయన అలా కోరలేదు. తన ఈ సదాచారులయిన దాసులు, తన పట్ల ఏకోన్ముఖులయిన తన ఈ దాసులు జీవిత కాలమంతా సందేశ కార్యక్రమం నిర్వహించడమే ఆయనకు ఇష్టం. వారు సకల విధాల కష్టనష్టాలను, పరీక్షలను భరిస్తూ ఆ కార్యక్రమాన్ని కొనసాగించాలనే ఆయన అభిలషించాడు.

ప్రవక్తల చరిత్ర మనకు ఇదే విషయాన్ని తెలుపుతోంది. వారు అనుచర అనుయాయులు, వారి తరువాత వారి స్థానాన వచ్చినవారు, సందేశ ప్రచార కార్యాన్నే చేపట్టారు. ప్రమాదాలు, కష్టనష్టాలలో నిండిన దారినే ఎన్నుకున్నారు. అనన్యమయిన త్యాగాల ఆదర్శాలను నిలిపారు. అవిశ్రాంతంగా ఆ దారిన ముందుకు సాగారు. తమ బొందిలో ప్రాణముండగా తమ ప్రస్థానాన్ని ఆపలేదు. శ్వాస ఆడుతూ ఉండగా ఎన్నడూ దారి మళ్ళించలేదు. ఏకోన్ముఖులయి ముందుకే సాగారు.

## విశాల మైదానం!

అల్లాహ్ తన ప్రవక్తలు, వారి అనుయాయుల విషయంలో, వారు ఎన్నెన్ని కష్టాలనయినా, ప్రమాదాలనయినా ఎదుర్కొని దైవధర్మ సందేశాన్ని ప్రజలకు అందజేయవలసిందే అన్న నిర్ణయం చేశాడు. ఇది ఆయన అంతిమ నిర్ణయం. ఇందులో మరో ఆలోచనకుగాని, మరో విధానానికిగాని తావే లేదు. ఈ కార్యక్రమంలో దేవుని దాసులయిన మానవులలోని ఎందరో ఎన్నికగన్న, ప్రముఖులయిన మహనీయులు సయితం కష్టాలు భరించడం సామాన్య విషయమే.

ఈ మహత్కార్య సాధనలో ప్రపంచంలోని ఎంతో విలువయిన ప్రాణాలు సయితం బలయిపోవడం కూడా సాధ్యమే. ఎటువంటి త్యాగాలకయినా సిద్ధమయి ఈ సత్కార్యాన్ని నిర్వర్తించడం అనివార్యం. ఎటువంటి పరిస్థితుల్లోనూ దీన్ని వదలడం కుదరదు. ఈ కార్యం ఎంత ఉన్నతమయినది, ఎంత మహత్తరమయినది, ఎంత ప్రముఖమయినది కాకపోతే ఈ పరిశుద్ధమయిన, పవిత్రమయిన జీవితాలు దీనికిగాను బలయి ఉంటాయి. ఈ మహత్కార్యం కొరకే ఆ జీవితాలన్నీ అంకితమయిపోయాయి- ఇదే తప్ప మరే పని వారి కర్తవ్యం కానట్టు?

వాస్తవానికి అల్లాహ్ విశ్వాసుల నుండి వారి ప్రాణాలను, వారి ధనసంపత్తిని, స్వర్గం ప్రతిమూల్యంగా, కొనుక్కున్నాడు. వారు దైవమార్గంలో పోరాడతారు, ప్రాణ బలికయినా, ప్రాణత్యాగానికయినా సిద్ధపడతారు. వారికి (స్వర్గవాగ్దానం), అల్లాహ్ పూచీ ఉన్న గట్టి వాగ్దానం. తౌరాత్, ఇన్జీల్, ఖుర్ఆన్ (దైవగ్రంథాల)లోను (ఈ ప్రమాణం చెయ్యడం జరిగింది). తన ప్రమాణాన్ని నెరవేర్చడంలో అల్లాహ్‌ను మించిన వాడెవడు? సంతోషించండి, దైవంతో మీరు కుదుర్చుకున్న మీ ఈ బేరం విషయంలో ఇక సంబరాలు జరుపుకోండి. ఇదే అత్యంత ఘనమయిన సాఫల్యం (అత్ తౌబా: 111). ఇదీ ఆ పనిలోని మహత్తు. ఈ మహత్కార్యాన్నే నేడు మీరూ నిర్వర్తించవలసి ఉంది. ఈ కార్యసాధనలో మీకు కలిగినదంతా ధారబోయవలసి వస్తే పోయండి. మీ జీవన సంపద, మీ జీవన నిధి ఇందులో తరిగిపోయినా, కరిగిపోయినా, అంతమయిపోయినా పోనివ్వండి.

ఇందులో మీకు నష్టమేమీ లేదు. ఈ బేరం వల్ల రేపు మీరు గర్వపడతారు. మీ సాఫల్యం, విజయం పట్ల చాలా మంది ఈర్ష్యగొంటారు. నేడు మిమ్మల్ని అవివేకులుగా భావించేవారు రేపు మిమ్మల్ని చూసి అపనమ్మకంతో ఆశాభంగం చెందుతారు. నేడు ధర్మ సందేశ వ్యాప్తికి ఏకారణమూ కానరావడంలేదని భావించేవారు రేపు కళ్ళప్పగించి పరికిస్తారు.

ఈ సందేశ కార్యాన్ని ఏదో స్వల్పమయినదిగా ఎంచకండి. ఇదే ఎంతో విస్తృతమయింది. మీలో శక్తి ఉన్నంతమేరకు, మీకు జీవన వ్యవధి ప్రాప్తమయిన మేరకు దీన్ని నిర్వర్తించినా ఇది తరగదు. మీరు ఏ క్షణాననయినా పని ముగిసిందని, పని లేదని, తీరిక దొరికిందని చెప్పలేరు.

ప్రపంచంలోని ఏ సిద్ధాంతమయినా దాని అనుయాయులకు కార్య అవకాశాలను పరిమితంగానే సమకూర్చగలదు. పరిమిత కార్యరంగాన్ని సూచిస్తుంది. శ్రామికులలో పనిచేయమని, శ్రీమంతుల్లో స్థానం పొందాలని, పెట్టుబడిదారుల్లో దారిచేసుకోవాలని,

ప్రజాసామాన్యాన్ని సంబోధించాలని, ప్రముఖులతో మటుకే మాటలాడాలని, వెనుకబడ్డ వారిని సముద్ధరించాలని, ఉన్నత వర్గీయులకు విజ్ఞప్తి చేయాలని, ఇలా రకరకాలుగా చిన్న చిన్న కార్యరంగాలను నిర్ణయిస్తాయి.

అంటే, ఆ సిద్ధాంతాల మనుగడ అవి పని చేయదలచిన ఈ చిన్న చిన్న రంగాల తోనే ముడిపడి ఉందన్న మాట. ఈ రంగాలు లేకపోయినట్లయితే ఈ సిద్ధాంతాలకు మనుగడ కూడా లేదన్న మాట! అందువల్లనే ఈ సిద్ధాంతాలు ఏ ప్రత్యేక పరిధుల్లో పని చేయకోరు తాయో ఆ పరిధులు అంతమయిపోతే, ఆ సిద్ధాంతాల అనుయాయులపై స్తబ్దత చోటు చేసుకుంటుంది. ప్రాణమున్న ఛాయలు కూడా కానరావు. ఈ మహా లోకంలో తాము చేయగల పని ఏదీ లేనట్టుగా వారు చచ్చుపడిపోతారు.

కాని ఇస్లామ్ అనుయాయుల పరిస్థితి అదికాదు. వారు నిర్వహించవలసిన బాధ్యత ఎన్నడూ అంతంకానిది. అది తాత్కాలికమయిన పనికాదు. అది ప్రత్యేక నిర్ణీత కాలంలో మటుకే చేయవలసిన పని అంతకన్నా కాదు, అది తీరిపోయిన తరువాత విశ్రాంతి తీసుకోవచ్చని దాని అనుయాయులు అనుకునే వీలులేదు. ఈ కార్యాన్ని సక్రమంగా నిర్వహించాలంటే మానవునికి ప్రాప్తమయిన సమస్త కాలమూ సరిపోదు. అతని అధికారంలో ఉన్న కాలవ్యవధి కూడా సరిపోదు.

ఇస్లామ్ అనుయాయి అయిన వ్యక్తి, ఇస్లామ్ సందేశకుడు, ఇస్లామ్ సందేశం ఎరుగని వారందరికీ అందజేయడం అతని కర్తవ్యం. ఈ కార్యభారం అతన్ని ఎన్నడూ ఒక్క క్షణమయినా స్థిమితంగా కూర్చోనివ్వదు. ఒక వర్గం సత్య సందేశాన్ని స్వీకరిస్తే ఆ వర్గానికి, మరో వర్గం ఒక కార్యరంగంగా రూపొంది ఎదురవుతుంది. ఎవరయినా ఒకసారి ఈ పని ప్రారంభిస్తే అది జీవితాంతం అతనికి పని కల్పిస్తుంది.

గంభీరంగా ఈ పని చెయ్యాలని సంకల్పించిన వ్యక్తికి, అన్ని వైపులా పని ప్రాప్తమవుతుంది. అన్ని వర్గాలలో పనిచేసే అవకాశాలు లభిస్తాయి. అన్ని వేళలా పనిచేసే సందర్భాలు ఎదురవుతాయి. ఇంత సువిశాల కార్యరంగంలో, కార్యవ్యవధిలో, ఏమి చెయ్యాలి, ఏ పరిధిలో తన శక్తుల్ని సామర్థ్యాలను వెచ్చించాలి అన్న అర్థరహితమయిన ప్రశ్న ఎన్నడూ ఎదురవదు.

ఈ కాలంలోనూ, మరే కాలంలోనయినా సరే, ఇస్లామ్ సందేశ సేవకులు చేయ వలసిన మహత్కార్యాలు, విస్తృత కార్యాలు, నిర్వర్తించవలసిన ప్రముఖ కార్యాలు మూడు విధాలుగా పేర్కొనవచ్చు. 1. సందేశ ప్రచారం, 2. సంస్కరణ, శిక్షణ, 3. ఇస్లామ్ సముద్ధరణ, సమున్నతులు. ఈ మూడు శీర్షికలలో ముస్లిములు చేయవలసిన పనులేవో, నిర్వహించవలసిన కార్యక్రమాలేవో పరిశీలించడం అవసరం.

# సందేశ వ్యాప్తి

ఇస్లామ్ అనుయాయుల మొదటి కర్తవ్యం ఇస్లామ్‌ను ఎరుగని ప్రపంచం సమక్షంలో దాన్ని పరిచయం చేయడం. దాని సరయిన చిత్రాన్ని, అత్యంత సవ్యమయిన చిత్రాన్ని చూపాలి. అన్ని కోణాలలో విశదంగా ప్రపంచం ముందుంచాలి. అది తమకు బాగా పరిచయమయిన యదార్థంగా ఎదుటి ప్రజలు అర్థం చేసుకోగలగాలి. ఎవరయినా సరే దానికి దూరంగా ఉండటానికి కారణం దాన్ని ఎరుగకపోవడం కారాదు.

ఇదొక సుదీర్ఘ కార్యక్రమం. ఒక్కనాటితో ముగియదు, ఒక్క ఏటితో తీరదు, నిరంతర కృషి అవసరం. ఇస్లామ్ అంటే ఏమిటో ఎరుగని వారంతా ఈ కార్యక్రమానికి మంచి కార్యరంగాన్ని అందజేస్తారు. ఇలాంటి వారిని వెదుకనవసరం లేదు. వీరు దొరకని పదార్థం ఏమీ కాదు. మన కళ్ళెదుటే ఎల్లెడలా కానవస్తారు. అన్ని వైపులా గోచరిస్తారు. ఆ సందేశం అందజేయడానికి మనం బయల్దేరగానే అంతటా వారే దర్శనమిస్తారు. వెదికే పని లేదు.

మనం రంగంలోకి రాగానే తూర్పు పడమరల్లో, ఉత్తర దక్షిణాల్లో అన్ని వైపులా మన కోసం నిరీక్షిస్తున్న వారు ఎదురవుతారు. బారులుతీరి నిలబడతారు, ఇస్లామ్ పరిచయ అవకాశం కోసమే ఎదురుచూస్తున్నారా ప్రజలు అన్న అనుభూతి కలుగుతుంది. మనం ఇస్లామ్‌ను, వారి ప్రభువు సందేశాన్ని, వారి ఆస్తిని, వారికి చెందిన దాన్ని వారికి అప్పజెబు తామేమోనని ఈ సందేశాన్ని ఆహ్వానించడానికే నిల్చున్నారా అనిపిస్తుంది. ఇంత ఘన మయిన సందేశం, ఇంత మహత్తుగల అవకాశం, ఇంత మహోన్నత కార్యక్రమం మరే సిద్ధాంతవాదులవద్దనయినా ఉందా?

ఈ సందేశ కార్యంలో ఎవరయినా సునాయాసంగా ముందుకు సాగలేరు. ఎన్నో సిద్ధాంతాల వ్యతిరేకతను ఎదుర్కోవలసి ఉంటుంది. ఆధునిక సిద్ధాంతాలూ ఎదురుగా నిలుస్తాయి. ప్రాచీన భావాలు పోటీ పడతాయి. సంప్రదాయాలూ ఆంతర వ్యవహారాలు అవరోధాలయి నిలుస్తాయి. ధర్మం పట్ల తిరుగుబాటుదారులు, అంధ విశ్వాసాల ధ్వజ వాహకులు, మూఢ ఆచారాల అనుయాయులు ప్రతిఘటిస్తారు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో బరితెగించి వ్యవహరించే వారు, దారితప్పి నడిచేవారు- అంతా ఎదురవుతారు.

ప్రపంచంలో ప్రతి వ్యక్తీ ఏదో ఒక సిద్ధాంతాన్ని, విశ్వాసాన్ని ఆశ్రయించి మరీ జీవిస్తున్నాడు. సచేతనంగా ఏదయినా నమ్మకం కలిగి ఉన్నా గుడ్డిగా తెలిసో తెలియకో ఏదయినా సిద్ధాంతం పట్టుకు వేలాడుతున్నా మొత్తానికి ఏదో ఆశయంతో, మరేవో ఆశలతో

బ్రతుకుతున్నాడు. ఈ ఆశ్రయాలన్నీ నిరాధారమయినవని, బలహీనమయినవని మీరు నిరూపించవలసి ఉంటుంది. సాఫల్యం దైవధర్మంలోనే, దైవాన్ని ఆశ్రయించడంలోనే దాగి ఉందని నమ్మకం కలిగించవలసి ఉంది.

ఈ పని సులువయినది కాదు. ఇస్లామ్‌ను క్షుణ్ణంగా జీర్ణం చేసుకోవలసి ఉంటుంది. దానితోపాటు ఇస్లామ్ వ్యతిరేక సిద్ధాంతాలను, ఆలోచనల్ని సయితం నిశితంగా అధ్యయనం చెయ్యవలసి ఉంటుంది. ఆ తరువాత దైవధర్మమయిన ఇస్లామ్, మానవ కల్పితమయిన సిద్ధాంతాలకన్నా, నమ్మకాలకన్నా ఏ విధంగా ఉన్నతమయినదో, ఉత్తమమయినదో, ప్రయోజనకరమయినదో నిరూపించవలసి ఉంటుంది.

ఇది ఎంతో మహత్తుగల పని. దాని ఔన్నత్యం, మహనీయతను మాటలలో చెప్పడం కష్టం. ప్రపంచంలోని ప్రతి పనిని గురించి మనిషి తృప్తి చెందగలడు. ప్రతి పనిని తాను త్వరగా ముగించి తృప్తి చెందగలనని అనుకోగలడు. కాని ఇది అలాంటిది కాదు. ఈ రంగంలో ఎంతటి గొప్ప విజయాన్ని సాధించినా ఇంకా సాధించవలసింది ఎంతో ఉందన్న అసంతృప్తి మిగిలే ఉంటుంది. తాను సాధించవలసిన దానికన్నా సాధించింది బహు స్వల్పమన్న భావం అతన్ని వెంటాడుతూనే ఉంటుంది. బాగా సమర్థుడయిన వ్యక్తికి ఎంతో సుదీర్ఘ కాలపు బ్రతుకు గడువు దొరకినా, అతను తన చివరి శ్వాస వరకు ఈ మహత్కార్యాన్ని నిర్వర్తిస్తూనే గడిపినప్పటికీ ఈ బృహత్తర బాధ్యత ముగియదు. ఇదే వాస్తవం. ఇది ఎన్నటికీ అంతంకాని నిరంతర బాధ్యత. మానవ సమాజం భువిలో మనుగడ సాగిస్తున్నంత కాలం కొనసాగే బాధ్యత. నిరంతర కృషిని కోరే అనంత మహాకార్యం.

ఇస్లామ్ సందేశ కార్యం ఎంతోకొంత నిర్వర్తించిన తరువాత మరో రంగం ఎదురవుతుంది. ఈ రంగం సందేశ ప్రచారం వల్లనే ఉనికిలోకి వస్తుంది. ఈ సందేశం వల్ల ప్రభావితులయిన సౌభాగ్యవంతులే ఈ కార్యరంగాన్ని సృజిస్తారు. వారు సందేశాన్ని అర్థం చేసుకుని దాన్ని సత్యమయినదని గ్రహించి దాన్ని ఎంతో మక్కువతో ఆశ్రయించిన వారు. దాన్ని ప్రాణప్రదంగా స్వీకరించిన వారు. అసత్యం నిండిన వాతావరణంలో, నలువైపులా మిథ్యావాదపు వికటాట్టహాసం మారుమ్రోగుతున్న పరిసరాల్లో సత్యాన్ని ఆశ్రయించడం, స్వీకరించడం, ప్రాణప్రదంగా భావించడం, ప్రియమయినదని ప్రకటించడం ఆషామాషీకాదు.

ఇది తన్ను తాను పరీక్షలకు గురిచేసుకోవడం. ఈ కఠిన మార్గంలో అడుగు వేయడం కఠోర హృదయాలకు సవాళ్ళు విసరడం వంటిది. అందువల్ల సందేశదాతలు

కేవలం సందేశం అందజేస్తే సరిపోదు. ఇటువంటి దశలో సత్యాన్ని ఆశ్రయించినవారిని ఆపదల్లో ఆదుకోవలసి ఉంటుంది. కష్టాలను పరిష్కరించవలసి ఉంటుంది. అవరోధాలను దూరం చెయ్యవలసి ఉంటుంది– ఇదో పరీక్ష.

దేవుని దాసులయిన మానవులు సత్యధర్మం కొరకు తాము ఇంతకాలం ఆశ్రయించిన ప్రియతమ సిద్ధాంతాలను కాదనవలసి ఉంటుంది. తాము ఇంతకాలం పెంచి పోషించి అనుసరించిన సంస్కృతీ సభ్యతల్ని, సామాజిక వ్యవస్థను త్యజించవలసి ఉంటుంది. తాము గర్వపడిన తమ వారసత్వాన్ని వదలుకోవలసి ఉంటుంది. తమకు తోడు నీడగా మసలిన వాతావరణాన్ని విడిపించుకోవలసి ఉంటుంది. తమ మిత్ర బృందాన్ని, బాంధవ్యాలను తెంచుకోవలసి ఉంటుంది. ఇది పరీక్షా సమయం. సత్యాన్ని స్వీకరించే వారికీ పరీక్షా సమయమే, సత్యాన్ని ప్రేరేపించిన వారికీ పరీక్షా ఘడియలే.

ఇటువంటి దైవదాసులను అక్కున చేర్చుకునేవారెవరు, ఇస్లామ్ పట్ల వల్లమాలిన ప్రేమను ప్రకటించినా, ఇటువంటి వారిని వారి మానాన వదలివేసే వారెవరు. పరమ ప్రభువు గమనిస్తూనే ఉన్నాడు. తమ గతాన్ని విస్మరించి, ఉజ్వలమయిన భావి కోసం సరికొత్త వర్తమానాన్ని నిర్మించుకోదలచిన వారికి తోడ్పాటు అందజేసే వారెవరో. కేవలం మాటల మూటలు పేర్చి, చేతల గాలి మేడలు చూపించే వారెవరో, పరీక్షా సమయాల్లో మైదానాన్ని తప్పించుకు తిరిగే వారెవరో విశ్వప్రభువు గమనిస్తూనే ఉన్నాడు.

## వృత్తం, చతురస్రం

మానవునికి ఎన్నో సమస్యలున్నాయి. అతను ఒక సామాజిక జీవి గనక అనేక సమస్యలు సమాజమే పరిష్కరిస్తుంది. ఒక సమాజంలో పుట్టిపెరిగి అలవాటు పడిన మానవుని సమస్యలు ఆ సామాజిక వ్యవస్థకనుగుణంగానే రూపొందుతాయి. ఆ సామాజిక పరిధిలోనే పరిష్కారమూ అవుతుంటాయి. అనేక సమస్యలు మానవుని ప్రత్యేక కృషి లేకుండానే వ్యవస్థలో వాటంతట అవే పరిష్కృతమవుతూ ఉంటాయి. మరికొన్ని పనులయితే కాస్తంత శ్రద్ధ వహిస్తే నెరవేరుతుంటాయి.

కాని మనిషి ఆ సామాజిక వ్యవస్థకు దూరంకాగానే అతని సమస్యల రూపం మారిపోతుంది. ఒక్కోసారి పరిష్కారాలు కనుచూపుమేర కానరావు. కానవచ్చినా పరిష్కారాల తీరుతెన్నులు వేరుగా, కొత్తగా ఉంటాయి. అసలు తన సమస్యలు పరిష్కారం కావేమో, లేక పరిష్కారమవడం బహు కష్టమేమో అనిపిస్తుంది. అందువల్ల గత సమాజానికి దూరమవగానే సంశయంలో పడిపోతాడు, అయోమయానికి గురవుతాడు, భయకంపితుడవుతాడు.

ఇస్లామీయ సందేశాన్ని మనసారా స్వీకరించే వ్యక్తికి దాదాపు ఇటువంటి పరిస్థితులే ఎదురవుతాయి. ఆ వ్యక్తి వదలివచ్చిన సమాజంలోని స్థితిగతులకు భిన్నమయిన వాతావరణంలో ప్రవేశిస్తాడు. అన్నీ చిక్కుముడులే ఎదురవుతాయి. ఎంతో సున్నితమయిన సందర్భాలు అనేకం తటస్థపడతాయి. అటువంటి వ్యక్తి, అటువంటి సందర్భాలు, మీ శ్రద్ధలు, ఆసక్తిని ఆహ్వానిస్తాయి. అటువంటి వ్యక్తులకు ఆ సమయంలో ఉత్తమమయిన మీ సహాయ సహకారాలు మెండుగా అవసరమవుతాయి. ఆ సహాయం పొందడం ఆ వ్యక్తుల హక్కు.

దైవధర్మాన్ని మీరు అభిమానించేవారే అయితే, దాని పట్ల ప్రేమగల వారయితే దైవధర్మాన్ని ఆశ్రయించిన వారిని ఆదుకోవడం, వారికి అవసరమయిన తోడ్పాటును అందజేయడం మీ బాధ్యత. అటువంటి వారిని నిస్సహాయులుగా, నిరాశ్రయులుగా వదలి పెట్టడం మీకు ధర్మం కాదు. వారిలో అపరిచిత భావం పుట్టకుండా జాగ్రత్త వహించడం మీ కర్తవ్యం. దైవధర్మం కొరకు వారు తమ గతాన్నంతా, తమకు కలిగినదంతా వదలుకుంటే మీరు మీకున్నదంతా కాకపోయినా ఎంతోకొంతయినా త్యాగం చెయ్యడానికి ముందుకురావడం, ఎంతోకొంతయినా వదలుకోవడానికి సంతోషంగా సిద్ధపడటం అవసరం.

ఎదుటివారి సమస్యల్ని వారి నుండి పరిగ్రహించి సంతోషంగా తమ సమస్యల జాబితాలో చేర్చుకోవాలి. వారిని సమస్యల ఆందోళన నుండి విముక్తం చేసి, ఆ ఆందోళనను తమ స్వంతం చేసుకోవాలి. తన సమాజాన్ని వదలుకున్న వ్యక్తి వేరొక కొత్త సమాజంలో చోటు పొందడం, అందులో ఇమిడిపోవడం చాలా కష్టతరమయిన పని, సుదీర్ఘ ప్రయత్నం అవసరమయ్యే పని. ఇన్ని కార్యరంగాలుండగా ఇస్లామ్ సందేశదాత తన కార్యపరిధి పరిమితమయినదనో, తన కార్యక్రమం సునాయాసమయినదనో ఎలా భావించగలడు?

ధార్మిక సేవ చేసేవారి బాధ్యత అంతటితో ముగియదు. మరో ముఖ్యమయిన పని వారు చేపట్టవలసి ఉంటుంది. ముస్లిమ్ సమాజం సంస్కరణ, సముద్ధరణలు కూడా వారి కర్తవ్యమే. వారి ధార్మిక సంబంధమున్న ఈ ముస్లిమ్ సమాజాన్ని, స్వయంగా తమకు చెందిన ఈ సమాజాన్ని సంస్కరించడం, ఈ సంఘ సభ్యుల సుశిక్షణా విధిని నిర్వర్తించడం వారి బాధ్యత. దీన్ని చింతనాపరంగా, ఆచరణాత్మకంగా, నైతికంగా, సామాజికంగా, సాంస్కృతికంగా ఎటువంటి లోటుపాటు లేకుండా తీర్చిదిద్దవలసి ఉంటుంది.

ఈ బాధ్యతకు ఎన్నో కోణాలున్నాయి. ఒకటి, ఈ సముదాయానికి విధించబడిన సందేశ వ్యాప్తి బాధ్యతను అది గుర్తించాలి, దాని స్పృహ అందులో జనించాలి. ఈ కర్తవ్య

నిర్వహణకు సముదాయంలో అవసరమయిన గుణగణాలను సృజించాలి. ఆచరణా త్మకంగా ఆ బాధ్యతను నెరవేర్చగలిగే వాతావరణాన్ని అందులో సృష్టించాలి. ఈ సముదా యాన్ని ఈ కార్యభారాన్ని మోయగలిగేలా సమాయత్తపరచాలి.

ఇక్కడ ఓ ప్రత్యేక కోణంలో ముస్లిమ్ సముదాయం బాధ్యతను పరిశీలించవలసి ఉంది. ఇస్లామ్‌కు సంబంధించిన ఎటువంటి పరిజ్ఞానమూ లేని ప్రజలలో దాని సందేశ వ్యాప్తి జరగాలంటే, ముందు దాన్ని అనుసరిస్తున్నామని ప్రకటించే వారి సంస్కరణ సముద్ధరణ అవసరం. ఇస్లామ్‌ను, దాని అనుయాయులమని చెప్పుకునే వారి నుండి వేరుచేసి చూపడమూ దుర్లభమే, చూడటమూ అసాధ్యమే.

ఇస్లామ్ అనుయాయులయిన ముస్లిముల జీవితంలో ఇస్లామ్ పరిపూర్ణ రూపం ప్రతిఫలించినప్పుడు సందేశ వ్యాప్తి మార్గాలు అనేకం ముందుకు వస్తాయి. నేడు మూయ బడి కనిపిస్తున్న తెరువులన్నీ తెరచుకుంటాయి. నేడు దైవధిక్కారులగా ధర్మవిరోధులుగా దర్శనమిస్తున్న వారంతా పరమ దైవభక్తులుగా, ధర్మసేవకులుగా రూపొందుతారు.

ఇస్లామ్ దైవధర్మమన్నదీ వాస్తవమే. దైవధర్మంగా అది ప్రళయ కాలం వరకు మనగలుగుతుందన్నదీ వాస్తవమే. ఎవరు దాన్ని అవలంబించినా అవలంబించకపోయినా, ఎవరు స్వీకరించినా మరెవరు తిరస్కరించినా, ఎవరు దాన్ని ఆచరించినా ఆచరించక వదలివేసినా అదొక దైవధర్మంగా చిరస్థాయిగా ఉంటుంది. దాని స్థానం ఎన్నటికీ మారదు. ఇందులో ఎటువంటి సందేహమూ లేదు.

ఇస్లామ్‌ను అర్థం చేసుకోదలచినవారు ఈ దృష్టితోనే దాన్ని అర్థం చేసుకునేందుకు ప్రయత్నించాలి. కాని సర్వసాధారణంగా జనులు ఇస్లామ్‌ను దైవధర్మంగా, మానవాళి అంతటి కోసం దైవం పంపిన ధర్మంగా, దాన్ని తమ సొత్తుగా, తమ వారసత్వంగా చూడరు. దీన్ని ముస్లిముల మతంగా చూస్తారు. అదే దృష్టితో పరిశీలిస్తారు. ఇస్లామ్‌ను పరిశీలించడానికి ముస్లిముల జీవితాలను పరిశీలిస్తారు. వారు చేసే ఒక్కొక్క ఆచరణను గమనిస్తారు. వారు చేసే ప్రతి పనిని అది ఇస్లామ్ అనుయాయుల ఆచరణ అనే దృష్టితో చూస్తారు.

ఇస్లామ్‌ను అధ్యయనం చేసేవారు ఖుర్ఆన్‌ని, ప్రవక్త ప్రవచనాలను మాత్రమే చూడరు. వారి దృష్టిలో అవి మాత్రమే ప్రామాణికమయిన నిర్వచనాలు కావు. వారు సహజంగా ఇస్లామ్ అనుయాయులయిన ముస్లిములు తమ ఆచరణ ద్వారా అందజేసే సందేశమే ఇస్లామ్ సందేశంగా పరిగణిస్తారు. కాని నేడు ముస్లిముల జీవితాలను, ఇస్లామీయ సిద్ధాంతాలను పరిశీలిస్తే వృత్తం, చతురస్రం గుర్తుకు వస్తున్నాయి!

## ఆలోచన-ఆచరణ

ఏ సిద్ధాంతమయినా దాని బాగోగుల్ని సశాస్త్రీయ దృష్టితో, సహేతుక ఆధారాలతో. సామంజస్యతాధోరణిలో, ఆచరణాత్మక కోణంలో పరిశీలించడమే సరయిన పద్ధతి. ఇందులో సందేహం లేదు. అలాకాక ఆ సిద్ధాంతాన్ని అనుసరిస్తున్నామని ప్రకటించేవారి ఆచరణనే చూస్తారు. ఇది సరయిన పద్ధతి కాదు. ఇలా ఆలోచించడం, పరిశీలించడం సరయినది కాదు. నిజమే, కాని ఇలా అనుకునేవారిని నిందించి ప్రయోజనం లేదు.

ఏ సిద్ధాంతాన్నయినా కేవలం హేతువు దృష్టితో శాస్త్రీయ పద్ధతిలో చూసేవారు చాలా తక్కువ. ఎక్కువగా దాన్ని అనుసరించేవారి ఆచరణలనే, వారి నడవడినే, వారి విధానాలనే గమనిస్తారు. అవి సిద్ధాంతానికి అనుగుణంగా ఉన్నా దానికి వ్యతిరేకంగా ఉన్నా పరిశీలకులు వారి ఆచరణనే సిద్ధాంతంగా పరిగణిస్తారు. ఇది ఏ సిద్ధాంతం విషయంలోనయినా సంభవించే వాస్తవమే.

ఏ సిద్ధాంతాన్నయినా అనుసరించే వారిచేత, ఆ సిద్ధాంతంతో ఎంతమాత్రం పొసగని చేష్టలు జరగడం సాధ్యమే. దానికి ఎన్నయినా కారణాలు చెప్పుకోవచ్చు. కాని ఈ ప్రపంచంలో స్థూలదృష్టితో దేన్నయినా పరిశీలించే వారే సర్వత్రా ఉన్నారని అంగీకరించవలసి ఉంటుంది. ఈ చేష్టల వెనక పని చేసే కారణాలను, అవసరాలను ప్రపంచం చూడదు. దానికి బదులు ఆ సిద్ధాంతాన్ని అనుసరించే వారిలో కనిపించే మంచీ చెడులు, వారు నమ్మే ఆ సిద్ధాంతం ద్వారానే ఉత్పన్నమయినట్లు చర్చించుకుంటుంది.

అందువల్ల ముస్లిములు ఆచరించే ఏ విధానమయినా, వారు అవలంబించే ఏ వైఖరి అయినా అది ఇస్లామ్ బోధించే వైఖరిగా మారిపోతుంది. అటు చూస్తే ముస్లిములు అత్యధికంగా ఇస్లామ్ బోధనలకు దూరమయిపోయారు. వాస్తవానికి ఇతోధిక ముస్లిములకు ఇస్లామ్ పట్ల సరయిన అవగాహన కూడా లేదనడమే సబబు. ఈ విషయాన్ని అంగీకరించవలసిందే.

దైవాన్ని నమ్మడమంటే భావమేమిటీ, అలా నమ్మడం వల్ల ఏర్పడే బాధ్యతలేమిటీ అన్నదే ముస్లిములకు తెలియదు. బహు దైవారాధన అని దేన్నంటారో, దేవుని ఏకత్వం అంటే ఏమిటో, తిరస్కారం అంటే ఏమిటో, విశ్వాసంలోని వాస్తవికత ఏదో, దేవుని విధేయత ఎంత విస్తృతమయినదో, దేవుని పట్ల తిరుగుబాటు ఎలా ప్రారంభమవుతుందో, దైవప్రవక్తను అనుసరించడం ఎందుకు అనివార్యమో, ఆయన అవిధేయతకు దూరంగా మెలగడం ఎందుకు అవసరమో-ఇవన్నీ ఏవీ ముస్లిములు ఎరుగరు.

ముస్లిములను ఒకే దైవాన్ని ఆరాధించమని బోధించడం జరిగింది. వారు ఈ విధ్యుక్త ధర్మాన్ని భారంగా భావించి తీసి ప్రక్కన పెట్టేశారు. వారిని అజ్ఞానానికి దూరంగా పరిశుద్ధంగా బ్రతకాలని ఉపదేశించడం జరిగింది. కాని వారు అసంఖ్యాకమయిన తప్పుడు ఆచారాలకు, మూఢ సంప్రదాయాలకు స్వయంగానే బందీలయిపోయారు. వారిని సత్యాన్ని అవలంబించమని ఆదేశించడం జరిగింది. కాని వారు మిథ్యనే అనుసరిస్తున్నారు. ప్రతి విషయంలోనూ ప్రవక్త మహనీయుల్ని వారు అనుసరించవలసింది. కాని వారు ఇతరుల్ని ఎవరెవరినో అనుసరించడంతో పాటు దానికి గర్వపడుతున్నారు కూడా.

ముస్లిములు నేడు తమ వ్యవహారాలను ధర్మాధర్మాలను (హలాల్, హరామ్‌లను) పాటించడం మానివేశారు. వాటి మధ్య విచక్షణను గమనించడం లేదు. వారి సామాజిక జీవితంలో చెడుగు చోటు చేసుకుంది. వారి సభ్యతాసంస్కృతుల్లో ఇస్లామేతర అంశాలు దారి చేసుకున్నాయి. అంతేకాదు, నేడు ముస్లిముల్లో విచ్చలవిడిగా బహు దైవారాధనా ప్రధానమయిన చేష్టలకు పాల్పడేవారున్నారు. ఆ చేష్టలు దేవుని ఏకత్వపు భావనకు కడు విరుద్ధమని వీరు తలచడం లేదు.

అడుగడుగునా వీరి జీవితంలో దైవం పట్ల తిరుగుబాటు ధోరణి గోచరిస్తుంది. ఇది వారి ధర్మానికీ విశ్వాసానికీ గొడ్డలిపెట్టు అని వారు గ్రహించడం లేదు. వీరికి దైవం, దైవప్రవక్తల పట్ల ఉండవలసిన ప్రేమభావం దైవవిరోధుల ఎడల కానవస్తోంది. వీరి శక్తి సామర్థ్యాలు ధర్మమార్గంలో వినియోగపడవలసిందిపోయి అవి తిరస్కార వృద్ధి మార్గంలో వ్యయమవుతున్నాయి. ముస్లిముల జీవితాలు వారి విశ్వాసాలకు విరుద్ధమయిన దిశలో సాగుతున్నాయి. ఇదీ నేటి పరిస్థితి.

ముస్లిములను ఈ స్థితిలో వదిలేసి ముస్లిమేతరుల్లో ఇస్లామ్ సందేశ పరిచయ కార్యక్రమం విజయవంతమవుతుందని ఎలా భావించగలం? ఇస్లామ్ పరిచయం సరయిన రీతిలో జరిగి, అది సరయిన విధంగా ఫలవంతమయ్యే అవకాశం ఏదయినా ఉందంటే, ఈ సందేశం ఆకులు, మొగ్గలు తొడిగి పూవులు పూసి కాయలుకాసే యోగం రావాలంటే, ముస్లిములు మాటల ద్వారా చేతల ద్వారా, ఇస్లామ్ సిద్ధాంతాలకు ప్రతిరూపాలుగా మారిపోవాలి. కనీసం వారిలో ఒక వర్గం అలా పరివర్తన చెందాలి.

ఆ వర్గం ప్రతి వ్యవహారంలో దైవవిధేయత పాటించేదయి ఉండాలి. దాని నైతిక నియమాలు ఇస్లామ్‌ను ప్రతిబింబించాలి. దాని వ్యవహారాలన్నీ దైవాదేశాలకనుగుణంగానే జరగాలి. దాని సామాజిక జీవితంలో ఇస్లామీయ విధానం ప్రతిఫలించాలి. వారి వ్యక్తిగత,

సామూహిక జీవితంలో ఎల్లెడలా ఇస్లామ్ రాజ్యమేలాలి. ఆ వర్గం తన చర్యల ద్వారా దైవప్రసన్నతాభిలాషతో ఉవ్విళ్ళూరుతున్నట్లు ద్యోతకమవ్వాలి. అది దైవాన్ని తప్ప మరెవ్వరినీ సంతోషపెట్టే ఇచ్ఛ కలిగి మనరాదు.

## ఇస్లామ్ ప్రతిఫలించాలి!

ఇస్లామ్ మానవుల వ్యక్తిగత, సామూహిక జీవితాల్లో వెలుగుచూపే దివిటీగా మారినప్పుడే ప్రపంచానికి తెలుస్తుంది, ఇస్లామ్ ఎటువంటి మానవుణ్ణి రూపొందిస్తుందో! ఇస్లామ్ తన అనుయాయుల్లో ఎటువంటి శీల స్వభావాలు జనింపజేయాలని అభిలషిస్తుందో, వారికి ఎటువంటి నైతిక రూపునిస్తుందో ప్రపంచం కళ్ళారా వీక్షించగలగాలంటే ప్రతి ముస్లిమ్ ఇస్లామీయ ఆదర్శ పురుషునిగా రూపొందేందుకు ప్రయత్నించినప్పుడే సాధ్యం.

ఇటువంటి వ్యక్తులు, సమాజం, వర్గం ఉనికిలోకి రాకపోతే ప్రపంచం ఎవరిని చూస్తుంది? నేటి సర్వసాధారణ ముస్లిమ్ సమాజాన్నే చూడగలుగుతుంది. నేడు సాధారణ ముస్లిముల ఆచరణా వైఖరి వాస్తవంగా ఇస్లామ్ వృద్ధికి అడ్డుగోడగా తయారయింది. వీరిని చూసి ఇస్లామ్ ప్రతిపాదించే నైతిక, సామాజిక వ్యవస్థను ఏర్పరచగల సమాజం ఇదే అని ఎవ్వరూ అంగీకరించలేరు.

అలాంటప్పుడు ఇటువంటి సమాజంలో నుంచి ఇస్లామ్‌ను మనసారా ఆచరించే వర్గం ఒకటి ఆవిర్భవించగలదా? అలా ఆవిర్భవించినా ఆ వర్గం ఇస్లామ్‌కు ప్రాతినిధ్యం వహిస్తుందని ప్రపంచం ఒప్పుకుంటుందా? ఆ వర్గంలో ఇంత గొప్ప శక్తి ఉత్పన్నమవుతుందా? సాధారణ ముస్లిముల ఇతోధిక సంఖ్యను వదలి ప్రపంచం ఇస్లామ్ అవగాహనకు ఈ వర్గాన్ని మాత్రమే, దాని వైఖరిని మటుకే పరికిస్తుందా?

ఈ ప్రశ్నలకు ఒకటే సమాధానం. అవును, ప్రపంచం ఇలా ముస్లిములను, ఇస్లామ్ అనుయాయులను వేరుచేసి చూడటం సంభవమే. నిస్సందేహంగా ఇది సాధ్యం. ఇందులో ఆశ్చర్యపడవలసిన అవసరం ఏదీ లేదు. ఇది నిత్యం జరిగే విధానమే. ప్రపంచం సిద్ధాంతాలను పరిశీలించేందుకు ఇలా విశాల హృదయాన్ని తప్పక చూపుతుంది. అందులో సందేహమే లేదు.

ఒక వర్గం ఇస్లామ్ బోధనలకనుగుణంగా ఆచరిస్తూ ప్రపంచం ఎదుట కనబడితే ఇస్లామ్ ప్రతినిధులెవరో, ఎవరు ఇస్లామ్‌ను వదలిపెట్టారో గుర్తించడం సులువవుతుంది. ఒక వర్గం ఇస్లామ్ బోధనలకనుగుణంగా ఆచరిస్తూ తదనుగుణంగా సందేశం వైపునకు

ప్రజల్ని ఆహ్వానించేది ఉనికిలోకి వస్తే ప్రపంచం అతన్ని పరిశీలిస్తుంది. ఇస్లామ్‌ని అర్థం చేసుకునే విషయంలో ఆ వర్గాన్ని తప్ప మరేవ్వరినీ కన్నెత్తి చూడదు.

ఒక సిద్ధాంతాన్ని నలుగురిలో పరిచయం చేసే వ్యక్తి, తన్ను తాను దానికి ప్రతినిధిగా ప్రకటించే వ్యక్తి దాన్ని ఆచరించేవాడుగా కూడా దర్శనమిస్తే ప్రపంచం ఆ సిద్ధాంతానికి అతన్నే ప్రతినిధిగా భావిస్తుంది. ఇతరులు ఎన్ని భాష్యాలు చెప్పేవారయినా వారు దాన్ని ఆచరించకుండా, దానికి విలువనివ్వకుండా వ్యవహరిస్తే వారి భాష్యాలను సుతరామూ అంగీకరించదు ప్రపంచం.

అందువల్ల ఇస్లామ్‌ను చిత్తశుద్ధితో ఆచరించే ఇస్లామ్ నిజసేవకులు ఉనికిలోకి వస్తే ప్రపంచం స్వయంగానే వారి వైపునకు మరలుతుంది. ఇతరుల్ని, కేవలం పేరుకు మాత్రమే ఇస్లామ్ తమ వద్ద ఉందని ప్రకటించేవారు, ఇస్లామ్ అనుసరణకు తలఒగ్గనివారు ప్రపంచం దృష్టిలో ఇస్లామ్ ప్రతినిధులుకారు. అలాంటి వారిని ప్రపంచం, ఇస్లామ్ ప్రతి నిధులుగా అంగీకరించదు.

ముస్లిముల్లో ఒక వర్గాన్ని ఇస్లామ్ ప్రతినిధులుగా తయారుచేయడం అంటే సాధారణ ముస్లిముల సంస్కరణను కాదనడం కాదు. సంస్కరణ, వారి శిక్షణలు కూడా సంస్కర్తల బాధ్యతా క్షేత్రంలోని అంతర్భాగమే. అయితే ఒక వర్గాన్ని లక్ష్యంగా పెట్టుకుని వారి సంస్కరణ, శిక్షణల పట్ల శ్రద్ధ వహించినట్లయితే అది దగ్గరి లక్ష్యంగా రూపొందు తుంది. అప్పుడే ఇస్లామ్ పరిచయ కార్యం సులువవుతుంది. అలా చెయ్యకపోతే అది కష్టసాధ్యమయిన కార్యంగా రూపొందుతుంది. ఇంతకు ఎన్నటికయినా, ఎప్పటికయినా ముస్లిములందరి సంస్కరణ, శిక్షణలు ముఖ్యమయిన విషయాలే.

ముస్లిములను ఒక సజీవ ఇస్లామ్ నిర్వచనంగా రూపొందించడం దాని సాము దాయక రూపుకు సరయిన భాష్యం. అది ప్రపంచం సమక్షంలో దేవుని ధర్మం సత్యమయిన దని సాక్ష్యమిచ్చే అనుచర సమాజంగా సిద్ధమవడం అవసరం. వాస్తవానికి ఇస్లామ్ సందేశ వ్యాప్తి ఈ సముదాయంలో ఏదో ఒక వర్గం బాధ్యత ఎంత మాత్రం కాదు. ఇది ముస్లిమ్ సముదాయం మొత్తం నిర్వహించవలసిన బాధ్యత. ఈ సముదాయం యావత్తూ తన ఈ కర్తవ్యాన్ని గుర్తించి తదనుగుణంగా వ్యవహరించనంత వరకు ఆ బాధ్యత తీరదు.

ఈ సమాజం, ముస్లిమ్ సమాజం ఇస్లామ్ సందేశాన్ని దేవుని దాసులయిన మానవులందరికీ చేరవెయ్యాలనే సంకల్పంతో నిలబడినట్లయితే పరిస్థితులు ఎంతగా

మారిపోతాయో! దేవుని దాసులు, మానవులు సయితం ఈ ఆహ్వానానికి స్వాగతం పలక డానికి లేచి నిలబడతారేమో! ఇందులో ఆశ్చర్యమేముంది? ఇస్లామ్ దేవుని నిజధర్మంగా విస్తరించడానికి వచ్చింది. ఇది మానవుని నైజానికి, ప్రకృతికి ఎంతో అనుగుణ్యమయినది. దాన్ని కాదనడానికి మానవుడు తన ప్రకృతితో పోరాడవలసివస్తుంది.

ఇస్లామ్ ప్రపంచంలోని సిద్ధాంతాల్లోకెల్లా మానవ ప్రకృతి, మానవ స్వభావంతో ఇతోధికంగా సామరస్యం పొందే ఏకైక సిద్ధాంతం. అందువల్ల సమస్త సిద్ధాంతాల్లోనూ ఇస్లామ్ ప్రత్యేకత, దాని విస్తరణ స్వభావం, దానికి వ్యాపించే విస్తరించే అవకాశాలు అన్నింటికన్నా అధికంగానే ఉన్నాయి.

అది విస్తరించిన కాలంలో వెల్లువలా వ్యాపించింది, దేశాలకు దేశాలు దాని ఆశ్రయం పొందాయి. జనవాసాలకు జనవాసాలు దాన్ని ఆలింగనం చేసుకున్నాయి. ప్రపంచంలోని పెద్ద భూభాగం దాని నీడలోకి వచ్చేసింది. అయితే దాని సేవకులు తమ పనులన్నింటిలో దానికే ప్రాధాన్యమిచ్చినప్పుడే అది సాధ్యమయింది!

## దైవధర్మం - మానవ వైఖరి

ఒకనాడు ఇస్లామ్ అనుచర సమాజం, దాని సభ్యులయిన ముస్లిములు తమ వ్యక్తిగత, సామూహిక జీవితంలో, తమ స్వరూప స్వభావాల్లో, కుటుంబ, సమాజ వ్యవహారాల్లో, ఆర్థిక, రాజకీయ కార్యకలాపాల్లో ఇస్లామ్‌కు ప్రతిరూపాలయి నిలిచారు. అంతేకాదు, తాము ప్రాణప్రదంగా భావించే ఆధ్యాత్మిక, నైతిక, భౌతిక జీవన మూల్యాలను ప్రపంచ ప్రజలందరికీ చేరవేయాలని సంకల్పించుకున్నారు. అప్పుడు ప్రపంచం కూడా అనుకూలంగా ప్రతిస్పందించింది, వారిని ఆహ్వానించింది, వారి ఆశ్రయాన్ని కోరింది.

ఇస్లామ్ మానవ కల్పితమయిన సిద్ధాంతం కాదు, ఏదో తాత్వికుని సాధనకు ఫలితం కాదు. అది యావత్తు సృష్టి కళను రచించిన పరమోన్నత విజ్ఞతా సంపన్నుడు, భువిలో తన ఉత్తమ సృష్టిరాశి అయిన మానవుల కోసం నిర్ణయించిన జీవన నియమావళి. అది ప్రపంచంలోని యావన్మందికి చెందిన ధర్మం. మానవుల శాశ్వత వారసత్వం. అది అందరికీ చేరవలసిన, అంతటా వ్యాపించవలసిన కారుణ్య జ్యోతి.

విశ్వకర్త, పరమోన్నత ప్రభువు పంపిన ధర్మం కావటాన అది మానవ ప్రకృతికి, శీలస్వభావాలకు అత్యంత అనుగుణ్యమయిన ధర్మం. దాన్ని కాదనడం, దాన్ని వ్యతిరేకించడం మానవ ప్రకృతిని కాదనడం, మానవ సహజ నైజాన్ని తిరస్కరించడంతో సమానం. అందువల్ల మానవుడు తన సహజ నైజానికి, ప్రకృతి స్వభావానికి అనుకూలంగా

ఉన్నంత వరకు దాన్ని వ్యతిరేకించలేడు, దానితో సంఘర్షించలేడు, దాన్ని తిరస్కరించలేడు. అలా చేస్తే తనలోని ఆత్మను నిరాకరించినట్లవుతుంది.

అందువల్లనే ఈ సహజ ధర్మం, దైవానికి స్వయం సమర్పణాధర్మం, మానవ ప్రకృతికి సానుకూలమయిన ధర్మం అంతటా విస్తరించే అవకాశాలు అధికంగా ఉన్నాయి, మార్గాలూ సమృద్ధిగా ఉన్నాయి. దానికి అడ్డుగోడలుగా నిలిచినవారు దాని అనుయాయుల మని చెప్పుకునే వారే కాని మరెవ్వరూ కారు. అలా అవాంతరాలుగాకాక ద్వారాలుగా దాని అనుయాయులు, వారి సముదాయాలు మారినప్పుడు అది సూర్యకాంతిలా వ్యాపిం చింది, వెన్నెలలా విస్తరించింది.

అయితే ఇది సంభవించడానికి సరయిన వాతావరణం ఏర్పడాలి. అందులో ప్రప్రథమంగా దాని అనుయాయులు, తాము ధర్మసేవకులమని ప్రకటించేవారు, తమ కార్యకలాపాలన్నింటిలో దానికే ప్రాధాన్యతనివ్వాలి. ఈ మహత్కార్యాన్ని, తమ కార్యకలాపా లన్నింటినీ వదలి, కేవలం దీని కోసమే పుట్టినట్లు, దీని కోసమే జీవిస్తున్నట్లు, మరే పనితోనూ ఎటువంటి సంబంధం లేనట్లు దీన్నే అదే పనిగా నిర్వర్తించాలి. దైవం నిర్ణయిం చిన ప్రకృతి నియమం ఏమిటంటే, ప్రపంచంలో ఏ పనీ కేవలం మహిమోపేతంగా జరగదు. మానవ కృషి ప్రతి అంశంలోనూ, ప్రతి కార్యంలోనూ అవసరమే. అది దైవధర్మానికి సంబంధించిన కార్యమయినా సరే, ప్రపంచంలో అదే సూత్రం వర్తిస్తుంది. సిద్ధాంతాల విషయంలోనూ అంతే. ఏ సిద్ధాంతమయినా కార్యకర్తల అవిరళ కృషి, కఠిన పరిశ్రమ వల్లనే వ్యాపిస్తుంది, జనాదరణ పొందుతుంది.

ఈ కఠిన పరిశ్రమ దేవుని దాసులయిన మానవుల ఐహిక జీవితం సుఖమయమవ డానికి, పరలోక జీవితంలో దైవ కృపాకటాక్షాలు ప్రాప్తమవడానికి జరిగితే అంతకన్నా కావలసిందేముంది? మానవుల్ని, దేవుని ధర్మాన్ని అవలంబించే వారుగా, దాన్ని తమ జీవితాల్లో అడగడుగునా అనుసరించే వారుగా మలచడానికి శ్రమించడంకన్నా ఉత్తమ శ్రమ మరేది కాగలదు?

నిజంగా ఈ శ్రమ జరిగినట్లయితే కన్నుల్లో కదలాడే దృశ్యం మరో విధంగా ఉంటుంది. నేటిలా విద్వేషభరితం, వైషమ్యతుల్యంగా ఉండదు. ప్రపంచంలో ఇస్లామీయ సముదాయం మానవుల్ని నరకాగ్ని నుండి రక్షించడానికి, సత్యసందేశాన్ని అందజేయడా నికి తాపత్రయపడుతూ ఉంటే ఇహపరాల సాఫల్యాన్ని కాంక్షించే ప్రజలు సందేశాన్ని స్వీకరించడానికి ఆత్రంగా ఎదురు చూస్తూ ఉంటారు!

ఇదంతా ఒక ఎత్తయితే, ఇస్లామ్ ప్రాబల్యం, ప్రాముఖ్యం పొందడం, దానికిగాను ప్రయత్నించడం, నిరంతర కృషి జరగడం మరో ఎత్తు. ఎక్కడయినా సరే ఇస్లామ్‌ను

పరిపూర్ణంగా అమలు జరపాలని ప్రజలు నిర్ణయించుకుంటే, దానికి అనువయిన వాతావరణం నెలకొనడం అవసరం. దాని సామాజిక, ఆర్థిక, రాజకీయ నియమాలను అమలు జరపడానికి ప్రజల్లో వాటి పట్ల ఆమోదం, అనుమోదం జనించడం అవసరం.

ఇస్లామ్ నిజానికి మానవుల వ్యక్తిత్వం, మానవుల అవసరాలు, మానవ సమస్యలంటే పట్టించుకోని ఊహాజనితమయిన తాత్విక, కేవలం ఆధ్యాత్మిక భావనల, ఆరాధనల ఆచారాల సంచయనం కాదు. అదొక ప్రత్యేక తరహాలో జీవం లేని నమ్మకాల స్థానే మనిషి శీలనిర్మాణాన్ని కాంక్షిస్తుంది. జీవితంతో సంబంధం లేని ఆచారాల స్థానే ఓ ప్రత్యేక ఆచరణా విధానాన్ని, ఆలోచనాసరళిని, జీవితమంతా ఆచరించవలసిన వైఖరిని ప్రతిపాదించే బలమయిన విశ్వాసాలను ప్రసాదిస్తుంది.

ఇస్లామ్‌ను నమ్మడమంటే దాన్ని దైవధర్మంగా విశ్వసించి మానవుడు తన జీవిత మంతా దానికి భిన్నమయిన, తనకు ఇష్టమయిన వైఖరిని అవలంబించ వచ్చని భావం కాదు, దాని అసలు భావం, మానవుడిలో కేవలం దైవదాస్య భావాలే జనించాలి. ఆయన్నే తన ఆరాధ్యుడుగా భావించాలి. జీవితంలోని ప్రతి వ్యవహారంలో ఆయన ఆదేశానికి తలవంచాలి. మానవుని నీతి, గుణగణాలే కాదు, అతని జ్ఞానం, కళలు, సంస్కృతీ సభ్యతలు, సామాజిక, రాజకీయ వ్యవహారాలు- అన్నీ దేవుని అభీష్టానికి కట్టుబడి ఉండాలి.

దాన్ని సంక్షిప్తంగా నిర్వచించాలంటే, మానవుడు తన్ను తాను దైవానికి అర్పించు కోవడం అని చెప్పవచ్చు. దేవుని ఇష్టం సమక్షంలో తన అధికారాన్ని పూర్తిగా వదలు కోవాలి. ఇలా విస్తృతంగా దైవవిధేయత పాటించాలంటే అన్ని వైపులా దైవధర్మం ఆధిక్యత పొందాలి. దేవుని ప్రభుత ఎల్లెడలా నెలకొనాలి. ఇస్లామ్ ఆధిక్యత పొందలేదంటే దైవేతర ఆలోచనా విధానం, ఆచరణా వైఖరి ప్రాబల్యం వహించిందన్న మాట.

ఇటువంటి పరిస్థితుల్లో దైవంతో మానవుని మానసిక, ఆధ్యాత్మిక సంబంధమయితే తప్పక ఏర్పడగలదు. ఆయన పంపిన ధర్మాన్ని మటుకు మనిషి తన జీవితంలో సరిగ్గా పాటించలేడు. దైవధర్మం, దైవేతర శక్తులకు లోబడి ఉన్నట్లయితే దైవధర్మాన్ని ఆశ్రయించిన వారు దైవనామ సంస్మరణ మటుకు చేయగలరు, ఆయన పట్ల ధ్యానంలో నిమగ్నమవ గలరు, ఆయన స్తోత్రం సంకీర్తనంలో తన్మయత్వం పొందగలరు; కాని బాహ్యజీవితంలో ఆయన పంపిన ధర్మాన్ని ఆచరించలేరు. మానవుల ధర్మావలంబన ఆంతరంగిక జీవితం వరకు పరిమితమయిపోతుంది.

ఇస్లామ్ మానవుని జీవితాన్నంతటినీ ఆవరించిన ధర్మం. జీవితంలో ఏదో ఒక రంగంలో - ఆధ్యాత్మిక నైతిక రంగంలో మటుకు- అది పరిమితమయిపోతే అటువంటి

సమాజంలో ఇస్లామ్ నెలకొన్నదని, ఆ సమాజం ఇస్లామీయ సమాజమని అనలేము. ఇస్లామ్ మానవుని వ్యక్తిగత సామూహిక వ్యవస్థల్లో ఆధిక్యత పొందలేదంటే, ఆలోచన ఆచరణల రంగంలో ఇస్లామ్‌కు భిన్నమయిన విధానాలు రాజ్యమేలుతున్నాయన్న మాట.

ఇటువంటి పరిస్థితుల్లో మనిషి తన వ్యక్తిగత, ఆంతరంగిక జీవితంలోనయితే ఇస్లామ్ సూచించిన ఆరాధనా విధానాలు, ఆచార వ్యవహారాలను పాటించగలడు కాని అతని సామూహిక జీవితమంతా ఇస్లామేతర విధానాలకు దాసోహమని అంటుంది. ఈ ఆధిక్యత పొందిన శక్తులు, వ్యవస్థలు ఏ మేరకు మనిషికి అనుమతినిస్తాయో ఆ మేరకే బాహ్యజీవితంలో దైవాజ్ఞల్ని మనిషి పాటించగలడు.

ఈ 'అనుమతి' పట్ల హర్షాతిరేకంతో మనిషి ఒక్కోసారి ఉబ్బిపోతాడు. ఆ 'అనుమతి'ని పొందే ముందు, దానికే సంతోషపడే ముందు కాస్త ఆలోచించాలి. అది పరిమితమయిన అనుమతి. ఆ శక్తులు తమ ఆధిక్యతకు, ప్రాబల్యానికి ఎటువంటి ముప్పులేదని, వాటిని కాపాడుకోవడం కష్టమేమీ కాదని తలచిన మేరకే ఆ అనుమతి ప్రాప్తిస్తుంది. అవి ఈ 'అనుమతి' కూడా తమ పెద్దరికపు మార్గంలో అవాంతరాలు సృష్టిస్తుందని భావిస్తే ఈ పరిమిత అనుమతి కూడా దోచుకోబడుతుంది!

ఈ క్లుప్తమయిన స్వేచ్ఛను కూడా ఆ శక్తులు ప్రదానం చేసేది మీ పట్లనో మీ ధర్మం పట్లనో వాటికేదో సానుభూతి కలగటం మూలాన కాదు, ఆ కారణం వేరు. విభిన్న రంగాల్లో ఇస్లామ్ పైన ప్రతిబంధకాలు సృష్టించిన తరువాత ఒక పరిమిత కోణంలో దానికి స్వేచ్ఛనిచ్చినంత మాత్రాన తమకు వాటిల్లే కష్టమయినా నష్టమయినా ఏదీ లేదని అవి తలపోస్తాయి, అంతే.

ఆ ఒక్క కోణం వదలి, దానికి వెలుపల అన్ని రంగాల్లో, సాంస్కృతిక, నైతిక, రాజకీయ రంగాల్లో తమ విధానాలను మీ తలన రుద్దుతాయి. తమ వాణిజ్య విధానాలు, తమ పారిశ్రామిక నియమాలు, తమ అంతర్జాతీయ చట్టాలు మీ చేత పాటింపజేస్తాయి. కొన్ని సందర్భాలలోనయితే ఫలాన చర్యలు ఇస్లామ్‌కు విరుద్ధమయినవన్న ప్రకటన సయితం మీరు చేయలేరు. ఇది అధికారంలో ఉన్న ఏ శక్తి అయినా అవలంబించే విధానమే. దీని ఆధారంగానే అది మనగలుగుతుంది. కాని ఇటువంటి పద్ధతుల్ని దైవ ధర్మం పట్ల మక్కువ ఉన్న ఏ వ్యక్తీ ఇష్టపడలేడు. ఇస్లామ్‌ను ఖైదు చేసి ఇలా ఆంక్షల మధ్యన పెట్టడం అతనికి సుతరామూ ఇష్టముండదు. ఎట్టి పరిస్థితుల్లోనూ, ఎటువంటి మూల్యమయినా చెల్లించి, తన ప్రాణాలనయినా ధారబోసి దాన్ని విముక్తం చేసే ప్రయత్నం చేస్తాడు.

ఇస్లామ్‌ను అనుసరించేందుకు మనిషికి అవకాశం లేకపోతే దాన్ని అన్ని రంగాల్లో

ఆచరించేందుకు అవాంతరాలు నిలబడితే ఆ అవకాశాలను సాధించడానికి, అవాంతరాలను తొలగించడానికి అతనిలో వ్యాకులత, ఆతురత జనిస్తాయి. చేప నీటికి వెలుపల నేలపై పడి తల్లడిల్లినట్లే తల్లడిల్లిపోతాడు. ఇది సహజమయిన వ్యాకులత, అదే లేకపోతే అతనిలో ఇంకా ఇస్లామ్ చోటు చేసుకోలేదన్న మాట.

ఇస్లామ్ కోరేది, మీ మొత్తం జీవితం దాని పట్టులోకి రావాలని. మరేమో ఇస్లామేతర శక్తులు కేవలం కొన్ని వ్యవహారాలలో మటుకే దాన్ని అనుసరించే అనుమతి మీకు ఇవ్వాలని కోరుతాయి. ఈ అనుమతితో మీరు సరిపుచ్చుకుంటే దీని భావమేమిటీ? మీరు ఇస్లామ్‌ను మీ మీద పూర్తిగా అధికారం చెలాయించాలని కోరుకోవడం లేదన్నమాట. నిజానికి ఇస్లామ్‌ను అనుసరించాలని కోరుకునే వ్యక్తి పరిస్థితుల ఈ స్వరూపాన్ని చూసి అసహనంతో తల్లడిల్లిపోతాడు. మానవునిలో ఈ అసహనం, ఈ తపన లేకపోతే అతను ఒక జడపదార్థం లాంటి అచేతనావస్థకు చేరుకుంటాడు. దాని వల్ల అతని ధార్మిక మృతి సంభవించడమూ కద్దు.

ఇస్లామ్‌ను ప్రేమించే వాని అత్యుత్తమ కోరిక, అత్యంత మహత్తరమయిన కృషి, తనపైన ఇస్లామీయ శాసనం అధికారం చెలాయించాలన్నది. అతని సంస్కృతి ఇస్లామీయ సంస్కృతి కావాలన్నది. అతని సామాజిక వ్యవస్థ నుండి ఇస్లామేతర అంశాలు బయట పడాలన్నది. అతని ఇచ్చిపుచ్చుకోవడాలు ఇస్లామ్ ఛాయలలో జరగాలన్నది. అతని పరిపాలనా వ్యవస్థ, రాజకీయ కార్యకలాపాలు అన్నీ ఇస్లామ్ ఆజ్ఞాబద్ధమయి నడవాలన్నది.

ఈ కోరిక నెరవేరాలంటే, ఈ కృషి, శ్రమ ఫలవంతమవ్వాలంటే మార్గం ఒక్కటే. ఇస్లామ్ సందేశాన్ని విస్తృతపరచాలి. పూర్తిగా ఏకాగ్రతతో, దీక్షతో దాన్ని సాధించేందుకు శాయశక్తులా కృషి చేయాలి. ఇలా చేయకుండా ఇస్లామ్ సమున్నతి లభిస్తుందని ఆశించడం నిరర్థకం.

ఇస్లామ్‌కు పరిపాలనా అధికార స్థానం లభించాలంటే మరో మార్గం లేదు, ప్రపంచం దాని వైపునకు శ్రద్ధ చూపాలి. దాని పరిధులు నిరంతరం సువిస్తరమవుతూనే ఉండాలి. ప్రపంచం దాని మీద ఇంకా దృష్టి సారించనే లేదంటే దాని పక్షాన శ్రద్ధ చూపకనేపోతే దానికి అధికార స్థానం, దాని పరిపాలనా వ్యవస్థ నెలకొనే ప్రశ్న అప్పుడప్పుడే తలెత్తదన్న మాట.

కొందరు ఊహించుకుంటారు. ఎవరయినా ఒక వ్యక్తి దైవవిశ్వాసం, ఇస్లామ్ పట్ల నమ్మకమున్న వ్యక్తి, దేవుని ఈ ధరిత్రిపైన దైవపరిపాలన జరగాలని ఆశపడే వ్యక్తి అధికారాన్ని సాధించగలిగితే అతని అధికార పరిధిలో ఇస్లామ్ ఆధిక్యత, పరిపాలనా స్థాయిని పొందుతుందని అనుకుంటారు. కాని ఈ అభిప్రాయం సరయినది కాదు. ఇది

అసంబద్ధమయినదీను. ఇస్లామ్ ఆధిక్యత పొందడమంటే భావం, ముస్లిమ్ వ్యక్తి పరిపాలనా ఆసనం ఎక్కడమన్నది ఎంతమాత్రం కాదు.

ఇస్లామ్ ఆధిక్యతనొందడం అంటే అర్థం, ఇస్లామీయ శాసనం, ఇస్లామీయ జీవిత విధానం చెలామణి కావడం. అది దేశంలో అన్నింటికన్నా ఉన్నతమయిన స్థానాన్ని అలంకరించాలి. దాని నిర్ణయం ముందుకు వస్తే మిగతా నిర్ణయాలన్నీ వెనక్కి తీసుకోవడం జరగాలి. ఇస్లామ్ ఈ స్థానాన్ని పొందాలంటే ముస్లిమ్ వ్యక్తి ఎవరయినా అధికారం పొందడం వల్ల ఎన్నటికీ జరగదు. లేదా ఒక చక్రవర్తి ఇస్లామ్ స్వీకరించడం వల్లనూ సంభవం కాదు. ఇది సంభవమవ్వాలంటే ఒక్కటే మార్గం. ఒక సమాజం మొత్తం, అందులోని వ్యక్తులందరూ ఇస్లామ్‌కు ఆ స్థానం ఇవ్వడానికి మనస్ఫూర్తిగా సిద్ధమవ్వాలి. కనీసం సమాజంలో ఒక బలవత్తరమయిన వర్గం సన్నద్ధమయి ఉండాలి. అది ఇస్లామ్‌ను అమలుపరచగల స్థోమత కలిగి ఉండాలి. అందులో ఆ సామర్థ్యం, ఆ శక్తి మెండుగా ఉండాలి.

ఇదేదో ఒక వ్యక్తి చేయగల కార్యం కాదు. అతను ప్రపంచంలోని ఎంతో మహనీయుడయిన వ్యక్తి కావచ్చు. కాని వ్యక్తిగత స్థాయిలో ఒక్కడే దాన్ని చేయడం సాధ్యపడదు. దీనికి సందేశ వ్యాప్తి జరగాలి. సాధారణ పరిస్థితుల్లో సతతం, నిరంతర సందేశ వ్యాప్తి జరిగే అవసరం ఎంతో తీవ్రమయిన అవసరం ఉంటుంది. సందేశ వ్యాప్తి ద్వారానే ఇస్లామ్‌కు అన్నింటిపైనా ఆధిక్యతనిచ్చే, ఉన్నత స్థానం ఇచ్చే సంకల్పబలం జనిస్తుంది. ఇస్లామ్‌ను తప్ప ఇతర జీవన వ్యవస్థల్ని దేన్నయినా, మరే శాసన వ్యవస్థనయినా తిరస్కరించగలిగే తాత్విక భావన, సైద్ధాంతిక మనస్తత్వం పుడుతాయి.

ఒకటి మాత్రం వాస్తవం, దీన్ని అంగీకరించడం సాధ్యమే. దీన్ని అంగీకరించాలి కూడా. ఎవరయినా గొప్ప వ్యక్తి ఇస్లామ్ స్వీకరిస్తే లేదా అతను ఇస్లామ్ సందేశానికి ధ్వజవాహకుడయి నిలిస్తే ఇస్లామ్ సందేశ వ్యాప్తిలో అతని ఇస్లామ్ అభిమానం ఎంతో సహాయంగా సహకారిగా మారుతుంది. కొన్ని సందర్భాలలో ఇటువంటి అవకాశాల వల్ల ధార్మిక సమున్నతి, ధర్మం ఆధిక్యత ఎంతో సులువయిపోతాయి. అందులో సందేహం లేదు.

కాని ఎవరయినా ఇస్లామ్‌ను స్వీకరించడం లేదా దాన్ని సమర్థిస్తూ నిల్చోవడం ఇస్లామ్ సర్వాధిక్యత పొందడానికి సరిపోదు. దీనిగ్గాను, ఆ వ్యక్తి, ఆ వ్యక్తితోపాటు అభిప్రాయ సారూప్యత గలవారు సందేశ ప్రచార కృషి తప్పనిసరిగా చేయవలసి ఉంటుంది. తద్వారా ఇస్లామ్‌ను అమలు జరిపేందుకు ఒక వర్గం సమాయత్తమవ్వాలి.

వారు ఆ వ్యక్తికి చేదోడు వాదోడుగా నిలవాలి. అటువంటి వర్గం, అటువంటి సమాజంలో దేవుని ధర్మాన్ని అమలు జరిపేందుకు అన్ని విధాలా వీలు కలగాలి.

సందేశం ఆధిక్యత నొందాలంటే ఆ మార్గంలో ఎదురయ్యే అనుకూల, ప్రతికూల పరిస్థితుల్ని సయితం సాధారణంగా పేర్కొనడం జరుగుతుంది. ఈ సందర్భంలో రెండు విషయాలు దృష్టిలో ఉండటం అవసరం. ఒకటి, సత్యసందేశానికి ప్రతికూల వాతావరణం, దానంతట అదే అనుకూలంగా మారిపోవడం జరగదు. ఈ లక్ష్యంతో నిరంతరాయంగా కృషి జరుపుతూ శ్రమపడుతూ ఉండాలి. రెండు, పరిస్థితులు అనుకూలించడం ఒక్కటే స్వయంగా ఒక సిద్ధాంతానికి ఆధిక్యతను ప్రసాదించిపెట్టదు. ఆ పరిస్థితులను సరిగ్గా వినియోగించుకుని వాటి ద్వారా ప్రయోజనం పొందాలి, ఇంకా ఆ సిద్ధాంతానికి ఆధిక్యత చేకూర్చపెట్టేందుకు ప్రయత్నాలూ జరగవలసి ఉంటుంది. అప్పుడే ఆ సిద్ధాంతం ఆధిక్యత పొందగలదు.

ఇస్లామ్ విషయంలోనూ ఇదే సూత్రం వర్తిస్తుంది. దీని కోసమూ ఇటువంటి వాతావరణం ఏర్పడటం అసాధ్యమేమీ కాదు. అయితే ఈ అనుకూల పరిస్థితుల వల్ల ఇస్లామ్ స్వయంగా పరిపాలనా ఆసనాన్ని చేరుకోజాలదు. దానికి ఈ పరిస్థితుల్ని సదా దృష్టిలో ఉంచుకుని వాటిని ఇస్లామ్ ఆధిక్యత దిశలో మలచడానికి కృషి చేసే వ్యక్తులు అవసరం. ఈ కార్యసిద్ధికి కావలసిన వ్యక్తులు సందేశ వ్యాప్తి వల్ల జనిస్తారు. సందేశ వ్యాప్తి తప్ప మరో మార్గం ఇస్లామీయ వ్యవస్థకు కావలసిన వ్యక్తులు తయారీకి ఇంతవరకు ఉనికిలోకి రాలేదు, ఇంతవరకు ఎవరూ కనిపెట్టలేదు!

ఇస్లామ్ ఆధిక్యత చెందడానికి చేసే కృషిలో భాగంగా ప్రత్యేక రాజకీయ రంగం లోనూ శ్రమపడటం అవసరం. ప్రపంచంలో అనేక రాజకీయ సిద్ధాంతాలు రంగంలో పని చేస్తున్నాయి. వీటిలో ప్రతి రాజకీయ రంగమూ మానవుని సఫలతకు ఒక ప్రత్యేక రూపాన్ని, ప్రత్యేక భావాన్ని కల్పిస్తుంది. అది మానవుని రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక సమస్యలకు ఒక నిర్దిష్ట పరిష్కారాన్ని సూచిస్తుంది. ఈ సిద్ధాంతాలన్నీ నిర్జీవమయినవి. వీటికి ఎటువంటి పటిష్టమయిన ప్రాతిపదిక లేదు. అవి కేవలం కొన్ని ఊహాజనిత, అతిస్థూలమయిన నినాదాల ఆధారంగా జీవిస్తున్నాయి.

వీటికి ప్రతిగా, వీటికి భిన్నంగా ఇస్లామ్, సాఫల్యానికి సంబంధించిన ఎంతో ఉన్నతమయిన భావనను అందజేస్తుంది. ఇస్లామ్ సమున్నతి కోరేవారు ఒక వైపున ఈ సమస్త సిద్ధాంతాలను సంపూర్ణంగా, నిండుగా విమర్శించడం అవసరమే కాదు, అత్యంతా వశ్యకం కూడా, వాటిలోని లోటుపాట్లనన్నింటినీ పూర్తిగా బట్టబయలు చేయాలి. అదే సమయాన ఇస్లామ్ ప్రతిపాదించే విజయ భావనను సర్వవ్యాపకం చేయాలి. దాన్ని చూసి సామంజస్యతగల ప్రతి మానవుడు దాని మహత్తును గుర్తించాలి, అంగీకరించాలి.

ఇది ఈ రంగంలో చేయతగ్గ సైద్ధాంతిక కార్యక్రమం. మరి చేయవలసిన ఆచారణాత్మకమయిన కార్యక్రమం ఏమిటంటే, ఎవరయితే సందేశ ప్రచారం వల్ల సందేశానికీ, ఆలోచనా విధానానికీ సామరస్యత పొంది ఏకీభవిస్తారో వారిని ఏకత్రం చేసి సంఘటితపరచాలి. వారికి శిక్షణ గరపాలి. తద్వారా వారిలో సమకాలీన రాజకీయ సిద్ధాంతాల సరయిన అవగాహనతోపాటు తీవ్రమయిన అయిష్టత, అసహ్యత జనించాలి. దానికి ప్రతిగా ఇస్లామ్ పట్ల తీవ్రమయిన యిష్టత, ప్రేమ ఏర్పడాలి. వారు ఇస్లామ్ ఆధిక్యత కొరకు తమకు చెందినదంతా ధారపోయడానికి సన్నద్ధులవ్వాలి. ఏ త్యాగానికీ వెరువరాదు. ఆ తరువాత ఈ కార్యకర్తల వర్గం ద్వారా ఇస్లామ్ ఆధిక్యత కోసం తప్పని సరిగా తీసుకోవలసిన చర్యలన్నీ ఆచరణాత్మకంగా చేపట్టవలసి ఉంటుంది. ఆ చర్యలు దానికి అనివార్యమయినవయి ఉండాలి, వాటిని అవలంబించే అనుమతినీ ఇస్లామీయ వ్యవస్థ ఇవ్వాలి.

ఇలా కృషి జరిపినప్పుడే ఆశిస్తున్న, కాంక్షిస్తున్న ఆ వస్తువు ప్రాప్తమవుతుంది. అప్పుడే మిథ్య సమసిపోయి, ఇస్లామ్ ఆధిక్యత పొందే అవకాశముంది. అప్పుడే మనిషి పైనుంచి, మనిషి పరిపాలన, దైవేతర శక్తుల పరిపాలన అంతమవుతుంది, అన్ని వైపులా దేవుని శాసనం, దేవుని న్యాయం అమలులోకి వస్తుంది. ఈ ప్రపంచంలో జనులు దేవుని ధర్మాన్ని సదా తిరస్కరిస్తూనే ఉన్నారన్నది నిజం కాదు. అనేక సందర్భాలలో జాతులు, దేశాలు దాన్ని స్వీకరించి తమ హృదయాలకు హత్తుకున్నారు, దాని పరిపాలన వారి పైన కొనసాగింది.

దీని ఉదాహరణ, ప్రస్ఫుటమయిన ఉదాహరణ, మహనీయ ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) అందజేసిన సందేశానికి సమాధానంగా ఉనికిలోకి వచ్చిన మహోజ్వలమయిన విప్లవం, మహనీయ ముహమ్మద్ (స)ని, ఆయన సహచరుల్నీ ఆదుకున్న దైవం నేటికీ సజీవుడయినవాడే. ఆయన సదా సజీవుడయి ఉంటాడు. లేవండి, మీరు మీ విధిని నిర్వర్తించండి, దైవం మీకు తోడయి ఉన్నాడు. ఆయన తలచుకుంటే భూమ్యాకాశాల సకల శక్తులూ మీ సహాయానికి సమాయత్తమవుతాయి. మీరు సుదూరమని భావిస్తున్న విషయం అతిత్వరలోనే మీ కళ్ళెదుట ప్రత్యక్షమవుతుంది. నేడు బహుశా మీరు దాన్ని ఊహించనయినా లేరేమో కాని రేపు కనులారా వీక్షించగలుగుతారు.



# సందేశం, దాని అనుసరణ

ఇస్లామ్ అనుసరణ, దాని సందేశం బయటికి రెండు విభిన్నమయిన పనులుగా అగుపిస్తాయి. ఒకటి, మానవుని వ్యక్తిత్వంతో సంబంధమున్నది, మరొకటి మనిషికి వెలుపల బాహ్యలోకంతో సంబంధమున్నది. అయినప్పటికీ రెంటి మధ్య చాలా లోతయిన ప్రగాఢ సంబంధమూ ఉంది. ఈ సంబంధం కారణంగా ఈ రెంటినీ పరస్పరం వేరు చెయ్యలేము, వేరువేరుగా పరిగణించనూ లేము; ఇస్లామ్ అనుసరణను పరిశీలిస్తూ దాని సందేశాన్ని ఉపేక్షించలేము. లేదా సందేశాన్ని గురించి ఆలోచిస్తూ దాని అనుసరణనూ విస్మరించలేము.

వాస్తవమేమిటంటే మనిషి ఇస్లామ్‌ను అనుసరించడం పరిపూర్ణం కావాలంటే అతను దాని సందేశాన్ని ప్రపంచానికి అందజేయడం అనివార్యం. అలాగే మనిషి ఇస్లామ్‌ను పూర్తిగా, సరిగ్గా అనుసరించనంత వరకు నిజభావంలో ఆ సందేశాన్ని అందజేసేవానిగా అలరారలేడు. మానవుల వరకు దేవుని ధర్మం అందజేయాలనుకునే వ్యక్తి అతను తొలుత ఈ ధర్మాన్ని తన మనోమస్తిష్కాలలో భద్రపరచుకోవడం, అది అతని జీవితమంతటినీ ఆక్రమించుకోవడం అత్యంతావశ్యకం.

ధర్మం వాస్తవికతను గురించి అతను స్వయంగానే ఏమీ ఎరుగకపోతే, అతని ఆచరణ ద్వారా ఆ ధర్మం వ్యక్తమవడం లేదంటే అలాంటప్పుడు అతను ఆ ధర్మాన్ని గురించి ఇతరులకు ఎరుకపరచడం అతని శక్తికి మించిన పని. అతను ప్రపంచాన్ని ఏ ధర్మం వైపునకు పిలుపునిస్తున్నాడో దాని ప్రప్రథమ సంబోధితుడు స్వయంగా అతనే. అందువల్ల అతను ఇతరుల మధ్య చేయదలచిన పనిని అతను తన స్వీయ వ్యక్తిత్వంతో ప్రారంభించాలి. ఇతరుల్ని దైవభక్తులుగా చేసే ముందు తన్ను తాను దైవభక్తునిగా మార్చుకోవలసి ఉంటుంది.

ఇస్లామ్ సందేశ ప్రచారం దాని అనుసరణ లేకుండానే చేయడం ఒక విధంగా పరిహాసమే. మరి సందేశం పిలుపు పరిహాసమయిపోయినప్పుడు అది జనుల్ని

ఆకర్షించజాలదు. ఒక పిలుపు, ఒక సందేశం ప్రపంచాన్ని ఆకర్షించి దాన్ని తన శరణులో ఆశ్రయం పొందేలా చేయగలగాలంటే దాని అనుయాయులు, ధ్వజవాహకులు తమ వ్యక్తిత్వాన్ని అందులో లీనమయి సమసిపోయేలా చేయగలగాలి, ఆ సందేశానికి సజీవ చిత్రాలయిపోవాలి, వారు మూర్తీభవించిన సందేశమయిపోవాలి.

## సందేశ సాఫల్యానికి అనుసరణ అనివార్యం

ఇస్లామ్ సందేశమంటే భావం ప్రజల మధ్యన కేవలం దాని సత్యతను, వాస్తవికతను చాటివేయడం మాత్రమే కాదు. నిజానికి ఇది దాని నైజం రీత్యా ఒక బలవత్తరమయిన, విప్లవాత్మకమయిన ప్రయత్నం. ఇస్లామ్, మానవుల స్వయంకల్పిత ధర్మాలన్నింటిపైనా ఆధిక్యత పొందాలని కోరుకుంటుంది. అన్నీ దానికి లోబడి దాని ఆజ్ఞాబద్ధమయి ఉండాలని కోరుకుంటుంది. బాహ్యలోకంలో ఇస్లామ్ కోరే ఈ సదాచార విప్లవాన్ని నెలకొల్పాలని ఏ వ్యక్తి ఆశిస్తాడో అతను తొలుత దాన్ని తన ఆంతరంగిక ప్రపంచంలో అటువంటి గుణమే గల విప్లవాన్ని నెలకొల్పవలసి ఉంటుంది. అలా కాకపోతే బయటి ప్రపంచంలో అతను చేసే కృషి ఫలించదు.

ఇతరుల మీద దేవుని రాజ్యం స్థాపించడానికి మానవుడు తన అస్తిత్వంపైన దేవుని రాజ్యాన్ని స్థాపించవలసి ఉంటుంది. అలా చేయకపోతే అతను ప్రళయం వరకు ప్రయత్నించినా ఇతరులపైన దేవుని ప్రభుతను స్థాపించనే లేదు. ఈ సందర్భంలో అన్నింటికన్నా ముఖ్యమయిన విషయం ఒక సందేశదాత తన దృష్టి ముందుంచుకోవడం అవసరం. అతడు ఈ సందేశ వ్యాప్తి ద్వారా కోరుకుంటున్నది దైవాన్ని ప్రసన్నుడిగా చేయాలన్న విషయం. మరి దైవం దృష్టిలోనయితే మనిషి ఇతరుల మధ్యనయితే దైవధర్మాన్ని ప్రచారం చేసి స్వయంగా తన జీవితం మటుకు ఈ ధర్మ ప్రభావాలకు దూరంగా శూన్యంగా ఉండటం దైవానికి సుతరామూ ఇష్టం లేదు.

يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لِمَ تَقُوْلُوْنَ مَا لَا تَفْعَلُوْنَ○ كَبُرَ مَقْتًا عِنْدَ اللّٰهِ اَنْ تَقُوْلُوْا مَا لَا تَفْعَلُوْنَ○

(الصف:٢،٣)

**విశ్వసించిన వారలారా మీరు స్వయంగా ఆచరించని విషయాలను ఎందుకు పలుకుతారు. దైవం దృష్టిలో మీరు స్వయంగా ఆచరించని విషయాలను పలకడం అత్యంత హీనమయిన అయిష్టమయిన విషయం.** *(అస్ సఫ్ : 3)*

దివ్యఖుర్ఆన్ గ్రంథంగలవారి ప్రసంగకర్తల్ని, బోధకుల్ని సంబోధించి ఇలా అంటుంది:

اَتَاْمُرُوْنَ النَّاسَ بِالْبِرِّ وَ تَنْسَوْنَ اَنْفُسَكُمْ وَ اَنْتُمْ تَتْلُوْنَ الْكِتَابَ اَفَلَا تَعْقِلُوْنَ ○ (البقرة:٤٤)

మీరు జనులకు 'మంచి'ని ఆదేశించి తమ్ముతాము మరచిపోతారా? వాస్తవంగా మీరయితే గ్రంథాన్ని పఠిస్తారే, మీరే మాత్రం ఆలోచించరా? *(అల్ బకర:44)*

ఈ బోధకుల బోధనలు, ఉపదేశాలకు దివ్యఖుర్ఆన్ "బిర్ర్" (మంచి) అనే పదాన్ని ప్రయోగించింది. ఇందులో చాలా విస్తృత అర్థాలున్నాయి. ఇది దైవం, దైవదాసులకు సంబంధించిన సకల రకాల హక్కులను ఆవరించి ఉంటుంది. భావమేమిటంటే, మీరు అల్లాహ్ ఆరాధనకు, బంధువులు, సంబంధీకుల హక్కుల నిర్వర్తనకు, ప్రపంచ ప్రజల ఎడల సద్ర్పవర్తనకు, ఉత్తమ నైతికతకు, వ్యవహారాలలో సత్యసంధతకు, నమ్మకం, నిజాయితీలకు, అప్పగింతల విషయంలో సదాచారానికి, సంబంధాలలో శ్రేయోభిలాష, హితోపదేశం, సానుభూతి, ఓదార్పు వైఖరికి హితవు గరుపుతూ ఉంటారు కాని స్వయంగా మీ ఆచరణా బొక్కసంలో ఈ శుభాలు లుప్తమయిపోయాయి. ధర్మం, దాని ఘనతలు, దాని ఉన్నత స్థానాలు మీ జపతుల్యమయిపోయాయి. కాని మీ జీవితాలలో వాటి ప్రభావాలు ఏమాత్రం కానరావు. మీరు దైవగ్రంథం పఠిస్తారు, దాన్ని బోధిస్తారు. దాని వల్లనే మీ ప్రసంగాలు, మీ హితోపదేశాలు శోభిల్లుతుంటాయి. దైవగ్రంథం కేవలం ఇతరులకు వినిపించడానికే కాదు, స్వయంగా తన జీవితంలో అనుసరించడానికీ వర్తించాలి. ఇందులో హితోపదేశం ఉంది, విశ్వసించిన వారు ఈ విధానాన్ని అనుసరించరాదు- వారయితే ధర్మానికి పిలుపునిచ్చేవారయి ప్రపంచంలో ముందుకు రావడం, స్వయంగా వారి జీవితాలు ఈ ధర్మం శుభలాభాలకు దూరమయి ఉండటం దైవభక్తి పరాయణతకు సొంతం వ్యతిరేకం. మనిషి ఇతరుల కొరకయితే మార్గబోధనాజ్యోతి వెలిగించి స్వయంగా తిమిరపు అగాధాలలోకి పోయి మునిగిపోవడం ధర్మనిష్ఠ అనిపించుకోదు.

## అందరిలోకెల్లా అధికంగా అనుసరించేవాడు

ప్రపంచంలోనూ పరలోకంలోనూ శుభపరిణామం దైవవిధేయతా మార్గం స్వీకరించి దైవం సమక్షంలో తలవంచిన వానికే స్వంతమవుతుందన్నది వాస్తవం. ఇస్లామ్‌ను త్రోసిపుచ్చి దైవానికి అవిధేయుడయిన వ్యక్తిని దుష్ పరిణామం నుంచి ఏ శక్తీ కాపాడజాలదు. ఇది యదార్థం. ఈ యదార్థాన్ని గురించి ప్రపంచానికి చాటి చెప్పడమే ఇస్లామ్ సందేశదాత అసలు కోరిక. ఈ యదార్థాన్ని అతను నమ్ముతున్నట్లయితే అతని హృదయం అది సత్యమని సాక్ష్యం పలికితే అతను అందరికన్నాముందు, అందరికన్నా అధికంగా ఇస్లామ్‌ను అనుసరించేవాడయి ఉండాలి.

అతని నోరు బహిరంగంగా ఈ యదార్థాన్ని చాటుతుంది. జీవితం గడిపే అత్యుత్తమ విధానం, దైవం తన సందేశహరుని ద్వారా పంపినదే అని అతను గట్టిగా వెల్లడిస్తున్నప్పుడు ఆచరణ ద్వారా ఆ విధానానికి వ్యతిరేకంగా వ్యవహరిస్తున్నట్లయితే అతను, దైవం, ఆయన సృష్టి సమక్షంలో తన నమ్మకాన్ని అవమానపరుస్తున్నాడన్న మాట.

## సందేశదాతను ప్రశ్నించటం తథ్యం

ఇస్లామ్ సందేశం అందజేయడం మహోన్నతమయిన సత్కార్యం, దైవసన్నిధిలో ఈ కార్యానికి లభించనున్న ప్రతిఫలం, పుణ్యఫలాలను ఊహించడం అంత సులువయిన విషయం కాదు. అయినప్పటికీ ఎవరయినా సరే ప్రపంచంలో సందేశ మహాకార్యాన్ని నిర్వహిస్తూ ఉన్నంత మాత్రానే దేవుని పట్టును తప్పించుకోలేడు. దైవసన్నిధిలో అతన్ని తప్పక ప్రశ్నించనిదే వదలడం జరగదు - మీరు ఏ ధర్మాన్ని గురించి ప్రపంచానికి సందేశం అందజేసేవారో అందులో మీ జీవితంలో భాగం పొందినదెంత మరి జీవితంలో అసలే కనుమరుగయిపోయినదెంత?

నేడు అతని జీవితంలో దైవధర్మం లుప్తమయిపోతే రేపు దైవదూతలు అతనికి వ్యతిరేకంగా చార్జిషీటు దాఖలు చేస్తారు, ఇతనయ్యా, నీ ధర్మ ప్రచారకుడు, ఇతనయితే దాని మహత్యాలు, ఘనతలు బాగా చెప్పేవాడే కాని తాను స్వయంగా దాన్ని ఆచరించే వాడు కాదు. ఇదేదో సాధారణమయిన తేలికపాటి అపరాధం కాదు. ఇది దైవ సందేశహరులు ముహమ్మద్ (స) మాటల్లో చెప్పాలంటే, ఇటువంటి బోధకుని పెదాలు నిప్పు కత్తెరలతో కత్తిరించడం జరుగుతుంది. ఇతను ప్రపంచ ప్రజలకయితే దైవగ్రంథం చదివి వినిపించే వాడు కాని తాను స్వయాన దాన్ని వీపు వెనక పడవేసేవాడు.

వాస్తవానికి మానవుని సాఫల్యం అన్నది దైవధర్మాన్ని అవలంబించడంలోనే దాగి ఉంది. అతను ధర్మం పట్ల తిరుగుబాటు వైఖరినవలంబించినట్లయితే అటు ప్రపంచం లోనూ సఫలత పొందలేడు, పరలోకంలోనూ సాఫల్యం అతనికి చేరువ కాదు. దేవుని కారుణ్యం దైవవిధేయులయిన వారికే ప్రాప్తిస్తుంది. అతను తన విధేయతా భావాన్ని రుజువుపరచలేకపోతే అతను దైవకారుణ్యానికి ఎలా అర్హుడవుతాడో మీరే ఆలోచించండి.

ఇస్లామ్ సేవ చేసే ఏ సేవకుడూ మరువరానిదొక విషయముంది. అతను శక్తి నంతా ధారబోసి ప్రయత్నించినప్పటికీ అతని దేశవాసులయిన సోదరులు దాన్ని తిరస్కరించినప్పటికీ, అతని స్వంత వీధివారు త్రోసిపుచ్చినప్పటికీ, అతని బంధుమిత్రులు కాదన్నప్పటికీ, చివరికి అతని తల్లిదండ్రులు, సోదరీసోదరులు, భార్యాపిల్లలు అందరూ

కాదన్నా, ప్రపంచంలో ఒక్క వ్యక్తి కూడా దాన్ని స్వీకరించకపోయినా, దైవం సమక్షంలో అతన్ని ఏమాత్రం ప్రశ్నించడం జరగదు. తనకున్న శక్తిసామర్థ్యాలను అతను జనుల్ని సన్మార్గాన తెచ్చేందుకు పూర్తిగా వినియోగించాడు. ఆపైన అతనిలో మనస్సులను మార్చగల శక్తి లేదు కాబట్టి అతను వారి హృదయాలను మార్చలేకపోయాడు.★

దీనికి భిన్నంగా స్వయంగా అతని జీవితంలోనే ధర్మం ఛాయలు లేకపోయి నట్లయితే అతను చెప్పుకునే ఏ సాకూ వినిపించుకోవడం జరగదు. మానవుడు చిత్తశుద్ధితో తన వ్యక్తిత్వాన్ని దైవదాస్యం వైపునకు మరల్చదలచుకుంటే నిశ్చయంగా మరల్చగలడు. ఈ మార్గంలో ఎటువంటి ఆటంకమేదీ లేదు. ఉన్నా దాన్ని దూరం చేయడం అతనికి అసాధ్యమేమీ కాదు. పరమ ప్రభువు అతనికి తన స్వీయ వ్యక్తిత్వంపైన పూర్తి అధికారాన్ని ఇచ్చాడు.

అయినప్పటికీ అతను తన మీద దేవుని ప్రభుతను నెలకొలుపుకోకపోతే మన్నింపు ద్వారాలన్నీ అతనికి మూసుకుపోతాయి, మరే వ్యక్తిపైనయినా ఈ బాధ్యతలు మోపి అతను దీని పర్యవసానాల నుండి తప్పించుకోలేడు. అతను స్వయంగానే తన చేష్టల పరిణామాన్ని అనుభవించవలసి ఉంటుంది - అది ఎంతో భయానకమయినదయినా మరెంతో హృదయవిదారకమయిన పరిణామమయినా సరే.

## అనుసరణ వల్ల దైవానుబంధం పెరుగుతుంది

ఇస్లామ్ సేవ చేయదలచిన వ్యక్తి, నిజంగానే తన ఈ సంకల్పం పట్ల గంభీరమయి ఉన్నట్లయితే, చిత్తశుద్ధి గలవాడయితే అతను దైవంతో సంబంధాన్ని సృజించుకోవలసి ఉంటుంది. అది ఈ కార్యసిద్ధికి అవశ్యమయినది. దైవంతో ఈ అనుబంధం ఇస్లామ్ అనుసరణ వల్లనే పుడుతుంది. ఇస్లామ్ అనుసరణే కదా అతను చేయదలచింది. ఇదొక్కటే తప్ప మరో మార్గం లేదు.

దేవుని ప్రవక్తలు ఏ జాతులలో ఆవిర్భవిస్తారో వారు ఆ జాతి ప్రజల్లో దేవుని ధర్మానికి ప్రప్రథమ, సర్వోత్తమ సందేశదాతలయి ఉంటారు. దైవంతో వారి సంబంధం స్థాయి ఎలా ఉంటుందంటే వారి ఆంతర్యం అనునిత్యం దైవసంస్మరణతోనే జ్యోతిర్మయ మయి ఉంటుంది. వారి ఆ జీవితం దేవుని ఆరాధన, సేవాభావాలలో పూర్తిగా మూసపోసి మలచినట్లు మారిపోతుంది. వారు ఆపాదమస్తకం దైవదాస్యం, స్వయం సమర్పణ, సంతృప్తి భావాల ప్రతిరూపమయి మెలుగుతారు.

వారు ఏ ధర్మాన్ని తమ జాతికి పరిచయం చేసి అనుసరించమంటారో దాన్ని

★ వివరాలకు చూడండి ఇదే పుస్తకం, 'సందేశదాత విజయుడే' అన్న శీర్షిక.

పూర్ణ ఏకాగ్రతతో అనుసరిస్తారు. వారిని వ్యతిరేకించేవారెవరికీ వారిని గురించి అభ్యంతరం తెలిపే సాహసం కలగదు, వారి ఆచరణ వారి సందేశానికి భిన్నమయి ఉందన్న ఆరోపణ మటుకు వారు చేయలేరు. వారు దైవాదేశాలను గట్టిగా పాలిస్తారు. జీవితంలో ఎటువంటి కఠినమయిన దశలు ఎదురయినా ఆ మార్గం నుండి తొలగిపోరు, తొణకరు, బెణకరు. ఖుర్ఆన్ వారిని దైవభీతి, దీక్ష, ఆరాధన, ప్రపంచం పట్ల నిర్లిప్తత, ధర్మనిష్ట. దైవవిధేయత, దైవం వైపునకు మరలడం, ఆయన్ని మాటిమాటికీ, అనునిత్యం సంస్మరించడం వంటి గుణాలు గలవారుగా అభివర్ణించింది. ఈ గుణగణాలు కేవలం వారి వైయక్తిక శీలస్వభావాలను మటుకే వ్యక్తం చేయవు, వీటి వల్ల, ధర్మసందేశ వ్యాప్తి చేయగల వ్యక్తులు ఎలాంటి వారు కాగలరో అన్న విషయమూ తెలుస్తోంది.

## అనుసరణ వల్ల సామర్థ్యం పెరుగుతుంది

ఇస్లామ్ వైపునకు పిలుపునివ్వడం మరే ఇతర సిద్ధాంతానికి పిలుపునివ్వడం కన్నా కష్టతరమయినది. ప్రపంచంలో వెలిసే ఉద్యమాలెన్నయినా, ఎన్ని సిద్ధాంతాలు ముందుకు వచ్చినా అవి మానవుని బాహ్యరూపాన్ని మార్చాలని, అతని కొన్ని సమస్యల్ని పరిష్కరించాలని కోరుతాయి. కాని ఇస్లామ్ మానవుని అంతర్ బాహ్యాలను, ఉభయత్రా మార్పు తేవాలని కోరుకుంటుంది. అది మానవుని జీవితం మొత్తానికి, ప్రతి సిద్ధాంతానికీ, ప్రతి ఉద్యమానికీ భిన్నంగా ఓ కొత్త ఆలోచన, సరికొత్త దిశ ఇవ్వగోరుతుంది.

ప్రపంచంలోని మరే సిద్ధాంతం అనుయాయికి, మరే సిద్ధాంతం నాయకునికి, మార్గదర్శకునికి సదృశంగా ఇస్లామ్ సేవ చేయగోరే వ్యక్తికి అధిక ధైర్యం, అధిక సహన స్థయిర్యాలు అఖండమయిన త్యాగనిరతి, ఇతోధికమయిన అవగాహనాశక్తి, దూరదృష్టి అవసరమవు తాయి. ఇవన్నీ లేకపోతే దాని సేవ చేసే బాధ్యత నెరవేరదు.

దైవంతో మానవుని అనుబంధం ఎంత పటిష్టమయితే ఈ లక్షణాలు సయితం అతనిలో అంతే బలంగా పైకి వస్తాయి. అతను దైవధర్మానికి అత్యంత ఉత్తమ సేవకుడుగా రుజువవుతాడు. దైవంతో మానవుని అనుబంధం ఎంతో పటిష్టమయి ధర్మం కోసం అతను మరొకరెవరితోనయినాసరే సంబంధాన్ని తెంచుకోవడాన్ని ఖాతరు చేయకున్నప్పుడు, దైవసంస్మరణ అతనికి ఎంతో ప్రియప్రదమయి, ప్రపంచంలోని ఏ విషయమూ అతన్ని దైవం పట్ల ఏమరుపాటు కలిగించనప్పుడు, దేవుని భీతి, ఆయన ప్రేమ అతని మనో మస్తిష్కాల్లో బాగా పాదుకుని మరే భయమూ, మరే ప్రేమా అతన్ని ఆక్రమించుకో గలగనప్పుడు - అలాంటప్పుడు ప్రపంచంలోని ఏ శక్తీ అతన్ని ధర్మమార్గం నుండి తొలగించ జాలదు. అతని స్థాయి కార్యకర్త మరెవరయినా తన సిద్ధాంతం, తన ఉద్యమం

కొరకు·ఎంతగా కృషి చేయగలడో అంతకన్నా ఎన్నో రెట్లు మెరుగయిన సేవలు ఇతను అందజేయగలడు.

## అనుసరణ లేనిదే వాదన నిలువదు

దైవసందేశహరులు తమ సందేశాన్ని అందజేసే రీతిని బట్టి వారిని వ్యతిరేకించేందుకు సమంజసమయిన వాదన ఏదీ మిగులదు. అలాగే ఇటువంటి కార్యానికై లేచే వ్యక్తిలోనూ, దైవప్రవక్తలలో ఉండేటటువంటి ధర్మానుసరణ భావనే ఉండాలి. ఆచరణలో గుల్లతనం ఉంటే మాటలో విలువ లేకుండా పోతుంది. అందువల్ల ఆచరణ శూన్యుడయిన వ్యక్తి దైవం పక్షాన మానవులపైన వాదనను నిలుపలేకపోతాడు.

ప్రపంచం మానవుని మాటలకన్నా అతని శీలస్వభావాలను మన్నిస్తుంది. అతని ఆచరణకూ అతని మాటలకు పొంతన కుదరకపోతే ఆ వ్యక్తి స్వయంగానే ఆ సందేశ స్వీకృతి మార్గంలో పెద్ద అవరోధంగా తయారవుతాడు. అతని మాటను కాదనడానికి జనులకు ఒకే ఆధారం చాలు–ఇతని ఆచరణ స్వయంగా ఇతనికి వ్యతిరేకంగా ఉందన్నది. ఒక వ్యక్తి ఇస్లామ్ సందేశకునిగా ముందుకు వచ్చినప్పుడు ప్రపంచం అతని అత్యంత స్వల్పమయిన తప్పిదాన్నీ మన్నించదు. అతన్ని అతి సాధారణ తప్పును సయితం సందేశంలోనే ఏదో చెడుగు ఉన్నట్లు నిర్ణయిస్తుంది, అతని అప్రతిష్టపాలుచేస్తుంది.

ఏ సందేశమయినా జనుల్లో స్వీకారయోగ్యం కావాలంటే సందేశదాత జీవితం ఆ సందేశానికి విశదీకరణ, వ్యాఖ్యానం కాగలగాలి. అతని నోట వింటున్న విషయాన్ని వారు అతని ఆచరణలో చూసుకోగలగాలి. అప్పుడే సందేశం ప్రజామోదం పొంది సామాన్య స్వీకృతి పొందగలదు.

వాస్తవానికి, ఇస్లామ్‌ను ప్రపంచం ఎదుట అందజేయాలని కోరుకునే వ్యక్తి తన పూర్తి మనుగడతో ఇస్లామ్ సత్యధర్మమన్న సాక్ష్యం పలకగలగాలి. అతని జీవితం నుండి దాని సత్యత ధ్వని పైకి లేవలేకపోతే కేవలం అతని ప్రచారం మూలంగా ఇతర వ్యక్తి జీవితం మారజాలదు. దైవధర్మం విలువను తగ్గించింది ఇదే ఆచరణహీనమయిన సందేశం. కాని బాగా ఆలోచించండి, మనలో ఎంతో మంది ఉన్నారు, వారికి ఇస్లామ్ కేవలం చర్చనీయాంశం మాత్రమే, మరెంతో మంది జీవితాల్లోకి అది నిజంగానే చోటుచేసుకుందని చెప్పలేము. ఇస్లామ్ పేరు చెప్పుకునే వారు దాన్ని చాలా పరాభవం పాలుచేశారు. కనీసం దాని సందేశదాతలు ఈ అపవాదు నుండి వాస్తవంగానే తప్పించుకోవడం అవసరం.



# సందేశం, సంస్కరణల క్రమం★

## సందేశం ఒక సంస్కరణా కృషి

ఇస్లామ్ సందేశం ప్రత్యేక కోణంలో మానవుల ఆలోచనాత్మక, ఆచరణాత్మక సంస్కరణ. అందువల్ల దీన్ని ఒక సంస్కరణాత్మకమయిన కార్యంగా పేర్కొనవచ్చు. ఇందులో భార్యాపిల్లల సంస్కరణ, కుటుంబం, తెగల సంస్కరణ, వీధి, పట్టణాల సంస్కరణ కూడా చేరి ఉంది. దేశం, ప్రపంచం, మానవాళి అంతటినీ సంస్కరించడం కూడా ఇందులో ఉంది. ఇస్లామ్‌ను నమ్మినప్పటికీ దాని బోధనలను గురించి ఎరుగనివారు, లేదా అంతా తెలిసీ దాన్ని ఆచరించడానికి సిద్ధంగాలేని వారినీ సంస్కరించవలసి ఉంది. అలాగే ఇస్లామ్‌ను గురించి ఏమాత్రం ఎరుగనివారు, లేదా అనేక కారణాల వల్ల దానికి దూరంగా ఉన్నవారు, దాన్ని స్వీకరించగోరని వారినీ సంస్కరించవలసి ఉంది.

ఈ విస్తృతమయిన సర్వతోముఖమయిన పనిలో ప్రతి వ్యక్తీ పాలుపంచుకోవలసి ఉంటుంది. అందులో ఒక క్రమపద్ధతి ఏర్పడాలి. అప్పుడే అందులో చక్కదనం, మెరుగులు, పటిష్టత పుడుతాయి; సందేశం, సంస్కరణా కార్యాలు సహజ రీతిలో పురోగమిస్తాయి. అలా జరక్కపోతే మనిషి ఏ రంగంలో ముందుగా చేరవలసి ఉంటుందో అక్కడ తరువాత అడుగుపెడతాడు, ఎక్కడ తరువాత కృషి సలపవలసి ఉందో అక్కడ తొలి అడుగుతోనే శ్రమపడటం మొదలెడతాడు.

క్రమపద్ధతి లేకపోవడం ఒక లోపం వంటిది. అది ఏ పనినయినా చెరచివేస్తుంది. సందేశం, సంస్కరణా ప్రయత్నం ఈ లోపానికి దూరంగా, పరిశుద్ధంగా ఉండటం

---

★ ఇస్లామ్ సందేశం సందర్భంలో ముస్లిమేతరుల్లో సందేశ వ్యాప్తి, ముస్లిముల్లో సంస్కరణ, శిక్షణల విషయం వేర్వేరు శీర్షికల క్రింద చర్చించబడ్డాయి. ఇక్కడ సౌలభ్యం కొరకు ఒకేసారి చర్చ జరుపుతున్నాము. ఈ రెంటిలో ఉన్న వ్యత్యాసం అర్థం అవుతూనే ఉంది. రెండూ సందేశకుని కార్యరంగాలే.

అవసరం. అందువల్ల మేము ఇక్కడ దాని క్రమపద్ధతిని గురించి కాస్త వివరంగా చర్చించదలిచాము. దీని వల్ల ఈ కార్యంలో క్రమపద్ధతికి గల ప్రాముఖ్యం ఏమిటో, సందేశానికి దీని వల్ల కలిగే ప్రయోజనం ఏమిటో ఊహించుకోవడం సులభమవుతుంది.

## భార్యాపిల్లల సంస్కరణ

సందేశ ప్రచారం, సంస్కరణా శిక్షణలు మీరు మీ ఇంటి నుండి ప్రారంభించాలి. దైవధర్మాన్ని నేడు చాలా మంది బూజుపట్టిన చాదస్తపు విషయంగా భావిస్తారు. మీరూ వారిలాగే అభిప్రాయపడేవారు కాకపోతే, దానికి ప్రాప్తమయి ఉన్న దాని వాస్తవ స్థానం, దాని ప్రాముఖ్యత దానికి ఇచ్చే మాటయితే ఈ విషయంలో మీ భార్య, మీ పిల్లలు, అందరి కన్నా అధికంగా మీ శ్రద్ధాసక్తులకు అర్హులు. మీరు వారికి ధర్మం యదార్థాన్ని తెలుపాలి, ధర్మానికి దూరమవడంచేత, దానికి విముఖులవడంచేత సంభవించే భయంకర పరిణామాలను గురించి హెచ్చరించాలి.

ఒకటి మాత్రం వాస్తవం, ఇందులో ఎటువంటి సందేహమూ లేదు. ఒక వ్యక్తి తాను మాత్రం దైవధర్మాన్ని అనుసరించడం తప్పనిసరి అని భావించినట్లయితే, అతను తన కోసం ధర్మమార్గం అనుసరణ అనివార్యమని తలచుకుంటే అతను తన భార్యాపిల్లల చేత సయితం ధర్మమార్గాన్ని తప్పనిసరిగా అనుసరింపజేస్తాడు. అటువంటి వ్యక్తి తాను మటుకు పరలోక యాతనలను తప్పించుకుని భద్రంగా ఉంటూ తన ఆలుబిడ్డలు ఆ యాతనల్లో చిక్కుకుపోవడాన్ని ఎన్నటికీ ఇష్టపడడు, ఒక్క క్షణమూ సహించడు.

మీ ఇంటివారల సంస్కరణ, వారిని ధర్మమార్గాన నడిపించడం మీకు ఏదో అదనపు (నఫిల్) కార్యక్రమం కాదు, లేక ఏదో అభిలషణీయమయిన పనీ కాదు. ఇది మీ విధ్యుక్త ధర్మం (ఫర్జ్). దైవాదేశం ఏమంటుందో చూడండి:

يٰۤاَيُّهَا الَّذِيۡنَ اٰمَنُوۡا قُوۡۤا اَنۡفُسَكُمۡ وَ اَهۡلِيۡكُمۡ نَارًا (التحريم:٦)

**విశ్వసించినవారలారా, మీరు మీ స్వయాన్నీ మీ ఇంటివారలనూ (నరకపు) అగ్ని నుండి కాపాడుకోండి.**

***(అత్ తహ్రీమ్: 6)***

దైవసందేశహరులు (స) ఇలా సెలవిచ్చారు:

الرجل راعٍ علٰى اهل بيته وهو مسئول عن رعيتهٖ

**పురుషుడు తన ఇంటివారలపైన కాపలా దారు, అతన్ని అతని కాపలాలో ఉండే వారిని గురించి (ప్రళయ దినాన) ప్రశ్నించడం జరుగుతుంది. *(బుఖారి, ముస్లిమ్)***

ఇస్లామ్ సందేశమయినా మరే సంస్కరణా కృషి అయినా ఫలప్రదం కావాలంటే తొలి నిబంధన చిత్తశుద్ధి, ప్రేమ. చిత్తశుద్ధి, ప్రేమభావాలు వ్యక్తమయితే సంబోధితుడు దాని ప్రభావానికి లోనవుతాడు. లేకపోతే అది అతనిపై ఎటువంటి ప్రభావమూ చూపజాలదు. ఈ దృక్కోణంతో గమనిస్తే, ప్రతి వ్యక్తి సంస్కరణకు తన భార్యాపిల్లలు ఇతరులందరికన్నా అధికంగా తగిన వారు అన్న యదార్థం ఇట్టే బోధపడుతుంది.

మనిషికి తన భార్యాపిల్లలంటే అమితమయిన ప్రేమానురాగాలుంటాయి. వారి ఎడల అందరికన్నా అధికంగా నిజమయిన శ్రేయోభిలాషి అతనే కాగలడు. వారి సేవ చేయడం తన బాధ్యతగా భావిస్తాడు. వారి సంరక్షణ, పోషణాభారం తానే వహిస్తాడు. వారి దుఃఖాన్ని బాధను తాను అనుభవిస్తాడు. వారి కొరకు బాధలను భరిస్తాడు, త్యాగాలు సమర్పించుకుంటాడు. అందువల్ల అతని చిత్తశుద్ధిని, ప్రేమను వారు ఎన్నడూ శంకించ లేరు. వారు ఇతన్ని తమ శ్రేయోభిలాషి అనీ, మహోపకారి అనీ అంగీకరించడానికి వివశు లయిపోతారు.

ఈ కారణంగా అతను వీరికి ధర్మసందేశాన్ని అందజేస్తే లేదా వారి సంస్కరణ పట్ల శ్రద్ధ చూపి వారిని సంస్కరించాలని కోరుకుంటే వారు మరోలా భావించరు. వారు ఈ కార్యక్రమాన్ని తమ సాఫల్యానికి మార్గమని తలపోస్తారు. మనం వారిని గురించి ఇదే ఆశించగలం. మరెవరయినా ధర్మసందేశాన్ని అందజేసినా, సంస్కరణా కృషి జరిపినా దానికి ప్రతిగా దానికన్నా అధికంగా ఇతని మాటకే ప్రభావితులవుతారు, సకారాత్మక ప్రభావాన్ని గ్రహిస్తారు.

భార్యాపిల్లల సంస్కరణ విషయంలో ఓ ప్రత్యేక పరిమితిలో దైవం మీకు అధికారాన్నీ ఇచ్చాడు. ఆ ప్రత్యేక పరిధిలో మీరు వారిని మందలించగలరు, కఠినంగా ప్రవర్తించనూగలరు. అందువల్ల వారు ఒకవేళ షరీఅత్ పరిధుల్ని దాటినట్లయితే తొలుత మీరు మృదువుగాను, అవగాహనా మార్గాల ద్వారానూ వారిని సంస్కరించే ప్రయత్నం చేయాలి. కాని ఒక వేళ దీని వల్ల వారి సంస్కరణ జరగకపోతే మీరు వారి పట్ల కఠినం గానూ ప్రవర్తించగలరు. వారిని అదుపు ఆజ్ఞల ద్వారా ధర్మావలంబనకు సమాయత్త మయ్యేలా చేయగలరు.

దైవం మీకు మీ భార్యాపిల్లల ఎడల ప్రసాదించిన ఒకింత అధికారం వల్ల మీరు మహా పరీక్షకే గురయ్యారు. దీని భావం ఏమిటంటే, మీ భార్యాపిల్లలు దైవధర్మానికి విముఖులయిపోయినట్లయితే మీరు మౌనం వహించలేరు. లేదా హితోపదేశం చేసి, ఇక నా బాధ్యత తీరిపోయింది, ఇంతకు మించి నేనేమీ చేయలేనని భావించి గమ్మున ఉండి పోలేరు. వారి ఈ వైముఖ్యాన్ని నిరోధించి రుజుమార్గాన తెచ్చేందుకు ఏ మేరకు మీ

అధికారాన్ని వినియోగించడానికి మీకు అనుమతి ఉందో ఆ మేరకు మీరు శక్తినీ వినియోగించవలసి ఉంటుంది. మీరు వారి తప్పుడు వైఖరిని భరిస్తూ ఉంటూ షరీఅత్ పరిధిలో వారి సంస్కరణకు కృషి చేయకపోతే మీరు దైవం దృష్టిలో మహాపరాధులవుతారు.

మీకు దేవుని ఈ ధరిత్రిలో అధికారం ప్రాప్తమయితేనే ఇక్కడ దేవుని ప్రభుతను స్థాపించాలన్న సత్సంకల్పంతో మీరు లేచి నిలబడ్డారు. మీకు దేవుడు మీ ఇంటిపైన ఇచ్చిన అధికారంతోనే మీ ఈ మహా సంకల్పానికి పరీక్ష. ఒక చిన్న పరిధిలో కొందరు మానవుల పైన మీకు లభించిన అధికారం ద్వారా మీరు వారిని దైవవిధేయులుగా, ఆజ్ఞాపాలకులుగా తీర్చిదిద్దడంలో కృతార్థులయినట్లయితే, అంతకన్నా విస్తృతమయిన అధికారం ప్రాప్తమయిన పక్షంలో మీరు ధరణిలో దేవుని ప్రభుతను నెలకొల్పుతారని ఆశించవీలవుతుంది. అలాకాక మీరు ఇంటిలోనూ దేవుని శాసనాన్ని విధించలేకపోయినట్లయితే మీ ద్వారా ప్రపంచమంతటా ఆయన శాసనం అమలు జరుగుతుందని ఆశించడమెలా సాధ్యమవుతుంది?

మీరు ప్రపంచంలో నిర్వర్తించగోరుతున్న మహత్కార్యానికి తొలి మజిలీ ఇంటి సంస్కరణ, మీరు ఈ తొలి మజిలీని పూర్తిగా నిర్వర్తించకపోతే మీచేత ఆ మిగిలిన మజిలీలన్నీ నెరవేరగలవని ఎవరు అనగలరు? వాస్తవానికి, మీ భార్యాపిల్లలు దేవుని ఆజ్ఞాపాలన చేస్తున్నారా లేదా ఆయన ఆజ్ఞల్ని ఉల్లంఘిస్తున్నారా అన్న విషయంలోనే మీకు ఆసక్తి లేకపోయినట్లయితే మీకు ప్రపంచం మార్గబోధన పొందిందా లేదా భ్రష్టమయిపోతున్నదా అన్న విషయంలోనూ ఆసక్తి కలగటానికి వీలు లేదు. కొన్ని సందర్భాలలో ధర్మసందేశ సేవజేసే వ్యక్తులు తాము ప్రపంచంలో తీసుకురాదలచిన సువిశాలమయిన పరివర్తనను గురించి ఆలోచిస్తున్నప్పుడు తమ భార్యాపిల్లల సంస్కరణను గురించి అంతగా పట్టించుకోరు. వారు ఈ విషయాన్ని ఇట్టే ఉపేక్షిస్తూ దాటిపోతారు, ఇది వారి ఆలోచనా పరిధికి, శ్రద్ధాసక్తులకు, కృషి, శ్రమలకు అంతగా అర్హమయినది కానట్టుగా వ్యవహరిస్తారు. నిజానికి ఇంటి బయట పరివర్తనకు ఇంటి లోపలి పరివర్తన అత్యంతావశ్యకమయినది.

మీ భార్యాపిల్లలకి ధర్మం విషయంలో ప్రేమ, అనురాగాలుండి వారు ధర్మమార్గంలో రాగల ఇబ్బందులలో కేవలం స్థిరచిత్తంతో నిలువడమేకాక మీకు స్థయిర్యాన్ని పురిగొలిపితే నిశ్చయంగా మీ సందేశ వ్యాప్తి భావన బలోపేతమవుతుంది, మీరు ఏకాగ్రతతో, పూర్తి నిమగ్నతతో ధర్మసేవ ఒనర్చగలుగుతారు. అలాకాక మీ ఇంటిలో ధార్మికమయిన వాతావరణం లేకపోయినట్లయితే ఇంటి బయట ధార్మిక సేవ చేయడం మీకు సులువు కాజాలదు.

చాలా మంది ధార్మిక సేవ చేయకపోవడానికి కారణం, కేవలం వారి భార్యా పిల్లలు వారి మార్గంలో అవాంతరాలయి నిలవడమే. వారిని ముందుకు సాగనివ్వరు వారు. మీరు ఈ యదార్థాన్ని తెలుసుకున్న తరువాత కూడా మీ ఇంటి సంస్కరణ ప్రాముఖ్యతను గురించి అర్థం చేసుకోరా, దాని గురించి ఏమరుపాటుకే లోనయి ఉంటారా?

## కుటుంబ సంస్కరణ

భార్యాపిల్లల సంస్కరణతోపాటు మీరు మీ తల్లిదండ్రులు, సోదరీసోదరులు, దగ్గరి బంధువులు, తదితర ఆప్తుల్ని సయితం సంస్కరించవలసి ఉంటుంది. ఎందుకంటే సాధారణ మానవులకన్నా బంధుగణం హక్కులు అధికం. దేవుని ఆదేశం చూడండి;

**నీ దగ్గరి బంధువులకు దైవభీతి కల్పించు.** وَاَنْذِرْ عَشِيْرَتَكَ الْاَقْرَبِيْنَ (الشعراء:٦)

***(అష్షు'రా : 6)***

కుటుంబం మన సామాజిక జీవితంలో ప్రముఖమయిన వ్యవస్థ. మనము దానితో పెనవేసుకునే ఉన్నాము, దానికి దూరమవలేము, కుటుంబానికి మన ఆవశ్యకత ఎంతయినా ఉంది, మనకూ దాని ఆవశ్యకత ఉంటుంది. అది మన సహకారాన్ని కాంక్షిస్తుంది, మనమూ దాని సహకారాన్ని కోరుకుంటాము. దాని మీద మన హక్కుల బాధ్యత ఉంది, మనపైనా దాని హక్కుల బాధ్యత ఉంటుంది.

అలాంటప్పుడు మీ కుటుంబం ధార్మికమయినదయితే, దైవభక్తిగలదయితే మీరున్నూ దానితో మీ సంబంధాలన్నింటినీ ధార్మిక పునాదులపైన నిర్మించుకోగలుగుతారు. అలా కాకపోతే ధార్మిక పరిధిలో ఉంటూ మీరు మీ కుటుంబంతో సంబంధాలను చక్కబరచుకోవడంలోనూ, కొనసాగించడంలోనూ ఎన్నో ఇబ్బందులు ఎదుర్కొంటారు. అంతేకాదు, ఒకానొక దశలో మీ ఎదుట ఓ ప్రశ్న తలెత్తవచ్చు. కుటుంబం వారిని సంతోష పెట్టాలా లేదా దైవాన్ని ప్రసన్నం చేసుకోవాలా లేదా దైవప్రసన్నత కొరకు కుటుంబంతో సంబంధాలు తెంచుకోవాలా? అన్న వివశత ఏర్పడటమూ సాధ్యమే.

కుటుంబ సంస్కరణ మరో కోణంలోనూ మీకు ప్రయోజనకరమయినది. కుటుంబ సభ్యులలో పరస్పరం సహాయ సహకారాలు, సానుభూతి భావాలుంటాయి. కొన్ని సందర్భాలలో ప్రభావం పక్షపాతం వరకు పెరుగుతుంది. మనిషి కుటుంబం కోరే ప్రతి ధర్మమయిన, అధర్మమయిన విషయాన్ని బలపరుస్తాడు. నిస్సందేహంగా ఈ పక్షపాతం మన దృష్టి ప్రకారం తప్పయినదే. కాని అది అలా ఉంచి, కుటుంబ సభ్యుల మధ్య సహాయసహకారాల, సానుభూతి భావనలు ఎంతో బలోపేతంగా ఉంటాయన్నది

మటుకు వాస్తవం. కుటుంబానికి వెలుపల ఇటువంటి బలోపేతమయిన భావం చాలా అరుదుగానే కానవస్తుంది.

అందువల్ల మీ కుటుంబానికి ధర్మం ఎడల ప్రేమానురాగాలుంటే వారు ధర్మ మార్గంలో మీకు ఉత్తమమయిన సహాయకులుగా రూపొందుతారు. ధర్మసందేశ కృషిలో వారూ మీతోపాటు కలసి పనిచేసే మాటయితే, వారు మీకు తోడ్పడటమన్నది, మీరు వారిలో ఒకరన్న భావంచేత కాదు, మీకు సహాయపడటం, తోడునివ్వడం తమ ధార్మిక, విశ్వాసపరమయిన ఆవశ్యకతగా భావించి మరీ తోడ్పాటు అందజేస్తారు. ఈ విధంగా కుటుంబ సంస్కరణ వల్ల ఈ సంబంధాలు సవ్యంగా రూపొందడమేకాక మీ ధార్మిక కృషిలోనూ ఉత్తమమయిన మద్దతుదారులు లభ్యమవుతారు.

కుటుంబ సంస్కరణ పట్ల మీరు ఉపేక్షాభావం కనబరిస్తే మీ దృష్టిలో ఉన్న మహత్తర ధ్యేయానికి వారు తీరని నష్టం కలగజేస్తారు. ప్రపంచం చాలా జాగ్రత్తగా గమనిస్తోంది. మీరు ఇతరులకు అందజేస్తున్న సందేశం మీరు మీ ఇంటను, మీ కుటుంబంలోనూ అందజేస్తున్నారా, లేదా? ఎందుకంటే, దైవధర్మం మోక్షానికి మార్గమయినట్లయితే మీరు ఇతరులకయితే దాన్ని గురించి తెలిపి మీ స్వంత ఇంటివారినీ, కుటుంబం వారినీ దాని పట్ల దూరంగా ఉంచుతారా? ప్రపంచం గమనిస్తూనే ఉంది, మీరు ఏ ధర్మం వైపునకు పిలుపునిస్తున్నారో దాన్ని స్వయంగా మీరు, మీ ఇంటివారలు, మీ కుటుంబం వారు ఏ మేరకు ఆచరిస్తున్నారన్న విషయాన్ని గమనిస్తోంది.

మీ ఇల్లు, మీ కుటుంబం ధర్మానికి దూరమయి ఉన్నట్లయితే, వారు ఇలా దూరంగా ఉండటాన్ని మీరు భరిస్తూ ఉన్నట్లయితే ధర్మసందేశ వ్యాప్తిలో మీరే పెద్ద అవరోధం. మీ భార్యాపిల్లలు, కుటుంబ సభ్యులు ధర్మాన్ని పరిహసిస్తూ ఉండగా, షిర్క్ (బహుదైవారాధన), బిద్అత్ (ధర్మంలో కొత్త విషయా)లలో మునిగి ఉండగా, నిషిద్ధ కార్యాలకు పాల్పడుతూ ఉండగా, తమ కార్యకలాపాలలో, వ్యాపారాలలో, వ్యవహారాలలో ధర్మాధర్మాల వ్యత్యాసాన్ని పాటించకున్నట్లయితే, సంతోష సమయాల్లోనూ, దుఃఖ సందర్భాలలోనూ దైవం, ఆయన ప్రవక్త చూపెట్టిన మర్యాదలను వదలి అజ్ఞానపూర్వక మయిన ఆచారాలను అనుసరిస్తూ ఉండగా మీరు వారి పరిస్థితుల్ని మార్చడానికి ప్రయత్నించడం మానుకుని ప్రపంచానికి ఉపదేశిస్తూ తిరుగుతూ ఉన్నట్లయితే లోకం దీని ప్రభావాన్ని ఏమాత్రం గ్రహించదు. అయితే మీరు మీ కుటుంబీకుల ఈ వైఖరిని నిరసిస్తూ ఉన్నట్లయితే, మీ వరకు మీరు ధర్మాన్ని అందజేసే వాదనను నెరవేర్చినట్లయితే దైవం దృష్టిలోనూ బాధ్యత నెరవేర్చినవారవుతారు, దేవుని దాసులయిన మానవులు సయితం మీరు బాధ్యులుకారని తలపోస్తారు.

ఇల్లు, కుటుంబం రెంటి సంస్కరణ కూడా చాలా సున్నితమయిన బాధ్యత. కొన్ని సందర్భాలలో కుటుంబ సంబంధాలు, సంస్కరణ కార్యాన్ని సులభతరం చేయవలసింది పోయి ఆ మార్గంలో ఒక అభేద్యమయిన తెరగా పరిణమిస్తాయి. మనిషి తన బంధువు ఎవరయినా తప్పు చేస్తూ ఉండగా చూసినట్లయితే, అతను తన బంధువు అయినందుకే ఆ తప్పును ఎత్తి చూపడు; అతను పరులకయితే అతిసునాయాసంగా వాళ్ళ తప్పులేమిటో చూపగలడు. కాని తన వారి తప్పుల్ని ఎత్తిచూపకుండా తప్పించుకు తిరుగుతాడు. ముఖ్యంగా తనకన్నా వయసులో పెద్దవారయినవారినీ, షరీఅత్ రీత్యా తాను తప్పనిసరిగా మర్యాదలను పాటించవలసిన వారినీ సంస్కరించడం మరీ కష్టం.

ధర్మసందేశదాత ఒక ప్రత్యేక స్థాయి, స్థానం కలిగి ఉంటాడు. అతను మానవుల సంస్కర్త, శిక్షకుడు, అతను దారితప్పిన వారికి సన్మార్గాన్ని చూపాలన్న ఉద్దేశంతో లేచి నిలబడతాడు. అయితే అతని ఈ స్థానమే అతన్ని పలుమార్లు తన పెద్దల సమక్షంలోకి రాకుండా ఆపివేస్తుంది. తానెవరి గౌరవమర్యాదలను పాటించడం ఆవశ్యకమో వారికి వారి లోటుపాట్లను గురించి ఎరుకపరచడంలో ఏదో అడ్డంకి ఉన్నట్లు భావిస్తాడు. దీనికి మరో కారణమూ ఉంది. మన సమాజంలో పెద్దల తప్పుల్ని తప్పుగా భావించడం, ప్రకటించడం కూడా అపరాధమే. వాస్తవానికి వారిని తప్పుదారి నుండి తప్పించడంలో ఎలాంటి జాప్యం చేయకుండా సరయిన దారి ఏదో చూపడమే వారి ఎడల మన శ్రేయోభిలాష, వినయవిధేయతలకు చిహ్నం. వారిని వినాశకరమయిన దారిన సాగిపోయేందుకు వదలిపెట్టడం వారి ఎడల ఎంతగా దుష్టచింతనో, ఆ వైఖరి వల్ల కలిగే దుష్పరిణామం ఎరిగినప్పటికీ వారికి ఎరుకపరచకపోవడం ఏ విధమయిన శ్రేయోభిలాషనో తెలుస్తూనే ఉంది.

సంతోషదాయకమయిన విషయమయినా, విషాదకరమయిన సందర్భమయినా మనం మొట్టమొదట మన కుటుంబ సభ్యుల్ని గుర్తు చేసుకుంటాము. పరలోకంలో సంభవించే సఫలతా నిష్ఫలతలలో మీకేమయినా నమ్మకమున్నట్లయితే సహజంగానే మీరు మీ కుటుంబ జనులకూ దీన్ని గురించి తెలియపరుస్తారు. మీ బంధువు ఎవరయినా నరకం వైపునకు సాగుతూ ఉన్నట్లయితే మీలో అతన్ని రక్షించే ఆత్రుత ఏమాత్రం లేకపోతే, కనీసం అతను నీటమునుగుతూ ఉంటే చూసినప్పుడు మీలో కలిగే ఆత్రుత అయినా మీలో కలగకపోతే భావమేమిటీ, మీరు స్వయాన నరకపు భయంకర రూపం గురించి ఎరుగరో లేదా మీకు మీ ఆప్తబంధువు పట్ల ప్రేమ లేదో, ఏదో ఒకటే సాధ్యం.

మీ సమక్షంలో మహనీయ ఇబ్రాహీమ్ (అ) ఉదాహరణ ఉంది. ఆయన తండ్రి

సాధారణమయిన అపరాధి కాదు, బహుదైవారాధన, విగ్రహారాధనకు లోనయి ఉండేవాడు. నేను నా స్వంత తండ్రికి ఏ విధంగా చెప్పగలను అని ఆలోచించలేదు హజ్రత్ ఇబ్రాహీమ్ (అ). నీవు అనుసరిస్తున్న తిరస్కార మార్గం, బహుదైవారాధన విధానం అది నిన్ను నేరుగా నరకానికి తీసుకు వెడుతుందని ఎలా చెప్పాలో అని సంశయించలేదు. దానికి భిన్నంగా ఆయన ఈ వైఖరికి కలిగే పరిణామాలను గురించి తన తండ్రికి స్పష్టమయిన పదాలలో హెచ్చరించారు.

إِذْ قَالَ لِأَبِيهِ يَٰٓأَبَتِ لِمَ تَعْبُدُ مَا لَا يَسْمَعُ وَلَا يُبْصِرُ وَلَا يُغْنِى عَنكَ شَيْـًٔا ۝ يَٰٓأَبَتِ إِنِّى قَدْ جَآءَنِى مِنَ ٱلْعِلْمِ مَا لَمْ يَأْتِكَ فَٱتَّبِعْنِىٓ أَهْدِكَ صِرَٰطًا سَوِيًّا ۝ يَٰٓأَبَتِ لَا تَعْبُدِ ٱلشَّيْطَٰنَ إِنَّ ٱلشَّيْطَٰنَ كَانَ لِلرَّحْمَٰنِ عَصِيًّا ۝ يَٰٓأَبَتِ إِنِّىٓ أَخَافُ أَن يَمَسَّكَ عَذَابٌ مِّنَ ٱلرَّحْمَٰنِ فَتَكُونَ لِلشَّيْطَٰنِ وَلِيًّا ۝ (مریم:۴۲-۴۵)

అప్పుడు అతను తన తండ్రితో ఇలా అన్నాడు, "తండ్రీ! వినలేని, కనలేని, మీకు ఏ పనినీ చేసిపెట్టలేని వాటిని మీరు ఎందుకు ఆరాధిస్తున్నారు? తండ్రీ! నా వద్దకు వచ్చిన జ్ఞానం మీ వద్దకు రాలేదు. మీరు నన్ను అనుసరించండి, నేను మీకు సరియైన మార్గం చూపుతాను. తండ్రీ! మీరు షైతానుకు దాస్యం చేయకండి. షైతాను కరుణామయుణ్ణి ధిక్కరించాడు. తండ్రీ! మీరు కరుణామయుని శిక్షకు గురి అవుతారేమో అని, షైతాను సహచరులైపోతారేమో అని నాకు భయంగా ఉంది." *(మర్యమ్:42-45)*

సరిగ్గా ఇదే విధంగా మహనీయ ముహమ్మద్ (స) కూడా తన కుటుంబం వారిని భయపెట్టే విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తించారు. రాబోతున్న భయానక దినం గురించి తన కుటుంబం వారిని హెచ్చరించారు. "నీవు నీ దగ్గరి బంధువుల్ని భయపెట్టు" అని దేవుని ఆదేశం అవతరించినప్పుడు ఆయన దాన్ని అమలుపరచిన విధానం హదీసుల్లో సవివరంగా పొందుపరచబడి ఉంది.

ఆయన తన తెగవారినందరినీ సమావేశపరిచారు. వారిలోని ప్రతి ఒక్క శాఖ వారిని పేరుపేరున సంబోధించి, "దేవుని శిక్ష రానున్నది. నేను అది రాక ముందే మీకు దాని సమాచారం అందజేస్తున్నాను. నా స్థితి సరిగ్గా ఓ వ్యక్తిలా ఉంది. అతనికి తెలుసు శత్రువు అతని కుటుంబంపైన దాడి చేయనున్నాడని. అతను ఆశగా మొరపెట్టుకుంటున్నాడు. జనులు అతని మాట వింటారని, ఆ దారి నుండి తప్పించుకోగలుగుతారని

ఆశిస్తున్నాడు. బనీ అబ్దుల్ ముత్తలిబ్, బనీ ఫహద్, బనీ లూయీ, మిమ్మల్ని మీరు దేవుని యాతన నుండి రక్షించుకోండి. మీ లాభనష్టాలు ఏవీ ఏమాత్రం నా చేతుల్లో లేవు. ఇంతకూ బంధుత్వం కారణంగా మీ హక్కు లేవో అవి నేను తప్పక నిర్వర్తిస్తున్నాను. నా కూతురు ఫాతిమా, నా మేనత్త సఫియా మిమ్మల్ని మీరున్నూ రక్షించుకోండి. నా వద్దనున్న ధన సామగ్రి ఇదో అర్పించుకుంటున్నాను. ఇందులో మీకు కావలసిందేదో తీసుకుని బాగా గుర్తుంచుకోండి; రేపు ప్రళయ దినాన నేను మీకు ఏ విధంగానూ ఉపకరించలేను.

*(బుఖారి, కితాబుత్తఫ్సీర్, ముస్లిమ్ కితాబుల్ ఈమాన్)*

మీ కుటుంబం ధర్మమార్గంలో మీతోపాటు తోడుగా ఉన్నట్లయితే దానిపైన సుస్థిరత, నిలకడ కనబరిచేలా కృషి చేయండి. దైవానికి కృతజ్ఞతలు అర్పించుకోండి. ఆయన మీ భారాన్ని ఒకదాన్ని తేలికపరిచాడు, అలాకాక మీ బంధుగణం ప్రపంచ వ్యామోహంలో బాగా మునిగి తేలుతున్న వారయినట్లయితే, దైవధర్మానికి విముఖులయి, తిరుగుబాటు దారులయి జీవిస్తూ ఉన్నట్లయితే, వారికి అలా స్పష్టంగా, అవసరమయితే ఆధారాలతో చెప్పి వేయండి, మీ వైఖరి దేవుని శిక్షకు పిలుపునిచ్చేదిగా, మిమ్మల్ని దేవుని కారుణ్యానికి దూరం చేసేదిగా ఉందని తెలుపండి. ప్రళయం వస్తుంది, నిస్సందేహంగా అది ఎదురవు తుంది, విచారకరమయిన విషయం ఏమిటంటే, మీకు దాని స్పృహే లేదు, మీరు దేవుని శిక్ష నుండి తప్పించుకునే ఏ విధానమూ చేపట్టలేదు అని వారికి చెప్పి వేయండి. ఇదే మీకు దేవుని ఆదేశం, దైవప్రవక్తల ఆదర్శం.

## పేట, పట్టణాల సంస్కరణ

ఇల్లు, కుటుంబాల సంస్కరణ తరువాత మీరు నివసిస్తున్న పేట, ఆ పట్టణాల సంస్కరణ మీ విధ్యుక్త ధర్మం, మీరు ఏ వాతావరణంలో పుట్టారో, పెరిగారో, యువకు లయ్యారో అది చేసిన మేలు మీపైన ఎంతో ఉంది. ఆ మేలు వల్ల ఏర్పడే ఆవశ్యకత ఏమిటంటే, అందులో దేవుని ధర్మాన్ని వ్యాపింపజేయాలి. అక్కడ నివసించే వారిని రానున్న భయానక దినంలో వచ్చే శిక్షను గురించి భయపెట్టాలి. దీనికి మీరు ఎంతగా సముచిత మయిన వారో, ఆ వాతావరణానికి బయటివాడు అంతగా సముచితం కాజాలడు.

మీకు సహజంగానే ఆ అవకాశాలు ప్రాప్తమయి ఉన్నాయి. మీ వాతావరణంలోని మానసిక స్థితి, అక్కడి పరిస్థితులు, ఆలోచనాత్మకమయిన, ఆచరణాత్మకమయిన మంచీ చెడులు మీకు బాగా తెలుసు, అందువల్ల మీరు వారి మధ్యన ఉత్తమమయిన ధర్మసందేశ కులుగా రూపొందగలరు. పైగా మీరు మీ స్వగ్రామంలో బాగా నిత్యపరిచితులయిన వారు,

మీ పట్ల అక్కడి జనులకు అపరిచితత్వం ఉండదు, అది పరాయి వ్యక్తి విషయంలో మటుకు తప్పక ఉంటుంది. దీని ప్రయోజనం ఏమిటంటే, మీ మాటను తమలోని వాడే అయిన ఒక వ్యక్తి మాటగా భావిస్తారు. మీరు ప్రేమగా చిత్తశుద్ధితో, సానుభూతితో వారి పరిస్థితులు, సమస్యల్ని దృష్టిలో ఉంచుకుని వారికి దైవధర్మాన్ని అందజేసినట్లయితే వారు అతి సులభంగా దాని వైపునకు మరలుతారని ఆశించడం తప్పు కాదు.

## చుట్టుప్రక్కల ప్రాంతం సంస్కరణ

మీరు మీ పట్టణంలో దైవధర్మాన్ని అందజేసిన తరువాత మీ పని ముగిసి పోయిందని తలపోయకండి. మీరు మీ చుట్టుపట్ల ప్రాంతంలోనూ ఇదే సేవ చేయవలసి ఉంటుంది. కాగా మీరు ఖుర్ఆన్‌లో చూస్తారు, దైవసందేశహరులు (స) మక్కా, మక్కా చుట్టుప్రక్కల ప్రాంతాలలో - ఉభయత్రా దైవాన్ని గురించి భయపెట్టే కార్యక్రమాన్ని నిర్వర్తించారు. పరిశీలించండి.

وَ كَذٰلِكَ اَوْحَيْنَآ اِلَيْكَ قُرْاٰنًا عَرَبِيًّا لِّتُنْذِرَ اُمَّ الْقُرٰى وَ مَنْ حَوْلَهَا ○ (الشورىٰ:٧)

ఇదే విధంగా మేము మీకు అరబీ ఖుర్ఆన్‌ని వహీ ద్వారా పంపాము, తద్వారా నీవు మక్కావాసులకు, మక్కా చుట్టుపట్ల నుండే వారినీ శిక్షను గురించి భయపెట్టాలని. *(అష్షూరా : 7)*

## ప్రపంచం మొత్తాన్ని సంస్కరించడం

దైవసందేశహరులు ముహమ్మద్ (స) మక్కా దాని చుట్టుపట్ల ప్రాంతంలోని జనవాసాలలో ధర్మసందేశాన్ని అందజేసిన తరువాత తన సందేశ వ్యాప్తి కార్యక్రమం ముగించలేదు. దాన్ని ప్రపంచమంతటా వ్యాపింపజేయడానికి ప్రయత్నాలు చేశారు. ఆయన సందేశమిస్తున్న ధర్మం ఏదో ప్రత్యేక జాతికి, ప్రత్యేక భూభాగానికీ పరిమిత మయింది కాదు, అది సమస్త లోకానికి వర్తించే ధర్మం. అందువల్లనే ఆయన్ని గురించి దివ్యఖుర్ఆన్‌లో ఇలా ప్రకటించడం జరిగింది:

وَ مَآ اَرْسَلْنٰكَ اِلَّا كَآفَّةً لِّلنَّاسِ بَشِيْرًا وَّ نَذِيْرًا ○ (سبا:٢٨)

మేము నిన్ను మానవులందరికీ (స్వర్గం) శుభవార్త అందజేసేవానిగా, నరకంను గురించి భయపెట్టేవానిగా చేసి పంపాము. *(సబా: 28)*

బాగా గుర్తుంచుకోండి, ఏ ధర్మమయితే సమస్త లోకానికి వర్తిస్తుందో దానికి సందేశ దాతలు మీరు. ఏ ప్రవక్త ప్రభవన సకల మానవాళి కొరకు జరిగిందో మీరు ఆయనకు వారసులు. అందువల్ల మీ బాధ్యత, విధ్యుక్త ధర్మమేమిటంటే, ఆ ధర్మాన్ని ప్రపంచమంతటా వ్యాపింపజేయడానికి ప్రయత్నించాలి. దాన్ని తిరస్కరించడం వల్ల కలిగే పరిణామాలను గురించి తెలిపే ప్రయత్నం చేయడం మీ బాధ్యత. అలా చేయకపోతే దైవం మీపై మోపిన విధిని నిర్వర్తించే బాధ్యతల నుండి విముక్తి పొందలేరు, మీరు మహనీయ ముహమ్మద్ పేరు చెప్పుకునేవారే అయినప్పటికీ సరయిన భావంలో ఆయనకు నిజవారసులు కాలేరు.

## ఒక అపోహ

ధర్మసందేశ వ్యాప్తికి పైన పేర్కొన్న క్రమపద్ధతి షరీఅత్‌లోనూ ప్రముఖమయింది, బుద్ధీ కూడా దాని ప్రాముఖ్యాన్ని అంగీకరిస్తుంది. అయితే అందులో ఏమాత్రం ముందూ వెనక చేయడం ధర్మసమ్మతమే కాదని దీని అర్థం కాదు. ఆ క్రమాన్ని వదలి ఎన్నడూ సందేశ వ్యాప్తి కార్యం చేపట్టడమే కుదరదు అనీ దీని భావం కాదు. ఈ క్రమం అవసరం కొద్దీ మార్పుకు లోనవడం సాధ్యమే. సందేశ ఆవశ్యకతల కనుగుణంగా అందులో మార్పు చేయడమూ సాధ్యమే.

ఈ క్రమం సందేశ వ్యాప్తిలో విభిన్న దశలుగా మన ముందుకు రాదు. ఒక దశ దాటిన తరువాతనే మరో దశ వస్తుందన్న నియమం లేదు. ఇది నిజానికి సందేశ వ్యాప్తిలో ఎదురయ్యే విభిన్న దిశలను సూచిస్తున్నది. వాస్తవానికి కొన్ని సందర్భాలలో సందేశదాత ఒకే సమయాన అనేక దిశలలో కృషి చేయవలసి ఉంటుంది. మీకు మీ ఇంటిలోనూ, కుటుంబంలోనూ ధర్మసందేశం అందజేసే అవకాశాలు, సౌలభ్యాలు ప్రాప్తమయి ఉన్నట్లే, అవకాశాలూ, ఈ సౌకర్యాలూ మీకు మహా జాతులను సంబోధించే విషయంలోనూ ప్రాప్తమవడం పూర్తిగా సుసాధ్యమయిన విషయమే. ఒక్కోసారి ధర్మసందేశ వ్యాప్తికి మీ ఇంటి వాతావరణం అనుకూలంగా లేకపోవచ్చు, బయటి పరిస్థితులు ఎంతో అను కూలంగా ఉండవచ్చు. ఇదీ సాధ్యమే.

ఇటువంటి సందర్భాలలో, ఇంకా ఇంటివారలు, కుటుంబంవారూ, తెగవారూ వీరందరిలో సందేశ వ్యాప్తి జరగనే లేదు అని తలపోసి ఈ ప్రాప్తమయిన అవకాశాలను వదలుకోవడం చాలా అవివేకం అనిపించుకుంటుంది. అంతేకాదు, మీరు మీ ఇంటి సంస్కరణలో నిమగ్నమయి ఉన్నా, కుటుంబం, తెగవారి సంస్కరణ కృషిని చేపట్టి ఉన్నా,

సందేశం, సంస్కరణల ఈ బృహత్తర పథకం ఎట్టి పరిస్థితిలోనూ మీరు మీ దృష్టిలో ఉంచుకునే ఉండాలి, వీలయిన స్థాయిలో దాన్ని నిర్వర్తిస్తూనే ఉండాలి.

ధర్మసందేశానికి సంబంధించిన క్రమం ఒకటి పేర్కొనడం జరిగింది. దాని భావం, ధర్మసందేశ వ్యాప్తి ఒక ప్రత్యేక పరిధిలో పూర్తి అయిన తరువాతనే రెండవ పరిధిలోకి ప్రవేశించాలన్నది కాదు. మీ ఇంటి సంస్కరణ పూర్తిగా జరిగిన తరువాతనే కుటుంబ సంస్కరణను మొదలుపెట్టాలని అర్థం కాదు. అలాగే మీ నగరంలో సందేశకార్యం పూర్తి కాకపోతే దేశవాసులకు ధర్మసందేశం అందజేయరాదని భావం కాదు. అసలు ఉద్దేశం ఏమిటంటే మనిషి, తాను ప్రపంచం మొత్తాన, లోకానికంతటికీ సందేశాన్ని అందజేయ వలసి ఉందన్న చింతలో తన ఇంటిని, కుటుంబాన్నీ, దగ్గరివారినీ మరచిపోతాడేమోనన్న భావంతో ఇలా అన్ని విషయాలూ స్పష్టపరచబడ్డాయి.

ఇది ఎంతయినా అసమంజసం, అహేతుకమయిన విషయం – ఒక వ్యక్తి ఇతరుల సంస్కరణకయితే పూనుకుని, తన భార్యాపిల్లల సంస్కరణ పట్ల అశ్రద్ధ చూపడం అన్నది, వారి ఎడల ఏమరుపాటుగా వ్యవహరించడం అన్నది చాలా తప్పయిన విధానం. దీన్ని గురించి అతన్ని ప్రశ్నించడం జరుగుతుంది. అయితే ఒకటి మాత్రం నిజం. ఈ తప్పు కారణంగా అతను ఇతరుల మధ్య జరుపుతున్న అతని సంస్కరణా కృషి, దేవుని దృష్టిలో నిందార్హమయినది కాదు. అది దాని స్థానాన ప్రశంసనీయమయినదే. దానికి ప్రశంస, ప్రతిఫలం ప్రాప్తమవడం కూడా సరయినదే.



# సందేశ వ్యాప్తి - సూత్రాలు, మర్యాదలు

ఖుర్‌ఆన్‌లోనూ, హదీసుల్లోనూ ఇస్లామ్ సందేశం అందజేయవలసిన ఆదేశం ఇవ్వబడిన చోటనే దాని సూత్రాలు, మర్యాదలూ తెలుపబడ్డాయి. కాని చాలా మంది సందేశ కార్యం చేసేవారు ఈ సూత్రాలేమిటో, వాటి మర్యాదలేమిటో ఎరుగరు, ఎరిగి ఉంటే వాటి ప్రాముఖ్యాన్ని గుర్తించరు. వాస్తవానికి ఇస్లామ్ సందేశ వ్యాప్తి అన్నది, ఖుర్‌ఆన్ హదీసుల్లోని విధానాల వల్లనే నిర్వర్తించడం సాధ్యమవుతుంది.

ఈ కార్యనిర్వహణకు వాటిలో కొన్ని విధానాలు నిర్వచింపబడి ఉన్నాయి. వీటిని కాదని రేయింబవళ్ళు మనిషి జనుల్ని దైవధర్మం వైపునకు పిలిచినా, ఆ మార్గంలో తన జీవితమే ధారపోసినా అతను సఫలత పొందిన సందేశదాతగా ఎన్నడూ రూపొందలేడు. వాస్తవంగా ఈ కార్యసిద్ధికి నిర్ణీతమయిన సూత్రాలను, మర్యాదలను మానివేసిన తరువాత ధర్మసేవ ఏమోగాని, సందేశానికి ఘోరమయిన నష్టం కలిగే ప్రమాదం మాత్రం ఉంటుంది. ఆ తరువాత ఎన్ని కాలాలకయినా ఆ నష్టాన్ని పూడ్చడం సాధ్యం కాకపోవచ్చు.

ఇస్లామ్ సందేశ క్రమంలో సందేశదాత దృష్టిలో ఉండవలసిన సూత్రాలూ, మర్యాదలు కొన్నేమో, ఇస్లామ్‌ను ఏ విధంగా ముందుంచాలన్నవి. ఇస్లామ్ జనుల ముందు దాని నిజస్వరూపంలో ప్రదర్శితమవ్వాలి. దాని ప్రత్యేకతలు పూర్తిగా నిలువగలగాలి. కొన్ని సూత్రాలేమో సంబోధితుని భావాలకు సంబంధించినవి. అతని ఈ భావాల దృష్ట్యానే సందేశదాత అతన్ని సంబోధిస్తాడు. దీని ఆధారంగానే సందేశకుడు తన సందేశ వైఖరిని నిర్ణయించుకుంటాడు. ధర్మంలో అతని భావాలకు ఏ విధమయిన ప్రాముఖ్యతనివ్వవలసి ఉంటుందో దాన్ని ఇస్తాడు.

కొన్ని సూత్రాల సంబంధం స్వయాన సందేశదాతతో ఉంటుంది. అతను ఈ సందేశాన్ని ఎంతవరకు అవగతపరచుకున్నాడు, ఎంత సంస్కారవంతంగా, ఎంత హుందాగా దాన్ని అందజేస్తాడు అన్న విషయాలతో ఉంటుంది. ఈ వ్యవహారంలో అతని జ్ఞానం, అవగాహన, నైతికత, శీల స్వభావాలు ఎంత ఉన్నతంగా ఉంటాయో అదే

స్థాయిలో ఇస్లామ్ స్వీకారయోగ్యమయ్యే అవకాశాలూ అధికమవుతాయి. ఇక్కడ మేము ఒక క్రమపద్ధతిలో ఆ సూత్రాలు, మర్యాదలు పొందుపరుస్తున్నాము.

## 1. ఇస్లామ్‌ను ఏ విధంగా అందజేయాలి?

ప్రప్రథమంగా ఈ ప్రశ్నను పరిశీలించండి, ప్రపంచం సమక్షంలో ఇస్లామ్‌ను ఏ విధంగా ముందుంచాలి. ఈ సందర్భంలో కొన్ని ప్రాథమిక విషయాలను దృష్టిలో ఉంచుకోవలసి ఉంటుంది.

## సందేశం సర్వసామాన్యం

అల్లాహ్ తన ధర్మాన్ని పంపింది, ఏ వ్యక్తి అయినా సరే దాన్ని స్వీకరించదలిస్తే సంతోషంగా స్వీకరించడానికే. ఇది ఏదో ఒక కుటుంబానికి, వర్గానికి చెందిన మీరాశీ కాదు. ఇది దీన్ని స్వీకరించిన ప్రతి వ్యక్తికీ స్వంతమయిపోతుంది. అందువల్ల దీని సందేశమూ సర్వసామాన్యమయినదయి ఉండాలి. ఇది సమస్త మానవులకూ వర్తించేలా ఉండాలి.

మీరు దీన్ని ఒక వ్యక్తి, లేక ఒక వర్గం సమక్షంలో తొలుత అందజేసి తరువాత మరో వ్యక్తి మరో వర్గం సమక్షంలో అందజేసినా తప్పు లేదు. మీకు దీని అనుమతి ఉంటుంది. మీరు ఇలా చేయడమూ అవసరమే. కాని ఈ సందేశాన్ని ఒక జాతీయ, లేక ఒక దేశానికి పరిమిత ఉద్యమం రూపంలో అందజేయడం మటుకు ఎంతమాత్రం సరయినది కాదు. అలాగే దీన్ని మానవులందరి మార్గబోధనకు మార్గంగా భావించడం కాక ఇది ఒక ప్రత్యేక జాతికి విజయాన్ని చేకూర్చే లేక ఒక ప్రత్యేక జాతి సంస్కరణను కోరే ప్రయత్నంగా జనం భావించేలా వ్యవహరించడమూ సరయినది కాదు.

ఈ సందేశం విషయంలో అసంఖ్యాక ప్రజలు దీనికి దూరమయి, దీనికి వంచితు లయిపోయేటటువంటి వాతావరణాన్ని సృష్టించడం ఈ సందేశాన్ని వక్రీకరించడం అవుతుంది, అంతేకాదు ఇది మానవాళి పట్ల ఘోరమయిన అత్యాచారం. ఒక వ్యక్తిని లేదా ఒక సమాజాన్ని దైవధర్మానికి దూరంచేయడం, ఆ వ్యక్తిని లేదా ఆ సమాజాన్ని శ్వాసించకుండా చేయడంకన్నా తీవ్రమయిన చర్య. ఎందుకంటే శ్వాసించకుండా నిర్బంధిస్తే కేవలం అతని తాత్కాలిక జీవితం అంతమయిపోవచ్చు. కాని దైవధర్మానికి వంచితుడయినట్లయితే అతను చిరకాలానికి సర్వనాశనమయిపోతాడు.

అయితే అత్యంత విచారకరమయిన విషయం ఏమిటంటే, దాన్ని నమ్మేవారు చాలా కాలంగా ఇటువంటి వైఖరే అవలంబిస్తున్నారు, దాని వల్ల ప్రపంచం ఈ ధర్మం కేవలం

వీరికే చెందిన ధర్మం అని అనుకుంటూ ఉంది. వారు తమ లాభనష్టాలను గురించే ఆలోచిస్తున్నారు, తమ పట్ల మాత్రమే తమకు ఆసక్తి ఉన్నట్లు వ్యవహరిస్తూ పనులు చేసుకుంటూ ఉంటారు. చివరికి తమ ధర్మాన్ని వారు ప్రచారం (తబ్లీగ్) చేసినా తమ వారి మధ్యనే చేసుకున్నారు. అంటే దైవధర్మం కేవలం వారి కొరకే ప్రత్యేకమన్న మాట. ఇతరులకెవరికీ అందులో వాటా లేదన్న మాట.

ఇస్లామ్ సందేశాన్ని అందజేసే ధ్యేయంతో నిలబడే వారు పాటించవలసిన మొట్టమొదటి విషయం ఏమిటంటే, వారు దాన్ని అందజేసే తీరు వల్ల అది ఏ ఒక్క ప్రత్యేక వర్గానికో చెందిన సంపదగా కానరాకూడదు. మానవాళి అంతా దాన్ని తన సొమ్ముగా భావించగలిగేలా దాన్ని ప్రదర్శించాలి. ఈ విషయాన్ని వారు కేవలం నోటితో చెప్పడమే కాదు, ఆచరణ ద్వారా అమలుపరచి కూడా నిరూపించాలి. వారు తమ వ్యవహారాలన్నింటిలో, ఈ విశ్వజనీన ధర్మాన్ని అనుసరించే వారికి తగినటువంటి వైఖరిని అవలంబించవలసి ఉంటుంది. అలా కాకపోయినట్లయితే వారు కేవలం నోటితో ఎన్ని వాదనలు చేసినా తాము ఏ ధర్మం వైపునకు పిలుపునిస్తున్నారో అది మానవాళి అంతటికీ చెందిన ధర్మమని ప్రపంచం నమ్మజాలదు.

దీనికి అవసరమయిన మొట్టమొదటి విషయం ఏమిటంటే, వారు అన్ని రకాల జాతి దురభిమానాల నుండి తమ ఆంతర్యాలను ప్రక్షాళించాలి. ప్రతి వ్యక్తితో సత్యం, సత్యతల ఆధారంగా వ్యవహారం జరపాలి. వారు ఎవరికీ అనుచితమయిన మద్దతును ప్రకటించి నిలబడకూడదు, మరెవరినీ అనవసరంగా వ్యతిరేకించనూరాదు, దానికి బదులు సత్యం, ధర్మం ఆచరించే ప్రతి వ్యక్తికీ తోడ్పాటు అందజేయాలి, అతను తమకు ఏపాటి అపరిచితుడయినాసరే. పూర్తిగా అసత్యవాది అయిన వ్యక్తి తమకు రక్తసంబంధీకుడే అయినా అతనికి వేరయి దూరమయిపోవాలి. వారి శత్రుత్వమయినా మైత్రి అయినా అంతా దైవధర్మానికి లోబడే ఉండాలి, ప్రపంచంలోని ఏ శక్తీ వారిని ఈ మార్గాన్నుండి చలింపజేయగలగకూడదు.

## జీవితం మొత్తాన్ని సంస్కరించగోరాలి

అల్లాహ్ కోరేదేమిటంటే, మానవుడు తన జీవితం మొత్తాన అల్లాహ్‌కు ఇష్టమయిన మార్గాన్ని అనుసరించాలన్నది. దీనికే ఆయన తన సందేశహరుల్ని పంపాడు. తన ధర్మాన్నీ అవతరింపజేశాడు. ధర్మసందేశకుడు దేవుని దాసులయిన మానవ సోదరుల మధ్య ఈ ధర్మంలోని ఈ ఆవశ్యకతను చాటడానికే లేచినిలబడతాడు. అతను జీవితంలోని ప్రతి వ్యవహారంలోనూ దైవధర్మానుసరణకే పిలుపునివ్వాలి. కాని ఎంత విచారకరమయిన

వాస్తవం, సుదీర్ఘకాలం నుండి ఈ ధర్మాన్ని అవలంబించే వారు దీన్ని పరిచయం చేస్తున్న తీరు ఎంతో బాధాకరమయింది. అది నిజ జీవితంతో ఎటువంటి సంబంధంలేని, కొన్ని అధి భౌతిక సిద్ధాంతాలే అని వారు నిరూపిస్తున్నారు. అందువల్లనే వారిలోని మేధావులు, చదువుకున్నవారు, జ్ఞానులు వ్రాసే రచనల్లోనూ, వారి ప్రసంగాల్లోనూ, పరమ ప్రభువు అల్లాహ్ కోరుతున్నదేమిటో, ఆయన ఇష్టాన్ని నెరవేర్చే విధానమేదో అన్న అంశాలు కానరావడం చాలా అరుదు.

అయితే వారు తమ ప్రావీణ్య పటిమలు బాగా వెచ్చించే అంశాలు- ఆత్మ అనాదియా లేక పుట్టించబడిందా? గగన వీధుల్లో ప్రకృతి విపరీతాలు, మార్పులు సంభవమా కాదా? అన్నవి. ఇటువంటి విషయాల పట్ల ఆసక్తి చూపేవారు సయితం బహు స్వల్పంగా ఉంటారు. మరెవరికి ఆసక్తి కలుగుతుందో వారికి కూడా ఇవన్నీ పరిశోధన, ఆవిష్కరణల విషయాలయితే కాగలవు కాని ఆ రిసెర్చ్ వల్ల వారి ఆచరణాత్మక జీవితంలో ఎటువంటి మార్పయినా రావడం అన్నది కల్ల. పోతే సామాన్య జనులకయితే ఈ చర్యలు అసలు పూర్తిగా నిరర్ధకమయినవి.

ఇదయితే ముస్లిముల పెద్దలు, మేధావులు, జ్ఞానుల విషయం. ముస్లిముల అత్యధిక ప్రజల పరిస్థితి ఏమిటంటే, వారు దైవధర్మం గురించి తమ నోటితో కాదేమోకాని ఆచరణ ద్వారా, కొన్ని పండుగలు, ప్రత్యేక సందర్భాలలో కొన్ని జీవం లేని ఆచారాలు పాటిస్తేసరి, తమ బాధ్యత నెరవేరుతుందన్న భావం వ్యక్తం చేస్తారు. ఈ పరిచయం, ధర్మంలోని అపార మయిన సౌందర్యాన్ని దోచుకుంది. దాని సహజమయిన ఆకర్షణ అంతమయిపోయింది. ప్రతి జాతిలోనూ అటువంటి ఆచారాలున్నాయి. మీకు మీ ఆచారాలు ఎలా ప్రియప్రద మయినవో ఆ జాతులకూ వారి ఆచారాలు అలాగే ప్రియమయినవి. వారు వాటిని వదలుకుని మీ ఆచారాలను ఎందుకు పాటించాలి, అలా చేయడానికి ఎటువంటి హేతుబద్ధమయిన కారణమూ ముందుకు రానప్పుడు?

దైవగ్రంథం దాని నిజరూపంలో మన వద్ద ఉన్నదన్నది నిస్సందేహంగా వాస్తవం. దీని ద్వారా మానవుడు అతి సులువుగా దైవధర్మాన్ని తెలుసుకోగలడు. అయితే ఈ గ్రంథం ఎడల ఈ గ్రంథాన్ని నమ్మేవారి వైఖరి ఈ మార్గంలోనూ అవాంతరంగా రూపొందింది. వారు దీన్ని ప్రజల ముందు పరిచయం చేసిన తీరు ప్రకారం, అది అర్థం చేసుకోకుండా పఠించేది, పెళ్ళి పేరంటాల సందర్భాలలో పారాయణం చేసేది, అవసాన దశలోని బాధను నివారించడానికి, మృతుని పాపాల మన్నింపునకై లేక భూత ప్రేతాలను పారద్రోలడానికి వచ్చినదని మాత్రమే ప్రపంచానికి తెలుసు.

ఈ 'ఉన్నత ఆశయాల' కోసం ప్రపంచంలో అనేక మత గ్రంథాలున్నాయి. అలాంటప్పుడు ప్రపంచ ప్రజలు ఈ ప్రత్యేక గ్రంథం వైపునకు మరలే అవసరం ఏమిటీ? దాన్ని నమ్మేవారు దాన్ని దైవగ్రంథమని అంటారు. ఇప్పుడు సందేశ వ్యాప్తి కోసం పనిచేయగోరే వారు తమ వారు, పరాయి వారు ఉభయుల్లో ప్రబలి ఉన్న ఈ ఆలోచనా తీరును మార్చవలసి ఉంటుంది. ఇహపరాలలో మానవ సాంగత్యం ఈ గ్రంథంతోనే ముడివడి ఉందని బోధపరచాలి. వారు దాన్ని స్వీకరిస్తే వారి సమస్యలన్నీ అతి సునాయాసంగా పరిష్కృతమయిపోతాయి– ఎప్పటి నుంచో ఈ పరిష్కారం కొరకే వేచి ఉన్నట్లు. కాని వారు దీన్ని తిరస్కరించినట్లయితే తమ సమస్యల్ని పరిష్కరించుకోలేక పోవడమేకాక, వారి పరలోకం కూడా సర్వనాశనమయిపోతుంది.

## సిద్ధాంతాలకు ప్రాముఖ్యాన్నివ్వాలి

ఇస్లామ్‌లో కొన్ని సూత్రాలున్నాయి. ఆ సూత్రాల నుండి శాఖోపశాఖలుగా అనేక వివరాలు వెలికి వచ్చాయి. సూత్రాలను అంగీకరించిన వ్యక్తి వాటి వివరాలను సులభంగా కాదనలేడు. కాని ఎవరయితే ఈ సూత్రాలనే అంగీకరించరో వారు వీటి ఆధారంగా ఏర్పడిన వివరాల వ్యవస్థనంతటినీ సొంతం నిరాకరిస్తాడు. అందువల్ల ఇస్లామ్ దృష్టిలో సయితం సిద్ధాంతాలు సూత్రాలకు అధిక ప్రాముఖ్యముంది. అది ఆంశిక విషయాలు, వివరాలకన్నా వీటికే ప్రాధాన్యతనిస్తుంది.

కాని గతంలో కొంతకాలంగా ఇస్లామ్ సేవ పేరిట జరిగేదంతా సిద్ధాంతాల వైపుగాకాక అంశిక విషయాల వైపుగా జరుగుతోంది. ఏ సిద్ధాంతాల ఆధారంగా దైవధర్మం నెలకొని ఉందో వాటిని ప్రజల సమక్షంలో రూఢీపరిచే ప్రయత్నమేదీ జరగలేదు. కాని ధర్మంలోని చిన్న చిన్న విషయాలలో ఒక్కొక్క దాని పట్ల అమితమయిన శ్రమతో, సూక్ష్మ దృష్టితో కృషి చేయడం జరిగింది. పెద్ద పెద్ద ఘనమయిన పుస్తకాలు వ్రాయబడ్డాయి.

ప్రపంచం దేవుని ఉనికినే కాదన్నది, ప్రవక్త దైవదౌత్యాన్ని తిరస్కరించింది. నాస్తికత్వం, భౌతికతత్వం – విశ్వాసాలను, ఆలోచనల్ని, సంస్కృతీ నాగరికతల్ని, శాస్త్రాలు విద్యల్ని, పరిపాలనను, రాజకీయాలను ప్రతి జీవన విధానాన్ని ఆక్రమించుకున్నాయి. చివరికి ఇస్లామ్‌ను దైవధర్మమని నమ్మే చాలా మంది, దాని సత్యత పట్ల అనుమానాలకు కుశంకులకు గురయ్యారు, చాలా మంది ధర్మాన్ని వదలి భ్రష్టులూ అయ్యారు. కాని మా 'ధార్మిక సేవకులు' ఈ దాడిని దాటవేశారు. ధర్మంలోని భూమికలయిన సిద్ధాంతాలు ప్రపంచంలో ఏ మూలనా చర్చనీయాంశం కావన్నట్టు వ్యవహరించారు. అయితే

నమాజ్‌లో రఫయె యద్దైన్, ఆమీన్ బిల్ జహ్రీ వంటి సమస్యల పరిష్కారాలకే తమ పోరాట పటిమను ధారపోయసాగారు.

కొన్ని సందర్భాలలో ఇటువంటి చర్యలూ అవసరమవుతాయన్న విషయమూ నిస్సంకోచంగా వాస్తవమే, కాని అవి దైవాన్ని, ప్రవక్తనూ నమ్మేవారికే పరిమితం. కాని అసలు ధర్మం, విశ్వాసాలే డోలాయమానమయిపోతున్న చోట వుజూ గుస్ల్‌కు సంబంధించిన వివరాలు అందజేయడంలోగల అర్థమేముంది?

నిస్సందేహంగా ఇస్లామ్ సేవకులందరూ ఇలాంటి చిన్న చిన్న విషయాలలోనే నిమగ్నులయిపోయారన్నదీ వాస్తవం కాదు. ధార్మిక మూల్యాల పటిష్టతకు ఎటువంటి కృషి జరగలేదన్నదీ నిజం కాదు. ఈ రంగంలోనూ అనేక ప్రయత్నాలు జరిగాయన్నదీ వాస్తవమే, ఆ ప్రయత్నాలలో కొన్ని చాలా విలువయినవీ జరిగాయి. అయినప్పటికీ ఈ ప్రయత్నాలు ఆధునిక కాలపు శాస్త్రీయత, చింతనాత్మక ప్రమాణానికి చాలా అల్పమయినవన్న విషయాన్నీ కాదనలేము. నేటి మానసిక, ఆలోచనాత్మక మనిషిని తృప్తిపరిచే సరకు అందులో లేదన్నదీ వాస్తవమే. కనుక నేడు ఇస్లామ్ సేవకులు ఈ కొరతను తీర్చే ప్రయత్నం పూర్తిగా చేయడం అవసరం. లేకపోతే నేడు ఇస్లామ్ ఏ ఉన్నత స్థాయి సేవను కాంక్షిస్తుందో అది నెరవేరదు.

ధర్మసందేశ వ్యాప్తికి సరయిన పద్ధతి ఏమిటంటే, మొదట ధర్మానికి మూలాధారాలయిన విశ్వాసాలను, సిద్ధాంతాలను పటిష్టపరచాలి. ఆ తరువాత నిమ్నవిషయాల్లో దేనికి ఎంత ప్రాధాన్యత ధర్మంలో ఇవ్వబడిందో అంతే ప్రాధాన్యత దానికి ఇవ్వాలి. దానికి ధర్మంలో యదార్థ రూపంలో ఏ స్థానమివ్వబడిందో ఆ స్థానమే దానికి ఇవ్వాలి. అందులో ఏకాస్తా మన పక్షాన తగ్గింపూ జరగరాదు, పెంచడమూ జరగరాదు. ఒక వ్యక్తి ఆంతర్యంలో ధర్మానికి మూలాధారాలయిన విశ్వాసాలను సిద్ధాంతాలను పటిష్టంగా పాదుకోనివ్వకనే ఇతర నిమ్న విషయాలు అసంఖ్యాకమయిన వాటి పట్ల వివరాలతో సహా సంతృప్తపరిచే ప్రయత్నించగోరితే అందులో మీ సమయం శక్తీ వృథా అవడమేకాక పునాదుల్లేని ఒక కట్టడాన్ని నిర్మించిన వారవుతారు. ఒక చిన్న గాలి తెర చాలు, దాన్ని నేలమట్టం చేయడానికి.

## ధర్మంలోని మూలసారాన్ని జనింపజేయాలి

ఇస్లామ్ మూలసారం ఒకటుంది, ఒకటి దాని బాహ్యచక్రం. దాని మూలసారం, ఆత్మ, మానవునిలో దేవునికి విధేయతా భావం, దాస్యభావం జనించడం. మనిషి దేవుని ఆదేశానికి ప్రతి దానికీ తలవంచేందుకు, దైవాజ్ఞల్ని పాలించేందుకు సిద్ధమవ్వాలి. ఇస్లామ్

బాహ్యరూపం దాని షరీఅత్ వ్యవస్థ. అందులో మానవుని సకల ఆచరణలకు ప్రత్యేక నియమాలు నిర్దిష్టపరచబడతాయి. ఇస్లామ్ సందేశ వ్యాప్తి సవ్యంగా జరగాలంటే మీరు దాని బాహ్యరూపానికి ప్రాధాన్యతనివ్వడానికి బదులు దాని ఆత్మను, నిజసారాన్ని మనిషిలో జనింపజేసే కృషి చేయాలి. ఆ నిజభావన, మూలభావన మనిషిలో జాగృతమయి నట్లయితే అతనే స్వయంగా ప్రతి విషయంలోనూ దేవుని అభీష్టాన్ని నెరవేర్చే ప్రయత్నం చేస్తాడు. కాని ఆ మూలసారం భావనే అతనిలో జనించకపోతే అడుగడుగునా అతను ఇస్లామ్‌కు దూరమయ్యే ప్రమాదం అనునిత్యం ఉంటుంది.

అంతేకాదు, ఇస్లామ్ నిజసారం మనసుకెక్కకపోతే మరో నష్టం కలిగే అవకాశమూ ఉంది. ఇస్లామ్ మూలసారం, ఊపిరి, ప్రాణం, జీవం లోపించిన వ్యక్తిని ఎవరినయినా షరీఅత్‌లోని ఒక అంశానికి కట్టుబడేలా చేసినట్లయితే అతను అలవాటుగా దానికి కట్టుబడిపోతాడు. అయితే మరే ఇతర అంశాన్ని పాటించడం అతనికి బాధగా పరిణ మిస్తుంది. ప్రారంభంలో ఏ షరీఅత్ ఆదేశాలనయితే మీరు అతనికి ఉపదేశించి పాటింప జేస్తారో వాటినయితే అతను పటిష్టంగా అనుసరిస్తాడు. కాని ఇతర విషయాలలో ఇస్లామ్ కోరే ఆవశ్యకతలేమిటో తెలుసుకునే ఆసక్తి అతనిలో ఏమాత్రం జనించదు. ఈ మాట కేవలం ఒక సైద్ధాంతిక విషయం కాదు, ఆచరణాత్మకంగా కానవస్తూనే ఉంటుంది. దైవధర్మం మానవులలో ఎటువంటి ధార్మిక జీవాన్ని సృజించగోరుతుందో దాన్ని సృజిం చకుండా ఏ వ్యక్తుల్లో కొన్ని షరీఅత్ నియమాలను అభ్యాసం ద్వారా నేర్పి వదలివేయడం జరుగుతుందో వారు ఆ అంశాలనయితే ఎట్టి పరిస్థితుల్లోనూ వదలుకోవడానికి ఇష్టపడరు. కాని అసంఖ్యాకమయిన ఇతర విషయాల్లో, ప్రముఖమయిన విషయాల్లో షరీఅత్ ఆదేశాలను పాటించడం పట్ల ఏమరుపాటుకు గురయిపోతారు. అసలు ఆ విషయాలను అనుసరించే ఆదేశాలే లేనట్లుగా వ్యవహరిస్తారు.

## 2. సంబోధితులు

ఇస్లామ్ సందేశం అందజేయడానికి ప్రప్రథమంగా సంబోధితుని మనస్తత్వాన్ని, అతని మానసిక మొగ్గుదలను అర్థం చేసుకోవడం అవసరం. సంబోధితుడు ఇస్లామ్‌ను తిరస్కరించేవాడా లేక దాన్ని సమ్మతించేవాడా, అతని అంగీకారమయినా, అనంగీకార మయినా ఏ స్థాయిలో ఉందో, ఏ విధమయినదో తెలుసుకోనిదే మీరు అతనికి సందేశాన్ని అందజేస్తూ సంబోధించలేరు, సంబోధించి ఫలితమూ సాధించలేరు. అటువంటి పరిస్థితిలో కళ్ళుమూసుకుని, తెలియని గురికి బాణం వదలినట్లవుతుంది, శక్తి వృథా చేసినట్లవుతుంది.

## సంబోధితులు, భిన్నస్థితిగతులు

దైవధర్మం విషయంలో అందరూ ఒకే విధంగా వ్యవహరించరు. కొందరు స్వయంగానే దాన్ని అన్వేషిస్తూ ఉంటారు. వారికి ఆ సందేశం అందినప్పుడు వారు దాని వద్దకు; దప్పిగొన్నవాడు నీటి వద్దకు పరిగెత్తినట్టు గెంతుతూ వస్తారు. ఆ సందేశం అటువంటి వారి మధ్య అలా తెలియడమే చాలు వారు దాన్ని ఒక్కపట్టునే వచ్చి స్వీకరిస్తారు. ఇటువంటి వారు తమ సవ్యమయిన నైజం వల్ల దైవధర్మం తప్ప మరోదాన్ని ఎన్నటికీ మనసారా స్వీకరించరు. ఎప్పుడయినా పరిస్థితుల ప్రభావం వల్ల మరో మార్గాన పడినా తమ తప్పు బహు స్వల్పకాలంలోనే తెలుసుకుంటారు. తెలుసుకున్న వెంటనే వెనకా ముందూ ఆలోచించకుండా దాని వలయం నుండి బయటపడతారు, దాన్ని తిరస్కరిస్తారు, పరిత్యజిస్తారు. ఇటువంటి వారిని నిజధర్మం వైపునకు పిలువడానికి సందేశకునికి ఎంతో అధికంగా శ్రమపడనవసరముండదు. ధర్మసందేశం వారి చెవులకు సోకగానే వారు స్వయంగా ధర్మం వైపునకు పరుగు పరుగున వస్తారు. నిరాధారమయిన, పునాదుల్లేని సిద్ధాంతాన నిలకడగా గడపడం వారి తత్వానికి నైజానికీ పొసగని విషయం.

కొందరు ధర్మాన్ని వ్యతిరేకిస్తారు. వారి ఈ వ్యతిరేకత సూత్రప్రాయమయింది, సైద్ధాంతికమయింది. ధర్మాన్ని తిరస్కరించడానికి కాదు వారు దాన్ని వ్యతిరేకించేది, ధర్మం పట్ల సత్యత వారికి ఇంకా విశదం కాలేకపోవడం వల్ల వారు వ్యతిరేకిస్తారు. వారికి ధర్మం సత్యత ప్రస్ఫుటమయినట్లయితే వారు ప్రతి బంధనాన్నీ తెంచి వేస్తారు, ధర్మాన్ని ఆశ్రయిస్తారు, దాన్ని తాను పోగొట్టుకున్న బిడ్డను తల్లి చాలా కాలం తరువాత చూసినప్పటి భావాతిశయంతో తమ ఆంతర్యానికి హత్తుకుంటారు. ఇటువంటి వారి విషయంలో సందేశకుడు వారికి ధర్మం పట్ల సత్యతను విశదపరచి నిదర్శనాలను చూపెట్టాలి, వారికి అటువంటి ఆధారాలు పరిచయం చేయాలి. అయితే దీనికి తార్కికులు అవలంబించే విధానాలను అవలంబించరాదు.

తార్కికులు తమ వాదనల నిరూపణకు అనుసరించే విధానాల వల్ల ఎదుటి వారి నోళ్ళయితే మూయవచ్చు, వారు ఈ వాదోపవాదాలను, చర్చను వద్దనుకుని మీకు ఓ దండం, మీ చర్చకూ ఓ దండం అని పారిపోనూ వచ్చు. విజయ గర్వంతో మీ మెడ నిక్కబొడుచుకోనూ వచ్చు కాని ఎదుటి వ్యక్తి హృదయ కవాటాలు మీ సందేశం కొరకు తెరచుకోవు. ధర్మసందేశకునికి ఈ విధానం సరయినది కాదు. దైవధర్మ సత్యత నిరూపణకు ఈ విధానం సరయినది కాదు. దైవధర్మ సత్యత నిరూపణకు ఈ విధానం ఆవశ్యకతా లేదు. అతని విధానం సంబోధితుని హృదయ కవాటాలను తట్టి తెరపించాలి, అతనిలో నిద్రాణమయి ఉన్న అంతరాత్మను మేల్కొలపాలి. అతని మనస్సును, మస్తిష్కాన్నీ

ప్రభావితం చేసే, సంతృప్తి కలిగించే, అతన్ని అప్రయత్నంగా దైవధర్మం వైపునకు·ఆకర్షితం చేసే పద్ధతిని అవలంబించాలి. దైవధర్మం వాస్తవానికి ఈ విశ్వనైజంతో, మానవ ప్రకృతితో సామరస్యం, సహజ బాంధవ్యం, పూర్తి సానుకూలత కలిగి ఉంటుంది. మానవుడు దాన్ని అవలంబించినప్పుడల్లా విజయమే పొందాడు, సాఫల్యమే సాధించాడు. దాన్ని తిరస్కరించి నప్పుడే దేవుని ఆగ్రహానికి అభిశాపానికి గురయ్యాడు. ఈ వాస్తవాన్ని మీరు మీ వాదనకు ఆధారంగా, నిదర్శనంగా రూపొందించగలిగారంటే చాలు ఏ సౌజన్యశీలుడూ సామంజస్యత ప్రియుడూ దాన్ని కాదనలేడు.

ధర్మాన్ని తిరస్కరించేవారు కొందరు ఏదయినా సహేతుకమయిన కారణం వల్ల దాన్ని తిరస్కరించరు. ఆ తిరస్కారం వెనక అనేక ప్రేరకాలుంటాయి. వారు దాన్ని తిరస్కరించేది అది వారికి ఇంకా బోధపడలేదని కాదు, ఎట్టి పరిస్థితిలోనూ దాన్ని నమ్మ కూడదని నిర్ణయించుకున్నారు కాబట్టి. సందేశకుడు వారి మధ్యన, వారి వ్యతిరేకతలకు కారణాలు ప్రస్ఫుటమయి బయటకు వచ్చినంత వరకే ధర్మ ప్రచార కార్యక్రమం సాగనివ్వాలి. అవి ముందుకు వచ్చిన తరువాత, వాటిలో చిత్తశుద్ధి లేదన్న విషయం బహిర్గతమయిన తరువాత వారి విషయంలో సమయం వృధా చేయకుండా, సత్యాన్ని స్వీకరించేందుకు మొగ్గుదల చూపే వైపున శ్రద్ధ చూపడం మంచిది.

కొందరికి ఇస్లామ్ సిద్ధాంతాలు సూత్రాల పట్ల ఎటువంటి వ్యతిరేకతా ఉండదు. కాని దాని సహజమయిన తప్పనిసరి ఆవశ్యకతలను అంగీకరించడానికి వారు సిద్ధంకారు. ఇటువంటి వారి సమక్షంలో ఇస్లామ్ మౌలిక సత్యాలను, సూత్రాలను గురించి సుదీర్ఘంగా చర్చించడం వృధా అవుతుంది. వారికి ఇస్లామ్ పరిచయం చేయడంతోపాటు తద్వారా వారు దాన్ని అంగీకరించిన తరువాత దాని ఆవశ్యకతల్ని ఆచరించడానికి నిరాకరించకుండా ఉండేలా చేయగలగాలి.

కొందరు ఈ ఆవశ్యకతలేమిటో అసలే ఎరుగనివారుంటారు. ఇటువంటి వారికి ఆ ఆవశ్యకతలేమిటో తెలుపడమే చాలు, వారు వాటి ప్రకారం ఆచరించడానికి సిద్ధమవు తారు. కొందరు ఇస్లామ్‌ను పూర్తిగా అవగతం చేసుకుని దాని పట్ల పూర్తిగా ఏకీభవించి నప్పటికీ ఆచరణాత్మకంగా దాని పట్ల తోడ్పాటును అందజేయరు. ఇటువంటి వారి విషయంలో సందేశకుడు ప్రేరణతోపాటు భయభక్తుల భావనల్ని రేపవలసి ఉంటుంది. దైవధర్మాన్ని అనుసరిస్తే కలిగే అత్యుత్తమ పరిణామం గురించి, దాని పరిత్యాగం వల్ల కలిగే భయంకరమయిన దుష్పరిణామాలను గురించి తెలుపవలసి ఉంటుంది.

కొందరితో సందేశకుడు విభిన్న విషయాలను చర్చించవలసి ఉంటుంది. అయితే ఈ చర్చను తర్కవాదంగా, వాదోపవాదాలుగా కాక అవగాహనా సదస్సుగా మలచాలి, అవి అవగాహనకు సోపానాలుగా మారాలి. తర్కవాదనల్లో ఎదుటి వ్యక్తిని తమ ప్రతివాదిగా వ్యతిరేకిగా భావించి అతని ప్రతి మాటను ఖండించే ప్రయత్నం జరుగుతుంది. ఎదుటి వ్యక్తి సత్యవాక్కు పలికినప్పటికీ దాన్ని వ్యతిరేకించడమే వాదనలో ముఖ్యమయి ఉంటుంది. కాని సందేశకుడు ఇటువంటి వైఖరిని అవలంబించనూ లేదు, అవలంబించ కూడదు కూడా. అతను అడుగడుగునా ఒక సత్యప్రియునిలా తన భూమికను నిర్వర్తించవలసి ఉంటుంది. ఎదుటి వ్యక్తి పలికే దానిలో సత్యం ఉన్నట్లయితే దాన్ని సంతోషంగా, ఆనందంగా స్వీకరించవలసి ఉంటుంది. దాన్ని సత్యంగా ప్రకటించవలసి ఉంటుంది. మరే విషయమయితే మిథ్య అయి ఉంటుందో దాన్ని మిథ్య, అసత్యంగానే సంస్కారవంతంగా సౌజన్యంగా ఖండించవలసి ఉంటుంది. ఎంతో వివేచన, ఔచిత్యంతో అతని మనస్సును మస్తిష్కాన్నీ సంస్కరించే ప్రయత్నం చేయాలి. ఒకరిలో ఈ సౌజన్యత, గంభీరతలు, ఔచితీవిజ్ఞతలు లేకపోయినట్లయితే, అవి ఇంకా జనించలేకపోతే అటువంటి వారు ఇస్లామ్ సందేశకుని స్థాయిని చేరుకోలేదన్న మాట. వారు ఇంకా ఎంతో సాధన చేయవలసి ఉందన్న మాట.

## జాతి నాయకులను సంబోధించడం

సందేశాన్ని వినేవారిలో లేక సంబోధితుల్లో కొందరు నాయకత్వం, నేతృత్వపు స్థానం కలిగి ఉంటారు. అత్యధిక ప్రజలు వారి వెనకాల అనుసరించేవారుంటారు. సందేశకుడు ఈ నాయకుల్లో, వారి అనుయాయుల్లో ఎవరెవరు ధర్మం పట్ల ఏమరుపాటుకు లోనయి ఉన్నారో వారందరికీ ధర్మ సందేశం చేరవేయాలని అనుకుంటే అదొక శుభకర మయిన ఉద్దేశమే, సందేహం లేదు. కాని ఆచరణాత్మకంగా అది సాధ్యమయ్యే విషయం కాదు. మనిషి శక్తులు, సామర్థ్యాలు పరిమితమయినవి. అతను ఒక ప్రత్యేక పరిధిలోనే పనిచేయగలుగుతాడు. అతని సమక్షంలో ఇక రెండు మార్గాలున్నాయి. అతను తన వాతావరణాన్ని, జనసామాన్యాన్ని ముందుకు తీసుకువెడుతున్న నాయకుల్ని ఉపేక్షించడం, జనసామాన్యంలో సందేశ ప్రచారం చెయ్యడం. రెండవ మార్గం, మూలతః తత్సమయ నాయకులను సంబోధించి దానితోపాటు సాధ్యమయినంతమేర సామాన్య జనుల్లో ఈ సందేశ విస్తృతికి కృషి జరపడం.

ఈ రెండవ విధానమే దైవప్రవక్తల, సందేశహరుల విధానం. వారు తొలుత జాతి నాయకులనే సంబోధిస్తారు, లీడర్లకే పిలుపునిస్తారు. వారు తమ శక్తి నుంచే ఒకసారి వారిని సంస్కరించి సన్మార్గాన తేవడానికి వినియోగిస్తారు. వారిలో ఒక్క వ్యక్తి అయినా

సరే దైవధర్మాన్ని చిత్తశుద్ధితో స్వీకరించి అనుసరిస్తే తద్వారా అనేక మంది ధర్మావలంబనకు మార్గం సుగమమవుతుంది. వారు తమ నాయకత్వపు సామర్థ్యం వల్ల, ప్రజల్లో తమ పలుకుబడి వల్ల ధర్మసందేశ విస్తృతికి సామాన్య మనుషుల ఒక సంస్థ కూడా చేయలేని పనిని చేసి వేయగలరు. ఈ విధంగా సందేశకుడు సంవత్సరాల తరబడి చేసే కృషి కొన్ని నెలల్లోనే నెరవేరుతుంది. వాస్తవంగా ఒక సందేశం సమాజంలోని ఉన్నత శ్రేణి మానవులలో చోటు కల్పించుకోనంత వరకు ఆ సమాజాన్ని ఆవరించడం అసాధ్య విషయం.

దైవసందేశహరులు సందేశ ప్రచారంలో అపారమయిన ప్రజ్ఞాపాటవాలు గలవారయి ఉంటారు. అందువల్ల వారు తమ జాతి నాయకుల్ని లీడర్లను అతిసునాయాసంగా సంబోధించగలుగుతారు, అలా వారు విజయమూ సాధించగలుగుతారు. అయితే ఇప్పుడు ఈ కార్యభారం నిర్వహించవలసిన వారు ముస్లిమ్ సముదాయంలోనివారు. ఈ సముదాయంలో తక్కువ సామర్థ్యమున్నవారూ ఉన్నారు, ఎక్కువ సామర్థ్యమున్నవారూ ఉన్నారు. సమకాలీన నాయకుల్ని సంబోధించే అవకాశాలున్నవారూ ఉన్నారు, ఇటువంటి అవకాశాలకు అసలే నోచుకోని వారూ ఉన్నారు. తత్కారణంగా ఏ వ్యక్తికి ఎటువంటి సామర్థ్యం యోగ్యతలున్నాయో, ఎవరికి ఎన్నెన్ని ఏ మేరకు అవకాశాలున్నాయో వాటి కనుగుణంగానే తన కార్యపరిధిని నిర్ణయించుకునేందుకు బద్ధుడయి ఉన్నాడు. ఆ పరిధిలోనే అతనికి సందేశ వ్యాప్తి సులభతరమవుతోంది.

అయితే ఒక విషయం మనసులో పదిలంగా ఉండాలి. తన శక్తిసామర్థ్యాలను అంచనా వేయడంలో సందేశకుడు ఎటువంటి ఆత్మన్యూనతా భావానికి గురవకూడదు. ఏది ఏమయినా ఒకటి మాత్రం సత్యమని అతను విస్మరించరాదు. అతని వద్ద ఉన్నది సత్యం. మరెవరయితే సత్యాన్ని నిరోధిస్తున్నారో వారు ఎంతటి మహామహులయినా వారి పునాదులు సూత్రప్రాయంగా బలహీనమయినవి. అందువల్ల ధర్మసందేశ ప్రదాత తన శక్తిసామర్థ్యాలకన్నా ఎత్తయిన స్థాయిలోనే తన కార్యపరిధిని అన్వేషించుకునే ప్రయత్నం చేయాలి. తనకు ఎప్పుడు ఇటువంటి అవకాశం కలిగినా తన మాటను అందజేయడంలో జంక కూడదు, వెనుకాడ కూడదు.

ఈ మార్గాన అతనికి ప్రారంభంలో కష్టాలే అధికంగా ఎదురవుతాయి. అయితే ఒకటి మాత్రం వాస్తవం, కష్టాలు, కడగండ్లే మనిషిలోని శక్తిసామర్థ్యాలకు మెరుగులు దిద్దుతాయి. అంతేకాక తాను ఏ దైవసందేశాన్ని అందజేయడానికి బయలుదేరాడో ఆయన తనను సున్నిత సన్నివేశాలలో నిస్సహాయంగా, వంటరిగా వదలివేయడు. ఆయన తప్పనిసరిగా తనను ఆదుకుంటాడు, తనకు తోడ్పడతాడు. కాని అతను తక్కువ స్థాయి జనుల్లోనే

ధర్మసందేశాన్ని అందజేసేందుకు పూనుకుంటే అతని పని సులభతరమవడంలో సందేహం లేదు. కాని అతనిలోని శక్తిసామర్థ్యాలు ముందుకు రావు, మెరుగులు దిద్దుకోవు. కష్టాలలో మనిషి దైవం వైపునకు మరలే సహాయం అర్థించే విధంగా, ఇటువంటి సాధారణ పరిస్థితుల్లో అతను మరలడమూ తక్కువే అవుతుంది కూడా.

## 3. సందేశకుడు

సందేశం సఫలమవ్వాలన్నా, నిష్ఫలమయిందన్నా చాలా మటుకు రెండు కోణాలలో, సందేశకుని వ్యక్తిత్వంపైన ఆధారపడి ఉంటుంది. ఒకటి, స్వయంగా అతనికి తన సందేశం పట్ల అవగాహన ఏమేరకు ఉంది, దాన్ని అతను ఏ స్థాయిలో జీర్ణం చేసుకోగలిగాడు, ఆకళింపు చేసుకోగలిగాడు, దాన్ని అందజేయడానికి ఏ విధానాన్ని అవలంబిస్తున్నాడు, ఏ మార్గాలను అనుసరిస్తున్నాడు అన్నది. రెండవది, సంబోధితుని పట్ల అతని వైఖరి ఎలా ఉంది, అతని ఎడల తాను వ్యవహరించే తీరు ఏదీ అన్నది. అతను సంబోధితుని ఎడల ఎంతగా సమంజసమయిన సహేతుకమయిన విధానాన్ని ఎన్నుకుంటాడో అంతగానే సంబోధితుడు అతనికి చేరువయ్యే అవకాశం పెరుగుతుంది, అంతగానే శ్రద్ధగా అతను ఇతని మాటను వింటాడు, గ్రహించే ప్రయత్నం చేస్తాడు. సంబోధితుని ఎడల అతని వైఖరి సవ్యంగా లేకపోతే అతనూ ఇతని సందేశానికీ, అతనికీ దూరమయిపోతాడు. ఈ రెండు కోణాలను కాస్త వివరంగా ఇక్కడ చర్చించడం, అర్థం చేసుకోవడం అవసరం.

## సందేశం స్పష్టంగా ముందుండాలి

ఇస్లామ్ సందేశం పట్ల స్వయంగా సందేశకుని మనోమస్తిష్కాలు ప్రస్ఫుటంగా అవగాహన కలిగి ఉండటం అత్యంతావశ్యకం. ఇస్లామ్ ఏమిటో, దాని సందేశం అందజేయవలసిన అవసరమేమిటో అతను గ్రహించాలి. తన ఆశయం, గమ్యం సదా అతని కళ్ళెదుటే ఉండాలి. దాని అవసరాలను ఆవశ్యకతల్ని అతను అతిక్షుణ్ణంగా అవగత పరచుకుని ఉండాలి. తన ఆశయ సిద్ధికి సరయిన విధానమేమిటో, సముచితమయిన పద్ధతి ఏదో అతను బాగా ఎరిగి ఉండాలి. ఈ అవగాహన లేనిదే అతను ముందుకు సాగలేడు.

ఈ విషయంలో, సందేశకుడు ఈ సమస్యలను గురించి పూర్తిగా స్పష్టంగా అవగాహన కలిగి లేకపోయినట్లయితే రెండు నష్టాలు ఎలాగూ ఎదురవుతాయి. ఒకటి, అతను ఇస్లామ్ సందేశాన్ని పూర్తిగా విశదంగా ఇతరుల సమక్షంలో అందజేయలేడు.

అసలు సందేశమే సరిగ్గా అందజేయకపోతే అది ప్రవర్ధమానమవడం, వ్యాప్తి చెందడం, ఫలవంతమవడం అన్న ప్రశ్నే ఉత్పన్నం కాదు, ఆ అవకాశమే మిగులదు. ఒక సందేశాన్ని దాని సందేశకుడే, దాని ప్రచారకుడే స్వయంగా తాను కోరేదేమిటో, ఎందుకు అలా కోరుతున్నాడో తెలుసుకోలేకపోతే ఆ సందేశం నిశ్చయంగా నిష్ఫలమవుతుందనడంలో సందేహమేముంది? దీని వల్ల కలిగే రెండవ నష్టం ఏమిటంటే, అతను ఇస్లామ్, ఇస్లామేతర విరుద్ధ సిద్ధాంతాల మధ్య గల వ్యత్యాసాన్ని అర్థం చేసుకోలేకపోతాడు. అలాంటప్పుడు ఒక ప్రమాదం ఎప్పటికీ ఉంటుంది, అతను ఇస్లామ్‌ను, ఇస్లామ్ వ్యతిరేక సిద్ధాంతాలను, కలగలిపి అన్నీ ఒకటేనని, ఆ సిద్ధాంతాలు కూడా ఇస్లామ్ సిద్ధాంతాలే అని నమ్మి, స్వీకరించే ప్రమాదం ఎలాగూ ఉంటుంది. అంతేకాదు, వాటిని ఎంతో ఉద్వేగంతో, ఉత్సాహంతో ప్రచారం చేయడమూ సాధ్యమే.

## సందేశం అతిస్పష్టంగా అందజేయాలి

వాస్తవమేమిటంటే మానవుడు అతిగా ఏమరుపాటుకు లోనయి ఉన్నాడు. అతన్ని బాగా విదిలించి లేపాలి. అప్పటి వరకు మేల్కొనడు. అందువల్ల సందేశకుడు తన మాటను బాగా ఉత్సాహంగా, ఉద్వేగంగా, బలంగా ముందుంచాలి. నిద్రాణమయి ఉన్న మానవ అంతరాత్మ జాగృతమవ్వాలి. అతని భావావేశాలలో చలనం కలగాలి. తత్వవేత్తల్లా ప్రాణం లేని శుష్కవాదాలు నిండిన భావప్రకటనా శైలి వల్ల సత్యసందేశం అందుకోవడం కష్టం. అలాగే అతి స్పష్టమయిన, విశదమయిన శైలిలో సందేశం అందజేయాలి. సందేశకుడు సుదీర్ఘ ఉపన్యాసం చేసిన తరువాత కూడా జనులు నీ ఉద్దేశ్యమేమిటీ అని ప్రశ్నించి నట్లయితే, నీవు కోరేదేమిటీ అని అడిగే మాటయితే అతను ప్రయోగించిన భాష నుడికట్టు లాంటిదీ, చిక్కు ముడివంటిదేకాని సందేశకుని భాష కాదని తెలుస్తూనే ఉంది.

చిక్కుచిక్కుల భాష, అందుకోలేని అలంకారాలు, ఊహాతీతమయిన ఉపమానాలు, సంక్లిష్టమయిన పరిభాష, పదబంధాలు, అనవసరంగా దీర్ఘమయిన అధిక ప్రసంగాలు, అలాగే మరీ క్లుప్తంగా బోధపడనటువంటి కష్టసాధ్యమయిన ప్రసంగం కూడా సందేశకునికి సముచితం కానివి, ఇవి అతని మార్గంలో అవాంతరాలు, అడ్డంకులుగా పరిణమిస్తాయి. మాటలాడితే ప్రస్ఫుటంగా రెండూ రెండూ నాలుగుగా, సులభ గ్రాహ్య మయిన పదాలలో, వినేవాడికి సునాయాసంగా మింగుడు పడే రీతిలో మాటలాడాలి. శైలి సమస్యాపూర్ణం వంటిది, అస్పష్టమయినదయితే ప్రభావం కోల్పోతుంది. జనులకు ఆకర్షణీయం కాదు, స్వీకారయోగ్యమూ కాదు.

## ధర్మసమ్మతమయిన మార్గాలు

ధర్మం అనుమతించిన విధానాలనే ధర్మసందేశ వ్యాప్తికి వినియోగించాలి. ధర్మంలో ధర్మసమ్మతమయిన (హలాల్) విషయాలేవో, వాటి పరిధులేవో గుర్తెరిగి వాటిని పాటించాలి. వాటిని గాలికి వదలివేసి ధర్మసందేశ కార్యాన్ని చేపట్టేందుకు సమాయత్త మవడం కూడా పాపమే. దైవధర్మం ప్రచారానికి ధర్మవిరుద్ధమయిన, అధర్మమయిన సాధనాలను వినియోగించే అవసరమేదీ లేదు. ధర్మానికి ఆ ఆవశ్యకత ఏమాత్రం లేదు. అధర్మ విధానాలతో దాని వ్యాప్తి ఎంతమాత్రం అనుమతి యోగ్యం కావు. ధర్మవ్యాప్తికి అధర్మ విధానం విషతుల్యం, మహాపాపం.

ఏ వ్యక్తి ధర్మంలోని హలాల్‌ని హరామ్‌గా, హరామ్‌ని హలాల్‌గా పరిగణిస్తాడో అతను ధర్మానుసరణ, ధర్మావలంబన, ధర్మసంస్థాపనా విధులు, మహత్మ్యాలు వల్లించడం అత్యంత తెలివితక్కువతనమూ అవుతుంది, అది పెద్దపెట్టున కాపట్యం, ద్వంద్వ నీతి అవుతుంది. అపమార్గాలు, దుష్ట విధానాల వల్ల ధర్మానికి ఎటువంటి లాభం కలిగే అవకాశం లేకపోగా నష్టం వాటిల్లే ప్రమాదం మటుకు బలంగా ఉంటుంది. అందువల్ల ఇటువంటి త్రోవలు త్రొక్కేవాడు తెలివి కోల్పోయినవాడయినా ఉంటాడు, లేదా వాస్తవానికి దైవధర్మ విరోధి, దుష్టచింతకుడు, కీడును కోరేవాడయి ఉంటాడు. మీరు వడ్డీ ఆదాయంతో ధర్మప్రచార సంస్థ స్థాపించినట్లయితే దాని వల్ల ధర్మప్రచారం మటుకు ఎన్నడూ జరగదు, కాని ధర్మం మటుకు అభాసుపాలవుతుంది, పరాభవానికి గురవుతుంది. దైవధర్మ సేవ చేయాలని పూనుకున్నవారు, దైవధర్మ సంస్థాపనా దీక్షతో, దైవాన్ని ప్రసన్నునిగా చేయాలన్న ధ్యేయంతో నిలబడ్డవారు, ధర్మానికి నష్టం కలిగించే, షైతాన్‌ని సంతోషపెట్టే విధానాలను అవలంబించడం ఎంత దౌర్భాగ్యం, వారు ఎంత అదృష్టహీనులు!!

## ధర్మనైజాన్ని కాపాడాలి

ఇస్లామ్ సందేశ వ్యాప్తి విషయంలో మనిషి అది చూపెట్టే మార్గాన్ని నిబద్ధతతో అనుసరించడంతోపాటు దాని నైజాన్ని కూడా దృష్టిలో ఉంచుకుని మెలగాలి. ఇస్లామ్ ఓ విశిష్ట నైజంగల ధర్మం. దానికి ఎన్నో విషయాలు సానుకూలంగా ఉంటాయి, మరెన్నో ప్రతికూలంగానూ ఉంటాయి. దీని నైజానికి పొసగిన అంశాలనే సందేశకుడు పాటించాలి. దానికి అబ్బని విషయాలను ఊసెత్తకుండా వదలివేయాలి. ఇస్లామ్ అంగీకరించని విధా నాల ద్వారా దీని సందేశాన్ని అందజేసినట్లయితే దాని మహత్తు ఎన్నడూ గుర్తింపునకు రాదు. అది జనుల దృష్టిలో అతి తేలికయినదిగా, భారవిహీనమయినదిగా రూపుదాల్చు తుంది. అప్పుడు దాని వైపునకు కన్నెత్తి కూడా ఎవడూ చూడడు. ఎవరయినా ఆ విధంగా

ఇస్లామ్‌కు చేరువయినప్పటికీ అతను తన ఆచరణలో దాని నైజాన్ని లెక్కచేయక పోవడమేకాక దాని హద్దులనూ కాలరాస్తారు.

ధర్మసందేశకుడు ధర్మనైజానికి ఏమాత్రం పొసగని, దానికి భారమయినటువంటి మార్గాలను పూర్తిగా మానుకోనంత వరకు మానవులకు దాని ప్రాముఖ్యత అవగతమవదు. దాని నైజాన్ని ఏమాత్రం గాయపరచకుండా, బాధ కలిగించకుండా దాని వ్యాప్తికై కృషి చేసినప్పుడే దాని ప్రాముఖ్యత, మహత్తు బాహ్యంలో వ్యక్తమవుతుంది. ప్రజలు దాని విశిష్టతను సరిగ్గా గుర్తించగలుగుతారు.

## జనుల సంసిద్ధతనూ చూడాలి

సందేశకుడు సందేశాన్ని అందజేస్తున్నప్పుడు సంబోధితులు సందేశాన్ని వినడానికి మానసికంగా సన్నద్ధులయి ఉండే సందర్భాన్ని దృష్టిలో ఉంచుకోవాలి. ఆ సందేశాన్ని వారు చాలా విశాల హృదయంతో తెరచిన మేధతో వినడానికి, పరిశీలించడానికి, ఆలోచించ డానికి సన్నద్ధులయి ఉన్నప్పుడు మాత్రమే సందేశాన్ని అందజేయాలి. వారు వినడానికి కూడా సిద్ధంగా లేని సమయాన సందేశాన్ని తీసుకుని వారి వద్దకు వెళ్ళడం సరయినది కాదు.

మానవులకు శాంతిని నెమ్మదిని ప్రోది చేయగల విషయం ఒక్క దైవధర్మంలో తప్ప ప్రపంచంలో మరే సాధనంలోనూ లేదు. ఏ వ్యక్తి దైవధర్మం ఆశ్రయించలేకపోయాడో, దానికి వంచితుడయిపోయాడో అతని జీవితంలో అనేక సందర్భాలు వస్తాయి, అప్పుడు తాను ఏ మార్గం ద్వారా సుఖాన్ని, సంతోషాన్ని, శాంతినీ పొందాలని కోరుకుంటున్నాడో అవన్నీ మిథ్యా మార్గాలనీ, అవిశ్వాసనీయమయినవనీ తెలుసుకుంటాడు. అటువంటి సందర్భాలలో సందేశకుడు తన శక్తినంతా, సామర్థ్యాన్నంతా వినియోగించి, ఎంతో వివేచనతో, విజ్ఞతతో ధర్మసందేశాన్ని అతనికి అందజేయాలి. ఇటువంటి సందర్భాలే సందేశకుని ప్రత్యేక శ్రద్ధ, శ్రమ, జాగరూకతలను కోరుతాయి. సంబోధితుడు ధర్మం వైపునకు శ్రద్ధ చూపే, దాని పట్ల తన స్వీకార దృష్టి పారజేసే అవకాశాలున్న సందర్భాలు కూడా ఇవే.

మానవులకు వ్యక్తిగత స్థాయిలో ఇటువంటి సందర్భాలు, అవకాశాలూ వచ్చి నప్పుడు వారు ధర్మసందేశాన్ని చెవులొగ్గి వినడానికి సిద్ధమయినట్లే, సరిగ్గా ఇలాగే, దైవం పట్ల ఏమరుపాటుకు లోనయిన జాతులు, సముదాయాలు సయితం అటువంటి పరిస్థితులకు లోనవుతాయి. అప్పుడు అవి ధర్మసందేశాన్ని వినడానికి సమాయత్తమవు

తాయి. అటువంటి అవకాశాలను, పరిస్థితులను సవ్యంగా వినియోగించుకోక పోవడం చాలా పెద్ద తప్పు. సందేశకులు ఎన్నడూ అటువంటి పరిస్థితుల్ని వృధా కోల్పోరాదు. సదా వాటిని అన్వేషిస్తూ ఉండాలి.

## ఎవ్వరూ దారి తప్పినవాడు, కాఫిర్ కాదు

రుజుమార్గానికి బహుదూరమయిపోయినవారు అనేక మంది సందేశకునికి ఎదురవుతారు, వారి మధ్యనే అతను పని చేయవలసి ఉంటుంది. అటువంటి వారిని అతను మార్గవిహీనులని, మహాపాతకులనీ అన్నట్లయితే బహుశా అది వాస్తవికత రీత్యా సరయినదే కావచ్చు, తప్పుకాక పోవచ్చు. కాని అది యదార్థమే అయినప్పటికీ, సందేశ ప్రచారం దృష్ట్యా అటువంటి వారిని తిరస్కారి అని, మహాపాపులని అనడం మానుకోవాలి. మానవుడు సాధారణతః తన్ను ధర్మవిరోధి అన్నా, పాపాత్ముడన్నా, దారి తప్పినవాడన్నా అదొక పెద్ద అభాండంగా భావిస్తాడు. ఇది మానవ నైజం. అందువల్ల సందేశకుడు అతన్ని మార్గవిహీనుడని అనగానే అతనిలో అజ్ఞానపు అహం దెబ్బతింటుంది. అతను రెచ్చి పోతాడు, అతని మాటను వినడానికి ససేమిరా అంగీకరించడు, అతన్ని పూర్తిగా తిరస్కరిస్తాడు.

## గర్వం, అహంభావం అవాంఛనీయాలు

తాను సన్మార్గావలంబీకుడు, సంస్కర్త అన్న భావం సందేశకునిలో పొడసూపితే, అదే గర్వం. అది విసర్జనీయం. ఈ విషయం అతన్ని తన ధ్యేయంలో నిష్ఫలునిగా చేసి వేస్తుంది. గర్వమయినా, అహంభావమయినా నైతిక మాలిన్యం, బహుదూరాల వరకు వాతావరణం దాని వల్ల కలుషితమయిపోతుంది. దుర్గంధపూరితమయిపోతుంది. సౌజన్యశీలుడయిన ఏ వ్యక్తీ అహంభావి, గర్విష్టి అయిన వ్యక్తికి చేరువ కావడానికి ఇష్టపడడు, అతనికి దూరంగా ఎడంగానే ఉంటాడు.

జనుల్ని సంస్కరించి వారికేదో మేలుచేస్తున్నానన్న భావం సందేశకునిలో మొలకెత్త రాదు. తాను తన విధిని మాత్రమే నిర్వర్తిస్తున్నాను అని అతను దృఢంగా నమ్మాలి, అలాగే ప్రవర్తించాలి. ప్రపంచంలో అనేక మంది సన్మార్గానికి దూరంగా, దైవధర్మం పట్ల ఏమరు పాటుకు లోనయి జీవిస్తున్నారు. ఇటువంటి పరిస్థితుల్లో వారిని దైవధర్మం వైపునకు పిలుపునిచ్చే స్థానం దైవం ఎవరికి ప్రసాదించాడో వారికి ఆ పరమ ప్రభువు ఎంతో మహోపకారం చేసినట్లే. సందేశకుడు ఆ మహోన్నత మహోపకారాన్ని గుర్తించినట్లయితే గర్వంతో పొంగిపోవడం కాదు, వినయంతో, కృతజ్ఞతాభావంతో దైవం సమక్షంలో తలవంచుతాడు, వినమ్రుడవుతాడు.

అలాగే సందేశకుని పిలుపులో అధికార స్వరం వినిపించరాదు. ఇతరుల్ని తమ దాసులుగా భావించే వారి స్వభావమది. ఇతరుల్ని తన దాసులుగా చేయడానికి లేవడు సందేశకుడు, వారిపైన తన అధికారం చెలాయించడానికి అతను అంగీకరించడు. మానవులంతా ఒకే దేవుని దాసులని చాటడానికే అతను ఆవిర్భవించాడు, అందరూ ఆ దైవానికి దాసులయి, ఆయన దాస్యం చేయాలన్నదే అతని పిలుపు. ఒకరిని తక్కువవారని భావించి వారితో వ్యవహరించడు సందేశకుడు; అతను తప్పిపోయిన తన సోదరుడు అన్న భావంతోటే అతని సంస్కరణకు పూనుకుంటాడు.

ఎవరయినా దైవధర్మావలంబనకు సంసిద్ధులవడం, ధర్మాన్ని స్వీకరించి ఆచరించ డానికి సమాయత్తమవడం, సందేశకునికి ప్రపంచం, ప్రపంచంలోని సమస్త వస్తుసామగ్రి కన్నా ఎన్నో రెట్లు మించిన సంపద. ధర్మసందేశం చేతబూని నిలబడ్డ ప్రతి వ్యక్తికీ ఈ సంపద ప్రాప్తం కాదు. ఆంతర్యంలోన చిత్తశుద్ధి, ఆవేదన, మాటల్లో ప్రేమ తీపి, భాషలో అమృతం నిండిన వారి సంభాషణే స్వయంగా చెబుతుంది, జనులు అవలంబించే తప్పుడు వైఖరి వల్ల మనస్తాపంతో వారు బాధపడుతున్నారని, వారి సంస్కరణ కోరుకుంటున్నా రనీను.

## నీతిమంతంగా మెలగాలి

సందేశకుడు, సంబోధితుని పట్ల మృదువైఖరినవలంబించాలి. తనను చూడగానే అతను పరిగెత్తేలా లేక వ్యతిరేకతకు పూనుకునేలా వ్యవహరించరాదు. సందేశకుడు ఉన్నత నైతికతకు నిలయమయి ఉండాలి. జనం అతని వైపునకు ఆకర్షితులవ్వాలి. అతని మాట వినడానికి ఉత్సుకత కనబరచాలి. సర్వసాధారణంగా ఇస్లామ్ సేవకులని చెప్పబడేవారు కుసంస్కారులన్న మాట, అహంభావులన్న విషయం స్థిరపడిపోయింది. నిజానికి సమాజంలో అందరికన్నా సంస్కారవంతులు, మర్యాదస్థులుగా వీరే ఉండవలసింది. నిజానికి సంస్కారం, మర్యాదలు, సౌజన్యత, సౌశీల్యత లేనిదే ఇస్లామ్‌ను ఊహించడమూ దుర్లభమే.

సందేశకుడు సమాజంలో కనిపించే చెడుగులను చెరిపివేసేందుకు ఉత్సాహాన్ని, ఆసక్తిని, అసహనాన్నీ కలిగి ఉండటమయితే సరయినదే. కాని చెడ్డవారి పట్ల ద్వేషంగాని, అసహ్యంగాని అతనిలో పొడసూపరాదు. అతను తన చుట్టూ పేరుకుపోయిన చెడుగులకు దూరంగానయితే తప్పక మసలుకోవాలి కాని వాటికి పాల్పడేవారి నుండి సంబంధాలను తెంచుకోరాదు. దారితప్పిన వారి సంస్కరణకు పూనుకున్నవారు, తాము సంస్కరించగోరే

వారు తమతో సంబంధాలు తెంచుకుంటే వారి సంస్కరణ ఎన్నటికీ జరగదు, పైగా వారు మరింతగా పాపాలలో కూరుకుపోవడం తథ్యం.

ధర్మసందేశకుడు ఒక విషయాన్ని ఎన్నడూ మరువకూడదు. కల్లోలం సమాజం నరనరాల్లో ప్రసరించడం మొదలిడితే, సత్కార్యం, దైవభీతి పనుల పట్ల ఎటువంటి మొగ్గుదల కానరాకపోతే చెడు మార్గాన్ని అవలంబించేందుకు మనిషి ఓ విధంగా వివశుడయిపోతాడు. అతను సందేశకుని వెటకారానికి అభ్యంతరానికీ, ఆగ్రహానికి అసహ్యానికీ కాదు సానుభూతికి పాత్రుడవుతాడు. మీరు అతని అపమార్గాన్ని బట్టి వ్యంగ్యంగా మాటలాడితే, అతన్ని అపహాస్యం పాలుచేస్తే అతని భావోద్రేకాలు రెచ్చిపోయే ప్రమాదముంది. అతను తన వైఖరిని మొండిగా సమర్థించడమూ జరగవచ్చు. సందేశకుడు సదా ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. అతని ధోరణిలోని వెగటు సంబోధితుణ్ణి ధర్మానికి దూరం చేసివేయదు కదా అని జాగ్రత్తపడుతూ ఉండాలి. అతను తన సదుద్దేశంలో తన అపసవ్యమయిన విధానాల వల్ల పరాజయంపాలయ్యే ఆస్కారం ఏర్పడుతుంది.

## తొందరపాటు కూడదు

ఈ సందర్భంలో చివరి విషయం, కాని ముఖ్యమయిన విషయం ఏమిటంటే, సందేశకుడు ఎన్నడూ తొందరపాటుకు లోనవరాదు. తొందరపాటు వల్ల మనిషి సత్య సందేశాన్ని సక్రమంగా అందజేయలేడు. సందేశం అందగానే అందుకుని సంస్కరించుకునే శుభాత్మలు బహుతక్కువగా ఉంటాయి. కొన్ని సమయాల్లో సందేశకుడు యావజ్జీవితం వెచ్చించినా జనుల్లో ఎటువంటి మార్పు సంభవించకపోయిన సందర్భాలనేకమున్నాయి. తన పనికి ఫలితాలు అతి త్వరగా బహిర్గతమవ్వాలని సందేశకుడు కోరుకున్నట్లయితే అతనికి నిరాశే ఎదురవుతుంది. అతను పర్యవసానంగా సందేశ కార్యాన్నే వదలివేయ వచ్చు. సందేశకుడు పూర్తి సహన సంయమనాలతో నిరంతరం దైవధర్మం వైపునకు ప్రజల్ని ఆహ్వానిస్తూనే ఉండాలి. ఎల్లెడలా దైవధర్మం వ్యాపించేంత వరకు లేదా ఆ కృషిలోనే అతని ప్రాణాలయినా పోయే వరకు ఆ కృషి జరగాలి.



# సందేశకుడు సఫలుడయ్యాడు

## సాఫల్యం - రెండు ప్రమాణాలు

ఒక సందేశకుడు సఫలుడయ్యాడా లేదా అని పరిశీలించేందుకు రెండు ప్రమాణాలు సాధ్యమే. ఒకటి, అతని సందేశం ఏమిటీ? అతను ఏ సిద్ధాంతం వైపునకు జనులను పిలుస్తున్నాడు? అన్నది. ఈ సిద్ధాంతం ఎంతగా పరిశుద్ధమయినది, ఎంతగా ఉన్నతమయినదీ అయితే దాన్ని అందజేసేవాడు అంతగానే సఫలుడయ్యాడని అనవలసి ఉంటుంది. ప్రపంచంలో కొందరు రోత సిద్ధాంతాలను బలపరుస్తారు. వారు అందరికన్నా నిష్ఫలురయినవారు. వారు తమ్ముతామూ, తోటి సోదరుల్నీ నాశపరుస్తున్నారు.

కొందరు మానవుని పాక్షిక సంస్కరణను కోరుకుంటారు. వారి ప్రయత్నాలన్నీ అతని అల్పస్వల్పమయిన సత్కార్యాల వరకే పరిమితమవుతాయి. ఇటువంటి వారికి భిన్నంగా కొందరు మానవుణ్ణి అన్ని కోణాలలో సంస్కరించగోరుతారు, అతన్ని సమగ్రంగా సముద్ధరింపజూస్తారు, ఈ రెండు విధాల జనులూ మానవాళి మేలుకోరే వారే అయి నప్పటికీ ఉభయుల స్థానాల్లో భూమ్యాకాశాలంత తేడా ఉంటుంది. మొదటి వర్గం వారు, రెండో వర్గం వారిలా ఉన్నత స్థానానికి, సాఫల్య ప్రమాణానికీ ఎంతమాత్రం అర్హులు కారన్నది తెలుస్తూనే ఉంది.

సందేశకుని సఫలతా నిష్ఫలతలను పరిశీలించే రెండవ ప్రమాణం ఆ సిద్ధాంతాల వల్ల, సందేశం వల్ల ప్రపంచానికి ఎంత ప్రయోజనం ఒనగూడింది అన్నది. ఆ వ్యక్తి ప్రారం భించిన నీటి చెలమ వల్ల లాభమొందిన జనవాళి సంఖ్య ఏపాటిది? అతను నాటిన చెట్టు నీడన విశ్రమించిన ప్రయాణీకులు ఎంత మంది అన్నది. కాని ఇది అతని సఫలతా నిష్ఫలతలను పరిశీలించే నిజమయిన ప్రమాణం కాదు. ఇది మరీ స్థూలమయిన ప్రమాణం. దేవుని ఈ నేలపైన సత్యానికి సాక్ష్యంగా నిలిచే వ్యక్తి నిస్సందేహంగా సఫలు డయినవాడు. అతని ప్రయత్నం వల్ల ఎవరికయినా సత్యస్వీకార సద్బుద్ధి ప్రాప్తమయి నట్లయితే అది అతని సాఫల్యానికి బాహ్యాపరమయిన తార్కాణం. కాని ఒకవేళ ఎవరూ

సహకరించకపోయినా ప్రపంచం మొత్తం అతను కృషి సలిపినా సత్యాన్ని స్వీకరించక పోయినట్లయితే దాని వల్ల అతని మహత్తు తరగదు. అతని సాఫల్యంలో ఎటువంటి లోటు రాదు.

ఇస్లామ్‌లో మానవాళికి కావలసిన అత్యంత సవ్యమయిన సిద్ధాంతాలున్నాయి. అది జీవితం మొత్తానికి అవసరమయిన సంతులిత వ్యవస్థను ప్రతిపాదిస్తుంది. దాని వల్ల అతని జీవితంలోని సకల ఎత్తుపల్లాలు అంతమయిపోతాయి. అందువల్ల ఇస్లామ్ సందేశాన్ని అందజేసేందుకు నిలబడ్డ వ్యక్తిని మనం ఎన్నటికీ నిష్ఫలుడని అనలేము. అతని సఫలతకు, అతను ఇస్లామ్ వైపునకు ఆహ్వానించడమే చాలు. ఎవరయినా వ్యక్తిగానయినా, వర్గంగానయినా ఆ సందేశానికి విముఖులయినట్లయితే వారు స్వయంగానే నిష్ఫలురవుతారు, సందేశకుడు కాదు.

## సందేశకుని విధి

సందేశకుని సాఫల్యం, అతను చేసిన ప్రయత్నానికి వెలువడిన ఫలితాలేమిటీ అన్న దానిపై ఆధారపడి లేదు, అతను తన బాధ్యతను సక్రమంగా నిర్వర్తించాడా లేదా అన్న దానిపైనే ఆధారపడి ఉంటుంది. ఇస్లామ్‌ను స్వీకరించిన తరువాత దాని సందేశం వైపునకు పిలుపునివ్వడం అతని విధిగా రూపొందుతుంది. ఆ విధి నిర్వహణ ఎట్టి పరిస్థితిలోనూ అతనికి ఆవశ్యకమయినదే. ప్రపంచం దాన్ని స్వీకరించినా స్వీకరించకపోయినా, సందేశానికి పర్యవసానంగా సఫలీకృతుడయినా లేక అతను ఆధిక్యత పొందే అవకాశాలు కానరాక పోయినా. ఏ క్షణానయితే ఒక వ్యక్తికి దైవధర్మం ప్రాప్తమవుతుందో అదే క్షణాన దాన్ని ఇతరులకు అందజేయడం అతని బాధ్యతగా రూపొందుతుంది. జనులు దైవధర్మాన్ని వ్యతిరేకిస్తున్నారు, అతని మాట వినడానికి సిద్ధంగా లేరు కాబట్టి అతన్నుంచి ఆ బాధ్యత తొలిగిపోదు.

సత్యాన్ని అందజేయడానికి ఎటువంటి నిబంధన లేదు. వింటున్నవాడు దాన్ని వెంటనే స్వీకరించాలన్న నిబంధన కూడా లేదు. ఒక వ్యక్తికి సత్యం ప్రాప్తమవడం, ప్రపంచంలో దాని పట్ల ఏమరుపాటు, విముఖత ఉండటం చాలు అతను సందేశాన్ని అందజేయవలసిందే. ప్రపంచంలో దైవాన్ని విస్మరించిన వారు, ఈ ధర్మం గురించి ఏమీ తెలియనివారు ధర్మం పట్ల అగత్యపరులయి ఉన్నారు. వారికి ధర్మం చేరవేయడం అవసరం. ఆ తరువాత వారు దాన్ని అనుసరించడానికి అంగీకరించినా లేక దాని పట్ల ధిక్కార వైఖరినే అవలంబించినా అది వారి ఇష్టం.

وَ اِنْ تَوَلَّوْا فَاِنَّمَا عَلَيْكَ الْبَلَاغُ
وَاللّٰهُ بَصِيْرٌ بِالْعِبَادِ ٥ (آل عمران:٢٠)

**వారు ఒకవేళ విముఖులయినట్లయితే కానివ్వు, నీ బాధ్యత వారి వరకు సత్యాన్ని చేరవేయడం వరకే. అల్లాహ్ స్వయంగా తన దాసులను చూస్తూనే ఉన్నాడు.**

***(ఆలి ఇమ్రాన్: 20)***

ఇస్లామ్ సందేశాన్ని అందజేసే బాధ్యత సరయిన రీతిలో నెరవేరాలంటే సందేశకుడు దాన్ని తన విధిగా భావించి మరీ అందజేయాలి. ఫలితాల పట్ల పూర్తిగా నిరపేక్షాపరుడయి వ్యవహరించాలి. అతను ఆ సత్కార్యంలోనే సదా నిమగ్నుడయి ఉండాలి, నిరంతరంగా నిమగ్నుడయి ఉండాలి. పరిస్థితులు అనుకూలంగా ఉన్నా లేక ప్రతికూలంగా ఉన్నా, ప్రపంచం అతనికి స్వాగతం పలికినా అతనికి వ్యతిరేకత కనబరచినా అతను మాత్రం తన పని చేసుకుంటూనే సాగాలి. ప్రపంచం తనను స్వాగతించాలన్న ఆశతో దాన్ని నిర్వహించాలని అతను కోరుకుంటే అది ఎన్నటికీ నెరవేరదు.

ప్రపంచంలో, తమ్ముతాము పరిశీలించుకు సాగేవారే విజయాన్ని సాధిస్తారు. ఎదుటివారిని గమనించి తమను గురించి నిర్ణయాలు చేసుకునే వారు ఎన్నటికీ సఫలీకృతులవ్వరు. ఇతరులు ఏమరుపాటుకు గురయినందు వల్ల తానూ నిష్క్రియాపరత్వానికి లోనయ్యే, తన బాధ్యతలను మరచిపోయే వ్యక్తి అదృష్టంలో నిరాశ, నిష్ఫలతలే వ్రాయబడతాయి. ప్రపంచం ఇస్లామ్‌కు తోడ్పాటు అందజేయకపోతే దాన్ని నమ్మేవారు దాని సందేశాన్నే వదలివేయాలని అర్థమా? దాని సంబోధితులు తమ బాధ్యతను గుర్తెరగకపోతే దాని అనుయాయులు సయితం తమ విధి నిర్వహణలో కొరత చూపే అవకాశం ఎక్కడిది? ఇస్లామ్ సేవకులు ఒక్క క్షణానికీ ఇస్లామ్‌నూ వదలుకోలేరు, దాని పిలుపునూ వదలుకోలేరు- వారిని వ్యతిరేకించేందుకు మిథ్యా శక్తులన్నీ విరుచుకుపడినా, వారి పీడన పట్ల ఒక్క సానుభూతి పలుకు పలికేవాడూ కానరాకపోయినా సరే.

నేడు ఎల్లెడలా నాస్తికత్వం, దైవధిక్కారం ప్రబలిపోయిన మాట వాస్తవమే. ఎటు చూసినా దైవం పట్ల విముఖత ఆవరించే ఉంది. ప్రపంచం దైవాన్ని మరచేపోయింది. సాంప్రదాయికమయిన ధార్మికత అక్కడక్కడ కానవస్తున్నప్పటికీ నిజమయిన ధర్మభావన ఎక్కడా గోచరించదు. దైవం పేరు పలకడానికి పెద్ద పెద్ద వారే జంకుతున్నారు. తన మతం, ధర్మం గురించి ఎవరయినా ప్రస్తావిస్తే అతను తన వాతావరణంలో అపరిచితుడయిపోతాడు. అతని మాటల్ని జనం వింతగా వింటారు. వారు అతన్ని తమ సమకాలీనుడని గుర్తింపునివ్వరు. తన ధార్మిక భావాల వల్ల అతను కాలగతికి ఎంతో వెనకబడిన

వాడుగా అగుపిస్తాడు. ఇదంతా వాస్తవమే. అయితే దీని వల్ల సందేశకుని బాధ్యత ఎంత మాత్రం తగ్గదు. అతను ఇటువంటి చీకటి వాతావరణంలోనే తన పని నిర్వహించ వలసి ఉంది. ఈ ప్రతికూల వాతావరణంలోనూ అతని మాటను వినడానికి ఎవరు సన్నద్ధులయి ఉన్నారో అతనికి ఏమాత్రం తెలియదు. ఎవరు అతని పిలుపునకు బదులివ్వడానికి ఉద్యుక్తులయి ఉన్నారో, ఎవరిలో సత్యాన్ని స్వీకరించే ఆసక్తి సామర్థ్యాలున్నాయో అతనెరుగడు. ఈ సజ్జనులు తన ఏమరుపాటు, అశ్రద్ధ వల్ల సత్యానికి వంచితులయిపోతే రేపు ప్రళయ దినాన అతను తన విధి నిర్వహణలో కొరత చూపించిన అపరాధానికి శిక్షను అనుభవించవలసి ఉంటుంది.

ప్రపంచం మిత్రుణ్ణయినా శత్రువునయినా ముఖం చూడగానే తెలుసుకుంటుంది. కాని దైవధర్మం వైపునకు పిలుపునిచ్చే వ్యక్తి మైత్రీ చిహ్నమేదీ లేని ముఖాలను వెదుక్కుంటూ తిరుగుతాడు. అతను రేయింబవళ్ళు తన కార్యక్రమాలలో నిమగ్నమయి ఉన్నట్లయితే తాను కోరుకునే వ్యక్తులు అతనికి తారసపడతారు. ఇటువంటి వారు కొందరు ప్రాప్తమయినా అది అతనికి ప్రపంచంలోని సకల సౌభాగ్యాలకన్నా ఎంతో విలువయినది. తనకు లభించిన వారే మానవాళిలోని మణి మాణిక్యాలు అతనికి. దైవసందేశహరులు (స) హజ్రత్ అలీ(ర)ని సంబోధించి చేసిన ఉపదేశమే ప్రతి సత్యసందేశకుని మార్గోపదేశం.

فَوَ اللّٰهِ لَأَنْ يَّهدِىَ اللّٰهُ بِكَ رَجُلاً وَاحِدًا خَيْرٌ لَّكَ مِنْ اَنْ يَّكُوْنَ لَكَ حُمُرُ النِّعَمِ

దైవం సాక్షిగా, నీ ద్వారా దైవం ఏ ఒక్క వ్యక్తికి సన్మార్గ బోధన కలిగించినా ఇది నీ విషయంలో ఎర్ర ఒంటెల కన్నా మేలయినది. *(బుఖారీ)*

## సందేశకుని విజయం

మానవులకు దైవధర్మం విశదమవ్వాలనే అల్లాహ్ కోరుకుంటాడు. తద్వారా దైవధిక్కారానికి ఎటువంటి వాదనకు అవకాశం మిగులరాదన్నది ఉద్దేశం. దీని బాధ్యత ఆయన ధర్మాన్ని విశ్వసించేవారికి అప్పగించాడు. వారు ధర్మసందేశ వ్యాప్తికి ఎటువంటి లోపం రానివ్వకుండా తమ వంతు పాత్ర సక్రమంగా నిర్వహించి ధర్మాన్ని విశదపరచినట్లయితే వారు తమ విధిని పూర్తిగా నిర్వర్తించినవారవుతారు. ఆపైన వారు దైవం దృష్టిలో బాధ్యత నిర్వహించినవారుగా పరిగణించబడతారు. ప్రపంచంలో ఏ ఒక్క వ్యక్తి కూడా వారికి సహకరించకపోయినా, అందరూ దాన్ని తిరస్కరించినా సరే, వారి బాధ్యత నెరవేరింది.

ఒక సందేశకుడు ఎందరి మనస్సుల్లో మార్పు తేగలిగాడు, ఎవరెవరిని విశ్వసించే వారుగా మలచగలిగాడు అన్న ప్రశ్న దేవుని సమక్షంలో ఎంత మాత్రం రాదు. సందేశకుని సాఫల్యం, ఎవరయినా అతని సందేశాన్ని విశ్వసించారా అన్న దానిపై ఆధారపడి లేదు. అతను సందేశాన్ని అందజేయడానికి శాయశక్తులా ప్రయత్నం చేశాడన్న విషయం చాలు.

ఈ ధర్మాన్ని నమ్మేవారు తమ అధీనంలో ఉన్న, తమకు సాధ్యమయిన విషయాల పట్ల మాత్రమే కృషి చేయాలని దైవం కోరుతున్నాడు. ఏ విషయాలపైన వారికి అధీనం, అదుపు లేవో వాటిని చేయాలని ఎంతమాత్రం కోరడం లేదు. వారికి తమపైన అధీనం ఉంది, వారు దాన్ని దైవాదేశాల మేరకు మార్చుకోగలరు, కనుక మార్చుకోవాలి. దైవ ప్రసన్నత కొరకు వారు తమను తాము అంకితం చేసుకోగలరు, అలా అంకితం చేసు కోవాలి. వారి వద్దనున్న మానసిక, మేధోశక్తుల్ని, ధనసంపదల్ని, ఆలోచన, ఆచరణల శక్తుల్ని దైవమార్గంలో వెచ్చించగలరు, వాటిని వెచ్చించాలి. ఈ విషయాల్లో వారు ఏమయినా లోటు చూపించినట్లయితే నిశ్చయంగా దాన్ని గురించి ప్రశ్నించడం జరుగు తుంది. ఎందుకంటే అల్లాహ్ వారికి ప్రసాదించినవాటిని వారు దైవమార్గంలో వెచ్చించ డానికి వెనుకంజవేశారు. అయితే ఏ విషయాలయితే వారి వద్దలేవో వాటిని వారు వెచ్చిం చనూలేరు, వాటిని గురించి వారిని ప్రశ్నించడమూ జరగదు. అంటే ఒక్క తమ వ్యక్తిత్వం తప్ప మరే విషయంపైనా వారికి అదుపు లేదు, వారు తమ్ముతాము తప్ప మరెవరినీ మార్చలేరు. అందువల్ల ఇతరుల బాధ్యత కూడా వారిపైన మోపడం జరగలేదు.

لَيۡسَ عَلَيۡكَ هُدٰهُمۡ وَ لٰكِنَّ اللّٰهَ يَهۡدِىۡ مَنۡ يَّشَآءُ ۝ (البقرة:٢٧٢)

**వారికి మార్గబోధన చేయడం నీ బాధ్యత కాదు. నిజానికి అల్లాహ్ తాను కోరిన వారికి మార్గబోధన చేస్తాడు.**

***(అల్ బకర : 272)***

ఇస్లామ్‌ను విశ్వసించేవారు ఇస్లామ్ సందేశాన్ని అందజేయడం వారికి విధి, కాని జనుల్ని విశ్వాసులుగా విధేయులుగా చేయడం మాత్రం విధి కాదు. వారి బాధ్యత సందేశ ప్రచారం మాత్రమే. వారు సందేశాన్ని అందజేసే బాధ్యత సక్రమంగా నెరవేర్చినట్లయితే తమ లక్ష్యాన్ని సాధించడంలో సఫలీకృతులయినట్లే. వారు తమ విధిని నిర్వర్తించారు. వారి సందేశాన్ని విన్న తరువాత విన్నవారు దాన్ని తిరస్కరిస్తే అది వారి తప్పు. దానికి వీరు దైవం వద్ద బాధ్యులుకారు.

మనముందు ప్రవక్తల దృష్టాంతాలున్నాయి. సందేశకుని విజయానికి ప్రమాణం, సంబోధితుడు అతని సందేశాన్ని స్వీకరించడమే అయినట్లయితే చాలా మంది దైవప్రవక్తలు

మనకు విఫలురయినట్లు అనిపిస్తుంది. వారు అత్యంత ఆర్ద్రహృదయంతో, శ్రేయోభిలాషతో జీవితాంతం ధర్మం వైపునకు పిలుపునిస్తూనే ఉన్నారు. అయినప్పటికీ వారు తమకు అత్యంత సన్నిహితులయినవారిని సయితం మార్చలేకపోయారు. మహనీయ నూహ్ (అలైహిస్సలామ్) ధర్మప్రబోధనా కృషి తొమ్మిదిన్నర వందల సంవత్సరాలు సాగింది కాని స్వయంగా ఆయన తనయుడే 'సంస్కారహీనుడి'గానే ఉండిపోయాడు. హజ్రత్ ఇబ్రాహీమ్ (అ) ఏకోన్ముఖ సందేశం ఆయన తండ్రినే సత్యవిధేయతకు సమాయత్తపరచలేకపోయింది. కడకు ఆయన తండ్రికి 'సలామున్ అలైక్' అని సలామ్ చెప్పి తండ్రి నుండి దూరమవ వలసి వచ్చింది. మహనీయ లూత్ (అ) తన భార్యకు మార్గోపదేశం చేశారు. కాని ఈ ఉపదేశం ఆమె యెడల నిష్ప్రయోజనమయిపోయింది. దేవుని శిక్ష వచ్చినప్పుడు ఈ నిర్ణయంతోపాటు వచ్చింది:

إِنَّا مُنَجُّوكَ وَ اَهْلَكَ إِلَّا امْرَأَتَكَ كَانَتْ مِنَ الْغَابِرِينَ○

(العنكبوت:٣٣)

**మేము నిన్నూ నీ ఇంటి వారినీ రక్షిస్తాము నీ భార్యను తప్ప. ఆమె వెనుక ఉండిపోయే వారిలో చేరిపోయింది.**

***(అల్ అన్కబూత్: 33)***

చివరి ప్రవక్త మహనీయ ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) సందేశం పట్ల ఆయన పినతండ్రి అబూ తాలిబ్ వైఖరిని గమనించండి. ఒక వైపున ఆయన ప్రవక్తను తన సంతానంకన్నా ప్రియప్రదంగా చూసుకునేవారు, ఆయన కోసం సకల విధాల కష్టాలను భరించారు, ప్రపంచంతోనే పోరాడటానికి సిద్ధమయ్యారు, కొండ చెరియల్లో నివసించడానికి సిద్ధమయ్యారు కాని తన తనయుడు ముహమ్మద్ (స)ను శత్రువులకు అప్పగించడానికి అంగీకరించరు. మరో ప్రక్కన ప్రవక్తశ్రీ (స) సందేశ ప్రచార కృషి జరుగుతూ పదేళ్ళు సాగాయి, కాని ఆయన దానికి తన తోడ్పాటును అందజేయరు. కడకు ఆయన అవసాన దశలో మరణశయ్యపైన ఉన్నప్పుడు ప్రవక్త (స) ఆయనకు చేరువయి,

ای عم قل لا اله الا الله كلمة احاجّ بها عند اللهِ

**"బాబాయి, దైవం తప్ప మరే ఆరాధ్యుడు లేడని ప్రకటించండి. నేను ఈ వచనం ఆధారంగా మిమ్మల్ని దైవం సమక్షంలో మీ మోక్షానికి ప్రయత్నిస్తాను" అని అన్నారు.**

***(బుఖారి)***

ఈ వాక్యానికి హృదయం ద్రవించవలసింది. కాని అబూ తాలిబ్ దాన్ని స్వీకరించలేదు. తమ తాతముత్తాతల ధర్మంపైనే ప్రాణాలు విడువటానికి ఇష్టపడ్డారు.

ఇంతేకాదు, దైవసందేశహరులు (స) తెలిపిన దాని ప్రకారం, ప్రవక్తల చరిత్రలో ఒక ప్రవక్తకు కేవలం ఒకే వ్యక్తి తోడయ్యాడు, ఆయన్ని అనుసరించి ముస్లిమ్ అయ్యాడు. అయినప్పటికీ ఆయన నిష్ఫలురయ్యాడని మనం అనగలమా? ఎంత మాత్రం కాదు. ఆయన ధర్మమార్గంలో తన శక్తినంతా వెచ్చించి ప్రచార బాధ్యతలు పూర్తిగా నిర్వర్తించారు. అందువల్ల ఆయన దైవసన్నిధిలో సంపూర్ణ ప్రతిఫలానికి పాత్రులయ్యారు.

కొందరు సందేశ వ్యాప్తికి ఎంతో ఉద్విగ్నులయి ఉంటారు. అయితే వారికి తమ నిజస్థితి ఏమిటో తెలియదు. వారు నిజానికి కేవలం దైవధర్మ సందేశకులు మాత్రమే, కాని వారు తమ్ముతాము ఇతరుల మార్గబోధనకు ఏకైక బాధ్యులయినట్లు తలపోస్తారు. ఇది ఒక భయంకరమయిన, వినాశకరమయిన తప్పు. ఇటువంటి వారు ఎంతో కాలం తమ సందేశ కార్యకలాపాలను కొనసాగించలేరు. అతి త్వరగా వారిలో నిరాశ చోటు చేసుకుంటుంది.

అసలు విషయం ఏమిటంటే, ఒక వ్యక్తి ఎంతో చిత్తశుద్ధితో సందేశ కార్యకలాపాలు నిర్వహిస్తాడు. అయితే అతను బహుకాలంగా కృషి జరిపినప్పటికీ సంబోధితుని ఆంతర్యం అతని సందేశం కొరకు తెరచుకోకపోవడం గమనించి, సత్యం విశదంగా తేటతెల్లపరచి నప్పటికీ అతను దాని తిరస్కారానికే ఒడిగట్టడం గమనించి, అతన్ని శ్రేయోభిలాషకు బదులుగా విరోధాన్ని ప్రదర్శించడం చూసి– నా ఈ జీవిత పర్యంతం చేసిన కృషి వృధా పోతుందా అని ఆలోచిస్తాడు. ఈ సందేశం విజయవంతం కాదా అని అనుమానపడ తాడు. నేను నా సంబోధితుణ్ణి తన అభిప్రాయం నుంచి తొలగించలేనా అని సందేహానికి లోనవుతాడు. ఇటువంటి భావనలు అతని నడుము విరగ్గొడతాయి. అతను ధైర్యం వీడి కూర్చుండిపోతాడు.

ఒక ఉత్తమ ప్రారంభానికి ఈ నిరాశాపూర్వకమయిన ముగింపు జరగడానికి కారణం, దైవం అతన్ని కేవలం, తాను సత్యమని నమ్మే ధర్మాన్ని ఇతరులకు అందజేయా లని ఆదేశించాడు. కాని అతనేమో తాను ఇతరుల్ని ఆ ధర్మాన్ని అవలంబించేలా చేసేందుకు నియమించబడినట్లు భావించుకున్నాడు. నిజానికి ఈ వ్యవహారంలో దేవుని చట్టం ఆయన గ్రంథంలో అతిస్పష్టంగా వివరించబడింది.

اِنَّکَ لَا تَهْدِیْ مَنْ اَحْبَبْتَ وَ لٰکِنَّ اللّٰهَ یَهْدِیْ مَنْ یَّشَآءُ ۝
(قصص:۵۶)

**ప్రవక్తా నీవు కోరిన వారికి మార్గబోధన చేయలేవు. అయితే అల్లాహ్ తాను కోరిన వారికి మార్గం చూపిస్తాడు.**

*(కసస్: 56)*

సత్యసందేశాన్ని ఎవరూ వినిపించుకోవటం లేదని, ప్రపంచం దాని వైపునకు మరలడం లేదని భగ్న హృదయుడయి తన సందేశ కార్యకలాపాలను మానుకునే వ్యక్తికి తెలిపే విషయం ఒక్కటే, దైవం నీకు ఏ భారం మోసే ఆదేశం ఇవ్వలేదో ఆ బరువు బాధ్యతలను నెత్తిన వేసుకున్నావు. నీవు లోనయి ఉన్న బాధకు నీ వద్ద నివారణ లేనేలేదు. జనుల్ని సన్మార్గాన వేయడం నీ బాధ్యత కాదు. మార్గబోధన అయినా, మార్గవిహీనత అయినా ఏ దైవం హస్తగతమయి ఉందో ఆయన పని ఇది. తన పని ఏదో మనిషి మరచిపోయి, దైవం చేసే పనిని తనదిగా భావించడం ఎంత అవివేక విషయం.

وَ اِنْ كَانَ كَبُرَ عَلَيْكَ اِعْرَاضُهُمْ فَاِنِ اسْتَطَعْتَ اَنْ تَبْتَغِيَ نَفَقًا فِي الْاَرْضِ اَوْ سُلَّمًا فِي السَّمَآءِ فَتَاْتِيَهُمْ بِاٰيَةٍ ؕ وَ لَوْ شَآءَ اللّٰهُ لَجَمَعَهُمْ عَلَى الْهُدٰى فَلَا تَكُوْنَنَّ مِنَ الْجٰهِلِيْنَ۝ (الانعام:٣٥)

వారు సత్యానికి విముఖులవడం నీకు బాధ కలిగిస్తూ ఉన్నట్లయితే నీవు భూమిలో ఏదయినా సొరంగం వెదకితీయి లేదా నిచ్చెన వేసుకుని ఆకాశానికి ఎక్కు, వారి కొరకు ఏదయినా సూచన తెచ్చి చూపు, తద్వారా వారు సత్యాన్ని తిరస్కరించకుండా ఉండటానికి. బాగా గుర్తుంచుకో, అల్లాహ్ కోరినట్లయితే వారిని మార్గబోధనపైన ఏకత్రం చేసేవాడే. అందువల్ల నీవు అజ్ఞానుల్లా వ్యవహరించకు.

*(అల్ అన్ఆమ్: 35)*

వాస్తవమేమిటంటే, ప్రపంచంలో ప్రతి వ్యక్తి తనదంటూ ఒక మార్గాన్ని నిర్ధారించుకున్నాడు. దానిపైనే అతను కళ్ళు మూసుకుని పరిగెడుతున్నాడు. అతను దాని ప్రేమలో పడి దాన్ని ఎట్టి పరిస్థితిలోనూ వదలుకోవడానికి సిద్ధంగా లేడు. కాని దైవధర్మం మటుకు సాహస జీవులయిన వారికే ప్రాప్తమవుతుంది. అటువంటి వారు తమ తప్పిదం తెలుసుకున్న తరువాత తమ వైఖరిని మార్చుకోగలుగుతారు, మిథ్యనే పట్టుకుని ఉండి పోవాలని నిర్ణయించుకోరు, సత్యాన్ని స్వీకరించడానికి సతతం సన్నద్ధులయి ఉంటారు.

సత్యం సత్యాన్ని కాంక్షించే వారికే ప్రాప్తమవుతుంది. సత్యపిపాసే లేని వారికి సత్య సందేశం అందజేసినా అది వృథా పోతుంది. సత్యసందేశం వారి చెవులకు సోకినా అది వారి హృదయాలలోకి దిగదు. సత్యం వెలుగు నలువైపులా వ్యాపించినప్పటికీ అతని కళ్ళు తెరచుకోవు. అతను దాన్ని కానలేకపోతాడు. ప్రపంచం సత్యాన్ని అనుసరిస్తూ ఉంటుంది, కాని అతని కాళ్ళు బరువెక్కి దాన్ని అనుసరించడం అతనికి కష్టతరమయి

పోతుంది. సత్యాన్ని పూర్తిగా అర్థం చేసుకున్న తరువాత దాన్ని తిరస్కరించే వ్యక్తికి సత్య స్వీకార మార్గాలు మూసుకు పోతాయి. ఇటువంటి పరిస్థితుల్లో ఖుర్ఆన్ బోధించేది, అటువంటి వారిని సందేశకుడు వారి మానాన వారిని వదలివేయాలని, అయితే అతను తన పనిని మటుకు కొనసాగిస్తూ ఉండాలి.

వారలా తిరస్కరించడానికి కారణం, సందేశకుడు తప్పుగా వ్యవహరిస్తున్నాడన్నది కాదు, అతను తన విధానాన్ని మార్చుకోవాలనీ అర్థం కాదు. సత్యం తనకు తోడయి ఉండగా జనులు కేవలం మంకుపట్టు, మొండితనాల కారణంగా తన్ను వ్యతిరేకిస్తున్నందుకు అతనికి తన మార్గం సత్యత పట్ల మరింత బలంగా నమ్మకం ఏర్పడాలి, తన విరోధులు బలహీన స్థానాన ఉన్నారన్న నమ్మకమూ కలగాలి. తన వద్ద ఆధారాల బల ముంది. వారు ఆధారాలు, నిర్ధారణల రీత్యా వట్టి చేతులతో నిలబడ్డారు. ఒక సందేశకునికి ప్రాప్తమయిన ఈ సంపద మహా గొప్పది. అది అతని విరోధులకు ఎంతమాత్రం ప్రాప్తం కాలేదు.

وَمَا يَسْتَوِى الْاَعْمٰى وَالْبَصِيْرُ ۙ وَلَا الظُّلُمٰتُ وَلَا النُّوْرُ ۙ وَلَا الظِّلُّ وَلَا الْحَرُوْرُ ۚ وَمَا يَسْتَوِى الْاَحْيَآءُ وَلَا الْاَمْوَاتُ اِنَّ اللّٰهَ يُسْمِعُ مَنْ يَّشَآءُ ۚ وَ مَآ اَنْتَ بِمُسْمِعٍ مَّنْ فِى الْقُبُوْرِ ۝ (فاطر:٢٠-٢٢)

గుడ్డివాడూ చూపుగలవాడూ సమానులు కాజాలరు; చీకటీ వెలుగులూ సమానం కాజాలవు; నీడా, ఎండలూ సమానం కాజాలవు, జీవించి ఉన్నవారూ మరణించినవారూ సమానులు కాజాలరు. నిస్సందేహంగా అల్లాహ్ తాను కోరిన వారికి తన మాటను వినిపిస్తాడు. గోరీలలో పడి ఉన్న వారికి నీవు వినిపించజాలవు. *(ఫాతిర్ : 20-22)*

## సందేశ సాఫల్యం- సందేశకుని సాఫల్యం - వ్యత్యాసం

చాలా మంది సందేశ సాఫల్యంలోనూ, సందేశకుని సాఫల్యంలోనూ వ్యత్యాసాన్ని గమనించరు. ఈ రెండూ వేర్వేరు విషయాలు. సందేశకుడు సఫలమవడానికి సందేశం విజయవంతం కావడం అవసరం లేదు, సందేశకుడు దైవధర్మం వైపునకు పిలుస్తూ పిలుస్తూ అంతమయిపోవడమూ సాధ్యమే, మానవాళిలో ఏ ఒక్క వ్యక్తి కూడా అతనికి తోడుగా నిలువకపోవడమూ సాధ్యమే. అలాగే అతను మిథ్యా వ్యవస్థను అంతమొందించి దేవుని పుడమిపైన దేవుని రాజ్యం స్థాపించగలగటమూ సాధ్యమే. అతను ఎట్టి పరిస్థితిలోనూ సఫలుడయినట్లే.

సందేశకుడు విజయం చెందడమంటే సత్యం క్రియారూపంలో ఆధిక్యత పొంది మిథ్య లొంగిపోవడంపైన ఆధారపడి లేదు. దీని సంబంధం సందేశకునితో కాదు, ఎవరికయితే సందేశం అందజేయబడుతోందో వారు దాని ఎడల ఎలా వ్యవహరిస్తు న్నారన్న విషయం పైనే అది ఆధారపడి ఉంది. వారు సత్యాన్ని స్వీకరించినట్లయితే సత్యం ఆధిక్యత పొందుతుంది. వారు దాన్ని తిరస్కరిస్తే అది ఆధిక్యత పొందజాలదు. దీని సంబంధం సందేశకునితో ఏ విధంగానూ లేదు. అతను విజయం పొందడానికి దాని మీదనే ఆధారపడి లేదు. సందేశకుని సందేశాన్ని ప్రపంచం యావత్తు కలసికట్టుగా నిరాకరించినా నీ మాటను తిరస్కరించడానికి కారణమేదీ అన్న ఆరోపణ అతని మీద రాదు. ఇది సందేశకుని లోపం కాదు, సంబోధితుల లోపం. మరి దేవుని సన్నిధిలో ఏ వ్యక్తీ మరో వ్యక్తి అపరాధానికి పట్టుబడటం జరగదు.

సత్యసందేశం ఎప్పుడు నెరిపినా తప్పనిసరిగా మిథ్య అన్నది ప్రపంచం నుండి అంతమయిపోవడం జరగనవసరం లేదు, సత్యం ఆధిక్యత పొంది రాజ్యమేలడమూ అవసరం లేదు. ఇక్కడ సత్యం అన్యాయానికి గురయి పీడితంగా ఉన్న స్థితినీ చూడటం జరిగింది. దానికి విజయమూ సాఫల్యమూ ప్రాప్తమయ్యాయి. కాని సందేశకుడు సదా విజయుడే అయ్యాడు. అతడు ఎట్టి పరిస్థితిలోనూ నిష్ఫలుడవడు. సత్యం విజయవంత మవడమంటే విరోధశక్తులు దాని దారికి అడ్డంగా నిలువక తొలిగిపోవడం, అది ప్రపం చాన అంతటా విస్తరించడం. కాని సందేశకుని విజయం ఏమిటంటే, అతను సందేశం కొరకు తన సర్వస్వాన్నీ ధారపోయడం.

సందేశకుడు అన్నింటినీమించి ఆశించేదేమిటంటే, సత్యం ఆధిక్యత పొంది, మిథ్య పైన అధీనం సాధించాలన్నది; ప్రపంచంలో దైవాదేశాల మేరకు వ్యవహారాలన్నీ తీర్పు జరగాలన్నది; ప్రపంచంలోని బూటకపు న్యాయస్థానాలన్నీ అంతమొందాలన్నది. అతను నింపాదిగా, నెమ్మదిగా కూర్చోలేడు, దైవధర్మం సమస్త ధర్మాలపైన విజయం సాధించ నంత వరకు, ఎల్లెడలా దాని పరిపాలనే సాగనంత వరకు అతను ప్రశాంతంగా కూర్చోడు. అతను తన ఈ కృషిలో తన్ను తాను నాశపరచుకుంటే నిశ్చయంగా అతను విజయుడే– అతని ప్రయత్నాల వల్ల సందేశం విజయం సాధించినా సాధించకపోయినా సరే.

సందేశకుడు తన సందేశ వ్యాప్తి మార్గంలో విభిన్న దశల్ని దాటవలసి ఉంటుంది. ఒకసారి అతను ఇతరులకు తన సందేశాన్ని అందజేస్తాడు. ఒక్కోసారి విరోధుల అత్యాచా రాలను భరిస్తాడు. ఒక్కప్పుడు సత్యకాముకులను సంఘటితపరుస్తాడు. ఒక్కోసారి విజయాసనాలను పరుస్తాడు. సందేశానికి సంబంధించిన ఈ అంతిమ దశ రాకపూర్వమే

సందేశకుడు అంతమయిపోయినట్లయితే నిస్సందేహంగా సందేశ కార్యం ఇంకా మిగిలి ఉందన్న మాటే, కాని సందేశకుని కర్తవ్యం నెరవేరింది. సందేశం ఏ దశలో ఉండగా అతను అసువులు బాసినా అదే అతని గమ్యం. అతని ప్రతి దశ కూడా సాఫల్య దశయే. అతను ఎక్కడ అంతమయినా అతను సఫలుడే.

مِنَ الْمُؤْمِنِيْنَ رِجَالٌ صَدَقُوْا مَا عَاهَدُوا اللّٰهَ عَلَيْهِ ۚ فَمِنْهُمْ مَنْ قَضٰى نَحْبَهٗ وَ مِنْهُمْ مَنْ يَّنْتَظِرُ ۖ وَمَا بَدَّلُوْا تَبْدِيْلًا ۝ (الاحزاب:٢٣)

**విశ్వసించిన వారిలో ఎందరు పురుషులు తాము దైవానికి చేసిన వాగ్దానాన్ని నిజం చేసి చూపించారు. వారిలో కొందరు తమ వాగ్దానాన్ని నెరవేర్చిన వారయితే మరి కొందరు దానికి నిరీక్షిస్తున్నారు. వారు తమ ఈ వాగ్దానానికి ఎన్నడూ విముఖులవలేదు.** ***(అల్ అహ్జాబ్:23)***

ఖుర్ఆన్ ప్రకారం, సత్యానికి ఆధిక్యత కలగజేయడం, మిథ్యను లొంగదీయడం మానవుల అధీనంలో లేదు. అది అల్లాహ్ హస్తగతమయిన విషయం. అందువల్ల దాన్ని అల్లాహ్‌కే అంకితం చేయండి. ఆయన, తాను కోరినప్పుడు తన ధర్మాన్ని సమున్నత పరుస్తాడు, కాని ఫలితాలకు నిరాశ చెంది మీరు మీ కృషిని మానుకోరాదు. అలా చేసినట్లయితే అదే మీరు పొందే మహా పరాజయం!

وَ اِنْ مَّا نُرِيَنَّكَ بَعْضَ الَّذِىْ نَعِدُهُمْ اَوْ نَتَوَفَّيَنَّكَ فَاِنَّمَا عَلَيْكَ الْبَلٰغُ وَ عَلَيْنَا الْحِسَابُ ۝ (الرعد:٤٠)

**మేము ఏ శిక్షనయితే వారికి వాగ్దానం చేస్తున్నామో దాని ఓ భాగాన్ని నీకు ఇహలోకంలోనే చూపిస్తాము లేదా దాని రాకకు పూర్వం నిన్ను ఇహలోకం నుండి రప్పించుకుంటాము. నీవు దాన్ని గురించి చింతించకు. నీ బాధ్యత అయితే దేవుని ధర్మాన్ని అందజేయడం మాత్రమే, మా పని అందరి లెక్క చూడటం.** ***(అర్రా'ద్:40)***

## సందేశ ఫలితాలు

మానవుడు సహజంగానే తన ఆచరణల ఫలితాలు ప్రపంచంలోనే చూడాలని కోరుకుంటాడు. ఫలితాలకు అతీతంగా పనిచేయడం మనిషికి కష్టసాధ్యమయిన విషయం. కాని మనం ఫలితాలను రాజకీయ ఆధిక్యత నుండి వేరుచేసి చూసినట్లయితే ఒక విషయం

మటుకు స్పష్టమవుతుంది. ఒక వ్యక్తి చిత్తశుద్ధితో దైవధర్మ సందేశాన్ని చేబూని బయలుదేరినట్లయితే, అతను దానికి ఆధిక్యతను సముపార్జించి పెట్టకపోయినా అతని పిలుపు ఏ మేరలకు చేరుతుందో అక్కడల్లా దాని ప్రభావాన్ని ఎంతో కొంత తప్పనిసరిగా వదలిపెట్టకపోదు. చరిత్రే దీనికి సాక్ష్యం.

ప్రపంచంలో ఎందరో వ్యక్తులున్నారు. వారు సత్యత, సంకల్ప శుద్ధి, నిజాయితీ, దైవభక్తి, దైవభీతి, పరిశుద్ధత, పవిత్రతల సందేశాన్ని అందజేశారు. వారి ఈ సందేశానికి ఫలితంగా ఎటువంటి రాజకీయ విప్లవం రాలేదు కాని వాస్తవానికి వారి బోధనలు వారి విరోధుల ఆంతర్యాల్లోనూ చప్పుడు చేయకుండా ప్రవేశించాయి. వారు అనేక వ్యవహారాల్లో ఆ సందేశకులు చూపెట్టిన విలువలకు లోబడే ఆలోచించసాగారు. దానికి వారు వివశులయిపోయారు. ఆ విలువలు వారి జీవితాల్లో అంతర్భాగమయిపోయాయి. వాస్తవంగా ఒక బలీయమయిన సందేశం వెలిసినప్పుడు, దాని ప్రభావాలకు వాతావరణం ప్రభావితం కాకుండా, దానికి అతీతంగా మెలగటం కష్టమయిన విషయం. కొన్ని సందర్భాలలో ఈ ప్రభావాలు భౌతికంగా గట్టిగా మనకు కానరాకపోవచ్చు. కాని అవి మానవ రక్తంలో అంతర్లీనమయి, అతని నరనరాల్లో ప్రాకుతుంటాయి. అతనికి కూడా వాటి స్పృహ లేకపోవచ్చు. అవి అతని భావోద్రేకాలు, భావనల్లోనూ చేరిపోతాయి. అతనికి వాటిని గురించి స్పృహ, చేతన కూడా ఉండకపోవచ్చు.



# ధర్మతిరస్కారం - కారణాలు*

అల్లాహ్ తన ధర్మాన్ని అతివివరంగా తెలిపాడు. దాన్ని గంభీరంగా పరిశీలించిన వారు అది సత్యమని గ్రహిస్తారు. కాని వాస్తవం ఏమిటంటే, దాన్ని ఎన్నడూ మానవు లెల్లరూ స్వీకరించలేదు. ప్రతి యుగంలోనూ అసంఖ్యాక జనులు దాన్ని తిరస్కరించిన వారున్నారు. నేడు కూడా దాన్ని కాదన్నవారే అత్యధిక సంఖ్యలో ఉన్నారు. ఖుర్ఆన్ దీని కారణాలను సవివరంగా పరిశీలించింది. ధర్మసందేశాన్ని అందజేయాలని కోరుకునే వ్యక్తి ఈ కారణాలను తెలుసుకోవడం అనేక విధాలా చాలా ప్రయోజనకరమయినది, అవసరమయినదీను.

(1) దీని వల్ల దైవధర్మ తిరస్కారం ఎందుకు జరుగుతుందో తెలిసిపోతుంది, దాని నివారణ కూడా తెలుసుకోవచ్చు. మేము ఆ కారణాలను కేవలం సూత్రప్రాయంగా విశ్లేషించాము. అయితే వాటిని వర్తింపజేయడం ఏమంత కఠినమయిన పని కాదు. వాటి వెలుగులో, ఏ వ్యక్తి ఏ కారణాల వల్ల ధర్మాన్ని కాదంటాడో వాటిని ఎలా దూరం చేయాలో గ్రహించడం సులువవుతుంది.

(2) కొన్ని సందర్భాలలో ఒక సిద్ధాంతాన్ని ఎంతో శక్తితో తీవ్రంగా వ్యతిరేకించడం జరుగుతుంది. ఫలితంగా దాన్ని నమ్మేవారు సయితం తమ స్థయిర్యాన్ని కోల్పోతారు. ధర్మసందేశకుడు, దైవధర్మం పటిష్టమయిన నిదర్శనాల ఆధారంగా నెలకొన్నదన్న సత్యాన్ని గ్రహించి, దాన్ని వ్యతిరేకించేవారు చాలా స్థూలంగా భావోద్రేకాల ఆధారంగా వ్యతిరేకిస్తు న్నారన్న యదార్థాన్ని గ్రహించినప్పుడు అతని విశ్వాసం మరీ పటిష్టమవుతుంది, ఇతోధిక మవుతుంది. అతను సంపూర్ణ విశ్వాసబలంతో దాన్ని సంబోధితుని సమక్షంలో పెట్టగలుగుతాడు.

---

* మానవుడు ధర్మాన్ని తిరస్కరించే కారణాలలో కొన్ని స్వయాన అతని ఆంతర్యంలోనే ఉంటాయి. కొన్ని అతని వాతావరణంలో, బాహ్యలోకంలో ఉంటాయి. ఇక్కడ కేవలం తొలి రకం కారణాలను చర్చిస్తున్నాము. రెండవ రకం కారణాలను మా పుస్తకం 'మానవుడు – సమస్యలు'లో చర్చించడం జరిగింది.

(3) ధర్మతిరస్కారానికి గల ఈ కారణాలు, ధర్మం ప్రస్ఫుటమయి ముందుకు వచ్చిన తరువాత కూడా మనిషి దాన్ని ఎందుకు నిరాకరిస్తున్నాడో తెలుపడంతోపాటు, అంతర్గతంగా ధర్మాన్ని నమ్మే వ్యక్తికి తన లోటుపాట్లను గమనించే అవకాశాన్నీ కలుగ జేస్తాయి. వీటిని పరిశీలించిన తరువాత తాను ధర్మాన్ని స్వీకరించినప్పటికీ దానికి దూరంగా ఎందుకు ఉన్నాడో కూడా తెలుసుకోగలుగుతాడు. దైవధర్మం దాన్ని స్వీకరించిన వారిలో పెంపొందించదలచిన ఆ మహత్తర పరివర్తన తనలో కలగకపోవడానికి కారణ మేమిటో తెలుసుకోగలుగుతాడు. ధర్మాన్ని సత్యమని నమ్మినప్పటికీ దాన్ని పరిపూర్ణంగా అనుసరించకుండా వారిస్తున్న విషయం ఏమిటో అర్థం చేసుకోగలుగుతాడు.

నిజానికి ఈ ఆచరణశూన్యతకు కారణాలు కూడా చిన్న స్థాయిలో నిరాకరణకు గల కారణాలే. అందువల్ల ఈ విశ్లేషణలో ధర్మవిశ్వాసుల సుశిక్షణా సామగ్రి కూడా ఉంది. ధర్మసేవ చేయాలని బయలుదేరినవారి వైఖరి, దైవధర్మ విరోధులు, దాన్ని రూపుమాపాలని కోరుకునే వారికి పూర్తిగా భిన్నమయినది కావడం అవసరం. అలాకాని పక్షంలో దైవధర్మ సందేశకులు, దానికి భాష్యం చెప్పేవారు అవడం అలా ఉంచి దైవధర్మాన్ని అనుసరించే వారుగా కూడా రూపొందజాలరు.

ఇవన్నీ ఆ కారణాలను తెలుసుకోవడం వల్ల కలిగే ఉప ప్రయోజనాలు. అసలు ప్రయోజనమయితే వేరు అది దైవధర్మాన్ని కాదనేవారిని నేరుగా ఎత్తి చూపుతుంది. వారి వైఖరి ఎంతగా అసమంజసమయిందో, అహేతుకమయిందో తెలుపుతుంది. ఈ కారణాలకు ఎట్టి పరిస్థితిలోనూ ఎటువంటి సహేతుకతనూ సేకరించడం సాధ్యం కాదు. ఈ వైఖరి వల్ల వారు అత్యంత భీకరమయిన పరిణామాన్ని ఎదుర్కోబోతున్నారని అవి ప్రస్ఫుటపరుస్తాయి.

ధర్మతిరస్కారానికి ప్రముఖ కారణాలను మనం ఇక పరిశీలిద్దాము.

## తప్పుడు ఆలోచనల ఆధిక్యత

సరయిన చింతన మనిషికి దైవధర్మం ద్వారానే ప్రాప్తమవుతుంది. అదొక్కటి తప్ప మిగతా ఆలోచనలు, సిద్ధాంతాలన్నీ తప్పయినవి, అసత్యమయినవి. ఎవరయితే దైవధర్మాన్ని కాదంటాడో అతను ఏదో ఒక తప్పుడు చింతనాపథాన్ని అనుసరించడం తప్పనిసరి అవుతుంది. అతనికి త్వరగానే తన తప్పు ఏమిటో అనే గ్రహింపు కలగకపోతే ఆ తప్పును తప్పుగా ఒప్పుకునేందుకు నిరాకరిస్తాడు. పైగా దాన్ని సమర్థిస్తూ నిదర్శనాలు సేకరించి పెడతాడు. దీనికి కేవలం మానసికమయిన కారణం ఒక్కటే.

ఒక చింతనాపథాన్ని చాలా కాలం వరకు పాటించడం మూలాన మనిషికి దాని పట్ల ప్రేమ పుడుతుంది. దాని పట్ల అతనిలో ఓ మాదిరి దురభిమానం ఏర్పడుతుంది.

ఈ అభిమానం ఓ సరయిన చింతనాపథం గురించి ఏర్పడితే అది శ్లాఘనీయమే. తద్వారా స్వయంగా అతనికీ, ఇతరులకూ ప్రయోజనం ఒనగూడుతుంది. కాని అదే అభిమానం తప్పుడు చింతనాపథం గురించి ఏర్పడితే దాన్ని ఎట్టి పరిస్థితిలోనూ ప్రశంసించలేము. అది స్వయంగా అతనికీ, అతను మనుగడ సాగించే సమాజానికీ వినాశహేతువుగా రూపొందుతుంది. ఒక తప్పుడు ఆలోచనాపద్ధతిని అనుసరిస్తూ సరయిన చింతనా పథానికి మరలడానికి అతి పటిష్టమయిన మానసిక బలమున్న వ్యక్తి వల్లనే సాధ్యమవు తుంది. అతను తన వైఖరిని విమర్శనాత్మకంగా పరిశీలించగలిగే సాహసోపేతుడయి ఉండాలి. ఇటువంటి వారు బహుస్వల్పంగా ఉంటారు.

సర్వసాధారణంగా ఒక వ్యక్తిపైన ఓ తప్పుడు చింతనాపథం అవహిస్తే అతని మనస్తత్వం దైవధర్మం విషయంలో మారిపోతుంది. అతను ధర్మాన్ని అర్థం చేసుకునేందుకు ప్రయత్నించడు. అతని శక్తి అంతా అభ్యంతరాలు తెలుపడంలోనూ, విమర్శలు కురిపించడంలోనే వెచ్చించబడుతుంది. దైవధర్మాన్ని తిరస్కరించడానికి అతనికి ఎటువంటి నిదర్శనమూ ఆధారమూ అవసరముండదు, చాలా చిన్న సాకు చాలు, కాదని నిరాకరిస్తాడు. ఖుర్ఆన్ పరిభాషలో అతనిపై షైతాన్ పట్టు మరీ పటిష్టమయిపోతుంది. షైతాన్ అతన్ని అతివేగంగా తప్పు త్రోవలోకి నెట్టివేస్తాడు. అతన్ని వంచనకూ గురిచేస్తాడు. తాను రుజుమార్గానే ఉన్నాడన్న అపోహను అతనికి కలుగజేస్తాడు. అతను ఎంతో బలీయమయిన ఆధారాలతోటే దైవధర్మాన్ని నిరాకరించాడని భ్రమ కలిగిస్తాడు.

وَ مَنْ يَّعْشُ عَنْ ذِكْرِ الرَّحْمٰنِ نُقَيِّضْ لَهٗ شَيْطٰنًا فَهُوَ لَهٗ قَرِيْنٌ۝ وَ اِنَّهُمْ لَيَصُدُّوْنَهُمْ عَنِ السَّبِيْلِ وَ يَحْسَبُوْنَ اَنَّهُمْ مُّهْتَدُوْنَ۝

(الزخرف:٣٦،٣٧)

**ఏ వ్యక్తి అయితే కరుణామయుడయిన దైవం సంస్మరణ నుండి విముఖుడవుతాడో మీలో అతనిపైన ఒక షైతాన్‌ని ఆధిక్యత కలుగజేస్తాము. వాడు అతనికి మిత్రుడయి పోతాడు. ఈ షైతానులు వారిని రుజు మార్గం నుండి వారిస్తారు. అయితే వారేమో తాము సన్మార్గానే ఉన్నామని భావించు కుంటూ ఉంటారు.**

***(అజ్ జుఖ్రుఫ్:36-37)***

అల్లాహ్ తన ధర్మాన్ని అవతరింపజేసే ముందు ధర్మవ్యతిరేక సిద్ధాంతాలన్నింటినీ రూపుమాపలేదు, వాటికి మనగలిగే అవకాశం కల్పించాడు. ధర్మంతో పాటు అవి కూడా తమ పని చేసుకుంటూ పోయేలా వాటికి అవకాశాన్నిచ్చాడు. ఇదే మానవుని పరీక్ష. దీని ద్వారానే ఏ వ్యక్తికి దైవధర్మం ఎంతగా ప్రీతిపాత్రమో తేలిపోతుంది,

దైవధర్మంతో పోటీపడే సిద్ధాంతాలను అవలంబించే వారెవరో కూడా స్పష్టమయిపోతుంది. కాగా దైవధర్మం మానవుల సమక్షంలోకి వచ్చినప్పుడల్లా మిథ్యావాదాలు పూర్తి బలంతో దాన్ని వ్యతిరేకించాయి. దాన్ని రూపుమాపడానికి, లోబరుచుకోవడానికి సకల ప్రయత్నాలూ చేశాయి. ఖుర్‌ఆన్ ఈ విషయాన్నే తెలుపుతుంది:

وَ كَذٰلِکَ جَعَلْنَا لِكُلِّ نَبِيٍّ عَـدُوًّا شَيٰطِيْنَ الْاِنْسِ وَالْجِنِّ يُوْحِيْ بَعْضُهُمْ اِلٰى بَعْضٍ زُخْرُفَ الْقَوْلِ غُرُوْرًا وَلَوْ شَآءَ رَبُّکَ مَا فَعَلُوْهُ فَذَرْهُمْ وَمَا يَفْتَرُوْنَ ○ وَلِتَصْغٰى اِلَيْهِ اَفْئِدَةُ الَّـذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِالْاٰخِرَةِ وَلِيَرْضَوْهُ وَلِيَقْتَرِفُوْا مَا هُمْ مُّقْتَرِفُوْنَ○ (الانعام:١١١،١١٢)

ఈ విధంగా మేము మానవుల్లోని, జిన్ను ల్లోని షైతానుల్ని ప్రతి ప్రవక్తకూ శత్రువుగా చేశాము. వారు మోసపుచ్చుకోవడానికి ఒకరి హృదయాల్లో మరొకరు ఆహ్లాదకర మయిన విషయాలు ప్రేరేపించుకుంటూ ఉంటారు. అల్లాహ్ కోరినట్లయితే వారు అలా చేసేవారేకారు. కాగా నీవు వారినీ వారి కాల్పనిక వాదాలను అల్లాహ్‌కు వదలిపెట్టు. ఇదంతా మేము వారిని చేయ నిస్తున్నామంటే పరలోకాన్ని విశ్వసించని వారి అంతర్యాలు దాని వైపునకు మరల గలిగి వారు దానికే ఇష్టపడేవారయి పోవా లని, వారు సంపాదించుకోదలచిన చెడుగు లన్నీ సంపాదించుకోగలగాలనీను.

*(అల్ అన్‌ఆమ్:111,112)*

దైవధర్మం సదా ఒక్కటే, కాని దాన్ని ఎదిరించే వారు విభిన్న కాలాల్లో విభిన్న సిద్ధాంతాల అనుయాయులు. ఆ సిద్ధాంతాలను ఎవరు దైవధర్మంతో పోల్చిచూసినా ప్రతి సిద్ధాంతమూ మానవ ఆలోచనల్లోని కొరతలకు ప్రత్యక్ష నిదర్శనం అని తెలుసుకుంటారు. మోక్షం అన్నది కేవలం దైవధర్మం ద్వారా మాత్రమే ప్రాప్తిస్తుందనీ గుర్తిస్తారు. దైవం మానవునికి ఆలోచించే అర్థం చేసుకునే శక్తిసామర్థ్యాలనిచ్చాడు. మనిషి సత్యాసత్యాలలో వ్యత్యాసాన్ని పోల్చుకోగలడు. అయితే మిథ్యాసిద్ధాంతాలు అతని మనోమస్తిష్కాలను ప్రగాఢంగా ఆక్రమించుకుంటాయి. అతను వాటిని వదలి ఆలోచించడానికి సయితం సిద్ధం కాడు.

لَهُمْ قُلُوْبٌ لَّا يَفْقَهُوْنَ بِهَا وَلَهُمْ

వారికి హృదయాలున్నాయి కాని వారు వాటి ద్వారా యోచించరు; వారికి కన్ను లున్నాయి కాని వారు వాటి ద్వారా

اَعْيُنٌ لَّا يُبْصِرُوْنَ بِهَا وَلَهُمْ اٰذَانٌ لَّا يَسْمَعُوْنَ بِهَآ اُولٰٓئِكَ كَالْاَنْعَامِ بَلْ هُمْ اَضَلُّ اُولٰٓئِكَ هُمُ الْغٰفِلُوْنَ○ (الاعراف:١٧٩)

చూడరు; వారికి చెవులున్నాయి కాని వారు వాటి ద్వారా వినరు. వీరు పశువుల్లాంటి వారు, అంతేకాదు అంతకన్నా హీన మయిన వారు. వీరే ఏమరుపాటుకు లోనయి ఉన్నవారు. *(అల్ ఆరాఫ్: 179)*

ఎవరయితే మిథ్యావాదాలకు దాసుడయిపోతాడో అతని సమక్షంలో దైవధర్మాన్ని దైవసందేశకుడు అందజేసినా అతను దాన్ని అతిసునాయాసంగా తిరస్కరించగలుగు తాడు. దైవసందేశకుడు సత్యధర్మాన్ని బలపరిచే గట్టి నిదర్శనాలను ముందుంచటడం వల్ల అతను అవాక్కయి పోవడం సాధ్యమే. కాని అతని మనోకవాటాలు దైవధర్మాన్ని ఆహ్వానించడానికి తెరచు కోజాలవు.

وَ قَالُوْا قُلُوْبُنَا فِيْٓ اَكِنَّةٍ مِّمَّا تَدْعُوْنَآ اِلَيْهِ وَ فِيْٓ اٰذَانِنَا وَقْرٌ وَّ مِنْۢ بَيْنِنَا وَ بَيْنِكَ حِجَابٌ فَاعْمَلْ اِنَّنَا عٰمِلُوْنَ○ (حم السجدة:٥)

వారంటున్నారు, నీవు ఏ విషయం వైపు నకు మమ్మల్ని ఆహ్వానిస్తున్నావో వాటి విషయంలో మా హృదయాలపైన తెరలు పడిపోయాయి, మా చెవులు బండబారి పోయాయి, మాకూ నీకూ మధ్యన ఒక చాటు తెర అడ్డుగా ఉంది. అందువల్ల నీవు నీ స్థానాన పని చేసుకుంటూ ఉండాలి, మేమూ మా స్థానాన మా పని చేసుకు పోతూ ఉన్నాము. *(హామీమ్ అస్సజ్దా: 5)*

## దురాచరణ పట్ల ప్రేమ

నిజధర్మాన్ని స్వీకరించడంలో మనిషికి అడ్డు వచ్చే విషయం మానవుని తప్పుడు ఆచరణ కూడా ఒకటి. మనిషి ఏదయినా తప్పుడు జీవన పంథాను అనుసరించినట్లయితే అతను సరయిన మార్గం నుండి తప్పుకుంటాడు, తప్పుడు మార్గాన ముందుకు సాగుతాడు. సరయిన ఆలోచనా విధానాన్ని ఆశ్రయిస్తే అతని జీవన వ్యవస్థ అంతా సమగ్ర మయిపోతుంది. ఏదయినా ఆలోచనా విధానంలోగల మంచీ చెడులను స్వచ్ఛమైన శాస్త్రీయ, బౌద్ధిక ఆధారాలతో తెలుసుకోవడం నిశ్చయంగా అతిసంక్లిష్టమయిన విషయమే. అయితే దాని ఫలితాలను చూసి అది సరయినదో కాదో నిర్ణయించడం, పోల్చిచూస్తే చాలా వరకు సులభమయిన కార్యమే.

ఒక వ్యక్తికి తప్పుడు ఆలోచనల ఫలితాలు అసహనానికి గురిచేస్తే అతనికి ధర్మం లోని వాస్తవికత అతిసులువుగా తేటతెల్లమవుతాయి. అయితే ఆ ఫలితాల పట్ల సంతుష్టిగా ఉన్న వ్యక్తి ధర్మం వైపునకు మరలడం చాలా కష్టసాధ్యమయిన విషయం. ప్రపంచంలో చాలా మంది ఈ కారణంగానే దైవధర్మాన్ని వదలి జీవిస్తున్నారు. వారికి అసలు స్పృహే లేదు; తప్పుడు ఆలోచనలు, సిద్ధాంతాలు వారి జీవితాలను ఏ మేరకు కలతలకు, కల్లోలాలకు గురిచేసి పెట్టాయో వారు గ్రహించలేకున్నారు.

సరయిన ఆలోచనా విధానం లేకపోవడం చేత వారి నైతికత సర్వనాశనమయి పోయింది. వారి సామాజిక వ్యవస్థ ఛిన్నాభిన్నమయిపోయింది. వారి ఆర్థిక, రాజకీయ జీవితంలో కలతలు పుట్టాయి. అయినప్పటికీ వారిలో తమను సంస్కరించుకోవాలన్న వ్యాకులత, తపన ఏ కోశానా కానరాదు. ఖుర్ఆన్ ప్రకారం, వారు బుద్ధిజ్ఞానాలున్నప్పటికీ, మంచీ చెడుల మధ్య వ్యత్యాసాన్ని గ్రహించగలిగినప్పటికీ షైతాన్ వారి దుర్ వ్యవహారాన్ని వారి దృష్టిలో అత్యంత శోభాయమానం చేసి పెట్టాడు. తాము చేసేవన్నీ అత్యంత సత్కార్యాలన్న వంచనకు గురయి ఉన్నారు వారు.

وَ زَيَّنَ لَهُمُ الشَّيْطٰنُ اَعْمَالَهُمْ فَصَدَّهُمْ عَنِ السَّبِيْلِ وَ كَانُوْا مُسْتَبْصِرِيْنَ۝ (العنكبوت:٣٨)

**షైతాన్ వారి ఆచరణల్ని వారికి తీర్చిదిద్ది పెట్టాడు; వారిని సన్మార్గం నుండి ఆపి ఉంచాడు, నిజానికి వారు తెలివితేటలున్న వారే.** ***(అల్ అన్కబూత్: 38)***

మానవునికి మోక్షమార్గం ఒక్కటే, దైవధర్మం ఏ విశ్వాసాలను అందజేస్తుందో వాటిని స్వీకరించడం, నైతికతకు ఏ ప్రమాణాలనయితే నిలుపుతుందో వాటిని పాటించడం, సంస్కృతీ నాగరికతలు, సామాజిక వ్యవస్థను గురించి ఏ మర్యాదల్ని నేర్పుతుందో వాటి ప్రకారం నడచుకోవడం, ఆర్థిక, రాజకీయ సిద్ధాంతాలను వేటిని ప్రతిపాదిస్తుందో వాటి కనుగుణంగా వ్యవహరించడం, న్యాయం, చట్టం గురించి ఏ సూత్రాలనయితే సూచిస్తుందో వాటిని చిత్తశుద్ధితో స్వీకరించి జీవితాన్ని వాటికి కట్టుబడి సాగేలా తీర్చిదిద్దడం. కాని ఏ వ్యక్తి తన నిష్ఫల జీవితాన్నే ఫలవంతమయినదిగా పరిగణిస్తాడో, స్వయంగా తానే నాశనమవగోరితే అతన్ని రక్షించగలిగే వాడెవడు?

اَفَمَنْ زُيِّنَ لَهٗ سُوْٓءُ عَمَلِهٖ فَرَاٰهُ حَسَنًا ؕ فَاِنَّ اللّٰهَ يُضِلُّ مَنْ يَّشَآءُ وَ

**ఏ వ్యక్తికయితే అతని దురాచరణ శోభాయమానంగా రూపొందించబడిందో, అతను దాన్ని ఉత్తమమయినదిగా పరిగణిస్తాడో అతని మాటేమిటి? (అతను సదాచరణను**

ఆచరించేవానిగా కాగలడా?) వాస్తవానికి అల్లాహ్ తాను కోరినవారిని దారి తప్పిస్తాడు, తాను కోరినవారికి దారి చూపిస్తాడు. అటువంటి వారి కొరకు నీ ప్రాణాలు పోగొట్టుకోరాదు. వారు చేసేదేమిటో అల్లాహ్‌కు నిశ్చయంగా బాగా తెలుసు. *(ఫాతిర్ : 8)*

يَهْدِىْ مَنْ يَّشَآءُ فَلَا تَذْهَبْ نَفْسُكَ عَلَيْهِمْ حَسَرَاتٍ ؕ اِنَّ اللّٰهَ عَلِيْمٌ ۢبِمَا يَصْنَعُوْنَ ○ (فاطر:٨)

## అధిక సంఖ్యాకుల అనుసరణ

దైవధర్మాన్ని స్వీకరించడం అంతసులువయిన పని కాదు. ముఖ్యంగా సత్యా సత్యాలను తమ స్వంత కళ్ళతోకాక ప్రపంచ చక్షువులతో పరికించే వారికి మరీను. అటువంటివారు అవలంబించే ప్రతి వైఖరి ప్రపంచ వైఖరే నిర్ణయిస్తుంది. ప్రపంచ వైఖరి మారిపోతే వారి పోకడ కూడా మారిపోతుంది. ఇటువంటి వారు ఒక విధానాన్ని దాని ఆధారాల మూలంగా స్వీకరించరు, దాని మూలంగా తిరస్కరించరు కూడా. ఏ సిద్ధాంతానికి వారు అనుకూలంగా ఉన్నా ప్రతికూలంగా ఉన్నా అది ప్రపంచం అనుసరించే తీరుపైన ఆధారభూతమయి ఉంటుంది. వారి దృష్టిలో ప్రపంచం దేన్ని స్వీకరిస్తుందో అది సత్యం, మరి దేన్ని స్వీకరించదో అది అసత్యం, మిథ్య.

దైవధర్మం సమకాలీన సిద్ధాంతాలను సమస్త కోణాలలో ఎదిరించి సవాళ్ళు విసిరినప్పుడు, అది దాని సత్యతను అత్యంత బలోపేతంగా నిరూపించినప్పుడు, బుద్ధిజ్ఞానాల రంగంలో దాన్ని వ్యతిరేకించడం అసాధ్యమయిపోయినప్పుడు, వారు తమ నలువైపులా కళ్ళప్పగించి ఎంతగానో చూడటం మొదలెడతారు. ప్రపంచం ఇటువంటి దైవధర్మాన్ని స్వీకరించడం లేదేమిటీ అని ఆశ్చర్యపోతారు. కాని స్వయంగా వారికి ధైర్యం చాలదు, ప్రపంచ పోకడకు భిన్నంగా తమ దుష్ట నమ్మకాలను వదలి దైవధర్మాన్ని స్వీకరించి దానికి లోబడి, దాన్ని అనుసరించేవారుగా మారేందుకు సాహసించలేరు. వారి ఆలోచనలు వారికి సంతృప్తిని కలిగిస్తాయి. దైవధర్మం అన్ని విధాలా సత్యమనే అనిపిస్తున్నా ప్రపంచం దాన్ని స్వీకరించడం లేదంటే అందులో నిశ్చయంగా ఏదో చెడుగు ఉంటుంది; ప్రపంచ ప్రజలందరూ అపమార్గాన నడుస్తూ కేవలం కొందరు మాత్రమే సత్యమార్గాన సాగడం అన్నది ఎలా సాధ్యమవుతుంది? ఇదీ వారి ఆలోచనా తీరు.

ఇలా ఆలోచించేవారు, ఇంత క్రింద స్థాయిలోకి అంతర్యాన్ని తీసుకుపోయినవారు, ఒకే పరిశుద్ధమయిన దానికి బదులుగా మాలిన్యానికి ప్రాధాన్యమిచ్చే వారు– కేవలం అది అధిక పరిమాణంలో ఉన్నదన్న కారణాన – దానికి ప్రాధాన్యమిచ్చేవారు ఉన్నత ఆలోచనా

సరళిని అనుసరిస్తారని ఎలా ఊహించగలం? దైవధర్మం పరిశుద్ధ అభిరుచి, ఉత్తమ ఆలోచనా సరళిగల వారికే ప్రాప్తమవుతుంది, ప్రపంచ పోకడ కారణంగా కాక దాని ఉత్తమ లక్షణాల కారణంగా దాన్ని స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నవారికే ప్రాప్తమవుతుంది.

ఖుర్ఆన్ ప్రకారం, ప్రపంచంలోని చాలా మంది జనులు తమ ఆలోచనలకు ఎటువంటి శాస్త్రీయ ఆధారాలు కలిగి ఉండరు. కేవలం ఊహలు, అనుమానాలనే అనుసరిస్తూ ఉంటారు. అందువల్ల ప్రపంచంలోని చాలా మందిని చూసి మిథ్యను, అసత్యాన్ని స్వీకరించడం, అవలంబించడం సరయిన విధానం కాదు. అధిక సంఖ్యాకులన్న ప్రమాణాన్ని ఎత్తివేసి సత్యం ప్రమాణంగా దేన్నయినా స్వీకరించాలి. ఇదే సమంజస మయిన మార్గం. లేకపోతే మానవుల్లో చాలా మంది దారితప్పిపోయినట్లే మీరున్నూ మార్గవిహీనులయి తిరుగుతారు, గమ్యం మీకు దూరమయిపోతుంది.

وَ اِنۡ تُطِعۡ اَكۡثَرَ مَنۡ فِى الۡاَرۡضِ يُضِلُّوۡكَ عَنۡ سَبِيۡلِ اللّٰهِ ‌ؕ اِنۡ يَّتَّبِعُوۡنَ اِلَّا الظَّنَّ وَاِنۡ هُمۡ اِلَّا يَخۡرُصُوۡنَ ○ (الانعام:۱۱۶)

**నీవు భువిలో నివసించే అధిక సంఖ్యాకులయిన జనులను అనుసరించే మాటయితే వారు మిమ్మల్ని దైవమార్గం నుండి తప్పించి వేస్తారు. వారయితే ఊహలనే అనుసరిస్తున్నారు. కేవలం గుడ్డిగా అనుకరిస్తున్నారు.** ***(అల్ అన్ఆమ్:116)***

## దారితప్పిన లీడర్ల దాస్యం

సత్యాసత్యాలను తెలుసుకుని వాటి మధ్య తారతమ్యాన్ని పాటించడం ప్రతి వ్యక్తి చేయవలసిన వైయక్తిక కార్యం. కాని ప్రపంచంలో చాలా మంది ఈ పని స్వయంగా తాను చేయదు, ఈ పనిని తమ నాయకులు, లీడర్లకు వదలివేస్తాడు. వారు తమ నాయకులను దైవమని చెప్పని మాట వాస్తవమే. కాని తమ నాయకుల ఆదేశమేదీ వారికి దైవాదేశం కన్నా తక్కువేమీ కాదు. వారి లీడర్లు దేన్ని సత్యమని చెబితే అదే వారికి సత్యం. వారి లీడర్లు దేన్నయితే అసత్యమని నిర్ణయిస్తారో అది నిశ్చయంగా అసత్యమే. వారి నాయకులు నడచిన బాటే వారి మార్గం; ఏదయినా విరుద్ధమార్గాన ఒక్క అడుగు వేయడమయినా వారికి అసాధ్యమే. వారు ప్రతి విషయంలోనూ తమ నాయకుల బుద్ధిననుసరించి ఆలోచిస్తారు. మరేమో వారి నాయకులు వారిని పశువుల్లా తాము కోరిన దిశలో తోలుకుపోతారు.

మోక్షమార్గమేదో అల్లాహ్ తన ప్రవక్తల ద్వారా తెలిపాడు. ఇక మనిషికి మిగిలినవి రెండే మార్గాలు. ఒకటి, నేరుగా ప్రవక్తల బోధనలను తెలుసుకోవడం, వాటి వెలుగులో తామూ తమ జీవితాన్ని గడపటం, ఇతరులకు కూడా దారి చూపటం. రెండు, ప్రవక్తల

మార్గాన్ని చూపగలవారిని అనుసరించడం. నిస్సందేహంగా, దైవప్రవక్తల బోధనల ద్వారా నేరుగా విభిన్న జీవన వ్యవహారాలకు సంబంధించిన జ్ఞానమార్జించగలవారు చాలా తక్కువే ఉంటారు. వారు ప్రపంచానికి రుజుమార్గమూ చూపగలుగుతారు.

కాని దైవం ప్రతి వ్యక్తికి ఎంతో కొంత జ్ఞానం, నేర్పు ఇచ్చాడు, తద్వారా వారు ప్రవక్తల మార్గాన తీసుకువెళ్ళేవారిలోనూ ఆ మార్గాన్నుంచి మరల్చి మరో దారికి తీసుకు వెళ్ళేవారిలోనూ వ్యత్యాసాన్ని పాటించగలరు. అయినప్పటికీ మనిషి తన బ్రతుకు పగ్గాలు, ప్రవక్తల మార్గం నుండి స్వయంగానూ తప్పిపోయి ఇతరుల్నీ దారి తప్పించే వారికే అప్పగించినట్లయితే అతను స్వయంగానే తన మోక్షమార్గాన్ని మూసుకున్నాడన్న మాట. ప్రవక్తలను వ్యతిరేకించినప్పుడల్లా చరిత్రలో నమోదయిన భయంకర పర్యవసానాలు అతనికి ఎదురవక తప్పదు.

ఎవరయినా తన హృదయాన్ని ఈ మేరకు తన లీడర్ల కైవసం చేసి ఉన్నట్లయితే, అతను తన లీడరుతోపాటు నరకంలోకి సయితం వెళ్ళడానికి సిద్ధపడినట్లయితే ప్రపంచంలోని ఏ శక్తీ అతన్ని నరకం నుండి వెలికితీసి స్వర్గంలో ప్రవేశింపజేయజాలదు. మానవుడు కేవలం దైవశాసనానికి బద్ధుడు. కాని ఎంత దౌర్భాగ్యం, అతను తనలాంటి మానవుల ఆదేశాలను దైవాదేశాలను అనుసరించవలసిన రీతిలో అనుసరించడానికి సిద్ధమవుతాడు:

اِتَّخَذُوْا اَحْبَارَهُمْ وَ رُهْبَانَهُمْ اَرْبَابًا مِّنْ دُوْنِ اللّٰهِ وَالْمَسِيْحَ ابْنَ مَرْيَمَ ۚ وَمَآ اُمِرُوْا اِلَّا لِيَعْبُدُوْٓا اِلٰهًا وَّاحِدًا ۚ لَآ اِلٰـهَ اِلَّا هُـوَ سُبْحٰنَـهٗ عَمَّا يُشْرِكُوْنَ ○ (التوبۃ:٣١)

వారు దైవాన్ని కాదని తమ పండితుల్ని, తమ సన్యాసుల్ని, మర్యమ్ కుమారుడు ఈసాను దైవంగా చేసుకున్నారు. వారికి, ఒకే దైవాన్ని ఆరాధించాలని మాత్రమే ఆదేశించడం జరిగింది. ఆయన తప్ప మరో దైవం లేదు, వీరు చేసే బహుదైవారాధనకు అతీతుడు పరిశుద్ధుడాయన.

*(తౌబా:31)*

## గత వైభవ ఆరాధన

చాలా మంది గతాన్ని ఆరాధించే వారుంటారు. వారి గతాన్ని తప్పుపట్టే ఏ సిద్ధాంతాన్నీ వారు స్వీకరించరు. వారి పూర్వీకులను విమర్శించే ఏ భావంతోనూ అంగీకరించరు.

దైవం పంపిన సత్యాన్ని విడనాడటం వారికి సులువే అవుతుంది. కాని గతంలోని తప్పుడు సంప్రదాయాలను తమ జీవితాల నుండి వేరు చెయ్యడం వారికి సులభం కాదు. వారికి గతంలోని మంచి విషయాల పట్లనే కాదు, మాజీలోని లోటుపాట్లను కూడా వారు ప్రేమిస్తుంటారు. వారు గతం ద్వారా గుణపాఠం గ్రహించరు. దాని మంచినీ చెడునూ రెంటినీ గర్వంగా వల్లె వేస్తూ ఉంటారు.

వారికి తమ పూర్వీకుల్లో బుద్ధి, దూరదృష్టి, నిజాయితీ, శ్రద్ధ సమస్త సుగుణాలు గోచరిస్తాయి. వారిలో ఎటువంటి కొరతనయినా చూడగలగటం వారు అసాధ్యమని భావిస్తారు. గతంలో జరిగినదంతా వారి దృష్టిలో సరయినదే. గతంలో జరిగినట్లు ఎటువంటి ప్రమాణమూలేని ఏ విషయమయినా వారి ప్రకారం సరయినది కాదు, మిథ్య. ఎంతటి తప్పుడు తత్వమయినా సిద్ధాంతమయినా అది గతంలో స్వీకృతి పొందినదయినట్లయితే వారికి స్వీకారయోగ్యమే. కాని వారి మార్గవిహీనులయిన పూర్వీకులు తిరస్కరించినది, ఎంతటి కొత్త సిద్ధాంతమయినా వారికి స్వీకారయోగ్యం కాజాలదు.

ఖుర్ఆన్ ఈ గతాన్ని ఆరాధించడాన్ని ప్రశాంతంగా విమర్శిస్తుంది. గతంలో సత్యకాంతి కానవచ్చినట్లయితే నిశ్చయంగా అది హృదయానికి హత్తుకోవలసిందేనని అది అంటుంది. కాని సత్యం లేని గతం అది గర్వించదగ్గది కాదు గర్హించదగ్గది, సిగ్గుపడదగ్గది. తన తాతముత్తాతలు తిరస్కరించిన కారణాన ఎవరయినా సత్యాన్ని తిరస్కరించినట్లయితే, అతను వారికి కలిగిన పర్యవసానం ద్వారా గుణపాఠం గ్రహించడానికి సిద్ధంగా లేడన్న మాట, వారిలానే నాశనమవ్వాలని కోరుకుంటున్నాడన్న మాట.

దైవధర్మం ఎన్నో త్యాగాలు చేస్తేగాని ప్రాప్తం కాదు. ఏ వ్యక్తి దాని కొరకు, గతంలోని బూజుపట్టిన సంప్రదాయాలను కూడా వదలలేకపోతాడో అతనికి అది ప్రాప్తమవడం దుర్లభం. మనిషికి గతం పట్ల కాదు, దైవధర్మం పట్ల ప్రేమ ఉండాలి. కాని ఎంత దౌర్భాగ్యం, అతను గతం పట్ల ప్రేమలోపడి దైవధర్మాన్ని మరచిపోతాడు:

وَ كَذٰلِكَ مَآ اَرۡسَلۡنَا مِنۡ قَبۡلِكَ
فِىۡ قَرۡيَةٍ مِّنۡ نَّذِيۡرٍ اِلَّا قَالَ مُتۡرَفُوۡهَآ ۙ
اِنَّا وَجَدۡنَاۤ اٰبَآءَ نَا عَلٰٓى اُمَّةٍ وَّ اِنَّا

**మరి ఇదే విధంగా (ప్రవక్తా) మేము నీకు పూర్వం ఏ జనవాసంలోనయినా భయపెట్టేవానిని పంపించినప్పుడు ఆ బస్తీవాసుల్లో సంపన్నులయినవారు, "మేము మా తాతముత్తాతలను ఒక మతాన్ని అవలంబిస్తూ ఉండగా చూశాము, మేము వారి అడుగుజాడలనే అనుసరిస్తున్నాము" అని అన్నారు. దానికి ప్రవక్త, 'మీరు మీ**

తాతముత్తాతలను అనుసరిస్తూ ఉండగా చూసిన విధానంకన్నా ఉత్తమమయిన దాన్ని సరయినదాన్ని మీకు చూపెట్టినా (మీరు మీ విధానాన్నే అంటిపెట్టుకు ఉంటారా?) అని అడిగినప్పుడు వారు ఇలా సమాధానమిచ్చారు, "నీకు ఏ ధర్మం ఇచ్చి ఉండడం జరిగిందో మేము దాన్ని నిరాకరిస్తున్నాము." అప్పుడు మేము వారి ఎడల మా తీర్పును తీర్చుకున్నాము. గమనించండి తిరస్కరించేవారికి ఎటువంటి పరిణామం ఎదురవుతుందో.

*(అజ్జుఖ్రుఫ్: 23-25)*

عَلٰٓى اٰثٰرِهِمْ مُّقْتَدُوْنَ○ قٰلَ اَوَلَوْ جِئْتُكُمْ بِاَهْدٰى مِمَّا وَجَدْتُّمْ عَلَيْهِ اٰبَآءَكُمْ ؕ قَالُوْٓا اِنَّا بِمَآ اُرْسِلْتُمْ بِهٖ كٰفِرُوْنَ○ فَانْتَقَمْنَا مِنْهُمْ فَانْظُرْ كَيْفَ كَانَ عَاقِبَةُ الْمُكَذِّبِيْنَ○

(الزخرف:٢٣-٢٥)

## ప్రపంచ వ్యామోహం

మానవుడు సాధారణంగా ప్రపంచ జీవితంలో నిండా మునిగి పోయాడు. కాని దైవధర్మం అతను పరలోక చింతనలో పరవశుడయిపోవాలని కోరుకుంటుంది. అతను ప్రపంచ జయాపజయాలకు అతీతంగా కేవలం పరలోకం కొరకే కృషి చేయాలని అభిలషిస్తుంది. ప్రపంచం మానవుని గమ్యం అయ్యేంత ప్రముఖమయింది కాదు:

ఈ ప్రపంచ జీవితమయితే కేవలం కొన్నాళ్ళ సామగ్రి. మరి పరలోకమో, అదే సదా కొనసాగే నిత్య గృహం.

*(అల్ మోమిన్ : 39)*

اِنَّمَا هٰذِهِ الْحَيٰوةُ الدُّنْيَا مَتَاعٌ وَّ اِنَّ الدَّارَ الْاٰخِرَةَ هِيَ دَارُ الْقَرَارِ○

(المؤمن:٣٩)

ప్రపంచ జీవితం ఒక వంచన. కాని మానవుడు దీన్నే అన్నింటికంటే గొప్ప, అన్నింటికంటే అంతిమమయిన వాస్తవమని నమ్ముతాడు. ఇంతకన్నా ఉన్నతమయిన వాస్తవికత ఏదీ లేదని, దాన్ని అతను అన్వేషించవలసిలేదని తలుస్తాడు. ప్రపంచం అతని రేయింబవళ్ళ పైన కప్పుకుంది. అతను చేసే ప్రతి కృషి దానికే అంకితమయి ఉంటుంది:

మీరు ప్రపంచ జీవితంలోని బాహ్యాశోభనే ఎరుగుదురు, పరలోకం పట్ల పూర్తిగా ఏమరుపాటుకు లోనయి ఉన్నారు.

*(అర్రూమ్: 7)*

يَعْلَمُوْنَ ظَاهِرًا مِّنَ الْحَيٰوةِ الدُّنْيَا وَهُمْ عَنِ الْاٰخِرَةِ هُمْ غٰفِلُوْنَ○ (الروم:٧)

ధర్మంలోని అనేకానేక వాస్తవాలు పరలోకానికి సంబంధించినవి. మానవుడు వాటిని అర్థం చేసుకోవాలంటే, ఈ భౌతిక ప్రపంచం నుంచి ఆలోచనల్ని కాస్త ఎడంగా తీసుకెళ్ళి ఆలోచించడానికి సిద్ధమయినప్పుడే సాధ్యమవుతుంది. కాని దీనికి సిద్ధపడే వారు బహు స్వల్పం. చాలా నుంది పరలోకం సంభవమన్న దాన్నే అంగీకరించరు. అనేక మంది దాని విషయంలో ఆశంకలో పడిపోయారు. అది తప్పక వస్తుందన్న నమ్మకం వారికి లేదు. నిజానికి పరలోకం మన కంటికి దూరమయి ఉన్నప్పటికీ అది వచ్చే సమయమయితే అతి సమీపానే ఉంది. అప్పుడది పూర్తిగా ముసుగులు తొలిగించి దర్శనమిస్తుంది. అప్పుడు మానవుడు పరలోకాన్ని తిరస్కరించిన వైఖరికి పర్యవసానాలు చూసి కంపించిపోతాడు. కాని అప్పుడు చేతులు నులుముకున్నా పశ్చాత్తాపం చెందినా ఎటువంటి ప్రయోజన ముండదు. అప్పటికి ఆచరణా వ్యవధి ముగిసిపోతుంది. చేసిన ఆచరణల ఫలితాలే ముందుకు వస్తాయి:

فَيَوْمَئِذٍ لَّا يَنفَعُ الَّذِينَ ظَلَمُوا مَعْذِرَتُهُمْ وَلَا هُمْ يُسْتَعْتَبُونَ ۝
(الروم:٥٧)

**కాగా ఆ రోజున జులుం చేసేవారికి వారి సాకులేవీ ఉపకరించవు, వారికి దైవాన్ని ప్రసన్నుణ్ణి చేసే అవకాశమూ ఇవ్వబడదు.**

***(అర్‌రూమ్: 57)***

## ప్రపంచ సామగ్రి ఆధిక్యత

ప్రపంచ సామగ్రి అధికమయి, సౌలభ్యాలు, సౌకర్యాలు నిండిన జీవితం కూడా కొన్ని పర్యాయాలు సత్యస్వీకార మార్గంలో అడ్డుగా నిలుస్తుంది. సుఖవంతమయిన జీవితం మానవునిలోనుంచి విధేయతాభావాన్ని దోచుకుంటుంది, అతన్ని దైవద్రోహిగా మార్చి వేస్తుంది. విలాసమయ జీవితంలో మానవుడు దైవమార్గ బోధనను, దైవం తన ప్రభువు, తాను ఆయనకు దాసుడు కానట్టే నిరాకరిస్తాడు. పరమ ప్రభువు ఈ తలబిరుసుతనానికి, ఈ తిరుగుబాటుతనానికి మాటిమాటికీ అతన్ని హెచ్చరిస్తాడు. అయినా మనిషి దాన్ని మానుకోడు. కడకు దేవుని ప్రతిచర్య నియమం అతన్ని నులిమివేస్తుంది:

وَمَا كُنَّا مُعَذِّبِينَ حَتَّىٰ نَبْعَثَ رَسُولًا ۝ وَ إِذَا أَرَدْنَا أَن نُّهْلِكَ قَرْيَةً أَمَرْنَا مُتْرَفِيهَا فَفَسَقُوا فِيهَا

**మేము జనుల మధ్యన ఒక ప్రవక్తను పంపనంత వరకు వారిపైకి ఎటువంటి యాతనా శిక్షను పంపము. మేము ఏదయినా జనవాసాన్ని అంతమొందించాలని అనుకుంటే దాని సంపన్న జనులకు**

فَحَقَّ عَلَيْهَا الْقَوْلُ فَدَمَّرْنَاهَا تَدْمِيْرًا ۝ (بنی اسرائیل:۱۵،۱۶)

**మా విధేయత పాటించవలసిందని ఆదేశి స్తాము. అయినా వారు దానికి అవిధేయు లయ్యే ఉంటారు. అప్పుడు ఆ జనవాసం పైన శిక్షను విధించే నిర్ణయమవుతుంది. మేము దాన్ని సర్వనాశనం చేసివేస్తాము.**
***(బనీ ఇస్రాయీల్: 15, 16)***

సంపన్నుడయిన వ్యక్తి ఒక్కోసారి భ్రమకు లోనవుతాడు. సత్యం తన వంకే ఉందని అనుకుంటాడు. పైగా ఒక్కోసారి దాన్ని దాటి తానే వాస్తవానికి సత్యానికి ప్రతిరూపమన్న ఆత్మవంచనకు కూడా లోనవుతాడు. తన ఆదేశమే దైవాదేశం, తనకు వ్యతిరేకత దైవ వ్యతిరేకత అని తలుస్తాడు. ఎవడయినా లేమికి గురయినవాడు తన తప్పిదాలను విమర్శించడాన్నయినా తనకు సన్మార్గం చూపడమయినా తగదని, అటువంటి వ్యక్తి దానికి యోగ్యుడు కాడని భావిస్తాడు. అతను ఎప్పుడయినా తక్కువ స్థాయి వ్యక్తి నోట సత్యసందేశం విన్నట్లయితే అసహ్యంగా దాన్ని విసిరిగొడతాడు. దీనికి అతను ఓ వితర్కాన్ని సృష్టిస్తాడు. దానితో తానూ సంతుష్టుడవడానికీ ఇతరుల్నీ సంతృప్తపరచడానికి ప్రయత్నిస్తాడు. అది నాకు ప్రపంచ విలాసాలన్నీ ప్రాప్తమయి ఉన్నాయంటే ఇది సత్యం నాతోపాటు ఉందన దానికి నిదర్శనం. నా మార్గం తప్పయినదయితే దైవం ఈ విధంగా నన్ను కృపాకటాక్షాలతో నింపేవాడుకాదు, ఆయన బహుమానాలకు నేను అర్హుణ్ణయ్యే వాణ్ణికాను. దీనికి భిన్నంగా నా వైఖరిని తప్పు పట్టే వ్యక్తి అతనికి కనీసం ప్రశాంతమయిన, నెమ్మది నిండిన జీవితమయినా ప్రాప్తం కాలేదు. అతని మార్గం దైవమార్గమయి ఉంటే, అతని వైఖరి దైవం దృష్టిలో అభిలషణీయమయినదే అయితే అతను ప్రపంచ సామగ్రికి వంచితుడయ్యేవాడు కాదు. అతను చెప్పేదంతా అబద్ధమనడానికి ఇదే చాలు. దైవం అతనికి తోడుగా లేడు. కాగా ఇటువంటి వ్యక్తిని అనుసరించడం స్వయంగా మనల్ని మనం నాశపరచుకోవడ మవుతుంది.

మహనీయ నూహ్ (అలైహిస్సలామ్) జాతిలోని సంపన్నులయిన వారి మనస్తత్వం ఇలాంటిదే. దివ్యఖుర్ఆన్ వారి ప్రస్తావన ఈ విధంగా చేస్తుంది:

وَقَالَ الْمَلَأُ مِنْ قَوْمِهِ الَّذِيْنَ كَفَرُوْا وَ كَذَّبُوْا بِلِقَآءِ الْاٰخِرَةِ وَ اَتْرَفْنٰهُمْ

**అతని జాతి నాయకులు తిరస్కరించారు, పరలోకంలో హాజరవడాన్ని నిరాకరించారు, వారికి మేము ప్రపంచ జీవితంలో**

فِی الْحَیٰوۃِ الدُّنْیَا ۙ مَا ھٰذَا اِلَّا بَشَرٌ مِّثْلُکُمْ ۙ یَاْکُلُ مِمَّا تَاْکُلُوْنَ مِنْہُ وَ یَشْرَبُ مِمَّا تَشْرَبُوْنَ ○ وَلَئِنْ اَطَعْتُمْ بَشَرًا مِّثْلَکُمْ ۙ اِنَّکُمْ اِذًا لَّخٰسِرُوْنَ○ (المومنون:۳۳،۳۴)

సంపన్నులుగా చేసి పెట్టాము. వారిలా అన్నారు, ఇతను మీలాంటి వ్యక్తే, మీరు తింటున్నదే అతనూ తింటున్నాడు. మీరు త్రాగేదే ఇతనూ త్రాగుతున్నాడు. మీరు మీవంటి ఓ మానవుణ్ణే అనుసరించినట్ల యితే నిశ్చయంగా మీరు మహా నష్టంలో పడిపోయినట్లే.

***(అల్ మూమినూన్:33,34)***

అన్ని కాలాల్లోనూ అన్ని లీడర్లలోనూ ఈ మనస్తత్వం పనిచేస్తూనే ఉండేది. మహనీయ ముహమ్మద్ (స) విషయంలో ఆయన వ్యతిరేకులు ఇదే విధంగా ఆలోచించే వారు.

وَ قَالُوْا لَوْلَا نُزِّلَ ھٰذَا الْقُرْاٰنُ عَلٰی رَجُلٍ مِّنَ الْقَرْیَتَیْنِ عَظِیْمٍ○ (الزخرف:۳۱)

వారిలా అంటున్నారు, ఈ ఖుర్ఆన్ ఈ రెండు నగరాల (మక్కా, తాయిఫ్)లలోని ఎవరయినా ఒక పెద్ద మనిషికి ఎందుకు అవతరింపజేయబడలేదు?

***(అజ్జుఖ్రుఫ్:31)***

ప్రపంచంలో ఇటువంటి తెలివిలేని మాటల్ని సునాయాసంగా నమ్మేవారికేమాత్రం కొదువ లేదు. వారు సత్యాన్ని సత్యంగా పరిశీలించరు. దాన్ని అందజేసే వ్యక్తి సంపాదన రీత్యా ఏ స్థాయి వ్యక్తి అని గమనిస్తారు. ఆ పైన దాని రీత్యానే వారి వైఖరి నిశ్చయమవు తుంది. సత్యాన్ని అందజేసేవారు నిరుపేద, నిరాధార అనాథుడు అయిన వాడయితే సరి, వారు దాన్ని అతిసునాయాసంగా తిరస్కరిస్తారు. జాతి నాయకులు మిథ్యావాదం వైపునకు పిలుపునిచ్చే మాటయితే దాన్ని వారు తిరస్కరించకపోవడమే కాదు, దాని వైపునకు పరుగిడి అందుకుంటారు. వారికి అర్థంకాని విషయం ఏమిటంటే, ఒక వ్యక్తి సకల సౌలభ్యాలకు దూరమయి ఏ ప్రపంచ సామగ్రీ లేనివాడయినా అతను సత్యానికి సాక్షి, దాని పరిరక్షకుడయి ఉండగా సమస్త అధికారాలకు రాజభోగాలకు ఆలవాలమయిన వారు, మహానాయకులు, శ్రీమంతులేమో ఆ సత్యాన్ని గురించి ఏమీ ఎరుగనటువంటివారయి ఉండటం ఎలా సంభవం? కాని ఈ తెలివితక్కువతనం, ఈ దోషమయమయిన ఆలోచనా తీరు వల్ల వారు సత్యతిరస్కారం వల్ల కలిగే పర్యవసానాల నుండి రక్షించబడలేరు. కాగా చరిత్ర దీనికి సాక్ష్యంగా నిలిచి ఉంది, వారెన్నడూ రక్షితులయి ఉండలేదు:

وَ نَادٰى فِرْعَوْنُ فِىْ قَوْمِهٖ قَالَ يٰقَوْمِ اَلَيْسَ لِىْ مُلْكُ مِصْرَ وَ هٰذِهِ الْاَنْهٰرُ تَجْرِىْ مِنْ تَحْتِىْ اَفَلَا تُبْصِرُوْنَ ۝ اَمْ اَنَا خَيْرٌ مِّنْ هٰذَا الَّذِىْ هُوَ مَهِيْنٌ ۙ وَلَا يَكَادُ يُبِيْنُ ۝ فَلَوْلَآ اُلْقِىَ عَلَيْهِ اَسْوِرَةٌ مِّنْ ذَهَبٍ اَوْ جَآءَ مَعَهُ الْمَلٰٓئِكَةُ مُقْتَرِنِيْنَ ۝ فَاسْتَخَفَّ قَوْمَهٗ فَاَطَاعُوْهُ ؕ اِنَّهُمْ كَانُوْا قَوْمًا فٰسِقِيْنَ ۝ فَلَمَّآ اٰسَفُوْنَا انْتَقَمْنَا مِنْهُمْ فَاَغْرَقْنٰهُمْ اَجْمَعِيْنَ ۙ ۝ فَجَعَلْنٰهُمْ سَلَفًا وَّ مَثَلًا لِّلْاٰخِرِيْنَ ۝

(الزخرف:٥١-٥٦)

ఫిర్‌ఔన్ తన జాతివారిని సంబోధించి ఇలా చాటాడు, "నా ప్రజలారా, ఈజిప్ట్ రాజ్యం నాది కాదా? ఇక్కడ నాకు దిగువన ప్రవహిస్తూ ఉన్న నదులను మీరు చూడటం లేదా? నిజానికి నేను, ఈ నీచుడయిన వ్యక్తి కన్నా నిశ్చయంగా ఉత్తమమయిన వాడిని, ఇతనయితే సరిగ్గా మాటలాడనయినా మాటలాడలేడే. ఇతని కోసం బంగరు కంకణాలెందుకు అవతరింపజేయబడలేదు, ఇతనితోపాటు దైవదూతలు బారులు తీరి ఎందుకు రాలేదు." ఇలా అతను తన జాతి వారిని నీచులయిన వారిగా భావించాడు. వారు అతని మాటను అంగీకరించారు. నిస్సందేహంగా వారు ఎంతో పాపాతురులయినవారు. వారు మాకు ఆగ్రహాన్ని కలిగించగా మేము ప్రతీకారాన్ని తీర్చుకున్నాము. వారినందరినీ ముంచి వేశాము. వారిని తరువాతి వారి కోసం పూర్వగాములుగా, (గుణపాఠం కాగల) ఉదాహరణగా చేశాము. *(అజ్‌జుఖ్రుఫ్:51,56)*

## అధికారం, సత్తా

చరిత్ర గరిపే అనుభవం రీత్యా దైవధర్మాన్ని అధికారంలో ఉన్న పెద్దలు సర్వసాధారణంగా తిరస్కరించారు. వారి సమక్షంలో దైవధర్మం వచ్చినప్పుడల్లా వారు దాన్ని తమ అధికారానికి ప్రమాదకరంగా పరిగణించారు, దాన్ని వ్యతిరేకించారు. వారిని దైవాగ్రహం నుండి, ఆయన శిక్ష నుండి తప్పించాలని కోరే వ్యక్తి వారికి అతి పెద్ద రాజకీయ ప్రత్యర్థిగా పరిణమిస్తాడు. అతను దైవధర్మం సత్యమయినదనడానికి అతి పటిష్టమయిన ఆధారాలను

చూపుతాడు. ఇదంతా అధికారాన్ని చేబట్టేందుకు పన్నాగంగా పరిగణించి తిరస్కరిస్తారు. ప్రపంచంలోని మహా నిస్వార్థ వ్యక్తి కూడా, చిత్తశుద్ధిగల వ్యక్తి కూడా ధర్మసందేశం అందజేస్తే అతని నిస్వార్థతలోనూ వారికి అధికార పిపాస గోచరిస్తుంది. వారు పెడబొబ్బలు పెడతారు:

**నిశ్చయంగా ఈ మాట ఏదో స్వార్థంతోనే పలుకడం జరుగుతోంది.** *(సాద్:6)*

**اِنَّ هٰـذَا لَشَیۡءٌ یُّرَادُ ۝** (ص:٦)

ఫిర్ఔన్ దృష్టిలో హజ్రత్ మూసా (అ), హజ్రత్ హారూన్ (అ) వంటి వ్యక్తుల్లోనూ అధికార పిపాస గోచరించింది, అతని ప్రకారం వారి పిలుపునకు ఉద్దేశ్యం ప్రభుత్వ సత్తాను కైవసం చేసుకోవడం తప్ప మరేమీ కాదు.

**వారు ఇలా అన్నారు, వీరయితే మంత్ర గాళ్ళు, వీరు తమ మంత్రశక్తితో మిమ్మల్ని మీ నేల నుండి తొలిగించి వేయాలని, మీ ఆదర్శ సంప్రదాయాన్ని నిర్మూలించాలని చూస్తున్నారు.** *(తాహా:63)*

**قَالُوۡۤا اِنۡ هٰذٰنِ لَسٰحِرٰنِ یُرِیۡدٰنِ اَنۡ یُّخۡرِجٰکُمۡ مِّنۡ اَرۡضِکُمۡ بِسِحۡرِهِمَا وَ یَذۡهَبَا بِطَرِیۡقَتِکُمُ الۡمُثۡلٰی ۝** (طٰہٰ:٦٣)

ఇదే మాటను మరో చోట ఇలా తెలుపడం జరిగింది:

**వారిలా అన్నారు, మీరెందుకు వచ్చారు, మేము మా తాతముత్తాతలను ఏ సంప్రదాయాన్నయితే ఆచరిస్తూ ఉండగా చూశామో దాన్నుండి మమ్మల్ని మరల్చివేయడానికా? ఆపైన భువిలో పెద్దరికం మీ ఇద్దరికే పరిమితం కావాలనా? మేము మీ మాటను నమ్మబోవటం లేదు.** *(యూనుస్:78)*

**قَالُوۡۤا اَجِئۡتَنَا لِتَلۡفِتَنَا عَمَّا وَجَدۡنَا عَلَیۡهِ اٰبَآءَنَا وَ تَکُوۡنَ لَکُمَا الۡکِبۡرِیَآءُ فِی الۡاَرۡضِ ؕ وَ مَا نَحۡنُ لَکُمَا بِمُؤۡمِنِیۡنَ ۝** (یونس:٧٨)

## మనోకాంక్షల దాస్యం

దైవధర్మ స్వీకారంలో మనోకాంక్షల దాస్యం కూడా ఒక అడ్డుగోడే. మనోకాంక్షల దాసుడయిన మానవుడు ఏ విషయాన్నయినా ఆలోచించే ముందు తన ఆత్మసుఖాన్ని దృష్టిలో ఉంచుకుంటాడు. దైవం సృష్టించిన ఈ ప్రపంచంలో అతను కేవలం తన కాంక్షల పరిపూర్తినే అన్వేషిస్తూ ఉంటాడు. అతను ఏ అడుగు వేసినా తన మనస్సుకు కష్టం కలిగించే విధంగా ఉండరాదన్న నిర్ణయంతోటే జీవితం గడుపుతుంటాడు. అతన్నుండి తన

ఆత్మసుఖాన్ని, తన ఆనందాన్ని దోచుకునే తనను అసహనానికి గురిచేసే ఎటువంటి చిక్కులోనయినా పడటానికి సుతరామూ ఇష్టపడడు.

ఈ కారణంగానే దైవధర్మాన్ని అర్థం చేసుకున్నప్పటికీ ఇటువంటి వ్యక్తి దాన్ని స్వీకరించడు. ఎందుకంటే దీని వల్ల అతని మనస్సు పొందే ఆనందాలలో అంతరాయం కలుగుతుంది. అయితే దైవధర్మానికి అభిమానం మెండు. ఎవరయితే దాన్ని తెలుసుకుని, అర్థం చేసుకుని కూడా నిర్లక్ష్యభావంతో త్రోసిపుచ్చుతాడో అతనికి ఆమడల దూరానికి వెళ్ళిపోతుంది. మనిషి తన మనోకాంక్షల సమక్షంలో తలవంచినప్పుడు దైవం అతన్ని తన గడప నుండి తొలిగించివేస్తాడు. అతను తన మనోకాంక్షల దాస్యం చేస్తూనే చచ్చి పోతాడు, కాని దైవం సమక్షంలో తలవంచే సద్బుద్ధి అతనికి ఎన్నటికీ కలగదు.

اَفَرَاَيْتَ مَنِ اتَّخَذَ اِلٰهَهٗ هَوَاهُ وَ اَضَلَّهُ اللّٰهُ عَلٰى عِلْمٍ وَّ خَتَمَ عَلٰى سَمْعِهٖ وَ قَلْبِهٖ وَ جَعَلَ عَلٰى بَصَرِهٖ غِشٰوَةً فَمَنْ يَّهْدِيْهِ مِنْۢ بَعْدِ اللّٰهِ اَفَلَا تَذَكَّرُوْنَ ○ (الجاثیہ:۲۳)

తన మనోకాంక్షలను తన దైవంగా చేసుకున్న వ్యక్తిని నీవు గమనించావా? అతను జ్ఞానం పొందినప్పటికీ దైవం అతన్ని దారి తప్పించాడు. అతని చెవులకూ మనస్సుకూ ముద్రవేశాడు. అతని కళ్ళను కప్పివేశాడు. కాగా దైవమే అతన్ని మార్గవిహీనుణ్ణిగా చేసినప్పుడు అతనికి దారి చూపేవాడెవడు? మీరు నిజంగా మార్గబోధన పొందరా? *(అల్ జాసియా: 23)*

## అహంకారం

దైవం పట్ల తిరుగుబాటుకు ఒక కారణం అహంకారం. దైవం షైతాన్‌కు ఆదేశమిచ్చాడు, ఆదమ్‌కు సజ్దా చెయ్యమని, కాని వాడు దైవాదేశాన్ని పాలించడాన్ని నిరాకరించాడు. ఖుర్ఆన్ దీనికి కారణం అతనిలోని అహంకారమని చెబుతుంది. అహంకారమంటే తన్ను తాను పెద్దవానిగా భావించడం; ఇది రెండు విధాలుగా వ్యక్తమవుతుంది. ఒకటి, సత్యతిరస్కారం, రెండవది, ఇతరుల్ని నీచులుగా భావించడం. ఈ రెండు విషయాలూ షైతాన్‌లోని అహంకారంలో ఉండేవి. ఒక వైపున వాడు హజ్రత్ ఆదమ్‌ను తనకన్నా హీనమయినవానిగా భావించాడు. మరో వైపున దైవాదేశాన్ని పాలించడానికి నిరాకరించాడు.

అహంకారం వల్ల మానవునిలో దైవం పట్ల తిరుగుబాటు, విద్రోహభావాలు జనిస్తాయి. ఈ భావాలు ఏ స్థాయిలో ఎటువంటి ఫక్కీలో ఉంటాయో దైవం పట్ల తిరుగు బాటు సయితం అదే స్థాయిలో, అదే ఫక్కీలో కొనసాగుతుంది. అహంకారం దాని శిఖరానికి చేరుకుంటే దైవం పట్ల తిరుగుబాటు కూడా దాని అంతిమ స్థాయికి చేరుకుంటుంది. తాను పెద్దవాణ్ణన్న భావం మనిషిని దైవం సమక్షంలో తలవంచకుండా ఆపుతుంది. దైవం తనకు నిజంగా ఇవ్వనటువంటి స్థానాన్ని తనకు కావాలని అతను కోరుకుంటాడు. ఎవరిలో అహంకారం ఉంటుందో అతని మనస్తత్వం దేవుని విధేయుడు, ఆజ్ఞాపాలకుడయిన వ్యక్తి మనస్తత్వానికి పూర్తిగా భిన్నమయి ఉంటుంది. దేవుని విధేయత పాటించాలంటే మనిషి ఆయన్ని తన ఆరాధ్యుడుగా, పాలకునిగా భావించినప్పుడే సాధ్యం. కాని దురహంకారి అయిన వ్యక్తి ఎవ్వరికీ తనకన్నా పెద్దవానిగా అంగీకరించడానికి సిద్ధంకాడు. దేవుని విధేయత అతనికి కంటకప్రాయమవుతుంది. అతను తన్ను తాను సకల ప్రతిబంధకాలకు అతీతునిగా భావిస్తాడు.

అదే విధంగా ప్రతి దురహంకారి అయిన వ్యక్తి సమాజంలో తనకు అత్యున్నత స్థానం ప్రాప్తం కావాలని కోరుకుంటాడు. మరెవరూ తనకు సరిసమానమయిన స్థానాన నిలబడరాదని ఆశిస్తాడు. దారితప్పిన వాడయినప్పటికీ అతనికి తన బుద్ధివివేకాలు, దూరా లోచనలు, తెలివితేటల పట్ల గర్వమూ ఉంటుంది. అతను గుడ్డివారిలా ఎదురు దెబ్బలూ తింటుంటాడు. కాని అతని గర్వం తన తప్పుడు వైఖరి పట్ల ఆలోచించే అవకాశమివ్వదు. సత్యం, సత్యతలు మరో వ్యక్తికి తెలిసిపోగా తన కళ్ళకు దూరంగా ఉండటం అన్నది అసంభవమని అతను భావిస్తాడు. ఎక్కడయినా మంచి అన్నది ఉన్నట్లయితే దాని జ్ఞానం అందరికన్నా ముందు తనకే కలుగుతుంది. మరెవరయినా దాన్ని చేరుకునే ముందు తానే దాన్ని చేరుకుంటాడు అని తలపోస్తాడు. చివరికి ఇతర మానవునిలోని ఏ నైతిక సుగుణా లనూ అతను అంగీకరించడానికి సిద్ధంగా ఉండడు. సౌజన్యశీలుడయినా, సంస్కారవంతు డయినా తానేనని లేక తన పంథాని అనుసరించే వారేనని అనుకుంటాడు.

దైవధర్మం వైపునకు పిలిచేవారు, అతని పాపాలను, చెడు నడతలను విమర్శించే వారు అతని దృష్టిలో నీచాతినీచులు, దుష్టులయినవారు. ఎవరయినా పెద్ద స్థాయి నుండి తనకు సద్బుద్ధి చేయడాన్ని అతను సుతరామూ ఇష్టపడడు. ఇతరులు తన తప్పును ఎత్తిచూపడాన్నీ అతను సహించడు. అతను తన తప్పు కొరకు ప్రాణాలు కోల్పోవడా నికయినా ఇష్టపడతాడు కాని ఒకరి సద్బోధ స్వీకరించి తన సంస్కరణకు ఒప్పుకోడు.

ఏ వ్యక్తి అయితే అహంకారం కారణంగా తన్ను తప్ప మరేదేన్నీ చూడటానికి సిద్ధంగా ఉండడో అతను దైవధర్మానికి ఎటువంటి నష్టమయితే కలిగించలేడు కాని ధర్మం అతనికి తాళంవేసి సీలు చేసిన సత్యంగా పరిణమిస్తుంది. దానికి చేరే మార్గాలన్నీ అతనికి మూసివేయబడతాయి:

**إِنَّ الَّذِينَ يُجَادِلُونَ فِيٓ ءَايَٰتِ اللَّهِ بِغَيْرِ سُلْطَٰنٍ أَتَىٰهُمْ ۙ إِن فِى صُدُورِهِمْ إِلَّا كِبْرٌ مَّا هُم بِبَٰلِغِيهِ ۚ فَاسْتَعِذْ بِاللَّهِ ۖ إِنَّهُۥ هُوَ السَّمِيعُ الْبَصِيرُ**

(المؤمن:٥٦)

ఎవరయితే దైవ వచనాల పట్ల వివాదాలలో పడతారో, తమ వద్దకు ఎటువంటి నిదర్శనమూ చేరకుండానే జగదాలాడతారో అటువంటి వారి అంతర్యాల్లోనయితే కేవలం గర్వం నిండుకుని ఉంది. (మేము దీన్ని ఏ విధంగానయినా అంతమొందించి తీరుతాము అని తీర్మానించుకుంటారు, కాని) వారు దాని వరకు చేరలేరు. నీవయితే అల్లాహ్‌ను శరణుకోరు, ఆయనే సర్వమూ వినేవాడు, సమస్తమూ చూసే వాడూను. (అల్ మూమిన్ : 56)

## ధర్మంలో సవరణాభిలాష

ఒక సిద్ధాంతం నిదర్శనాపూర్వకంగా నిరూపితమయిపోతే మానవుడు అవలంబించ వలసిన సమంజసమయిన వైఖరి, దాన్ని హృదయానికి హత్తుకోవడం; దానికి విరుద్ధమయిన సిద్ధాంతాలన్నింటినీ పూర్తిగా తిరస్కరించడం. కాని చాలా మంది జనులు దైవధర్మం విషయంలో ఈ సమంజస వైఖరినవలంబించరు. వారు అత్యంత హేయ మయిన, నీచమయిన విధానాన్నయినా అనుసరించి దాన్ని వ్యతిరేకిస్తారు. తరువాత వ్యతిరేకత సయితం జీవరహితం, అసంపూర్ణమయి పోతూ ఉంటే పూర్తిగా అటు ధర్మాన్ని కాదనలేకపోతారు, ఇటు దాన్ని దాని నిజస్వరూపంలో స్వీకరించనూలేరు. దానికి బదులు అందులో మార్పు కావాలని కోరుకుంటారు. ఆ మార్పు వల్ల అది తప్పుడు భావాలకు, సిద్ధాంతాలకు చేరువ కావాలని అభిలషిస్తారు.

వీరి కృషి అంతా సాగింది దేనికంటే, దైవధర్మంలో వారి మనోకాంక్షలకు కూడా అవకాశం ప్రాప్తం కావాలి, అలా దైవవిధేయతతోపాటు మనోకాంక్షల సంతృప్తి లభించాలి అన్నది. నిజానికి దైవధర్మం దాని స్వచ్ఛమయిన పరిపూర్ణమయిన అనుసరణను

కోరుకుంటుంది. ఎంత గొప్ప వ్యక్తి అయినా సరే, కడకు దైవప్రవక్త సయితం, అందులో ఒక్క అక్షరమేరనయినా మార్పుచేర్పు చేయగల స్థానం కలిగిలేదు, దాన్ని తన ఇష్టం వచ్చినట్టు అవలంబించనూలేదు.

وَ اِذَا تُتْلٰى عَلَيْهِمْ اٰيَاتُنَا بَيِّنٰتٍۙ قَالَ الَّذِيْنَ لَا يَرْجُوْنَ لِقَآئَنَا ائْتِ بِقُرْاٰنٍ غَيْرِ هٰذَاۤ اَوْ بَدِّلْهُؕ قُلْ مَا يَكُوْنُ لِيْۤ اَنْ اُبَدِّلَهٗ مِنْ تِلْقَآئِ نَفْسِيْۚ اِنْ اَتَّبِعُ اِلَّا مَا يُوْحٰۤى اِلَيَّۚ اِنِّيْۤ اَخَافُ اِنْ عَصَيْتُ رَبِّيْ عَذَابَ يَوْمٍ عَظِيْمٍ○

(یونس:۱۵)

**వారికి అతిస్పష్టమయిన మా వచనాలను వినిపించినప్పుడు మమ్మల్ని కలసుకోవలసి ఉందని ఆశించనివారు, దీని స్థానే మరో ఖుర్ఆన్ని దేన్నయినా తీసుకురండి, లేదా ఇందులో మార్పులు చేయండి అని అంటారు. ప్రవక్తా వీరికి చెప్పివెయ్యి, ఇందులో నీ పక్షాన ఏదయినా మార్పు చేయగలిగేందుకు నాకు ఎటువంటి అధికారం లేదు. నేనయితే కేవలం నా వద్దకు వచ్చే వహీని మటుకే అనుసరిస్తాను. నేను నా ప్రభువుకు అవిధేయుణ్ణయినట్లయితే ఓ మహానాడు పడే శిక్షను గురించిన భయం నాకుంది.**

***(యూనుస్:15)***

ఎవరయితే మిథ్యావాదాన్ని వదలకుండా దైవధర్మం వైపునకు వస్తారో వాస్తవానికి వారికి దైవధర్మం పట్లనూ ప్రేమ, అభిమానాలుండవు. నిజానికి తమకు మనోకాంక్షల ఎడలనే అభిమానం మెండు. తమ కాంక్షల పట్లనే అనురాగం. దైవధర్మం రూపుమాపదలచిన ఆలోచనలు, సిద్ధాంతాల పట్లనే ప్రేమానురాగాలుంటాయి. దైవధర్మం మిథ్యావాదంతో సంధీ ఒడంబడిక చేసుకునేందుకు ఆవిర్భవించదు. అది దాన్ని అణచివెయ్యడానికి, దాన్ని నుజ్జునుజ్జు చేసివేయడానికి, దాని మీద ఆధిక్యత సాధించడానికి ఆవిర్భవిస్తుంది. మనిషి మిథ్యావాదం నుండి పూర్తిగా దూరం కానంతవరకు సత్యానికి సహచరుడు కాజాలడు.



# దైవధర్మం పొందేవారు

ఇహలోకంలో కొందరికి దైవధర్మం ప్రాప్తమవుతుంది, మరికొందరు దీనికి దూరమవుతారు. ఈ రోజుల్లో ఇదేమీ ముఖ్యమయిన విషయం కాదు, దీన్ని ఎవ్వరూ పట్టించుకోరు. నిజానికి ఒకరికి దైవధర్మం ప్రాప్తమవడం అంటే అతను సాఫల్యం పొందడమన్న మాట. మరెవరయినా ఈ ధర్మాన్ని పొందకపోవడమంటే వారు నిష్ఫలురవడ మన్నమాట. ఇంత పెద్ద ఘటన ఏదో యాదృచ్ఛికంగా విధివశాత్తు జరగదు; ఇది ఆ సంబంధిత వ్యక్తి చేసుకున్న నిర్ణయం; దీని వల్ల అది అతన్ని దైవధర్మానికి చేరువనో దూరమో చేసివేస్తుంది.

ఎవరికయితే దైవధర్మం వాస్తవికత వెల్లడవుతుందో, మరెవరయితే ముందుకు వచ్చి దాన్ని స్వీకరిస్తారో వారిలో కొన్ని ప్రత్యేకతలుంటాయి. అవి వారిని దైవధర్మానికి ఎడంగా ఉండనివ్వవు. ధర్మం వారికి అత్యంత ఆవశ్యకమయిపోతుంది. అది లేకుండా వారు జీవితాన్ని ఊహించుకోనయినా ఊహించుకోలేరు. మేము ఇక్కడ వారి ఈ ప్రత్యేకతలనే ఖుర్ఆన్ బోధనల వెలుగులో వెల్లడించగోరుతున్నాము.

## సవ్యప్రకృతి గలవారు

దైవధర్మం మానవుని ప్రకృతికి సరిగ్గా అతకినట్లు ఉంటుంది. మానవుడు సహజంగా వేటినయితే ఇష్టపడతాడో అవి దైవధర్మంలోనూ అభిలషణీయమయినవి. మరే విషయాలను మానవ ప్రకృతి ఇష్టపడదో అవి దైవధర్మంలోనూ అభిలషణీయం కావు. దైవధర్మం మానవునికి అపరిచితమయిన దాన్ని దేన్నీ అతన్నుండి కోరదు. అలాగే మానవ నైజం స్వీకరించ నిరాకరించేవాటిని వేటినీ అది మానవుడు స్వీకరించాలని అభిలషించదు. దైవధర్మాన్ని స్వీకరించడమంటే వాస్తవానికి మానవుడు తన ప్రకృతి కోరికల్ని మన్నించడమే అవుతుంది. ఈ కారణంగానే ఖుర్ఆన్‌లో ఇలా సెలవీయబడింది:

فَاَقِمْ وَجْهَكَ لِلدِّيْنِ حَنِيْفًا، فِطْرَتَ اللّٰهِ الَّتِىْ فَطَرَ النَّاسَ عَلَيْهَا، لَا تَبْدِيْلَ لِخَلْقِ اللّٰهِ، ذٰلِكَ الدِّيْنُ الْقَيِّمُ، وَلٰكِنَّ اَكْثَرَ النَّاسِ لَا يَعْلَمُوْنَ○ (الروم:٣٠)

కాగా నీవు ఏకాగ్రచిత్తుడవయి నీ అభిముఖ దిశను (దైవధర్మం) వైపున నిలబెట్టుకో. అల్లాహ్ మానవుల్ని సృష్టించిన ప్రకృతి పైన సుస్థిరంగా నిలచిపో. దైవ సృష్టిలో ఎటువంటి మార్పు జరగడమూ అసంభవం. ఇదే సుస్థిర మయిన ధర్మం. కాని చాలా మంది ఎరుగరు. *(అర్‌రూమ్:30)*

దైవధర్మాన్ని మనం వాస్తవికత రీత్యా రెండు పదాలలో నిర్వచించదలిస్తే దాన్ని మనం 'తౌహీద్' (దేవుని ఏకత్వం), 'అద్ల్' (న్యాయ స్థాపనం) అని అనవచ్చు. 'తౌహీద్' అంటే దైవాన్ని నమ్మడం, ఆయన ఉనికిలోనూ లక్షణాలలోనూ మరెవరినీ చేర్చకపోవడం, కేవలం ఆయన్నే ఆరాధించడం. 'అద్ల్' అంటే జనులతో జరిపే వ్యవహారాలలో ఎటువంటి అతివాదానికీ లోనవకుండా న్యాయంపై నిలకడ కనబరచడం. ఈ రెండు విషయాలూ మానవ ప్రకృతిలో నిబిడీకృతమయి ఉన్నాయి. అయితే మానవ ప్రకృతి చెరుపుకు గురయినప్పుడు మానవుల్ని వీటిని స్వీకరించకుండా ఆపుతుంది.

మానవుని ఉనికిలో – ఆంతర్యంలోనూ బాహ్యంలోనూ ప్రపంచంలో అనేక విషయాలున్నాయి. అవి అతని నైజాన్ని చెరిపివేయగలవు. ఈ విషయాలే గనక లేకపోతే దైవతిరస్కారం, ఆయనతో పాటు సహవర్తులు కల్పించడం అన్నది అసలు సాధ్యమే కాదు. అలాగే సహజంగానే మానవుడు అన్యాయం, అత్యాచారాలను ఇష్టపడడు. కాని తప్పుడు కారణాలు అతన్ని న్యాయం, సామంజస్యత మార్గాన్నుండి తప్పించివేస్తాయి. అందువల్ల మనిషి తన నైజాన్ని ప్రకృతిని అణచివేయనంతవరకు దైవధర్మాన్ని దాని బోధనల్ని తిరస్కరించలేదని చెప్పడం తప్పేమీ కాదు. మనిషి దైవధర్మం వైపునకు, పిల్లవాడు తల్లి వైపునకు పరుగిడేలా, దప్పిగొన్నవారు నీటి వద్దకు పరిగెత్తేలా ముందుకు వస్తాడు.

మానవ ప్రకృతి సవ్యంగా ఉన్నట్లయితే ధర్మాన్ని స్వీకరించడంలో అతనికి ఎటువంటి జంకుబొంకు లేకపోవడమేకాక అతను ధర్మ ప్రచారకునిగా, ధర్మానికి ప్రతినిధిగా రూపొంది ముందుకు వస్తాడు. నిజమయిన, సత్యమయిన ప్రకృతిగల మానవుడు దైవధర్మం తప్ప మరే విషయంపైనయినా సంతృప్తి చెందడం, తన పరిసరాలలో దానికి ప్రతికూలతను, తిరుగుబాటును భరించడం దుస్సాధ్యమయిపోతుంది. మానవ

నైజం ఇలా సవ్యతరమయిన స్థితిలో ఉండటాన్ని ఖుర్ఆన్ 'కల్బున్ సలీమ్' (ఉదాత్త వినమ్ర హృదయం) అని కూడా అభివర్ణిస్తుంది. మహనీయ ఇబ్రాహీమ్ (అ) విషయంలో అది ఇలా ప్రకటిస్తుంది:

**అతను తన ప్రభువు సన్నిధిలో 'కల్బున్ సలీమ్'తో వచ్చినప్పుడు, అతను తన తండ్రి, తన జాతివారినుద్దేశించి మీరు ఆరాధించే ఈ విషయాలు ఏమిటీ అని అడిగినప్పుడు, ఏమిటీ, ఏదో అసత్యాన్ని సృష్టించుకున్నారా, దైవాన్ని కాదని ఇతర ఆరాధ్యుల్ని కోరుకుంటున్నారా, నిఖిల జగతికి ప్రభువయిన అల్లాహ్ గురించి మీ అభిప్రాయమేమిటీ అని అడిగాడు.**

*(అస్ సాఫ్ఫాత్: 84-87)*

**اِذْ جَآءَ رَبَّهٗ بِقَلْبٍ سَلِيْمٍ ۝ اِذْ قَالَ لِاَبِيْهِ وَ قَوْمِهٖ مَاذَا تَعْبُدُوْنَ ۝ اَئِفْكًا اٰلِهَةً دُوْنَ اللّٰهِ تُرِيْدُوْنَ ۝ فَمَا ظَنُّكُمْ بِرَبِّ الْعٰلَمِيْنَ ۝**

(الصّٰفّٰت:٨٤-٨٧)

ఆ తరువాత బూటకపు ఆరాధ్యులపైన ఆయన జరిపిన విమర్శను, అసత్య మార్గాన ఆయన సుస్థిరతను, త్యాగాలను ఖుర్ఆన్ ప్రస్తావిస్తుంది. ఇదంతా ఒక సత్యాన్ని ప్రకటిస్తుంది. ఏ వ్యక్తికయితే వినమ్ర హృదయం ప్రాప్తమయి ఉంటుందో అతను మిథ్యా దైవాల పట్ల, హజ్రత్ ఇబ్రాహీమ్ (అ) అవలంబించిన వైఖరినే అవలంబిస్తాడు అన్న యదార్థాన్ని చాటుతోంది. ఈ వైఖరి ప్రమాదభూయిష్టమయినదనడంలో సందేహం లేదు, కాని పరలోక సాఫల్యం ఇందులోనే ఇమిడి ఉంది:

**ఆ రోజున ధనమూ పనికిరాదు, సంతానమూ ఉపకరించదు. అయితే ఏ వ్యక్తి అయితే వినమ్ర హృదయంతో దైవం సన్నిధిలో హాజరవుతాడో అతనికి తప్పక మోక్షం ప్రాప్తమవుతుంది.**

*(అష్షు'రా:88-89)*

**يَوْمَ لَا يَنْفَعُ مَالٌ وَّ لَا بَنُوْنَ ۝ اِلَّا مَنْ اَتَى اللّٰهَ بِقَلْبٍ سَلِيْمٍ ۝**

(الشعراء:٨٨،٨٩)

## చింతనాపరులయిన వారు

ధర్మాన్ని తెలుసుకోవాలని, అర్థం చేసుకోవాలని ప్రయత్నించే వ్యక్తి ధర్మం వరకు

చేరడం సులభతరం. మరెవరయితే ఈ ప్రయత్నాన్నే ఇష్టపడడో అతనికి ధర్మం తానయి ప్రాప్తం కాజాలదు. అందువల్లనే ఖుర్ఆన్ ఇలా కోరుతుంది:

وَ اِذَا قُرِئَ الْقُرْاٰنُ فَاسْتَمِعُوْا لَهٗ وَ اَنْصِتُوْا لَعَلَّكُمْ تُرْحَمُوْنَ○ (الاعراف:۲۰۴)

దివ్యఖుర్ఆన్ పఠనం జరిగేటప్పుడు శ్రద్ధగా వినండి. మౌనం వహించండి. దీని వల్ల మీపై కరుణించడం సాధ్యమవుతుంది. *(అల్ ఆరాఫ్:204)*

దైవధర్మం ఏదో కాల్పనిక కథ కాదు, యదార్థరహితమయిన విషయం కాదు. దాన్ని అలక్ష్యం చేయడం తగదు. అందులో ఆలోచించే చింతన చేసే విషయాలు అనేకం ఉన్నాయి. దైవధర్మం కేవలం తన సత్యతను ప్రకటించడం మాత్రమే కాదు. దానికి ఎంతో బలమైన ఆధారాలు ఎత్తిచూపుతుంది. వాటిని గురించి ఆలోచించమని పిలుపునిస్తుంది.

كِتٰبٌ اَنْزَلْنٰهُ اِلَيْكَ مُبٰرَكٌ لِّيَدَّبَّرُوْا اٰيٰتِهٖ وَ لِيَتَذَكَّرَ اُولُوا الْاَلْبَابِ○ (ص:۲۹)

మేము ఈ గ్రంథాన్ని నీకు అవతరింప జేశాము, ఇది మహా శుభకరమయినది. తద్వారా దీని వచనాల పట్ల జనులు యోచన, చింతన జరపాలని, తెలివయిన వాడు దీని ద్వారా జ్ఞానోపదేశం పొందాల నీను. *(సాద్: 29)*

దైవధర్మాన్ని గురించి మనిషి చింతన జరిపినప్పుడు అతనికి దాని మహత్తు సాక్షాత్కరిస్తుంది. మనిషి దానికి చేరువవుతాడు. దైవధర్మాన్ని వ్యతిరేకించే వారి మహా రోగమేమిటంటే, వారు దాన్ని గురించి యోచించరు. వారు దాన్ని వ్యతిరేకించి ఎంత గొప్ప సత్యాన్ని తిరస్కరిస్తున్నారో వారికేమాత్రం అవగాహన లేదు. నిజానికి ఆలోచనా పరుడయిన ఏ వ్యక్తి అయినా దాన్ని తిరస్కరించే ప్రసక్తే లేదు. మనిషి దాన్ని గురించి ఆలోచించడానికి, యోచించడానికి సిద్ధంగానే లేనప్పుడు, లేదా దాన్ని అంగీకరించనే రాదని ముందే నిర్ణయించుకున్నప్పుడు మాత్రమే దాన్ని నిరాకరించడం సాధ్యమవుతుంది. ఖుర్ఆన్ ఎంతో ఆశ్చర్యంగా ప్రశ్నిస్తుంది. బుద్ధి దైవధర్మాన్ని స్వీకరించమని ప్రబోధిస్తుంది, కాని జనం దాన్ని తిరస్కరిస్తున్నారేమిటీ? అని. దీనికి కారణం ఏమిటీ?

اَفَلَا يَتَدَبَّرُوْنَ الْقُرْاٰنَ اَمْ عَلٰى قُلُوْبٍ اَقْفَالُهَا○ (محمد:۲۴)

వారు ఖుర్ఆన్ పట్ల చింతన చెయ్యరా, లేక వారి హృదయాలకే తాళాలు పడ్డాయా? *(ముహమ్మద్: 24)*

మానవ జ్ఞానం ఏ స్థాయికి చేరనుందో, దైవధర్మం సరిగ్గా దాని కనుగుణ్యంగానే ఉంది. ధర్మాన్ని దాని బోధనల్నీ వ్యతిరేకించే ఏ విషయమూ మానవుడు నేటి వరకు కనుగొనలేదు. ఈ కారణంగానే ఖుర్ఆన్ అంటోంది, ఆలోచనాపరులు, జ్ఞానసంపన్ను లయినవారికి ధర్మాన్ని స్వీకరించడంలో ఎటువంటి సిద్ధాంతపరమయిన చిక్కు ఎదురు కాదు. వారు అతి సంతోషంగా దాన్ని స్వీకరిస్తారు, అది సత్యమని సాక్ష్యమిస్తారు:

وَ يَرَى الَّذِيْنَ اُوْتُوا الْعِلْمَ الَّذِىْ اُنْزِلَ اِلَيْكَ مِنْ رَّبِّكَ هُوَ الْحَقَّ ۙ

(سبا:٦)

**ఎవరికయితే జ్ఞానం ఇవ్వబడిందో వారికి తెలుసు నీకు నీ ప్రభువు తరఫున అవత రింపజేయబడిన ధర్మం సత్యమయినదని.**

***(సబా: 6)***

దైవధర్మం ఏదో చిక్కుతో కూడుకన్న ఫిలాసఫీ కాదు. దాన్ని అర్థం చేసుకునేందుకు బుద్ధీజ్ఞానాల మహాగొప్ప భాండాగారాలు అవసరముండవు. అది ప్రస్ఫుటమయిన గ్రంథం రూపంలో అవతరించింది. దాన్ని చూసి ఏ వ్యక్తి అయినా సరే ఇట్టే గ్రహించగలడు, అది కోరేదేమిటో, అది కోరనిదేమిటో, దాని దృష్టిలో మానవుని నిజస్థానమేదో, మానవుని మోక్షమార్గమేదో, అది మానవ మనుగడకు ఏ మార్గాన్ని ప్రతిపాదిస్తుందో, సఫలతా నిష్ఫలతలకు ఏ కారణాలను సూచిస్తుందో. ఈ యదార్థాల వెల్లడిలో అది ఎటువంటి నిగూఢతను కనబరచలేదు. వీటిని అతిస్పష్టంగా విడమర్చి, అతి సరళమయిన సాధారణ భాషలోనే వెల్లడించింది. అందువల్ల ప్రతి వ్యక్తి తన బుద్ధీబలాన్ననుసరించి దాన్ని అర్థమూ చేసుకోగలడు, దాని ద్వారా ప్రయోజనమూ పొందగలడు.

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِىْٓ اَنْزَلَ عَلٰى عَبْدِهِ الْكِتٰبَ وَلَمْ يَجْعَلْ لَّهٗ عِوَجًا ○

(الكهف:١)

**సకల స్తోత్రాలు దైవం కొరకే. ఆయనే తన దాసునికి ఈ గ్రంథాన్ని అవతరింప జేశాడు. ఇందులో ఎటువంటి వక్రతనూ పెట్టలేదు.**

***(అల్ కహ్ఫ్ : 1)***

దైవధర్మం మానవుని సమక్షంలో అతిస్పష్టంగా వెల్లడయింది. ఎవరయినా వాస్తవం గానే దాన్ని అర్థం చేసుకోదలిస్తే అతని మార్గంలో ఇక ఎటువంటి అడ్డూ లేదు. ఇక ఇది మానవుని బాధ్యత, అతను దైవధర్మాన్ని అర్థం చేసుకునే ప్రయత్నం చేయడమో లేదా తన మనస్సును ఆ దారి నుండి తప్పించి మరే పనిలోనయినా నిమగ్నం చేయడమో అతని పని.

وَ لَقَدْ يَسَّرْنَا الْقُرْاٰنَ لِلذِّكْرِ فَهَلْ

**మేము ఖుర్ఆన్‌ని సులభతరం చేసి వేశాము. అలాగయినా జనం దాని ద్వారా**

مِنۡ مُّدَّكِرٍ۝ (القمر:١٧)

మార్గబోధన పొందాలని. ఉన్నారా ఎవరయినా దీని ద్వారా హితోపదేశం పొందేవారు? *(అల్ కమర్: 17)*

ఇక్కడ మరో విషయం గుర్తుంచుకోవాలి. దైవధర్మం పట్ల సుదీర్ఘ చింతన చేసే ప్రతి వ్యక్తీ దాన్ని పొందగలుగుతాడన్న నమ్మకం లేదు. దాన్ని పొందడానికి, మనిషి అన్ని విధాల దురభిమానాలకు దూరమయి నిర్మల హృదయంతో ఆలోచించగలగడం తప్పనిసరి. మనిషికి ఏదయినా విషయం పట్ల పక్షపాత బుద్ధి ఉన్నట్లయితే అతనికి అదొక్కటే తప్ప మరేదీ అసలు కనిపించనే కనిపించదు. అతనికి ధర్మంలో సత్యత పట్ల నమ్మకం కలిగినా దాన్ని స్వీకరించడానికి అతని హృదయ కవాటాలు తెరచుకోవు.

క్రీ.శ. 6వ శతాబ్దిలో దైవధర్మం పట్ల ఇస్రాయీల్ సంతతివారి వైఖరి దీనికి ప్రబల సాక్ష్యం. వారు దైవధర్మాన్ని, తండ్రి తన సంతానాన్ని గుర్తించినట్లే గుర్తించేవారు. అయినప్పటికీ వారిలో అత్యధికులు దాన్ని స్వీకరించలేదు. కారణం, దాన్ని అందజేసేవారు తమ జాతి వ్యక్తి కాకపోవడం ఒక్కటే. వారితోపాటు ఆ కాలంలోనే కొందరున్నారు, వారి దృష్టిలో దైవధర్మం జాతి, దేశం, వంశం, గోత్రం అన్నింటికన్నా ఉన్నతమయింది. వారి సమక్షంలో దైవధర్మం రాగానే వారు ఎలుగెత్తి చాటారు, ఇదే సత్యమని; కళ్ళ నుండి అశ్రువులు రాలగా ప్రార్థనలు చేశారు, "దేవా, మా ఈ సాక్ష్యాన్ని స్వీకరించు, నీ ధర్మం పట్ల సాక్ష్యాన్ని పలికినవారిలో మమ్మల్ని చేర్చుకో" అని వేడుకున్నారు:

وَ اِذَا سَمِعُوۡا مَاۤ اُنۡزِلَ اِلَى الرَّسُوۡلِ تَرٰۤى اَعۡيُنَهُمۡ تَفِيۡضُ مِنَ الدَّمۡعِ مِمَّا عَرَفُوۡا مِنَ الۡحَـقِّ‌ۚ يَقُوۡلُوۡنَ رَبَّنَاۤ اٰمَنَّا فَاكۡتُبۡنَا مَعَ الشّٰهِدِيۡنَ۝ (المائدۃ:٨٣)

వారు దైవప్రవక్తకు అవతరింపజేసిన వచనాన్ని విన్నప్పుడు, నీవు గమనిస్తావు, వారు సత్యాన్ని గుర్తుపట్టడం మూలంగా వారి కళ్ళ నుండి అశ్రువులు ధారా పాతంగా ప్రవహిస్తూ ఉంటాయి, వారు ఇలా వేడుకుంటారు, మా ప్రభూ, మేము విశ్వసించాము, మమ్మల్ని సయితం సాక్ష్యం పలికే వారిలో వ్రాసుకో.

*(అల్ మాఇద: 83)*

కొన్ని విషయాలు దైవధర్మం పట్ల ఆలోచించే మార్గంలోనూ అవరోధాలయి నిలుస్తాయి. కాగా ప్రపంచ వ్యామోహం, ఇహలోకపు సౌలభ్యాలు, మనిషి సమయాన్ని అతని శక్తిసామర్థ్యాలను అతన్నుండి దోచుకుంటాయి. అతను దైవధర్మాన్ని తన

ఆలోచనా విషయంగా చేసుకునేందుకు, ఏకాగ్రతతో దాన్ని గురించి ఆలోచించడానికి అవకాశాన్ని అతనికి కల్పించవు. అలాగే అధికార మదం కూడా చింతనాపథంలో అడ్డు తెరయిపోతుంది. ఈ మత్తు తొలగనంత వరకు మనిషి ధర్మం వైపున శ్రద్ధ చూపడం సాధ్యపడదు. ఇవేకాక ఇంకా అనేక కారణాల వల్ల మనిషి ధర్మం విషయంలో ఆలోచించకుండా అతన్ని వారిస్తాయి.★

కాని మనిషిలో సత్యాన్ని చూడగలిగే, గుర్తించగలిగే, అర్థం చేసుకోగలిగే సామర్థ్యముంటే అతను ఈ కారణాలనన్నింటినీ తొలిగించి దైవధర్మం వైపునకు ముందుకు సాగుతాడు. అతనికి వీటిలో ఏదీ ఈ మార్గంలో అవరోధం కాజాలదు. ఈ సామర్థ్యమే 'సబా'రాణిని ధర్మస్వీకారానికి సమాయత్తపరచింది, ఆమె విశ్వసించింది. దీనికి భిన్నంగా ఇటువంటి సామర్థ్యంలేకపోవడం చేత ఫిర్ఔన్ గర్వంలో పడిపోయాడు, నేనే అందరికన్నా గొప్ప దైవాన్ని అనుకోసాగాడు. అందువల్ల మరెవరి సమక్షంలోనయినా తలవంచడం తనకు పరాభవంగా భావించాడు. ఈ యదార్థాన్నే ఖుర్ఆన్ ఇలా తెలిపింది:

اِنَّکَ لاَ تُسْمِعُ الْمَوْتٰی وَلاَ تُسْمِعُ الصُّمَّ الدُّعَآءَ اِذَا وَلَّوْا مُدْبِرِیْنَ○ وَمَآ اَنْتَ بِهٰدِی الْعُمْیِ عَنْ ضَلٰلَتِهِمْؕ اِنْ تُسْمِعُ اِلَّا مَنْ یُّؤْمِنُ بِاٰیٰتِنَا فَهُمْ مُسْلِمُوْنَ○ (النمل:٨٠،٨١)

**నీవు మృతులకు వినిపించలేవు, అదీ వారు చెవిటి వారియి వెనుతిరిగి పారిపోతూ ఉండగా. అలాగే నీవు గుడ్డివారికి దారి చూపి తప్పి పోకుం డానూ ఆపలేవు. మా ఆయత్‌లను విశ్వసించేవారికి, ఆపైన విధేయులయ్యే వారికి మాత్రమే నీవు వినిపించ గలుగుతావు.** *(అన్ నమ్ల్: 80-81)*

ఖుర్ఆన్‌లోని ఈ వాక్యానికి భావం తెలుసుకోవాలంటే పై వాక్యం వెలుగులో దాన్ని పరిశీలించాలి. మృతులయిన వారికీ, గుడ్డివారికీ, చెవిటి వారికీ, వెనుదిరిగి పారిపోయే వారికీ వినిపించలేవు అన్న వాక్యం వెలుగులో చూడాలి. భావమేమిటంటే, ఎవరిలో సత్యాన్ని వినే స్వీకరించే సామర్థ్యముందో మరెవరి హృదయాలు సజీవంగా, అంతరాత్మ జాగరూకతతో ఉందో ఎవరయితే దైవవచనాలను విని చెవుల్లో వ్రేళ్ళు దోపుకోరో దానికి బదులుగా వాటిని శ్రద్ధగా వింటారో, అర్థం చేసుకునే ప్రయత్నం చేస్తారో వారే నీ మాటను వింటారు, దైవధర్మాన్ని స్వీకరిస్తారు. ఈ సామర్థ్యమున్నట్లయితే దైవధర్మం ప్రాప్తమవు తుంది. లేకపోతే మనిషి నడిచే కళేబరం మాత్రమే. మృతులకు వినిపించడం దైవసందేశ హరుల తరమూ కాని పని. ప్రవక్త రాకకు, అతనికి వహీ అవతరణకూ కారణం:

★ వివరాలకు చూడండి వెనుకటి చర్చ: *ధర్మతిరస్కారం - కారణాలు.*

لِيُنْذِرَ مَنْ كَانَ حَيًّا وَّ يَحِقَّ الْقَوْلُ
عَلَى الْكَافِرِيْنَ۝ (يٰسٓ:۷۰)

అతను భయపెట్టాలని సజీవుదయిన వ్యక్తికి, తిరస్కారులకు వాదన పూర్తి కావాల నీను. *(యాసీన్: 70)*

## గుణపాఠం గ్రహించేవారు

దైవధర్మాన్ని కాదనడం దైవశిక్షను ఆహ్వానించడమే. ఏ జాతులయితే దైవధర్మాన్ని తిరస్కరించాయో అవి సర్వనాశనమయిపోయాయి, ప్రపంచంలోని ఏ శక్తీ వాటిని రక్షించలేకపోయింది. ఏ వ్యక్తిలో చరిత్ర చెప్పే ఈ సంఘటన ద్వారా గుణపాఠం గ్రహించే సామర్థ్యముంటుందో అతనెన్నడూ దైవధర్మాన్ని తిరస్కరించే సాహసం చెయ్యడు. దైవధర్మం పిలుపు ఎప్పుడు అతని చెవులకు సోకినా అతను శరవేగంతో దాని వైపునకు గెంతిపోతాడు, సంతోషంగా దాన్ని స్వీకరిస్తాడు. 'కాఫ్' సూరాలో ఈ యదార్థాన్నే సూచించడం జరిగింది:

وَ كَمْ اَهْلَكْنَا قَبْلَهُمْ مِّنْ قَرْنٍ هُمْ
اَشَدُّ مِنْهُمْ بَطْشًا فَنَقَّبُوْا فِى الْبِلَادِ ؕ
هَلْ مِنْ مَّحِيْصٍ۝ اِنَّ فِىْ ذٰلِكَ
لَذِكْرٰى لِمَنْ كَانَ لَهٗ قَلْبٌ اَوْ اَلْقَى
السَّمْعَ وَهُوَ شَهِيْدٌ۝ (قٓ:۳۶،۳۷)

మేము వీరికి ముందు ఎన్నో జాతులను సంహరించాము. అవి తమ పట్టులో వీటి కన్నా ఎంతో కఠినమయినవి. (వారి పైకి దైవశిక్ష వచ్చిపడినప్పుడు) వారు పట్టణా లన్నీ తిరిగి తమకేదయినా శరణు లభిస్తుం దేమోనని గాలించారు (కాని వారికి ఏ రక్షణా ప్రాప్తం కాలేదు). నిశ్చయంగా ఇందులో గుణపాఠం ఉంది, (అంత ర్యంలో సజీవ) హృదయమున్న వారి కొరకు లేదా చెవులొగ్గి హృదయ సాక్షా త్కారంతో మాట వినేవారి కొరకు.

*(కాఫ్: 36-37)*

ప్రతి వ్యక్తి సహజసిద్ధంగా మోక్షాన్ని కాంక్షిస్తాడు. ఏ వ్యక్తి అయినా నాశనమవడాన్ని కోరుకోడు. అందువల్ల అతను చరిత్ర ఇచ్చే హెచ్చరికల ద్వారా గుణపాఠం గ్రహించడం అవసరం. అయితే కొన్ని సందర్భాలలో మనిషికి ఏమరుపాటు నిరాసక్తత చుట్టుముడు తాయి. అతను ఈ హెచ్చరికల్ని అర్థం చేసుకునే ప్రయత్నం చేయడు. నాశనం నుండి తప్పించుకునే కోరిక ఉన్నప్పటికీ నాశనమార్గాన్నే ముందుకు సాగుతాడు. చివరికి ధర్మాన్ని వ్యతిరేకించే అసంఖ్యాకమయిన జనుల్లానే స్వయంగానూ తరువాతి వారి కొరకు గుణ పాఠానికి ఉదాహరణగా మిగిలిపోతాడు.

ఎన్నో జనవాసాలు దుర్మార్గ వైఖరినవలం బించగా మేము వాటిని సర్వనాశనం చేసి వేశాము. అవి ఇప్పుడు తమ కప్పులపైన తల్లక్రిందులయి పడి ఉన్నాయి; ఎన్నో బావులు పాడుపడిపోయాయి. ఎన్నో పటిష్టమయిన కోటలు శిథిలమయి పోయాయి. వీరు భువిలో తిరగడం లేదా, వీరికి అవగతపరచుకునే హృదయాలు, వినగలిగే చెవులు లేవా? వాస్తవానికి కళ్ళు గుడ్డివి కావు, ఆంతర్యాలలోని హృద యాలు గుడ్డివయిపోతాయి.

*(అల్ హజ్జ్:45-46)*

فَكَاَيِّنْ مِّنْ قَرْيَةٍ اَهْلَكْنٰهَا وَهِيَ ظَالِمَةٌ فَهِيَ خَاوِيَةٌ عَلٰى عُرُوْشِهَا وَ بِئْرٍ مُّعَطَّلَةٍ وَّ قَصْرٍ مَّشِيْدٍ○ اَفَلَمْ يَسِيْرُوْا فِي الْاَرْضِ فَتَكُوْنَ لَهُمْ قُلُوْبٌ يَّعْقِلُوْنَ بِهَآ اَوْ اٰذَانٌ يَّسْمَعُوْنَ بِهَا ۚ فَاِنَّهَا لَا تَعْمَى الْاَبْصَارُ وَلٰكِنْ تَعْمَى الْقُلُوْبُ الَّتِيْ فِي الصُّدُوْرِ○ (الحج:٤٥،٤٦)

## ధర్మాన్ని కోరుకునేవారు

దైవధర్మాన్ని కోరుకునేవానికే అది ప్రాప్తమవుతుంది. ఏ వ్యక్తిలోనయితే ధర్మం పట్ల కోరికే ఉండదో అతను దానికి దూరంగానే ఉండిపోతాడు. పరమ ప్రభువు ఈ విషయంలో తన నియమాన్ని అతిస్పష్టంగా వివరించాడు.

ఆయన తన ధర్మం వరకు చేరే మార్గం, తన ధర్మం వైపునకు మరలే వారికే చూపిస్తాడు. (అర్ రా'ద్:27)

يَهْدِيْ اِلَيْهِ مَنْ اَنَابَ○ (الرعد:٢٧)

ధర్మం లేకుండా మనిషి జీవితంలో అంతులేని వెలితి ఏర్పడుతుంది. మనిషి అనుభూతుల్లేని జీవితం గడిపేందుకు అలువడలేకపోతే ధర్మాభిలాషలో అసహనంతో చలించిపోవాలి. ఆకలి గొన్నప్పుడు ఆహారం కొరకు తపించినంతగా అతను ధర్మం కొరకు పరితపించాలి. మనిషి జీవితంలో ధర్మం లేమి వల్ల ఏర్పడే అనేక కోణాల శూన్యాన్ని ఒక్క దైవధర్మం మటుకే పూర్తి చేయగలుగుతుంది. మరే మార్గం ద్వారానూ దాన్ని పూరిం చడం సాధ్యపడదు. వీటిలో కొన్ని కోణాలను మేము ఇక్కడ ఉదాహరిస్తున్నాము:

1) ప్రతి మనిషి తెలుసుకోగోరుతాడు, తనకు ఎవరయినా సృష్టికర్త, స్వామి, ప్రభువు, ఆరాధ్యుడు ఉన్నాడా లేడా? ఉంటే ఆయనతో గల సంబంధం ఎటువంటిది? దైవధర్మం ఈ ప్రశ్నకు ఎంతో సరయిన సంతృప్తికరమయిన సమాధానమిస్తుంది.

మానవునికి ఏదయినా సిద్ధాంతాన్ని దాని ఉత్తమ కోణాలను పరిశీలించగలిగే సత్తా ఉన్నట్లయితే అతను అప్రయత్నంగా ఎలుగెత్తి చాటుతాడు, ఇదే సత్యం, దీన్నే నేను అన్వేషిస్తూ ఉన్నాను అని.

2) మానవునికి చట్టం అవసరం. ఈ ఆవశ్యకతను అతను స్వయంగానే తీర్చుకోవాలని ప్రయత్నించినప్పుడల్లా చాలా తీవ్రంగా నిష్ఫలత చెందాడు. ఎందుకంటే మనిషి నిర్మించే ప్రతి చట్టం సంతులనాన్ని, సంయమనాన్ని కోల్పోయి ఉంటుంది. అందులో ఒక విషయాన్ని పరిగణనకు తీసుకుంటే మరొకటి అసలు ఉనికే కోల్పోతుంది. దీనికి భిన్నంగా దైవధర్మం మనకు అనుగ్రహించే చట్టం ఎటువంటి అతివాదానికీ లోనవక అత్యంత సంతులితంగా ఉంటుంది. మనిషి తాను నిర్మించిన అసంతులిత చట్టాలను దీనితో పోల్చి చూసినట్లయితే, ఇది ఏ మానవుడూ నిర్మించింది కాదు, దైవం పంపినదే అన్న విషయాన్ని అతని ఆంతర్యమే సాక్ష్యం పలుకుతుంది. అయినప్పటికీ ధర్మాభిలాష మానవునిలో జనించడం లేదంటే దైవధర్మం అతని ఆంతర్యంలో ప్రవేశించే ఏ మార్గమూ ఈ ప్రపంచంలో మరేదీ లేదు.

3) మృత్యువు ఒరలేని కరవాలం, ప్రతి వ్యక్తి మెడపైన వ్రేలాడుతోంది. మృత్యువు ఎప్పుడొస్తుందో, ఎప్పుడు జీవన వ్యవధి ముగుస్తుందో ఎవ్వరూ చెప్పలేరు. మరణం తరువాత ఏమవుతుందో అన్నది ప్రముఖమయిన ప్రశ్న. ఇది ఆలోచించే ప్రతి మనిషినీ వ్యాకులపరిచే ప్రశ్న. మరణానంతరం ఏ ప్రమాదమూ లేదు కదా అన్న విషయాన్ని ప్రతి మనిషీ తెలుసుకోగోరుతాడు. తద్వారా తనకు ప్రాప్తమయిన ఈ స్వల్పకాల జీవన వ్యవధిని సంతృప్తిగా గడపగోరుతాడు. ఏదయినా ప్రమాదమున్నట్లయితే దాన్నుండి తప్పించుకునే మార్గమేది?

దైవధర్మం అతనికి తెలుపుతుంది, మరణానంతరం మనిషి శాశ్వతంగా సఫలుడయినా అవుతాడు, లేదా అంతులేని నిష్ఫలతకయినా లోనవుతాడు; తీర్పు అప్పుడే జరుగుతుంది. దైవధర్మాన్ని స్వీకరించినవారు సాఫల్యం పొందుతారు. దాన్ని తిరస్కరించిన వారు నిష్ఫలత నుండి తమ్ముతాము ఏమాత్రం రక్షించుకోలేరు. ఈ వాస్తవాన్ని దైవధర్మం మాటిమాటికీ ఎంత బలంగా నొక్కి చెప్పిందంటే దాన్నుండి చూపు మరల్చుకోవడం మనిషికి సాధ్యపడని విషయం.

ఈ కారణాల వల్లనే మనిషిలో తప్పనిసరిగా ధర్మాన్ని పొందాలన్న కోరిక పుట్టాలి, పుడుతుంది. ఈ అభిలాష ఎవరిలో కలుగుతుందో అతనికి దైవధర్మం తప్పక ప్రాప్తమవుతుంది. ఎందుకంటే ఎవరు దైవాన్ని ఆయన ధర్మం కొరకు అర్థిస్తారో అతన్ని

ధర్మవిహీన స్థితిలో పడి ఉండనివ్వడం, ఆ స్థితిలోనే అతన్ని ప్రపంచం నుండి తీసుకు పోవడం అన్నది ఆయన కారుణ్యానికి పొసగని విషయం.

## ధైర్యవంతులయిన వారు

దైవధర్మం ప్రాప్తం కావాలంటే సత్యం కొరకు మిథ్యాభావాలతో పోరాడే సాహసం ఉండాలి. అటువంటి వ్యక్తికే అది ప్రాప్తమవుతుంది. దైవధర్మం ముందుకు వచ్చిన తరువాత దాన్ని ఎట్టి పరిస్థితిలోనూ స్వీకరించి తీరుతానని సిద్ధమయిన వ్యక్తికే అది లభిస్తుంది. ధర్మం కొరకు పెద్ద పెద్ద ప్రయోజనాలను, కీర్తి ప్రతిష్ఠలను, హోదా, సంపత్తులను త్యాగం చేయగలవారికి, ధర్మం తన ప్రాణాలను కోరినా దాన్ని సంతోషంగా అర్పించగల సంకల్పనిరతి, సాహస బలం ఉన్నవారికి మాత్రమే అది ప్రాప్తమవుతుంది. సంకల్పం, సాహసం ఉన్నట్లయితే అతిసాధారణ వ్యక్తిని సయితం దైవం తన ధర్మానికి ధ్వజ వాహకునిగా చేసివేస్తాడు. కాని సాహసమే లేకపోతే మహాగొప్ప తత్వవేత్తలు, తాత్కాలిక మహారాజులు కూడా దానికి హక్కుదారులు కాలేరు.

దీనికి ఉదాహరణ మనకు హజ్రత్ మూసా (అ) కెదురుగా వచ్చిన మంత్ర జాలికులలో కానవస్తుంది. ఫిర్ఔన్ వారికి వాగ్దానం చేశాడు, వారు తమ జాల విద్యతో గారడీ చేసి మహనీయ మూసా (అ)ని లోబరచుకున్నట్లయితే వారు తన రాచదర్బారులో సన్నిహితులవుతారని. కాని వారు, హజ్రత్ మూసా(అ) మంత్రజాలికుడు కాదని గమనించగానే, ఆయన సత్యసందేశకుడు, దైవసందేశహరుడు అని గ్రహించగానే వారికి తమ తప్పు తెలిసివచ్చింది, వారు విశ్వాసంగైకొన్నారు. వారి ఈ చేష్ట వారిని ఫిర్ఔన్ ఆగ్రహానికి గురిచేస్తుందన్న విషయం వారెరుగనిది కాదు. కాని వారు దాన్ని లెక్కచెయ్యలేదు. ప్రతి కష్టాన్నీ ఎదుర్కోవడానికి సన్నద్ధులయ్యారు.

కాగా ఫిర్ఔన్ వారికి, తొలుత మీ కాళ్ళు చేతులూ నరికిస్తాను, తరువాత ఉరి కంబానికెక్కిస్తాను అని బెదిరించినా వారు విశ్వాసంగల వారెవరయినా ఇచ్చే సమా ధానమే ఇచ్చారు.

قَالُوْا لَنْ نُّؤْثِرَكَ عَلٰى مَا جَآءَنَا مِنَ الْبَيِّنٰتِ وَالَّذِىْ فَطَرَنَا فَاقْضِ مَا اَنْتَ قَاضٍ ؕ اِنَّمَا تَقْضِىْ هٰذِهِ الْحَيٰوةَ الدُّنْيَا ؕ اِنَّاۤ اٰمَنَّا بِرَبِّنَا لِيَغْفِرَ

ఇది ఎన్నటికీ సాధ్యపడదు. మా సమక్షంలోకి వచ్చిన ప్రస్ఫుటమయిన నిదర్శనాలను, మమ్మల్ని పుట్టించిన దైవానికి సదృశంగా మేము నీకు ప్రాధాన్యతనివ్వడం ఎన్నడూ సాధ్యమవదు. కాబట్టి నీవు చేయదలచిందేదో నీవు చేసుకో; నీవు ఇహ

لَنَا خَطٰيٰنَا وَمَا اَكْرَهْتَنَا عَلَيْهِ مِنَ السِّحْرِ ؕ وَاللّٰهُ خَيْرٌ وَّ اَبْقٰى○

(طٰہٰ:۷۲،۷۳)

లోకపు ఈ జీవితంపైనే నీ అధికారాన్ని చెలాయించగలుగుతావు. మేమయితే మా ప్రభువును విశ్వసించాము, ఆయన మమ్మల్ని మన్నించాలని, మేము చేసిన పాపాలకు, నీవు మమ్మల్ని బలవంతపెట్టి చేయించిన జాల విద్యకు. అల్లాహ్ మాత్రమే శుభకరుడు, నిత్యధాముడు.

*(తాహా: 72–73)*

దైవధర్మం ఎదురువచ్చినప్పుడు ధైర్యహీనుడు దాన్ని చూసి వణకిపోతాడు. ఖుర్ఆన్ మాటల్లో, ఎవరయితే, 'మేము నీతోపాటు ఈ మార్గబోధనను అనుసరించే మాటయితే మా ఈ భూభాగం నుండి గెంటివేయబడతాము.' (అల్‌కసస్: 57) అని అంటారో వారు దైవధర్మాన్ని స్వీకరించడం సులభం కాదు. వారు నెమ్మదిని సంతృప్తినీ కోరుకుంటారు. కాని దైవధర్మం మాత్రం ప్రమాదాలను ఎదిరించగల వారికే ప్రాప్తమవుతుంది.

ఇదొక వాస్తవం. దైవధర్మానికి సదా సాహసవంతులయిన వ్యక్తులే స్వాగతం పలికారు. ఇప్పుడు కూడా వారే స్వాగతించగలరు. వీరికి ఇదొక్కటే తప్ప మరే వస్తువునూ పొందే లేక పోగొట్టుకున్న చింత ఉండదు. ధైర్యవిహీనుడయిన మనిషికి తన వద్దనున్న అతిస్వల్పమయిన జీవన సామగ్రి కూడా మహా సంపదగా అగుపిస్తుంది. అతను ఈ సంపదను కోల్పోవడానికీ సిద్ధపడడు, దైవధర్మమూ అతనికి ప్రాప్తం కాదు.



- అల్లాహ్ పట్ల విశ్వాసం
- పరలోకం పట్ల విశ్వాసం
- దివ్యఖుర్ఆన్ అంతిమ దైవ గ్రంథం
- నమాజ్, ధర్మసందేశం
- దైవమార్గంలో ఖర్చుపెట్టడం
- త్యాగం
- చిత్తశుద్ధి ధర్మానికి ప్రాణం
- స్థిరచిత్తం

# పిలుపునిచ్చే వారి గుణగణాలు

ఇస్లామ్ స్వయంగా ఒక సందేశం. ఈ సందేశాన్ని స్వీకరించినవారు దీన్ని ప్రపంచం మొత్తాన వ్యాపింపజెయ్యడం, భూతలంలో దీన్ని నమ్మనివారు ఒక్కరయినా సరే మిగిలి ఉన్నంత వరకు వ్యాపింపజేసే తమ కృషిని కొనసాగించడం వీరి బాధ్యత. ఇంత మహా గొప్పకార్యాన్ని సాధించే మానవునిలో ఇస్లామ్ అభిలషించే ఉన్నత గుణగణాలు సయితం పరిపూర్ణంగా స్థానమేర్పరచుకోవాలి. ఈ లక్షణాలు ఒక వ్యక్తిలో కానవస్తాయంటే ఒక వైపున అతని జీవితం ఇస్లామ్ రూపంలో పూర్తిగా పోతపోయబడి ఉందని రుజువవు తుంది, మరో వైపున ఈ లక్షణాల మూలంగానే ఆ వ్యక్తిలో ఇస్లామ్ సందేశం బరువు బాధ్యతలు మోసే శక్తి జనిస్తుందన్నది వాస్తవం. ఈ గుణగణాలే ఈ మార్గంలో పనికి వచ్చే గొప్ప సాధనాలు, ఆయుధాలు, మహా సంపదలు.

ఈ లక్షణాలతో అతను సందేశ రంగంలో కాలిడినప్పుడు పటిష్టమయిన శీల స్వభావాలు, అపార క్రియాత్మక శక్తి, అసామాన్యమయిన ఉత్సాహ ఉద్రేకాలతో ప్రవేశిస్తాడు. ఇవి లేకుండా ప్రవేశిస్తే బలహీనుడయిన, అస్త్రవిహీనుడయిన వ్యక్తి యుద్ధ రంగంలోకి ప్రవేశించినట్లుంటుంది. అటువంటి వ్యక్తి ద్వారా ఎటువంటి కార్యసాధననూ ఆశించలేము. అతను శత్రువును జయించడం అలా ఉంచి అతనికెదురుగా ఎంతో సేపు నిలువనూ లేడు.

ఇస్లామ్ దాన్ని విశ్వసించేవారిలో దాని అనుయాయుల్లో కోరే సకల లక్షణాలు గుణగణాలు ఇక్కడ ప్రస్తావించడం లేదు. సందేశకార్యం కొరకు వాటిలోని కేవలం కొన్ని లక్షణాల ప్రాముఖ్యతను మటుకే వివరించడం జరిగింది. అయితే దీని ద్వారా ఇస్లామ్ ఎటువంటి మనస్తత్వాన్ని, ఆలోచనాసరళిని సృష్టించగోరుతుందో ద్యోతకమవుతుంది, అలాగే ఇస్లామ్ సేవకు కావలసిన గుణగణాలెలాంటివో కూడా తెలిసిపోతుంది.

# అల్లాహ్ పట్ల విశ్వాసం

## అల్లాహ్ పట్ల విశ్వాసం ధర్మానికి మూలం

దైవాన్ని నమ్మడం ధర్మంలో మౌలికమయిన అంశం. దీని ద్వారానే విశ్వాసి, అవిశ్వాసుల మధ్య వ్యత్యాసాన్ని గుర్తించడం జరుగుతుంది. మానవుడు ఈ జీవితంలో రెండే విధానాలు అనుసరించగలుగుతాడు. పరమ ప్రభువు అల్లాహ్‌నయినా విశ్వసించాలి లేదా షైతాన్‌నయినా అనుసరించాలి. అల్లాహ్ చూపిన మార్గానికి భిన్నమయిన ప్రతి మార్గం షైతాన్ మార్గమే. వాస్తవానికి షైతాన్ మార్గాన పయనించేవాడు ఎన్నటికీ ఎట్టి పరిస్థితిలోనూ అల్లాహ్‌ను చేరలేడు.

ఇస్లామ్ మనలో దైవభక్తిని సృజించగోరుతోంది. భక్తి, విశ్వాసంతో మొదలవుతుంది. మనిషి తన దైవవిశ్వాసంలో చిత్తశుద్ధి గలవాడయినట్లయితే, సత్యవంతుడయినట్లయితే అతని ఆత్మ దైవదాస్య భావనలతో ఉగ్రూతలూగుతూ ఉంటుంది. అతని జీవితమంతా దైవభక్తి వ్యాపిస్తుంది. తాగూత్ షైతాన్‌తో అతని బంధాలన్నీ తెగిపోతాయి. అతను దైవంతో తన సంబంధాన్ని పటిష్టపరచుకుంటాడు.

فَمَنْ يَّكْفُرْ بِالطَّاغُوْتِ وَ يُؤْمِنْ بِاللّٰهِ فَقَدِ اسْتَمْسَكَ بِالْعُرْوَةِ الْوُثْقٰى ۚ لَا انْفِصَامَ لَهَا ۗ وَاللّٰهُ سَمِيْعٌ عَلِيْمٌ ○ (البقرة:٢٥٦)

మరెవడయితే తాగూత్‌ని తిరస్కరిస్తాడో, అల్లాహ్‌ను విశ్వసిస్తాడో అతను ఒక గట్టి ఆధార పాశాన్ని పట్టుకున్నట్లు, అది ఎన్నడూ తెగదు. నిశ్చయంగా అల్లాహ్ అన్నీ వినేవాడు, అంతా తెలిసినవాడు.

*(అల్ బకర: 256)*

## దైవవిశ్వాసం - తప్పనిసరి ఆవశ్యకతలు

దైవాన్ని విశ్వసించడమంటే మీరు పూర్తిగా ఆయనకు స్వయంగా సమర్పణ

చేసుకున్నారన్న మాట. ఆయన దాస్యంలో తన్ను తాను అర్పించుకున్నారన్న మాట. ఇక మీపైన మరొకరెవరి ప్రభుత కూడా చెల్లనేరదన్నమాట. మీరు ప్రపంచంలో కేవలం అల్లాహ్ దాస్యం కొరకే జీవిస్తున్నారన్న మాట. ఇదొక్కటే తప్ప మీ జీవితానికి మరో లక్ష్యం ఏదీ లేదన్న మాట. విశ్వాస ప్రకటన ద్వారా మీరు అల్లాహ్ దాసులని ఆయన ఆదేశాన్ని పాలించేవారని ప్రమాణం చేస్తున్నారన్న మాట. ఆయన ఆదేశానికి లోబడే జీవిస్తానని, సరిగ్గా ఒక దైవభక్తి పరాయణుడయిన దాసుడు జీవించినట్లే జీవితం గడుపుతానని ప్రమాణం చేస్తున్నారన్న మాట. అల్లాహ్ ఎటు వైపునకు వెళ్ళరాదని మిమ్మల్ని కోరుతాడో ఆ వైపున ఒక్క అడుగూ మీరు వెయ్యకుండా ఆగిపోతారు. మీరు ఏ పని నిర్వర్తించినా అల్లాహ్ ఆదేశానుసారమే నిర్వర్తిస్తారు. కేవలం అల్లాహ్ నిర్ణయమే మీ ఎడల నిర్ణయంగా చెల్లుతుంది. మరెవరి నిర్ణయమయినా మీకు శిరోధార్యం కాజాలదు.

## ఈ ప్రమాణ పాలనమే విశ్వాసం

దాస్యం చేసే ఈ ప్రమాణం మీ నుండి మీ సర్వస్వాన్నీ దోచుకుంటుంది. మీరు మీ ఈ ప్రమాణంలో సత్యబద్ధులే అయినట్లయితే ఏ వస్తువూ స్వయంగా మీకు స్వంతం కాజాలదు. అన్నీ అల్లాహ్‌కు చెందినవయిపోతాయి. ఈ ప్రమాణం చేసిన తరువాత మీ మనసు, మీ ఆలోచన కూడా ఆయన ఇష్టం కొరకే పరిమితమవుతుంది, ఆయన ప్రసన్నత పొందడమే మీ చింతనా కేంద్రమవుతుంది. ఒక్క అల్లాహ్ సంస్మరణ తప్ప మరే బాధ మీకు మిగులదు. మీ భావనలు పరమ ప్రభువు కొరకే అంకితమయిపోతాయి. కేవలం ఆయన అస్తిత్వమే మీ సుఖదుఃఖాల ప్రేరణగా రూపొందుతుంది. మీరు ఆయన ప్రేమలోనే జీవిస్తారు, ఆయన ప్రేమ కొరకే ప్రాణాలు వదలుతారు.

అల్లాహ్ ఆదేశమయినట్లయితే మీరు మీ ప్రాణశత్రువునయినా హృదయానికి హత్తుకునేందుకు సిద్ధమవుతారు. ఆయన ఇష్టం కాకపోతే మీ స్వంత సంతానాన్ని సయితం మీ నుండి దూరం చేసుకునేందుకు వెనుకంజవేయరు. మీ సమయమంతా అల్లాహ్ వశమయిపోతుంది. మిమ్మల్ని ఆయన ఛత్రఛాయ నుండి దూరం చేసే ప్రతి కార్యక్రమానికీ మీరు దూరమయిపోతారు. ఇతరులంతా మునిగిపోయి తేలియాడుతున్న ఈ రేబవళ్ళ రంగుల కేళి మిమ్మల్ని ఆకర్షించదు. మీరు అదే సమయాన్ని దైవప్రసన్నతబడయటానికి వినియోగించుకుంటారు. ఆయన ఇష్టం, ప్రసన్నత, సంతోషాలే మీ ధ్యేయం, లక్ష్యం, మీకు వలసిన గమ్యం అవుతాయి. మీరు చేసే ప్రతి కృషి వెనక, మీరు ఆయనకు చేరువ కావాలన్న అభిలాష, ఆవేదన మటుకే క్రియాశీలమవుతుంది.

మీరు ఏ స్థితిలో ఉన్నా ఆపాదమస్తకం మూర్తీభవించిన దైవదాసులయి మెలుగుతారు. అల్లాహ్ మీ పట్ల ప్రసన్నుడవ్వాలన్న ఆకాంక్షతో మీ ఆత్మ నిరంతర వ్యాకులతకు లోనయి ఉంటుంది. మీరు కోరుకునే కోరికల్లో అత్యుత్తమమయిన కోరిక ఒక్కటే, రేపు మీరు అల్లాహ్ సమక్షంలో, ఆయన సన్నిధిలో హాజరయినప్పుడు నిజమయిన దైవదాసులుగా నిలబడాలన్నది. మీరు మీ సర్వస్వమూ ధారపోసిన తరువాత వణికే పెదాలతో, ఆవేదనాపూర్వకంగా ఆయనకు విన్నవించుకుంటారు, 'స్వామి, ఈ దాసుడు ఉన్నదేదో అంతా అర్పించుకున్నాడు. ఇక నీవే దీన్ని స్వీకరించాలి:

**నిశ్చయంగా నా నమాజ్, నా కుర్బానీ, నా జీవితం, నా మరణం అన్నీ అల్లాహ్ కొరకే! ఆయనే సర్వలోకాల ప్రభువు.**

***(అల్ అన్‌ఆమ్: 162)***

**اِنَّ صَلاَتِیۡ وَ نُسُکِیۡ وَ مَحۡیَایَ وَ مَمَاتِیۡ لِلّٰہِ رَبِّ الۡعٰلَمِیۡنَ ۝**

(الانعام:۱۶۲)

విశ్వాసమంటే అల్లాహ్ దాస్యమన్న మాట. అల్లాహ్ దాస్యమన్నది అత్యున్నత హోదా, అది ప్రతి ఒక్కరికీ సునాయాసంగా ప్రాప్తమవదు. పరమ ప్రభువు తన దాస్యం కొరకు ఎన్నుకునేది, కేవలం దైవదాస్యం కొరకు తన్ను తాను మనఃపూర్వకంగా అంకితం చేసుకునే వ్యక్తినే. మీరు మీ అత్యుత్తమ సమయాన్ని, మీ విలువయిన సంపదను, మీ ఉత్కృష్టమయిన శక్తిసామర్థ్యాలను అల్లాహ్‌కు అర్పించుకునేందుకు అనునిత్యం సన్నద్ధులయి ఉన్నట్లయితే అల్లాహ్ కూడా మిమ్మల్ని తన దాస్యపరిధిలోకి స్వీకరించడానికి సిద్ధమయి ఉన్నాడు. మీరు మీ సర్వస్వాన్ని ఆయన మార్గంలో వెచ్చించినట్లయితే మీకు దాస్యభావనలో అత్యున్నత స్థానం ప్రాప్తమవుతుంది. మీరు ఒకవేళ ఈ పూర్ణ సమర్పణకు సిద్ధంగా లేకపోయినట్లయితే, అల్లాహ్ దాస్యానికి మీ జీవితంలో కేవలం ఒక క్రింది స్థాయిని మాత్రమే ఇవ్వదలిస్తే అల్లాహ్‌కు ఇటువంటి అసంపూర్ణ దాస్యం ఆమోదయోగ్యం కాదు.

చాలా మంది వ్యాపారులు తమ వ్యాపారం ఒకటి ముఖ్యమయినది, ప్రధానమయినదిగా ఏర్పరచుకుంటారు. దానిపైనే తమ శక్తిని ప్రముఖంగా వెచ్చిస్తారు. వారికి ఒక దిగువ స్థాయి వ్యాపారమూ ఉంటుంది. దాన్ని వారు తమ మిగతా సమయాల్లో నడుపుకుంటారు. కాని మీరు అల్లాహ్ దాస్యాన్ని క్రింది స్థాయి కార్యంగా అవలంబించలేదు. అల్లాహ్ దాస్యమే మీకు లక్ష్యమూ, గమ్యమూ అయినట్లయితే దీనికి మీరు మీ పూర్తి జీవితాన్ని పణంగా పెట్టవలసి ఉంటుంది. మీరు అల్లాహ్ దాసుడు, ఆయన సేవకుడుగా

మసలుకోగలిగితే, మీ ఈ సంకల్పంలో మీరు చిత్తశుద్ధి గలవారే అయితే మిమ్మల్ని మీరు పరిపూర్ణంగా ఆయన దాస్యానికి అర్పించుకోండి. ఒక వ్యక్తి ఒక స్వామికి దాస్యం చేయాలని నిర్ణయించుకుంటే అతను క్షణకాలంపాటయినా మరొకరి ఊడిగం చెయ్యడం ఎట్టి పరిస్థితిలోనూ అతనికి శోభించదు.

మీరు ఇతరుల ఊడిగంలో పూర్తిగా నిమగ్నులయి ఉండగా, పనిలేని వేళల్లో పరమ ప్రభువును స్మరించుకుంటూ ఆయన పేరు మీదుగా ఆయన దాస్యం చేస్తున్నట్లు ప్రమాణ పత్రం పొందడం ఎంతమాత్రం సంభవం కాదు. అల్లాహ్ ఎంతో ఆత్మాభిమానం గలవాడు. ఆయన బహుదైవారాధనను సుతరామూ సహించడు. తనకు దాస్యం చేస్తూ ఇతరుల దాస్యం కూడా చేయాలని అతుకు పెట్టే వ్యక్తి చేసే ఇటువంటి దాస్యాన్ని ఆయన స్వీకరించడు. ఆయన తన దాసునిగా స్వీకరించాలంటే, సకల దాస్యాల బంధనాలను త్రెంచేసి కేవలం ఒక్క అల్లాహ్ దాస్యపాశాన్నే తన మెడలో వేసుకునే వ్యక్తిని మటుకే ఆయన స్వీకరిస్తాడు.

ఎవరయినా దైవదాస్య పరిధిలోకి వచ్చి, ఏదయినా వ్యవహారంలో నిర్ణయం చేసే అధికారం దైవానికి ఇవ్వదలచకపోతే నిజభావంలో అతను ఇంకా దైవదాస్యంలోకి ప్రవేశించనేలేదన్న మాట. మనిషి ఇష్టపూర్వకంగా తన ఇష్టాయిష్టాలను వదలుకోనంత వరకు, తనకు చెందిన ప్రతి వస్తువును అల్లాహ్‌కు అప్పగించనంత వరకు అతను ఆయన దాసుడుగా రూపొందనేజాలడు. అల్లాహ్ మననుంచి పాక్షిక దాస్యాన్ని కోరడం లేదు, సంపూర్ణ దాస్యాన్ని కాంక్షిస్తున్నాడు.

يَاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا ادْخُلُوْا فِى السِّلْمِ كَافَّةً وَّ لاَ تَتَّبِعُوْا خُطُوٰتِ الشَّيْطٰنِ اِنَّهٗ لَكُمْ عَدُوٌّ مُّبِيْنٌ○ (البقرة:٢٠٨)

విశ్వసించిన జనులారా! మీరు పరిపూర్ణంగా ఇస్లామ్‌లోకి ప్రవేశించండి, షైతాన్ వెనకాల నడవకండి, వాడు మీకు నిజమయిన శత్రువు. *(అల్ బకర: **208**)*

## నమ్మకం, ద్రోహం ఒక చోట చేరలేవు

ఒక్కోసారి మనిషి ఆలోచిస్తాడు, తనకు విశ్వాసభాగ్యమయితే ప్రాప్తమయి ఉంది అయినప్పటికీ తన జీవితం దైవదాస్యం రసాన్ని పొందలేదేమో అని. అతను అంగీకరిస్తాడు, దైవమే తన ప్రభువు, స్వామి అని, కాని దైవవిధేయతకు, ఆయన సేవ కొరకు

తనలో ఎటువంటి ఉత్సాహం, ఆవేశం, ఆవేదన కానరావడం లేదని భావిస్తాడు. అతను అల్లాహ్‌ను విశ్వసించినట్లు ప్రకటిస్తాడు కాని దాని కొరకు త్యాగం చెయ్యడం అతనికి అంగీకారయోగ్యం కాదు. అతను దైవం పట్ల ప్రేమను వ్యక్తం చేస్తాడు కాని ప్రపంచ వ్యామోహం అతని మనోమస్తిష్కాలను ఆక్రమించుకుని ఉంటాయి. అతను మాటిమాటికీ దైవనామం సంస్మరిస్తాడు కాని అతని ఆచరణ యావత్తు అల్లాహ్ ఆజ్ఞాబద్ధమయి ఉండదు. ఇది అతిస్పష్టమయిన అంతర్విరుద్ధ స్థితి. ప్రపంచ వ్యామోహం, దైవప్రేమ ఎన్నటికీ ఒక చోట ఏకం కాజాలవు. మనిషి హృదయం దైవభీతితో కంపిస్తూ ఉండగా ఇతరుల భయమూ అతన్ని పీడిస్తూ ఉండటం సంభవం కాదు. మనిషి అల్లాహ్‌ను నమ్మడం, అతని మనస్సులో త్యాగభావన లేకుండా ఉండటం అంటూ జరగదు.

విశ్వాసం ఎంతటి మహత్తుగల విషయమంటే అది తండ్రిచేత తనయుని మెడపైన కత్తి వేటును వేయిస్తుంది, తనయుణ్ణి తండ్రికి వ్యతిరేకంగా నిలబెడుతుంది. అది ప్రాణం శరీరాల బంధం కన్నా మానవ సంబంధాన్ని దైవంతో పటిష్టతరం చేస్తుంది. అది ధన సంపత్తుల ప్రేమను తీసివేసి దైవప్రేమను ఆంతర్యం లోతుల్లో పాదుకొలుపుతుంది. అల్లాహ్ ప్రసన్నత కొరకు మనిషి, ఇల్లు, కుటుంబం, జాతి, దేశం అన్ని బంధనాలను తెంచివేసుకునేంత శక్తిమంతుడయ్యేలా అది అతన్ని తయారుచేస్తుంది:

قَدْ كَانَتْ لَكُمْ اُسْوَةٌ حَسَنَةٌ فِيْٓ اِبْرٰهِيْمَ وَالَّذِيْنَ مَعَهٗ ۚ اِذْ قَالُوْا لِقَوْمِهِمْ اِنَّا بُرَءٰٓؤُا مِنْكُمْ وَ مِمَّا تَعْبُدُوْنَ مِنْ دُوْنِ اللّٰهِ ۫ كَفَرْنَا بِكُمْ وَ بَدَا بَيْنَنَا وَ بَيْنَكُمُ الْعَدَاوَةُ وَالْبَغْضَآءُ اَبَدًا حَتّٰى تُؤْمِنُوْا بِاللّٰهِ وَحْدَهٗٓ (الممتحنہ:۴)

**మీ కొరకు ఇబ్రాహీమ్, అతని సహచరుల్లో ఓ ఉత్తమమయిన ఆదర్శముంది. వారు తమ జాతి వారి నుద్దేశించి, మేము మీ నుండీ, అల్లాహ్‌ను కాదని మీరు పూజించు కునే మీ ఆరాధ్యుల నుండీ మీ సంబంధ రాహిత్యాన్ని ప్రకటిస్తున్నాము. మీరు చేసేదాన్నంతటిని నిరాకరిస్తున్నాము. మీకూ మాకూ మధ్య నిత్యకాలానికి శత్రుత్వం, వైరం వ్యక్తమయిపోయింది- మీరు ఒకే అల్లాహ్‌ను విశ్వసిస్తే తప్ప.**

***(అల్ ముమ్తహిన: 4)***

విశ్వాసం మనిషిని దైవం పట్ల నిష్కల్మష ప్రేమ కలవానిగా, నిష్కపట భక్తిగల

దాసునిగా రూపొందిస్తుంది. మనిషి ఆయనకు తప్ప మరెవరికీ దైవత్వపు స్థానమివ్వడానికి లేదా దైవత్వంలో భాగం కల్పించడానికి ఎన్నడూ సిద్ధమవడు. విశ్వాస వాస్తవికత ఒకరికి తేటతెల్లమయినప్పుడు అతని హృదయాన మిథ్య అన్నది ఎన్నటికీ తిష్టవేసుకోజాలదు. అతను పరిపూర్ణంగా దైవదాస్యంలో అంతర్లీనమయిపోతాడు. మనిషి అసత్యానికి మోసపోవడమన్నది అతను సత్యాన్ని గురించి తెలుసుకోలేకపోయినంత వరకే సాధ్యం. సత్యం ఆవిష్కృతమయిపోయిందంటే అసత్య ప్రభావం అంతమయిపోవాలి. అసత్యమే ఇంకా రాజ్యమేలుతోందంటే భావం ఇంకా సత్యం అతనికి కనుమరుగయి ఉందన్నమాట. తాను అల్లాహ్ దాసుణ్ణని, ఆయన దాస్యం తప్ప మరో మార్గం తనకు తగదని నమ్మకంగా తెలుసుకున్న వ్యక్తి అల్లాహ్ పట్ల విద్రోహానికి ఎలా పాల్పడగలడు, ఆ వైఖరిని ఎలా అవలంబించగలడు?

విశ్వాసం ద్వారానయితే మృత హృదయాలు సయితం జీవం పొందుతాయి. అందువల్ల మనిషిలో విశ్వాసం అన్నదే ఉన్నట్లయితే అతనిపైన మృత్యువు వంటి ఏమరుపాటు ఆవరించడం అసంభవం. దైవవిశ్వాసం అన్నది కేవలం ఒక సిద్ధాంతం కాదు, మనసులోనే పుట్టి మనసులోనే అంతమయిపోవడానికి. దైవవిశ్వాసం ఒక విప్లవాత్మకమయిన ఆలోచన, అది మానవుణ్ణి ఆసాంతం మార్చివేస్తుంది. అది మనిషిని ప్రపంచంలోని ప్రతి అధికార సత్తా నుండి స్వేచ్ఛ కల్పించి, వెలికితీసి ఒకే ఒక్క దేవుని అధికార సత్తాలోకి ప్రవేశింపజేస్తుంది. ఇదీ విశ్వాసం.

## సాంప్రదాయిక విశ్వాసం, నిజ విశ్వాసం

అల్లాహ్‌ను ఆయన సందేశహరుణ్ణి విశ్వసించే కుటుంబాన్ని మనకు ప్రసాదించాడు దైవం. ఇది ఆయన అనుగ్రహించిన అసంఖ్యాకమయిన వరప్రసాదాలలో నిస్సందేహంగా ఓ మహత్తరమయిన వరప్రసాదం. ఇటువంటి వాతావరణంకాక మరో విధమయిన వాతావరణంలో మనం పుట్టి ఉన్నట్లయితే మనం దైవనామం పలికేవారమో కామో. దీన్ని అంగీకరిస్తూనే మరో విషయం కూడా మరువరాదు, విశ్వాసం అన్నది కేవలం వాతావరణ ప్రభావంచేత అవలంబించవలసిన విషయం కాదు. నిజానికి విశ్వాసం మనోమస్తిష్కాల నిర్ణయానికి మారుపేరు. ఇది వారసత్వంగా లభించే సొమ్ము కాదు, మనిషి కష్టార్జితమయిన సంపద కాగలగాలి.

ఒక వ్యక్తి దైవాన్ని, ప్రవక్తనూ నమ్మినట్లు ప్రకటిస్తే అతన్ని మనం తిరస్కారి అని అనలేము. అతని ఈ అంగీకారం కేవలం ఇంటి వల్ల, వాతావరణం ప్రభావం వల్లనయినా సరే. ఇది యదార్థమే. ధర్మంలోని ప్రాథమిక విషయాలను నమ్మే వ్యక్తి విశ్వాసి. అతన్ని విశ్వాస పరిధి నుండి వెలివేసే హక్కు ఎవ్వరికీ ఎంతమాత్రం లేదు. అయితే ఈ విశ్వాసం మనిషిని ఆపాదమస్తకం మార్చివేసే ఈమాన్ కాజాలదు. ఈ విశ్వాసం వల్ల తిరస్కారం, బహుదైవారాధనల తెరలన్నీ చీరిపోగల విశ్వాసం కాదిది. మనిషిలో ప్రవేశించగానే అతనికి ఓ కొత్త వ్యక్తిత్వాన్ని ప్రసాదించగల జీవం లేనటువంటి విశ్వాసం ఇది. సత్యసందేశ వాణి విని మనిషి దాన్ని ఆలింగనం చేసుకునేందుకు పరుగిడితే అతనికి విశ్వాస జీవితం ప్రాప్తమవుతుంది. అటువంటి జీవితం లేదంటే భావం సత్యసందేశం అతని చెవులకు సోకలేదన్న మాట. ఒకవేళ అందినా అతను దాన్ని స్వాగతించలేదన్న మాట:

يَاأَيُّهَا الَّذِينَ آمَنُوا اسْتَجِيبُوا لِلَّهِ وَلِلرَّسُولِ إِذَا دَعَاكُمْ لِمَا يُحْيِيكُمْ (الانفال:٢٤)

**విశ్వసించినవారలారా, అల్లాహ్ ఆయన సందేశహరుడు ఇచ్చే పిలుపునకు, మీకు జీవితాన్ని ప్రసాదించే విషయం వైపునకు ఆహ్వానించినప్పుడు అనుకూలంగా స్పందించండి.** ***(అల్ అన్ఫాల్:24)***

ఇక్కడ మరో విషయాన్ని మరువకూడదు. విశ్వాసఫలాలు వాస్తవంగా ఉనికిలోకి రావాలంటే విశ్వాసం సచేతనమయినదయి ఉండాలి. సాంప్రదాయికమయిన విశ్వాసం ద్వారా ఎన్నటికీ దాని అవశ్యమయిన ఫలాలు బయల్పడజాలవు. నిజంగా దేవుడున్నాడా? ఉంటే ఆయన కోరేదేమిటి? అన్న ప్రశ్నను పరిష్కరించేందుకు మీరు ఏమాత్రం సమయం కేటాయించడానికి సిద్ధంగా లేరంటే భావం మీరు మీ సాంప్రదాయికమయిన విశ్వాసం పట్ల తృప్తి చెంది ఉన్నారన్న మాట, దాన్ని సచేతన, వాస్తవ విశ్వాసంగా మార్చడానికి ఆలోచించడం లేదన్న మాట. అయితే మీరు దాని ఉత్తమ ప్రతిఫలాలనూ ఆశించరాదు. అవి కేవలం సచేతన విశ్వాసానికే ప్రత్యేకం.

సాంప్రదాయికమయిన విశ్వాసం వారసత్వంగా ప్రాప్తమవుతుంది. మరి సచేతన విశ్వాసమేమో జీవితంలో ఓ విప్లవమయి ప్రవేశిస్తుంది. మీరు కేవలం సాంప్రదాయిక మయిన విశ్వాసానికి తృప్తిచెంది ఉన్నట్లయితే మీలో విశ్వాసపరమయిన విప్లవం ఎన్నటికీ రాజాలదు. దానికి విశ్వాసం, అదీ దృఢ విశ్వాసం హృదయాంతరాళాల్లో వ్రేళ్ళూనడం

అవసరం. మీ ఆలోచనలు, ఆచరణల పైన దాని పరిపాలన నెలకొని స్థిరపడాలి. అప్పుడే అది మీలో దారి చేసుకోగలదు.

ఏ విప్లవమయినా నిదర్శనాలు, సాక్ష్యాధారాల వెలుగులోనే వస్తుంది. నిరాధారంగా ఏ వాదనా మనిషిని మార్చజాలదు. ఉత్తుత్తి వాదనల వల్ల తాత్కాలికమయిన ఉద్వేగాలు, ఉత్సాహాలయితే పుట్టవచ్చు కాని మనిషిని స్థిరంగా ఆచరణలో నిమగ్నం చేసే శక్తి వాటి ద్వారా ప్రాప్తమవదు. ఆధారాలు లేని వాదన మనిషిని పిరికివానిగా చేసివేస్తుంది. కాని ఏ వాదన వెనకనయితే పటిష్టమయిన ఆధారముంటుందో అది అతన్ని సాహసవంతుణ్ణిగా, సంకల్పశీలునిగా రూపొందిస్తుంది. ఒక లక్ష్యం సత్యమయినదని మీ దృష్టిలో నిరూపితం కానిదే దాని కోసం ఎటువంటి త్యాగానికీ మీరు సిద్ధపడరు.

ఒక లక్ష్యాన్ని మీరు సత్యంగా నమ్మి స్వీకరిస్తే త్యాగమార్గం మీకు సులభతరమయిపోతుంది. దానిగ్గాను మీరు మీ సర్వస్వాన్నీ ధారబోయగలరు. దాని కోసం మీ సమస్త ప్రపంచం మీ నుండి దోచుకోబడినా మీకు బాధ కలగదు. ఎట్టి పరిస్థితిలోనూ మీ భవిష్యత్తు, మీ సంతానం భవిష్యత్తు ఉజ్వలంగా ఉండాలన్న తపన మీకు కలగదు. మీరు చేసిన త్యాగాలకు మీకు ఏ ప్రతిఫలమయినా ప్రాప్తిస్తున్నదా లేదా అన్న ఆలోచన కూడా మీలో ఏ మూలనా జనించదు. మీరు సత్యంగా నమ్మి సచేతనంగా స్వీకరించిన లక్ష్యం సదా మీ కళ్ళెదుట ఉంటుంది. దాని ద్వారా మీ ఆంతర్యంలో వేడిమి పుడుతుంది. మీ సంకల్ప నిరతికి నిరంతరం చలనశక్తి ప్రాప్తమవుతూ ఉంటుంది. ఆ లక్ష్యం మీ కళ్ళెదుట ఉన్నట్లయితే మీరు ఏమరుపాటుకు, నిస్పృహకు, నిస్తబ్దతకు గురికారు. ఆ ఆలోచనే మీకు కలగదు. మీరు మరే వస్తువు ప్రేమలోనయినా పడి ఆ లక్ష్యాన్ని మరచిపోయేవారుగా రూపొందరు.

ఇదే స్థితి దైవవిశ్వాసానికి సంబంధించింది. మీరు దైవభావనను పరిపూర్ణ చేతనతో మీ ఆంతర్యంలో చోటు కల్పించినట్లయితే మీ ఆలోచన ఆచరణల ప్రపంచంలో స్తబ్దత చోటుచేసుకోవడం అసాధ్యం. మీలో ఎటువంటి వ్యాకులత, సంచలనం కలగకపోవడమూ అసాధ్యమే. మంటలు రేగడం, వాటి వేడిమి సోకకపోవడం అసాధ్యమయిన విషయమయితే, బాగా తెలుసుకోండి, మనిషిలో విశ్వాస తాపం ప్రజ్వరిల్లడం అప్పటికీ అతని హృదయం మంచు ముద్దగా మారడం కూడా అంతకన్నా అసాధ్యమయిన విషయమే.

దివ్యఖుర్ఆన్ ప్రవక్తల గాథలను వివరించింది. ఈ చరిత్ర వల్ల తెలిసే దాన్నిబట్టి ప్రవక్తలు మూఢంగా గుడ్డిగా దేన్నీ అనుసరించరు. తమ భావాలు, ఆలోచనలపైన తమ అంతర్ దృష్టి మూలంగా, తమ అంతర్ జ్ఞానం ఆధారంగా, స్థిరంగా నిలబడతారు. వారు ఏది పలికినా సాధికారంగా, సాదరంగా పలికేవారు. వారు చేసే ప్రతి వాదన వెనక ఒక బలమయిన ఆధారం ఉంటుంది. ప్రతి ప్రవక్త తన వద్ద, తన ప్రభువు ప్రసాదించిన ఆధారం, నిదర్శనం ఉందన్న ప్రకటనతో తన జాతి ముందుకు వస్తాడు. ఈ నిదర్శనాలు, ఆధారాల బలిమి చేతనే ప్రవక్తల చరిత్ర అంతా నిరంతర పోరాట చరిత్రగా, త్యాగాలు, బలిదానాల చరిత్రగా, దృఢచిత్తం, స్థిరసంకల్పాల చరిత్రగా రూపొందింది.

## విశ్వాసం, కాపట్యాల స్వరూపం

పరమ ప్రభువు అల్లాహ్ పట్ల విశ్వాసం ఎంతగా బలీయమయి, ఎంతగా పటిష్ట మయి ఉంటుందో దాని ద్వారా అంతే ఉన్నతమయిన బలమయిన వ్యక్తిత్వం ఉనికిలోకి వస్తుంది. అలాకాక ఆ విశ్వాసంపైన బలహీనత, నీరసత్వం ఆవహిస్తే వ్యక్తి శీలస్వభావాల పైన తప్పనిసరిగా దాని ప్రభావం పడుతుంది. బలహీనమయిన విశ్వాసంతో ఉన్నత శీలాన్ని ఆశించలేము. అందువల్ల విశ్వాస బలహీనత పట్ల జాగరూకులయి ఉండాలి. దాన్ని వీలయినంత త్వరగా నయం చేసుకోవాలి. అలా జరగకపోతే అది ఒక్కోసారి 'నిఫాక్' (కపట తత్వం, ద్వంద్వ వైఖరి) వైపునకు తీసుకుపోగలుగుతుంది.

కాపట్యం, ద్వంద్వ వైఖరి ధార్మికతకు, విశ్వాసానికి వినాశకరమయినది. ఎవరికయితే కపట రోగం సోకుతుందో, అది అతనిలో వ్రేళ్ళూనితే అతను ధర్మం విషయంలో ఎన్నటికీ చిత్తశుద్ధి కలవాడిగా అలరారలేడు. ఎన్నటికీ ఏకోన్ముఖుడయి జీవించలేడు. అటువంటి వాడు తిరస్కారం, విశ్వాసాల మధ్య సదా డోలాయమానంగానే వ్యవహరిస్తాడు, సదా అనిశ్చితావస్థలోనే గడుపుతాడు. ఒక్కడుగు ముందుకు వేస్తే పదడుగులు వెనిక్కి తగ్గుతాడు. సత్యాన్ని బాగా గుర్తెరిగిన తరువాత కూడా దాని కోసం ఎటువంటి ఇబ్బందినీ భరించడానికి సిద్ధపడడు. భీరత్వం, ధీరహీనత అతన్ని అంటి పెట్టుకునే ఉంటాయి.

దీనికి భిన్నంగా విశ్వాసం మనస్సులో దృఢనమ్మకాన్ని ప్రసాదిస్తుంది. సంకల్పం, సాహసం, స్థిరచిత్తం, శూరత్వాలను అనుగ్రహిస్తుంది. సత్యం కొరకు జీవించడం, సత్యం

కొరకే మరణించడాన్ని నేర్పుతుంది. విశ్వాసం అంటే దాని ద్వారానే వ్యతిరేకతా తుఫానును ఎదిరించగల శక్తి ప్రాప్తమవుతుంది. ధర్మసమున్నతి కొరకు ధనప్రాణాల త్యాగాలకు సన్నద్ధులయ్యే సద్బుద్ధి ప్రాప్తమవుతుంది. దానికి ఎటువంటి జంకుగొంకు చోటుచేసుకో లేవు. శిరస్సు సమర్పించడమయినా, సిరులు ధారపోయడమయినా సులభతరమవుతుంది.

ఈ విషయాలను అహ్జాబ్ సూరా (ఆయత్ 9–27)లో సవివరంగా తెలుపడం జరిగింది.

అహ్జాబ్ యుద్ధంలో: మదీనాపై నుండి (తూర్పు నుండి) క్రింది నుండి (పడమటి నుండి) శత్రుసేనలు దాడి చేశాయి. వాటి సంఖ్యాబలం, ఉద్వేగం, ఉత్సాహం, వైభవం, పటాటోపం, యుద్ధసామగ్రి, సన్నాహాలు చూసి గుండెలదరి గొంతులోకి వచ్చేస్తున్నాయి. బలహీన విశ్వాసుల హృదయాలు విపరీతంగా కంపిస్తున్నాయి. అల్లాహ్ సహాయం, ఆయన వాగ్దానాలను గురించి రకరకాల భావాలు, అనుమానాలు, ఆశంకలు చోటుచేసు కోసాగాయి. ఆ సమయాన మునాఫికులు (కపటులు) తమ నోట వెల్లడిస్తున్న భావావేశాలవల్ల వారిలోని మాలిన్యం స్పష్టంగా ముందుకు వస్తోంది. అల్లాహ్, ఆయన సందేశహరులయితే మనతో, అరబ్బు, అరబ్బేతర ప్రపంచమంతా మీకు తల వంచు కుందని, ఎల్లెడలా ధర్మధ్వజం రెపరెపలాడుతుందని అన్నారు. కాని అదంతా ఏదో కంటి తుడుపు మాటలని నేడు తేలిపోయింది. ఇప్పుడయితే ప్రాణాలు కాపాడుకుని బయట పడటమే గగనమయిపోతోంది అని ద్వేషం వెళ్ళగ్రక్కారు.

مَا وَعَدَنَا اللّٰهُ وَ رَسُوْلُهٗۤ اِلَّا غُرُوْرًا ۝ (الاحزاب:١٢)

**మాకు అల్లాహ్, ఆయన సందేశహరుడు చేసిన వాగ్దానం కేవలం ఓ వంచన మాత్రమే.** ***(అల్ అహ్జాబ్: 12)***

వీరిలో ఒక వర్గమయితే తన మిత్రబృందంతో, సహచరులతో, ఇకనయితే ఇక్కడ నిలిచే ఏ అవకాశమూ లేదు. ఏ బస్తీలు, ఊళ్ళ నుండి మీరు ఇక్కడికి వచ్చారో అక్కడికే పదండి, లేకపోతే నలిపివేయబడతారు.

కొందరు తమ కాపట్యాన్ని కప్పిపుచ్చడానికి సాకులు వెదకసాగారు. మా ఇళ్ళు అరక్షితంగా ఉన్నాయి. అందువల్ల మమ్మల్ని మైదానం నుండి వెనక్కివెళ్ళే అనుమతి నివ్వండి అని కోరసాగారు. ఖుర్ఆన్ దాన్ని పురస్కరించుకుని وَمَا هِيَ بِعَوْرَةٍ నిజా **నికి వారి ఇళ్ళు అరక్షితంగా లేవు** అని అంటుంది. స్త్రీల రక్షణకు, పిల్లల రక్షణకు ముందే

ఏర్పాట్లన్నీ చేసుపెట్టుకున్నారు. ఆ సాకుకు అర్థమే లేదు. ఖుర్‌ఆన్ ప్రకారం, اِنْ يُّرِيْدُوْنَ اِلَّا فِرَارًا **వారయితే ఎలాగయినా మైదానం నుండి పలాయనం చిత్తగించాలని కోరుకుంటున్నారు.** (అల్ అహ్జాబ్: 13)

ఖుర్‌ఆన్ అంటుంది, మదీనాపైకి నలువైపుల నుండి శత్రుదాడి జరిగినట్లయితే వారు తమ ధర్మాన్నీ విశ్వాసాన్నీ వదలుకుంటారు. ధర్మవిసర్జన వారిలో మహమ్మారిలా వ్యాపించ గలదు. ఆ తరువాత ఓ ముఖ్యమయిన విషయం అది చెబుతుంది:

وَلَقَدْ كَانُوْا عَاهَدُوا اللّٰهَ مِنْ قَبْلُ لَا يُوَلُّوْنَ الْاَدْبَارَ ۭ وَكَانَ عَهْدُ اللّٰهِ مَسْئُوْلًا ۝ (الاحزاب:١٥)

**వారు దీనికి ముందు అల్లాహ్‌కు ఓ ప్రమాణం చేశారు, తాము వెనుదిరిగి పోమని, అల్లాహ్‌కు చేసిన ప్రమాణం గురించి తప్పక ప్రశ్నించడం జరుగు తుంది.** ***(అల్ అహ్జాబ్ : 15)***

ఇస్లామ్ నిజానికి ఓ వాగ్దానం, ప్రమాణం. మనిషి, ఎట్టి పరిస్థితిలోనూ తాను అల్లాహ్ ధర్మం పైన నిలకడ చూపిస్తూ స్థిరంగా ఉంటానని, ధర్మ సహాయం, సమర్థనల కోసం ఎటువంటి ధనప్రాణాల త్యాగానికయినా వెరువనని ప్రమాణం చేస్తాడు. వారున్నూ ఇస్లామ్ స్వీకరించి ఇటువంటి ప్రమాణమే చేశారు. వారిలో చాలా మంది, తాము బద్ర్ మైదానంలో తమ ప్రాణార్పణ సంకల్పాన్ని నిరూపించుకోలేకపోయామని, ఇక మరెప్పు డయినా అవకాశం వస్తే దానికి బదులు తీర్చుకుంటామని, ప్రాణార్పణలో ఎవరికీ వెనక నుండమని పలికిన వారున్నారు. ఇంతజేసీ కడకు వారు పలాయన పాఠమే అప్పజెప్పారు. చేసిన ప్రమాణానికి ఇది వ్యతిరేక విషయమే. పరమ ప్రభువు సన్నిధిలో దీన్ని గురించి తప్పక ప్రశ్నించడం జరుగుతుంది.

ఈ మునాఫికుల విషయంలో, వారి హామీ వ్యవహారంలో వారు పచ్చి పిసినారులు అనడం జరిగింది. దీని భావమేమిటంటే, వారికి సమాజంలోని నిరుపేదలు, అగత్య పరులు, అనాథల పట్ల ఎటువంటి సానుభూతి లేదు. వారు వీరి కొరకు తమ ధనం వెచ్చించడం ఇష్టపడరు. ధర్మం పిలుపు, దాని ఔన్నత్యం కొరకు జరుగుతున్న సంఘర్షణలో తమ ధనం వెచ్చించడానికి వారిలో ఎటువంటి సన్నద్ధత కానరాదు. సతత సమరం, నిరంతర కృషి జిహాద్ కొరకు జరుగుతున్న సన్నాహాలలో తమ ధనంలో ఒక భాగం పంచి ఇవ్వరు. ఏ సత్కార్యంలోనూ పాల్గొనడానికి వారి సానుభూతి ప్రాప్తం కాదు.

దానితోపాటు వారు ధనం విషయంలో లోభం గలవారు అనీ ప్రకటించడం జరిగింది. యుద్ధం ప్రస్తావన రాగానే వారు నిన్ను వింత దృక్కులతో చూస్తారు. తమ పైన మృత్యువు ఆవరించినట్లు అగుపడతారు. యుద్ధ ప్రమాదం ముగియగానే, యుద్ధప్రాప్తి పంపకం జరుగుతూ ఉంటే వారి నోటి చాపల్యం చూడదగినదిగా ఉంటుంది. తమకూ యుద్ధప్రాప్తిలో భాగం దక్కాలని ఆశిస్తారు. తాము దానికి హక్కుదారులమే అని వాదిస్తారు.

ఆ సున్నితమయిన పరిస్థితుల్లో దైవసందేశహరులు (సల్లల్లాహు అలైహి వసల్లం) ఏ విధంగానయితే స్థయిర్యం, సహనం, స్థిరచిత్తం, సాహసం, ధైర్యం, దైవంపైన నమ్మకం, త్యాగం వంటి విషయాలను ప్రదర్శించారో అది ఒక అనుపమమయిన ఆదర్శం. దైవం, పరలోకాల పట్ల విశ్వాసమున్నట్లయితే మనిషి అనునిత్యం ఈ ఆదర్శాన్నే దృష్టిలో ఉంచుకుంటాడు. దాన్ని అనుసరించడానికే ప్రయత్నిస్తాడు.

لَقَدْ كَانَ لَكُمْ فِيْ رَسُوْلِ اللّٰهِ اُسْوَةٌ حَسَنَةٌ لِّمَنْ كَانَ يَرْجُوا اللّٰهَ وَالْيَوْمَ الْاٰخِرَ وَ ذَكَرَ اللّٰهَ كَثِيْرًاؕ (الاحزاب:٢١)

**మీ కొరకు దైవసందేశహరుని వ్యక్తిత్వంలో అత్యుత్తమమయిన ఆదర్శముంది, అల్లాహ్‌ను, పరలోక దినాన్నీ నమ్మే, అల్లాహ్‌ను విరివిగా సంస్మరించే ప్రతి వ్యక్తికి ఇదొక మహో ఆదర్శం. *(అల్ అహ్జాబ్:21)***

చిత్తశుద్ధిగల నిజమయిన ముస్లిములు, దండు దండుగా దాడిచేస్తున్న తిరస్కారుల్ని చూసి ఏ మాత్రం గాభరాపడలేదు, ఎంతమాత్రం ధైర్యం వీడలేదు. వారి విశ్వాసం, నమ్మకాలలో వృద్ధే జరిగింది. ఏ దశలను దాటి సత్యం విజయవంతం, సర్వోన్నతం అవుతుందో ఆ దశలు వచ్చేశాయని వారి నమ్మకం మరీ గట్టిపడింది. అల్లాహ్, ఆయన సందేశహరులు చేసిన వాగ్దానాలు, కైసర్, కిస్రాల సామ్రాజ్య కాలం ముగియనుందని, మీరు రోము పర్షియాలను జయించగలుగుతారని ఇచ్చిన శుభవార్తలు నెరవేరే సమయం ఆసన్నమయిందని వారికి మరింత గట్టి నమ్మకం కుదిరింది.

وَلَمَّا رَاَ الْمُؤْمِنُوْنَ الْاَحْزَابَ ۙ قَالُوْا هٰذَا مَا وَعَدَنَا اللّٰهُ وَ رَسُوْلُهٗ وَ صَدَقَ اللّٰهُ وَ رَسُوْلُهٗ ۚ وَمَا زَادَهُمْ اِلَّاۤ اِيْمَانًا وَّ تَسْلِيْمًاؕ (الاحزاب:٢٢)

విశ్వసించినవారు (వైరి) సేనల దండులను చూడగానే 'ఇదే గదా అల్లాహ్ ఆయన సందేశహరుడు చేసిన వాగ్దానం, అల్లాహ్ ఆయన సందేశహరుడు నిజమే చెప్పారు. ఇదంతా వారి విశ్వాస భావనలో, వారి

**విధేయతా భావనలో, సంతుష్టిని పెంచు తూనే పోయింది.** *(అల్ అహ్జాబ్:22)*

విశ్వాసం, గట్టి నమ్మకం, ఆత్మ సమర్పణల ఈ భావంలో వీరిలో చాలా మంది తమ ప్రాణాల అర్చనలు అర్పించుకున్నారు. చాలా మంది తమ చేతిలో ప్రాణం పెట్టుకుని అమరగతి పొందే ఆశలో బ్రతుకుతున్నారు. అల్లాహ్‌తో చేసిన బాంధవ్య ప్రమాణాన్ని కొందరు నెరవేర్చారు, మరికొందరు ఆత్రుతతో నిరీక్షిస్తున్నారు, సమయం ఎప్పుడు ప్రాప్తి స్తుందా, ఎప్పుడు ప్రాణాన్ని అర్పించుకుందామా అని ఎదురుచూస్తున్నారు.

مِنَ الْمُؤْمِنِيْنَ رِجَالٌ صَدَقُوْا مَا عَاهَدُوا اللّٰهَ عَلَيْهِ ۚ فَمِنْهُمْ مَّنْ قَضٰى نَحْبَهٗ وَ مِنْهُمْ مَّنْ يَّنْتَظِرُ وَمَا بَدَّلُوْا تَبْدِيْلًا ○ (الاحزاب:٢٣)

**విశ్వాసులలో ఎందరో తాము అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు చేసిన ప్రమాణాన్ని పూర్తి చేసి చూపెట్టారు. వారిలో కొందరు తమ బాధ్యతను నెరవేర్చారు (ప్రాణాలను అర్పించుకున్నారు) మరికొందరు వేచి ఉన్నారు. అల్లాహ్‌తో తాము చేసిన ప్రమాణంలో వారు ఏమాత్రం మార్పు చెయ్యలేదు.** *(అల్ అహ్జాబ్:23)*

విశ్వాసం వల్ల మానవ శీలస్వభావాలలో విప్లవం దర్శనమిస్తుంది. ఉన్నతమయిన ఉత్తమమయిన పరిశుద్ధ గుణగణాలు ఉనికిలోకి వస్తాయి. దీనికి భిన్నంగా కాపట్యం వలలో పూర్తిగా భిన్నమయిన గుణాలే పుణికిపుచ్చుకుంటాయి. ఇది స్వార్థచింతన, స్వప్రయోజనాభిలాష, అవిశ్వసనీయ శీలస్వభావాలకు జన్మనిస్తుంది. దివ్యఖుర్ఆన్ విభిన్న స్థానాల్లో చాలా వివరంగా దీన్ని చర్చించింది. ఇక్కడ యుద్ధంలో, అదీ అహ్జాబ్ యుద్ధ సందర్భంలో విశ్వసించినవారు ఎటువంటి పరిపక్వమయిన శీలస్వభావాలను ప్రదర్శించారో, అలాగే కపటుల వల్ల ఎటువంటి స్వభావ నైచ్యం, పతనం ముందుకు వచ్చిందో దాన్ని చిత్రించడం జరిగింది.★

ధర్మం వైపునకు పిలుపు కూడా ఒక విధమయిన పోరాటమే. ఇది మిథ్యస్థానంలో సత్యాన్ని సుస్థాపితం చేసే కృషి. ఇందులో విజయానికి చాలా బలమయిన విశ్వాసం అవసరం. ఈ మార్గంలో వచ్చే దశలు చాలా సున్నితంగా ఉంటాయి, లోగడ కూడా

★ అహ్జాబ్ యుద్ధం జరిగిన పరిస్థితులను గురించి తెలుసుకునేందుకు ఇస్లామీయ చరిత్రను పరిశీలించవలసి ఉంటుంది.

వస్తూనే ఉండేవి. కాపట్యం, బలహీన విశ్వాసాలతో మనిషి పాదాలు అసలు నిలువనే జాలవు.

## అల్లాహ్‌తో సంబంధం, ఆయన పట్ల ప్రేమ విశ్వాసానికి ప్రాణం

అల్లాహ్ పట్ల ప్రేమ ఆయనతో మానసిక సంబంధం ధర్మానికి ఊపిరి. దైవాన్ని తిరస్కరించే వారిని తప్పుడు నమ్మకం, తప్పుడు ఆలోచనల పట్ల, విగ్రహారాధకులకు తమ విగ్రహాల పట్ల, ప్రజలకు తమ నాయకుల పట్ల, లీడర్ల పట్ల ప్రేమ ఉంటుంది. కొన్ని సందర్భాలలో ఆ ప్రేమ వారే వారి దేవుళ్ళయినట్లు ఏర్పడుతుంది. వాళ్ళను వారు దైవాన్ని ప్రేమించినట్లే ప్రేమిస్తారు కూడా. అయితే ఈ ప్రేమలన్నీ నిరాధారమయినవి. తన ప్రియుడు తనకు తోడుగా నిలువడని, కఠిన సమయాల్లో తన్ను నిస్సహాయ స్థితిలో వదలిపెడతాడని, తన ప్రేమ వల్ల తాను నష్టాన్నే కొనిదెచ్చుకుంటాడని మనిషి తెలుసు కుంటే, దాన్ని గురించి నిశ్చయంగా నమ్మకం కుదిరితే అతను ఆ ప్రేమను వదలు కుంటాడు.

కాగా బహుదైవారాధకుల నావ సుడిగుండంలో చిక్కుకున్నప్పుడు వారు తమ కాల్పనిక దైవాలను మరచిపోతారు. ఒకే దైవమయిన అల్లాహ్‌కు మొరపెట్టుకుంటారు. (యూనుస్:22). ఇది ఇహలోకపు విషయం. మరి పరలోక విషయానికి వస్తే అక్కడ సమస్త బూటకపు దేవతల దైవత్వం అంతమయిపోతుంది. వారున్నూ వారిని ఇష్టపడేవారున్నూ ఒకరిపై నొకరు ఆరోపణలు, అభిశాపాలు మోపుకుంటారు.

అల్లాహ్‌ను ప్రేమించే వారు ఆయన్ని ప్రేమించే తీవే వేరు. అల్లాహ్ పట్ల వారి ప్రేమ బూటకపు దైవాల ప్రేమికుల ప్రేమకన్నా వేనవేల రెట్లు అధికంగా ఉంటుంది. సుఖదుఃఖాలలోనూ, కష్టసుఖాలలోనూ, కలిమిలేముల్లో, ఆరోగ్య అనారోగ్యాలలో, ఎట్టి పరిస్థితిలోనూ వారి ఈ ప్రేమానుబంధం తెగదు. వారి ఆలోచన ప్రకంపనం ఏది జరిగినా అంతా దైవం పక్షానే జరుగుతుంది. వారు సహనానికి, కృతజ్ఞతా భావానికీ పెట్టింది పేరుగా ఉంటారు. ఆయన కారుణ్యచ్ఛాయలోనే శాంతిని కనుగొంటారు. అత్యంత సున్నితమయిన పరిస్థితుల్లోనూ ఆయన ఆధారాన్ని వీడరు, పటిష్టంగా పట్టుకునే ఉంటారు. మరెవరి వైపునకు సయితం కన్నెత్తి కూడా చూడరు. ఏ మేలయినా ఆయన ద్వారానే ఆశిస్తారు. దైవం పైన ఈ నమ్మకం, భరోసా, విశ్వసనీయత కేవలం ఆయన్ని విశ్వసించే చిత్తశుద్ధిగల వారికే ప్రాప్తమవుతుంది.

జనుల్లో కొందరున్నారు, ఇతరుల్ని అల్లాహ్‌కు తోడుగా, సహవర్తిగా భావిస్తారు; వారంటే దైవం పట్ల గల ప్రేమ వంటి ప్రేమనే కలిగి ఉంటారు. కాని విశ్వసించినవారికి అల్లాహ్ పట్ల గల ప్రేమ ఇంతకన్నా ఎంతో అధికమయినది.

*(అల్ బకర: 165)*

وَ مِنَ النَّاسِ مَنْ يَّتَّخِذُ مِنْ دُوْنِ اللّٰهِ اَنْدَادًا يُّحِبُّوْنَهُمْ كَحُبِّ اللّٰهِ ؕ وَالَّذِيْنَ اٰمَنُوْٓا اَشَدُّ حُبًّا لِّلّٰهِ ؕ

(البقرۃ:١٦٥)

విశ్వసించిన వారిపైన అల్లాహ్ ఎంతో దయ చూపుతాడు, మహోపకారం చేస్తాడు. ఆయన వారిలో తన ప్రేమను నాటుతాడు. తిరస్కారం, పాపకార్యం, పాతకాల పట్ల వారిలో ఏవగింపును సృజిస్తాడు. ఈ మహాసంపద ప్రాప్తమవడం అంటే వారికి సన్మార్గ బోధన హితవును ప్రసాదించి సత్కరించడం జరిగిందన్న మాట. వారిని అపమార్గం, మార్గవిహీనతల నుండి రక్షించడం జరిగిందన్నమాట.

.....కాని అల్లాహ్ మిమ్మల్ని ఈమాన్ (విశ్వాసం) పట్ల ప్రేమతో సత్కరించాడు. మీ హృదయాలను దాని ద్వారా అలంకరింపజేశాడు. మీ కొరకు తిరస్కారం, పాపం, అవిధేయతలను ఇష్టపడలేదు. ఇటువంటి వారే సన్మార్గబోధన పొందిన వారు. *(అల్ హుజురాత్: 7)*

...وَلٰكِنَّ اللّٰهَ حَبَّبَ اِلَيْكُمُ الْاِيْمَانَ وَ زَيَّنَهٗ فِيْ قُلُوْبِكُمْ وَ كَرَّهَ اِلَيْكُمُ الْكُفْرَ وَالْفُسُوْقَ وَالْعِصْيَانَ ؕ اُولٰٓئِكَ هُمُ الرّٰشِدُوْنَ ۝

(الحجرات:٧)

అల్లాహ్ ప్రేమతో మనోప్రపంచం ఉజ్వలమయినప్పుడు, తిరస్కారం, మహాపాపం, పాతకాలు, అపరాధభావాల పట్ల దూరం, అసహ్యత ఏర్పడతాయి. అల్లాహ్ పట్ల ప్రేమతో పాటు తిరస్కార భావం, పాపభావం పట్ల ప్రేమ ఒకే హృదయంలో ఏకత్రమవజాలవు.

## అల్లాహ్‌ను ప్రేమించేవారు, విశ్వసించే వారిని ప్రేమిస్తారు

అల్లాహ్‌ను ప్రేమించినట్లయితే, ఆయన్ని నమ్మే, విశ్వాసులను, ఆయన విధేయులను సయితం ప్రేమిస్తారు. వారంటే మానసిక సామీప్యం, అంతరంగ సంబంధం అగుపిస్తుంది. వారిని సేవించడం శుభప్రదంగా అనిపిస్తుంది. వారి పట్ల ప్రేమ, అనురాగాలు కనబరచడం ఓ విధమయిన ఆనందాన్ని కలుగజేస్తుంది. వారి కష్టసుఖాల్లో బాధల్లో పాలుపంచుకోవడానికి స్వయంగానే అంతరంగంలో భావావేశాలు పెల్లుబుకుతాయి.

వారిని గౌరవప్రదంగా, ఆదరంగా చూడటం జరుగుతుంది. వారిని అసహ్యించుకోడు. వారికి ప్రతిగా తన గొప్పదనాన్నీ, గర్వాన్నీ ప్రదర్శించడు. దీనికి భిన్నంగా వినమ్రత, విధేయతా వైఖరిని అవలంబిస్తాడు. ఈ విషయం కారణంగానే విశ్వాసులంతా ఒక పటిష్టమయిన సముదాయంగా రూపొందుతారు. విశ్వాసం వారిని పటిష్టంగా ఏకత్రం చేసి పెడుతుంది.

## అల్లాహ్‌ను ప్రేమించేవారు దైవధిక్కారుల సమక్షంలో తలవంచరు

అల్లాహ్‌నే ప్రేమించే వ్యక్తి శీలస్వభావాల మరో రూపమేమిటంటే, అతను అల్లాహ్‌ను తిరస్కరించే, అల్లాహ్‌ను ధిక్కరించే, ధర్మాన్ని సమూలంగా తుడిచిపెట్టే ఆలోచన గలవారికెదురుగా స్థిరచిత్తంతో ఓ మహా పర్వతమయి నిలుస్తాడు. వారు అతన్ని వంచలేరు, అతనిలో ఉక్కు వంటి గట్టిదనముంటుంది. వారతన్ని మెత్తనిమేతగా భావించ లేరు. అల్లాహ్ ధర్మాన్ని ఆవలంబించినందువల్లనూ దాన్ని అమలుపరచడంచేతను అతన్ని ఎంతగా అధిక్షేపించినప్పటికీ, అతనిపైన ఎన్నెన్ని ఎత్తిపొడుపులు, వెటకారాల అంబుల వర్షం కురిపించిననూ అతను వెనక్కి తగ్గడు. ప్రతి దాడిని తన రొమ్ము మీద గ్రహిస్తాడు, కాని ముందుకు సాగుతూనే ఉంటాడు. ఎటువంటి భయానికీ లోనవకుండా, ఎటువంటి ప్రమాదానికీ వెరువకుండా సత్యవాక్కును ప్రకటిస్తూనే ఉంటాడు. ఈ వాస్తవాన్నే ఈ ఆయత్‌లో ప్రవచింపబడింది:

يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا مَنْ يَّرْتَدَّ مِنْكُمْ عَنْ دِيْنِهٖ فَسَوْفَ يَاْتِى اللّٰهُ بِقَوْمٍ يُّحِبُّهُمْ وَ يُحِبُّوْنَهٗۤ ۙ اَذِلَّةٍ عَلَى الْمُؤْمِنِيْنَ اَعِزَّةٍ عَلَى الْكٰفِرِيْنَ ۙ يُجَاهِدُوْنَ فِىْ سَبِيْلِ اللّٰهِ وَلَا يَخَافُوْنَ لَوْمَةَ لَاۤئِمٍ ؕ ذٰلِكَ فَضْلُ اللّٰهِ يُؤْتِيْهِ مَنْ يَّشَآءُ ؕ وَاللّٰهُ وَاسِعٌ عَلِيْمٌ ۝ (المائدة:٥٤)

**విశ్వసించిన జనులారా, మీలో ఎవర యినా ధర్మానికి విముఖులయినట్లయితే (అతను బాగా తెలుసుకోవాలి) అల్లాహ్ అతిత్వరలో వేరే జనాన్ని తీసుకువస్తాడు. వారిని ఆయన ప్రేమిస్తాడు, వారున్నూ ఆయన్ని ప్రేమిస్తారు, ముస్లిముల ఎడల మెతకదనం కనబరుస్తారు, తిరస్కారుల కెదురుగా కాఠిన్యాన్ని ప్రదర్శిస్తారు. వారు అల్లాహ్ మార్గంలో సతత సమరం సలుపు తారు, ఎటువంటి అధిక్షేపణ చేసేవారి అధిక్షేపణకు వెరువరు. ఇది అల్లాహ్ అను గ్రహం, తలచినవారికి ఆయన ప్రదానం**

చేస్తాడు. అల్లాహ్ సర్వోపరివేష్ఠి, సర్వోపరి జ్ఞాని. *(అల్ మాఇద:54)*★

## దైవప్రేమకు లోబడిన మరే ప్రేమ అయినా ధర్మసమ్మతమే

ప్రపంచంలో మనిషి అనేక మందిని, విషయాలను, వస్తువులను ప్రేమిస్తాడు. వాటిని ప్రియమయినవిగా భావిస్తాడు. సహజంగా అతడు తన తల్లిదండ్రుల్ని, భార్యా పిల్లల్ని, బంధుమిత్రుల్ని, సన్నిహిత బృందాలను, కావలసిన వారిని అనేక వ్యక్తుల్ని, వర్గాలను ప్రేమిస్తాడు. అతను జీవన సామగ్రిని, ఇంటి వస్తువుల పట్ల సయితం ప్రేమ కనబరుస్తాడు. ఈ ప్రేమలన్నీ తప్పుకావు. ఆయా పరిధుల్లో ధర్మసమ్మతమయినవి, ఇష్టమయినవే. కాని ఈమాన్ (విశ్వాసం) ప్రత్యేకత ఏమిటంటే వీటిలో ఏ ప్రేమ అయినా దైవం, దైవప్రవక్తల ప్రేమకు లోబడే ఉండాలి. ఎప్పుడయినా ఈ రెండు కోవల ప్రేమల

---

★ ఇక్కడ, 'తిరస్కారుల కెదురుగా కాఠిన్యాన్ని ప్రదర్శిస్తారు' అన్న పదాల వల్ల ఎటువంటి అపార్థం కలగరాదు. దైవాన్ని ప్రేమించే వ్యక్తి దైవతిరస్కారుల్ని, దైవధిక్కారుల్ని అనుక్షణం ఎదుర్కొంటూ, వారితో పోరు సలుపుతూ ఉంటారని భావం కాదు. అడుగడుగునా వారి ఎడల కాఠిన్యాన్ని ప్రదర్శిస్తారని, అత్యంత ఉగ్రవైఖరి అవలంబిస్తారని అర్థం కాదు. ఇక్కడ చెప్పిన విషయానికి రెండు కోణాలున్నాయి. ఒకటి, దైవాన్ని ప్రేమించేవారు, తమ ధర్మం, విశ్వాసాల పట్ల పటిష్టంగా నిలబడి ఉంటారన్నది. తిరస్కారులు వారిని దాన్నుండి మరల్చలేరన్నది. ఇటువంటి సందర్భాలన్నింటిలో వారు సంకల్ప పర్వతాలయి నిలబడగా ఎవ్వరూ వారిని వారి స్థానం నుండి చలింపజేయలేరన్నదీ స్థిరపడుతుంది. రెండవ కోణం ఏమిటంటే, యుద్ధసమయంలో, విశ్వసించేవారు మిథ్యావాదులతో పోరాడవలసివచ్చినట్లయితే వారు స్థిరంగా, యోధులుగా నిలకడ కనబరుస్తారు. పిరికితనం, బేలతనం కనబరచరు. ఈ విధంగా ఈ విషయం ఒక ప్రత్యేక పూర్వరంగంలో తెలుపడం జరిగింది. దీని వెనువెంటనే 'దైవమార్గంలో సతత సమరం సలుపుతారు' అని వచ్చింది. ఈ వాక్యం ఈ విషయాన్నే సంకేతప్రాయంగా తెలుపుతోంది. సాధారణ పరిస్థితుల్లో ఇస్లామ్ విరోధులతో సానుభూతి, సదాచార వర్తనాల ఆదేశాలివ్వ బడ్డాయి. వారు ఇష్టకరంకాని పంథాను అనుసరించినా తప్పుడు విధానాన్ని అవలంబించినా సహనం మరిచారని, క్షమాభావం, మన్నింపు చూపాలని బోధించడం జరిగింది. దీని వివరాలు రచయిత మరో పుస్తకం 'ముస్లిమేతరులతో సంబంధాలు; వారి హక్కులు' (ఉర్దూ) అనే పుస్తకంలో చూడగలరు.

మధ్య ఎదురుబొదురు వ్యవహారం వస్తే అల్లాహ్, ఆయన ప్రవక్తల ప్రేమే ఆధిక్యత పొందాలి.

## అల్లాహ్ తన భక్తులయిన దాసుల్ని ప్రేమిస్తాడు

దాసుడు తన ప్రభువు అల్లాహ్‌ను ప్రేమించినప్పుడు, ఆయన సంస్మరణ చింతనలో నిమగ్నుడయినప్పుడు, ఆయన ఆరాధనలో, సేవలో తన రేబవళ్ళు గడిపినప్పుడు ఆరాధనా భావంతో అతని ఆత్మ డోలలూగుతున్నప్పుడు, ఆయన మార్గంలో తాను కష్టాలను భరిస్తున్నప్పుడు, అల్లాహ్ కటాక్షవీక్షణం అతని వైపున ప్రసరిస్తుంది. ఆయన అతన్ని తన ప్రేమాలింగనంలోకి తీసుకుంటాడు. ఇది ఎంత గొప్ప ప్రతిఫలమో! ఒక బలహీనుడయిన దాసుడు తన అల్పమయిన కృషితో దైవప్రేమకు పాత్రుడవుతాడు. ఆయన కారుణ్యం వర్షమయి అతనిపైన కురుస్తుంది. ఈ విషయాన్ని దివ్యఖుర్‌ఆన్‌లో పలుచోట్ల వివరించడం జరిగింది. ఇక్కడ కొన్ని ఉదాహరణలు ఇస్తున్నాము.

1. తనతో చేసిన ప్రమాణాన్ని పూర్తిచేసేవారు, తన పట్ల భయభక్తులతో జీవితం గడిపేవారంటే దైవానికి ఎంతో ప్రియమయినవారు. ఈ ప్రమాణం నిజానికి దాస్య ప్రమాణం, ఆయన ఆజ్ఞాపాలనా ప్రమాణం, ధర్మం పైన నిలకడ చూపే, దాన్ని ఇతరులకు అందజేసే, దాన్ని సమున్నతపరచే ప్రమాణం. ఈ ప్రమాణంపైన నిలకడ చూపడమే వాస్తవ ధర్మనిష్ఠ, దైవభక్తి. దీని ద్వారానే మనిషి విజయాన్ని సాధించగలుగుతాడు. పూర్వపు జాతులు ఈ ప్రమాణాన్ని భంగపరచడం చేతనే నిష్ఫలమయి, ఆశయ శూన్యులయ్యాయి. ఇక ఇటువంటి స్థితి నుండి తప్పించుకు జీవించాలన్న బోధన చేయడం జరుగుతోంది.

بَلٰى مَنْ اَوْفٰى بِعَهْدِهٖ وَاتَّقٰى فَاِنَّ اللّٰهَ يُحِبُّ الْمُتَّقِيْنَ۝
(آل عمران:٧٦)

**అవును, ఎవరయితే తన ప్రమాణాన్ని నెరవేర్చాడో, దైవనిష్ఠతో జీవితం గడిపాడో (అతను విజయాన్ని సాధిస్తాడు). ఎందుకంటే అల్లాహ్ భయభక్తులు గలవారంటేనే ప్రేమిస్తాడు.** ***(ఆలి ఇమ్రాన్ : 76)***

2. అల్లాహ్ ఇష్టపడేది తన పట్ల భక్తితో, వినమ్రతతో, బాధతో, రోదిస్తున్న హృదయంతో, భయం, ఆశలతో కేవలం నలుగురి మధ్య కాకుండా ఒంటరిగానూ ఆయనకు మొరపెట్టుకునేవారిని, నిత్యం సంస్మరిస్తూ ఉండే వారిని, అన్ని రకాల హింసా దౌర్జన్యాలకు, అత్యాచారాలకు భువిలో అల్లకల్లోలానికి దూరంగా ఉండేవారిని మాత్రమే.

اُدْعُوْا رَبَّكُمْ تَضَرُّعًا وَّ خُفْيَةً ۭ اِنَّهٗ لَا يُحِبُّ الْمُعْتَدِيْنَ ۝ وَلَا تُفْسِدُوْا فِى الْاَرْضِ بَعْدَ اِصْلَاحِهَا وَادْعُوْهُ خَوْفًا وَّ طَمَعًا ۭ اِنَّ رَحْمَتَ اللّٰهِ قَرِيْبٌ مِّنَ الْمُحْسِنِيْنَ ۝
(الاعراف:٥٥،٥٦)

మీ ప్రభువుకు మొరపెట్టుకోండి, రోదిస్తూ, లోలోనే శోకంతో. నిస్సందేహంగా అల్లాహ్, తాను నియమించిన హద్దుల్ని మీరేవారిని ఏమాత్రం ఇష్టపడదు. భువిలో దాని సంస్కరణ జరిగిన తరువాత అల్లకల్లోలాన్ని రేపకండి, ఆయన్ని భయంతోనూ ఆశతోనూ పిలువండి, నిశ్చయంగా అల్లాహ్ కారుణ్యం అతిసమీపాన ఉంది, ఉత్తమ ప్రవర్తన గలవారికి.

*(అల్ ఆరాఫ్: 55,56)*

3. దాసుడు ధర్మ సమున్నతి కోసం కృషి జరుపుతున్నప్పుడు తన ధనప్రాణాలను పణంగా పెట్టిపోరుతున్నప్పుడు అల్లాహ్ ప్రేమాలింగనం అతని కోసం తెరచుకుంటుంది.

اِنَّ اللّٰهَ يُحِبُّ الَّذِيْنَ يُقَاتِلُوْنَ فِىْ سَبِيْلِهٖ صَفًّا كَاَنَّهُمْ بُنْيَانٌ مَّرْصُوْصٌ ۝
(الصف:٤)

నిశ్చయంగా అల్లాహ్, తన మార్గంలలో వరుసలు దీరి, సీసం పోసి కట్టిన గోడలా పటిష్టంగా పోరాదేవారంటే ఎంతో ఇష్టపడతాడు. *(అస్సఫ్ : 4)*

ఈ ఆయత్‌లలో ధర్మంలోని విభిన్న కోణాలను ప్రస్తావించడం జరిగింది. దీని వల్ల దైవం పట్ల ప్రేమ కోరేదేమిటో ఊహించుకోవచ్చు. అల్లాహ్ ప్రేమకు పాత్రుడవ్వాలంటే మనిషి ఏమి చేయాలో, ఆయన ఎటువంటి శీలస్వభావాలను ఇష్టపడతాడో మనిషి ఎటువంటి చెడు నడతల వల్ల ఆయన కారుణ్యానికీ ప్రేమకూ దూరమవుతాడో క్షుణ్ణంగా బోధపడుతుంది.

## దైవసందేశహరుని (స) పట్ల ప్రేమ

దైవాన్ని ప్రేమించడం వల్ల ఏర్పడే ఆవశ్యకత, దైవప్రవక్త (స) పట్ల విధేయత పాటించే భావంగా మనిషి హృదయంలో ప్రభంజించాలి. ప్రవక్త బోధనల్ని మనః పూర్వకంగా పాటించాలి. ఆయన ఇచ్చిన ఏ ఆదేశాన్నీ వ్యతిరేకించకుండా మెలగాలి. దైవప్రవక్త విధేయతకు ఈ ప్రాముఖ్యత ప్రాప్తమవడానికి కారణం, ఆయన విధేయతే వాస్తవ దైవవిధేయత, ఆయన ఆదేశమే అల్లాహ్ ఆదేశం. ఆ ఆదేశ పాలన అల్లాహ్ ఆదేశ పాలన. దివ్యఖుర్ఆన్‌లో అతిస్పష్టంగా ఉంది:

مَنۡ يُّطِعِ الرَّسُوۡلَ فَقَدۡ اَطَاعَ اللّٰهَ‌ ۚ وَمَنۡ تَوَلّٰى فَمَاۤ اَرۡسَلۡنٰكَ عَلَيۡهِمۡ حَفِيۡظًا ○ (النساء:٨٠)

**ఎవరయితే ప్రవక్త పట్ల విధేయత చూపారో వారు వాస్తవానికి దైవానికి విధేయత పాటించారు. మరెవరయితే దానికి విముఖులయ్యారో వారు దానికి శాస్తిని అనుభవిస్తారు. మేము నిన్ను వారిపైన కాపలాదారుని చేసి పంపలేదు.**

*(అన్ నిసా: **80**)*

అల్లాహ్ పట్ల ప్రేమకు నిదర్శనం, అల్లాహ్ సందేశహరుని ఆజ్ఞల్ని పాటించడం. దానికి కించిత్తయినా దూరమవరాదు. ఇదే గనక లేకపోతే ఆచరణాత్మకంగా దైవప్రేమకు అర్థమే మిగులదు. అందువల్లనే ఇలా సెలవీయబడింది.

قُلۡ اِنۡ كُنۡتُمۡ تُحِبُّوۡنَ اللّٰهَ فَاتَّبِعُوۡنِىۡ يُحۡبِبۡكُمُ اللّٰهُ وَيَغۡفِرۡ لَـكُمۡ ذُنُوۡبَكُمۡ‌ؕ وَاللّٰهُ غَفُوۡرٌ رَّحِيۡمٌ ○ قُلۡ اَطِيۡعُوا اللّٰهَ وَالرَّسُوۡلَ‌ ۚ فَاِنۡ تَوَلَّوۡا فَاِنَّ اللّٰهَ لَا يُحِبُّ الۡكٰفِرِيۡنَ ○ (آل عمران:٣١-٣٢)

**ప్రవక్తా వీరికి చెప్పు, మీరు గనక అల్లాహ్ పట్ల ప్రేమగల వారయితే నా విధేయత పాటించండి. అల్లాహ్ మిమ్మల్ని ప్రేమిస్తాడు, మీ పాపాలను మన్నిస్తాడు. అల్లాహ్ మహా క్షమాశీలి, కరుణా గుణి. వీరికి చెప్పు అల్లాహ్, ఆయన ప్రవక్త పట్ల విధేయత పాటించండి, వారు గనక విముఖులయినట్లయితే (వారు తెలుసుకోవాలి) అల్లాహ్, తన పట్ల తిరస్కార భావాన్ని ప్రకటించేవారిని ప్రేమించడు.**

*(ఆలి ఇమ్రాన్: **31,32**)*

ఈ రెండు ఆయత్‌లలో మొదటి దానిలో దైవప్రేమకు నిదర్శనాన్ని ప్రవక్త అనుసరణ రూపంలో కోరడమయినది. రెండవ ఆయత్‌లో దైవం దైవప్రవక్తల విధేయతను ఒకేసారి ఆదేశించడం జరిగింది. దీన్నిబట్టి దైవప్రవక్త విధేయత నిజానికి దైవవిధేయతే అన్న సత్యం వ్యక్తమవుతుంది. ఇవి రెండు వేర్వేరు విధేయతలు కావు, ఒకే విధేయత.

మనిషి తాను ప్రేమించేవారిని స్వయంగానే అనుసరిస్తాడు కూడా. ప్రేమ పెచ్చరిల్లి మనోమస్తిష్కాలను ఆక్రమిస్తే అతను ఆపాదమస్తకం మూర్తీభవించిన వినయవిధేయతలయిపోతాడు. ఒకరి పట్ల ప్రేమ అంటూ కలగటం, వారిని అనుసరించక పోవడం అన్నది అసహజమయిన విషయం. ప్రేమాతిశయం, ఉద్వేగాలూ ఉంటూ ప్రేమించే వారి

మార్గబోధన అమలుపరచకపోవడం ప్రకృతి విరుద్ధమయిన విషయం. ఇది ప్రేమప్రకటన కావచ్చు నిజమయిన ప్రేమ మటుకు కాదు.

దైవసందేశహరుని (స) పట్ల ప్రేమ లేకుండా విశ్వాసాన్ని ఊహించనూ లేము. ఈ ప్రేమ వల్ల ఏర్పడే ఆవశ్యకత ఏమిటంటే, అది కేవలం నోటి మాటగా, లాంఛనప్రాయ మయినదిగా ఉండిపోరాదు. హృదయాంతరాళాల నుండి, ప్రాణం లోతుల్లోనుంచి ఉబికినదయి ఉండాలి. అది కడ మేరకు చేరినదయి కాగలగాలి. ఇది ఏ సంబంధం, బాంధవ్యాలకు సంబంధించినది కాదు. అన్ని సంబంధాలకు అతీతమయినది, అన్నింటిపైనా ఆధిక్యతగలదయి ఉండాలి. ఈ యదార్థాన్నే హజ్రత్ అనస్ (ర) ఉల్లేఖనం ఒక దానిలో వెల్లడించడం జరిగింది. ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవిచ్చారు:

لَا يُؤْمِنُ اَحَدُكُمْ حَتّٰى اَكُوْنَ اَحَبَّ اِلَيْهِ مِنْ وَالِدِهٖ وَ وَلَدِهٖ وَالنَّاسِ اَجْمَعِيْنَ[1]

మీలో ఏ ఒక్కడూ విశ్వాసి కాలేడు, నేను అతని దృష్టిలో అతని తల్లిదండ్రులకన్నా, అతని సంతానం కన్నా, మానవులందరి కన్నా ఇతోధిక ప్రియప్రదమయినవాణ్ణి కానంతవరకు.★

لَا يُؤْمِنُ اَحَدُكُمْ حَتّٰى يَكُوْنَ هَوَاهُ تَبَعًا لِّمَا جِئْتُ بِهٖ[2]

హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ (ర) ప్రవక్త మహనీయుల (స) వచనం ఇలా ఉటంకించారు: మీలో ఎవ్వరూ విశ్వాసి కాలేడు, అతని కోరికలు నేను తెచ్చిన ధర్మానికి లోబడనంతవరకు.★★

## ఈమాన్ కమ్మదనం

ప్రపంచంలో అనేక భౌతిక పదార్థాలలో కమ్మదనం, రుచి గోచరిస్తాయి. అందు వల్లనే మనిషి వీటి వైపునకు పరిగెడుతాడు. అలాగే ఆధ్యాత్మిక మానసిక స్థితిగతుల్లోనూ మాధుర్యం ఉంటుంది. ఈ కమ్మదనం, రుచి లభించాలంటే మనిషి మనోమస్తిష్కాలపైన అల్లాహ్, ఆయన ప్రవక్తల ప్రేమభిమానాలు ఆధిక్యత పొందాలి. వారి ఇష్టమే మనిషి ఇష్టమయిపోవాలి. వారికి ఇష్టం లేనిదేదయినా మనిషికి ఎంతమాత్రం ఇష్టం కాకూడదు.

---

★ సహీహ్ బుఖారి, కితాబుల్ ఈమాన్, హుబ్బుర్రసూల్‌మినల్ ఈమాన్. సహీహ్ ముస్లిమ్, కితాబుల్ ఈమాన్, వుజూబ్ ముహబ్బతరసులుల్లాహ్(స).

★★ మిష్కాతుల్ మసాబీహ్:షర్హుస్సున్నహ్–బగవి.

హజ్రత్ అనస్ (ర) ఉల్లేఖించారు, మనిషి విశ్వాసపు మాధుర్యాన్ని, మత్తును, కమ్మదనాన్ని చవిగొనాలంటే అతని దృష్టిలో దైవం, దైవప్రవక్తల ప్రేమ కడమ ప్రేమల న్నింటిపైనా ఆధిక్యతనొందాలి. దీని ఆధారంగానే తోటి మానవులతో అతని సంబంధాలు ఏర్పడాలి. తిరస్కారం, పాపం అతనికి అసహ్యమయినవిగా మారాలి. మంటలో కాలి మాడిపోవడం ఏ విధంగానయితే అసహ్యమయినదో వీటి పట్ల కూడా అతనికి ఏవగింపు కలగాలి. ఉల్లేఖనంలోని పదాల ప్రకారం ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవిచ్చారు:

ثَلاَثٌ مَّنْ كُنَّ فِيْهِ وَجَدَ بِهِنَّ حَلاَوَةَ الْاِيْمَانِ مَنْ كَانَ اللّٰهُ وَ رَسُوْلُهٗ اَحَبَّ اِلَيْهِ مِمَّا سِوَاهُمَا وَمَنْ اَحَبَّ عَبْدًا لَّا يُحِبُّهٗ اِلَّا لِلّٰهِ وَ مَنْ يَكْرَهُ اَنْ يَّعُوْدَ فِي الْكُفْرِ بَعْدَ اَنْ اَنْقَذَهُ اللّٰهُ مِنْهُ كَمَا يَكْرَهُ اَنْ يُّلْقٰى فِي النَّارِ

ఏ వ్యక్తిలోనయితే మూడు విషయాలు కానవస్తాయో అతను వీటి కారణంగా ఈమాన్, విశ్వాసం కమ్మదనాన్ని చవిచూడ గలడు. ● అల్లాహ్, ఆయన ప్రవక్త మిగతా విషయాలన్నింటికన్నా ప్రియప్రద మయిన వారు కాగలగాలి. ● ఒక వ్యక్తి పట్ల ప్రేమ కలిగి ఉంటే అది కేవలం అల్లాహ్ కొరకే ప్రేమ కలిగి ఉండాలి. ● అల్లాహ్ అతన్ని కుఫ్ర్ (తిరస్కారం) నుండి వెలికి తీసివేసిన తరువాత తిరిగి అందులోకి చేరడం, మంటలో పడ వేయటం వంటి అసహన భావాన్ని కలిగించాలి.★

మరో హదీసులో, మనిషి మైత్రీ శత్రుత్వాలు, ఇచ్చిపుచ్చుకోవడాలు, అన్నీ దైవం కొరకే జరిగినప్పుడు అతని విశ్వాసం పరిపూర్ణమవుతుంది అని ఉంది. హజ్రత్ అబూ ఉమామ (ర) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవిచ్చారు:

مَنْ اَحَبَّ لِلّٰهِ وَ اَبْغَضَ لِلّٰهِ وَ اَعْطٰى

ఎవరయితే అల్లాహ్ కొరకే ప్రేమిస్తాడో, అల్లాహ్ కొరకే ద్వేషిస్తాడో, ఇచ్చినా

---

★ సహీహ్ బుఖారి; కితాబుల్ ఈమాన్- హలావతుల్ ఈమాన్. సహీహ్ ముస్లిమ్: కితాబుల్ ఈమాన్.

لِلّٰهِ وَ مَنَعَ لِلّٰـهِ فَقَدْ اِسْتَكْمَلَ الْاِيْمَانَ

అల్లాహ్ కొరకే, వారించినా అల్లాహ్ కొరకే చేస్తాడో అతను తన విశ్వాసాన్ని పూర్తి చేసుకున్నట్లే. ★

ఈ హదీసు వల్ల తెలిసేదేమిటంటే, మనిషి సంబంధాలన్నీ అల్లాహ్ ప్రేమబద్ధమయి ఉండాలి, ఎటువంటి ప్రాపంచిక, భౌతిక అవసరం వీటికి తోడయి ఉండరాదు. ఒకరి పట్ల ప్రేమ, అనుబంధం ఏర్పడినట్లయితే అది కేవలం అల్లాహ్ ప్రసన్నత, ఆయన సంతోషం పొందడానికే కావాలి. ఇది విశ్వాసానికి పరమపదసోపానం. అలాగే ఒకరితో ద్వేషమయినా శత్రుత్వమయినా ఉంటే, అది అతనితో వ్యక్తిగత వైషమ్యం, కుటుంబ కలహం, జాతి విద్వేషం, వర్గపక్షపాతం లేదా ఇలాంటిదే మరేదయినా భావన వల్ల కారాదు. అతను దైవాజ్ఞల్ని ఉల్లంఘించేవాడవడం, దైవద్రోహి, దైవవిరోధి అవడంచేతనే కాగలదు. అయితే మానవునిగా అతనిలో సాధారణ మానవ సంబంధాలు కలిగి ఉండాలి. అతని కష్టాల్లో సహాయపడాలి, సహానుభూతిని అవలంబించాలి. అతని పరిస్థితుల సంస్కరణకు సయితం కృషి చెయ్యాలి. అతను సంస్కరణను స్వీకరిస్తే, దైవవిధేయత, ఆజ్ఞాపాలన పరిధిలోకి వచ్చినట్లయితే అతనితో విశ్వాసపరమయిన సంబంధం ఏర్పడుతుంది. ఈ బంధం అన్ని బంధుత్వాలకన్నా బలీయమయినది.

పరిణత విశ్వాసానికి ఒక గుర్తు ఏమిటంటే, మనిషి సంపాదన దేవుని అభీష్టం ప్రకారం ఖర్చు కావాలి. ఎక్కడ ఖర్చు చేయాలని ఆదేశించడం జరిగిందో అక్కడే ఖర్చు కావాలి. ఎక్కడ ఖర్చు చేయరాదని వారించడం జరిగిందో అక్కడ ఎంత మాత్రం ఖర్చు కారాదు. అది దేవుని దాసులయిన మానవుల ధర్మసమ్మతమయిన అవసరాలను తీర్చడానికి, ఆయన ధర్మసేవలో, ధర్మాన్ని సమున్నతపరచడానికి ఖర్చు కావాలి. దుబారా ఖర్చులు, వృధా ఖర్చులకు మనిషి దూరమయి ఉండాలి. పాపం అవిధేయతల కార్యాలలో స్వయంగా తన సంపాదనా వృధా చేయరాదు, ఇతరులకూ ఈ విషయంలో ఏ విధంగానూ సహాయపడరాదు.

అల్లాహ్ కొరకే ఏదయినా ఇవ్వడమంటే, మనిషి ఏ వ్యవహారంలోనయినా మాటిచ్చినా, ఒట్టు పెట్టుకున్నా, వాగ్దానం చేసినా, నాయకుని విధేయత పాటించే ప్రమాణం చేసినా అన్నీ అల్లాహ్ ప్రసన్నత కొరకే జరగాలి. ఏ దౌర్జన్యపరుని, దుష్టవర్తనుని విధేయత పాటించే ప్రమాణమూ చేయరాదు, అటువంటి వారికి తోడుగానూ నిలువరాదు.

★ సునన్ అబీ దావూద్, కితాబుస్సున్నహ్.

ఈమాన్ కమ్మదనాన్ని గ్రోలడానికి మనిషి దైవాన్ని నమ్మి పూర్తిగా సంతృప్తి చెందడం అవసరం. అతని ఆత్మ, తన ప్రభువు దైవం అన్న భావంతోటే అనంత ఆనందం అనుభవించాలి. అతని దృష్టి కేవలం దైవం మీదనే స్థిరపడాలి. దైవం తప్ప మరే విషయం పట్లనూ అతనికి ఎటువంటి ఆకర్షణ కలగరాదు. దైవధర్మం అతని క్రియాప్రదమయిన ధర్మమయిపోవాలి. దైవప్రవక్తను తన నిజమయిన, అసలు నాయకుడుగా భావించాలి. హజ్రత్ అబ్బాస్ బిన్ అబ్దుల్ ముత్తలిబ్ ఉల్లేఖనం ప్రకారం ప్రవక్తశ్రీ (స) ఇలా సెలవిచ్చారు:

ذاق طعم الایمان من رضی باللہ ربا و بالاسلام دینا و بمحمد رسولا

**అల్లాహ్ తన ప్రభువని, ఇస్లామ్ తన ధర్మమని, ముహమ్మద్ తన మార్గబోధకుడని, దైవసందేశహరుడని నమ్మి దానిపై సంతుష్టుడయిపోయిన వ్యక్తి విశ్వాసపు (ఈమాన్) మాధురిని గ్రోలాడు.** ★

దైవప్రసన్నతకు చెందిన ఈ ఉన్నత స్థానం ప్రాప్తం కావాలంటే, అల్లాహ్ పట్ల, ఆయన సందేశహరుని పట్ల, ఆయన ధర్మం పట్ల విశ్వాసం– బుద్ధిజ్ఞానాల వెలుగులో ప్రాప్తమయి ఉండాలి, పూర్తి చేతనతో మనోమస్తిష్కాలలో దానికి చోటు ఇవ్వాలి.

## ధర్మసందేశం కొరకు దైవంతో సంబంధం

ఖుర్ఆన్, హదీసుల వల్ల తెలిసేదేమిటంటే, దైవధర్మ సేవను సరయిన భావంలో చేయగోరిన వ్యక్తికి దైవంతో లోతయిన, పటిష్టమయిన సంబంధం ఏర్పడాలి. ఆయన కోసమే జీవించడానికయినా మరణించడానికయినా, ఆయన కోసమే ఒకరితో కలవడమయినా దూరమవడమయినా, ఇవ్వడానికయినా, నిరాకరించడానికయినా సిద్ధమవ్వాలి. దైవం పట్ల అతిగాఢమయిన ప్రేమ కలిగి ఉండాలి. ఆయనంటే ఇతోధికంగా భయపడాలి. ఆయన మార్గంలో కష్టాలు భరించి కూడా ఆనందాన్నే అనుభవించాలి. అతని నోరు అత్యంత కఠిన పరిస్థితుల్లోనూ దైవం పట్ల ఎటువంటి నిందకయినా పాల్పడకుండా ఉండాలి. ఆయన వైభవం ప్రాభవాలు ఔన్నత్యాలే భయోత్పాతమే అతని ఆంతర్యంలో గట్టిగా పాదుకుని ఉండాలి. ఆయన తప్ప మరొకరెవరి

---

★ సహీహ్ బుఖారి; కితాబుల్ ఈమాన్, బయాన్ అద్దలీలు అలా అన్ మన్ రజి యబిల్లాహి రబ్బ.....

భయమయినా అందులో స్థానం పొందరాదు. అతని శక్తులు సామర్థ్యాలను, తన సౌకర్యాలు, సౌలభ్యాలను, తన ధనసంపదల్ని, తన సుఖశ్రేయాలను, తన ప్రయోజనాలు అభిరుచుల్ని ఆయన కొరకు త్యాగం చేయగలగాలి. ఇదంతా చేసి ఆయన పట్ల తన బాధ్యత నెరవేర్చనేలేదని భావించగలగాలి. తన వల్ల కాగలిగినదంతా చేయగలిగినప్పటికీ తన ఏమరుపాటు, అలసత్వాల తలంపే అతన్ని ఆవేదనకు గురిచేయాలి. అతనికి అల్లాహ్ ఉనికిపాటు ఒక్కటే ప్రపంచంలోని సమస్త విషయాలకన్నా ప్రియప్రదమయినది, ప్రేమ పాత్రమయినది కాగలగాలి. ఆయన పట్ల ప్రేమే సకల ప్రేమలపైన ఆధిక్యత పొంద గలగాలి. అతనికి దైవధర్మానికి జరిగే నష్టం తన వ్యక్తిగత నష్టం అనిపించాలి. ధర్మోన్నతి పట్ల తన వ్యక్తిగత ఉన్నతి కన్నా అధికంగా ఆనందం కలగాలి. ధర్మం పట్ల జరిగే దాడిని తనపై జరిగే దాడికన్నా తీవ్రమయినదిగా ఎంచాలి. ప్రపంచంలోని ప్రతి నష్టాన్ని భరించి దాన్ని రక్షించేందుకు నడుంకట్టుకోవాలి. ఎవరికయితే అల్లాహ్‌తో ఇటువంటి సంబంధం పటిష్టంగా ఏర్పడదో అతను ధర్మకార్యం చేయడం సాధ్యంకాని విషయం. ఒకానొక తాత్కాలిక భావోద్రేక భావం క్రింద దాన్ని అతను ప్రారంభించినా దాన్ని కొనసాగించడం, ఆ మార్గంలో తారసపడే నష్టాలను భరించడం, దాని కొరకు త్యాగాలు సమర్పించడం అతనికి సాధ్యమయిన విషయాలు కావు.

ఈమాన్ లేక విశ్వాసం మీ నుండి నిజమయిన విశ్వసనీయతను కోరుతుంది. విశ్వాసం మీ నుండి నిరంతర త్యాగాన్ని కాంక్షిస్తుంది. ఈమాన్ మీ నుండి దృఢ సంకల్పంతో కూడుకున్న కృషిని ఆశిస్తుంది. ఈమాన్ మీ నుండి చిత్తశుద్ధిగల ప్రేమను కోరుతుంది. ఈమాన్, మీరు పూర్తిగా దైవానికే అంకితమయిపోవాలని అభిలషిస్తుంది, దైవప్రసన్నత కొరకు మిమ్మల్ని మీరు పణంగా పెట్టాలని కోరుతోంది. ఏ వ్యక్తి ఇలా తన అమ్మకానికి సిద్ధం కాడో అతని ఈమాన్ నిజమయిన ఈమాన్ కాదు. ఇటువంటి ఈమాన్‌కు దేవుని కారుణ్యం అవతరించదు, ఆయన బహుమానాలు వర్షించవు.



# పరలోకం పట్ల విశ్వాసం

## పరలోక విశ్వాసం ప్రాముఖ్యత

పరలోక విశ్వాసం ఇస్లామ్‌లో మౌలిక విశ్వాసం. ఇస్లామ్ పరిధిలోకి ఎవరు ప్రవేశించదలచినా అతనిలో పరలోకం పట్ల విశ్వాసం ఉన్నప్పుడే సాధ్యం. ఈ విశ్వాసం లేనిదే అతని ఇస్లామ్ విశ్వసనీయం కాదు. దివ్యఖుర్‌ఆన్‌లో ప్రారంభంలోనే తెలుపడం జరిగింది, ఈ గ్రంథం దైవభక్తిపరాయణులు, దైవభీతిపరాయణులు అయిన వారికే మార్గబోధనా గ్రంథం. ఈ జనుల ప్రత్యేక గుర్తింపుగా ఇలా సూచించడం జరిగింది:

وَ بِالْاٰخِرَةِ هُمْ يُوْقِنُوْنَ ○ (البقرة:٤)

వారు పరలోకాన్ని విశ్వసిస్తారు.

*(అల్ బకర: 4)*

మరో సందర్భంలో, ఈ గ్రంథం, సచ్చరితులు పరిశుద్ధ శీలస్వభావాలుగల మానవులకే మార్గదర్శకం అని. వారి అతిస్పష్టమయిన గుర్తు ఇది:

وَهُمْ بِالْاٰخِرَةِ هُمْ يُوْقِنُوْنَ ○ (لقمان:٤)

వారు పరలోకాన్ని దృఢంగా సంపూర్ణంగా నమ్ముతారు. *(లుక్మాన్: 4)*

## పరలోకం సంభవించి తీరుతుంది

ఖుర్‌ఆన్ స్పష్టంగా వెల్లడిస్తుంది, మన విశ్వాసం ప్రకారం అందులోని ప్రతి అంశం ఎటువంటి కుశంకలకు అనుమానాలకు అతీతమయినది, పరలోకం సంభవిస్తుంది, తప్పక సంభవిస్తుంది. ఇది భూమ్యాకాశాల స్వామి, పరిపాలకుడు చేసిన నిర్ణయం. జగతిలోని ఏ శక్తీ ఆయన చేసిన ఏ నిర్ణయాన్నీ మార్చజాలదు. ఆయన ఎంత తీవ్రిగా, బలోపేతంగా ఈ మాట అన్నాడో చూడండి:

وَ يَسْتَنْبِئُوْنَكَ اَحَقٌّ هُوَ ؕ قُلْ اِىْ وَ رَبِّىْ اِنَّهٗ لَحَقٌّ ؕ وَّمَا اَنْتُمْ بِمُعْجِزِيْنَ ۝

(یونس:۵۳)

వారు నిన్ను అడుగుతున్నారు, పరలోక శిక్ష రావడం తథ్యమా? వారికి చెప్పు, అవును; నా ప్రభువు మీద ప్రమాణం, అది సంభవించడం తథ్యం! మీరు దైవాన్ని లోబరచుకోలేరు. *(యూనుస్: 53)*

ఇదే విషయాన్ని దివ్యఖుర్ఆన్‌లో పలుచోట్ల ఇదే బలంతో, ఇదే తీవ్రతతో వెల్లడించడం జరిగింది. సబా సూరాలో ఇలా ఉంది:

وَ قَالَ الَّذِيْنَ كَفَرُوْا لَا تَاْتِيْنَا السَّاعَةُ ؕ قُلْ بَلٰى وَ رَبِّىْ لَتَاْتِيَنَّكُمْ ۙ عٰلِمِ الْغَيْبِ ۚ لَا يَعْزُبُ عَنْهُ مِثْقَالُ ذَرَّةٍ فِى السَّمٰوٰتِ وَلَا فِى الْاَرْضِ وَلَاۤ اَصْغَرُ مِنْ ذٰلِكَ وَلَاۤ اَكْبَرُ اِلَّا فِىْ كِتٰبٍ مُّبِيْنٍ ۝ لِّيَجْزِىَ الَّذِيْنَ اٰمَنُوْا وَ عَمِلُوا الصّٰلِحٰتِ ؕ اُولٰٓئِكَ لَهُمْ مَّغْفِرَةٌ وَّ رِزْقٌ كَرِيْمٌ ۝ وَالَّذِيْنَ سَعَوْ فِىْۤ اٰيٰتِنَا مُعٰجِزِيْنَ اُولٰٓئِكَ لَهُمْ عَذَابٌ مِّنْ رِّجْزٍ اَلِيْمٌ ۝

(سبا:۳-۵)

మరెవరయితే తిరస్కారానికి ఒడిగట్టారో వారు అంటున్నారు, ప్రళయం తమను ముట్టుకోదు అని. ప్రవక్తా వారికి చెప్పు, అవును నా ప్రభువు అగోచర విషయ జ్ఞానం కలవాడు, ఆయన మీద ఒట్టు, అది మీకు తప్పక తటస్థిస్తుంది. నా ప్రభువు జ్ఞానం మేరకు ఆకాశాల్లోనూ భూమిలోనూ ఏ ఒక్క అణువూ మరుగయిలేదు. అణువు కన్నా చిన్నదయినా పెద్దదయినా ప్రతి విషయం ఓ ప్రస్ఫుట గ్రంథంలో వ్రాయబడి ఉంది. (ప్రళయం రావడం దేనికంటే) విశ్వసించి సదాచారాలు చేసినవారికి దైవం సద్ఫలితాన్ని ఇవ్వడానికి. వారి కొరకు క్షమాభిక్ష, గౌరవప్రదమయిన ఉపాధి లభిస్తాయి. దీనికి భిన్నంగా మా ఆయత్‌లను మిథ్యగా నిరూపించడానికే కృషి చేసిన వారి కొరకు అతి తీవ్రమయిన బాధాకర యాతన ఉంది.

*(సబా: 3–5)*

ఇదే విషయాన్ని ఈ పదాలలోనూ తెలుపడం జరిగింది:

زَعَمَ الَّـذِيْنَ كَفَرُوْا اَنْ لَّنْ يُّبْعَثُوْاؕ قُـلْ بَلٰى وَ رَبِّىْ لَتُبْعَثُنَّ ثُمَّ لَتُنَبَّـؤُنَّ بِمَـا عَمِلْتُمْؕ وَ ذٰلِكَ عَـلَى اللّٰهِ يَسِيْرٌ۝ (التغابن:٧)

ఎవరయితే తిరస్కరించారో వారు, తాము ఎన్నటికీ తిరిగి లేపబడబోవటం లేదని వాదిస్తున్నారు. వారికి చెప్పు, అవును, నా ప్రభువు సాక్షిగా, మీరు తప్పక లేపబడ నున్నారు. మీరు చేసిన ఆచరణలన్నీ మీకు చూపెట్టబడనున్నాయి. ఇది అల్లాహ్‌కు సులభతరమయిన విషయం.

*(అత్ తగాబున్: 7)*

పరలోకాన్ని తీవ్రంగా వ్యతిరేకించే వారి వాదాన్ని సయితం అంతే బలమయిన రీతిలో ఖండించడం జరిగింది:

وَ اَقْسَمُوْا بِاللّٰهِ جَهْدَ اَيْمَانِهِمْۙ لَا يَبْعَثُ اللّٰـهُ مَنْ يَّمُوْتُؕ بَلٰى وَعْـدًا عَلَيْهِ حَقًّـا وَّ لٰكِنَّ اَكْثَرَ النَّاسِ لَا يَعْلَمُـوْنَ ۝ لِيُبَيِّنَ لَهُـمُ الَّـذِىْ يَخْتَلِفُوْنَ فِيْهِ وَلِيَعْلَمَ الَّذِيْنَ كَفَرُوْٓا اَنَّهُـمْ كَانُوْا كٰذِبِيْنَ۝ اِنَّمَـا قَوْلُنَـا لِشَىْءٍ اِذَآ اَرَدْنٰـهُ اَنْ نَّقُوْلَ لَـهٗ كُنْ فَيَكُوْنُ۝ (النحل:٣٨-٤٠)

వారు దైవం పేరు చెప్పి ప్రమాణాలు చేస్తారు. అతి కఠోరమయిన ప్రమాణం చేసి మరీ చెబుతారు, అల్లాహ్ మరణించిన వారిని తిరిగి లేపడు అని. అయితే ఆయన తప్పక లేపుతాడు. ఇది అల్లాహ్ వాగ్దానం, గట్టి వాగ్దానం. కాని చాలా మంది ఎరుగరు. (ఆయన లేపడానికి కారణం) వారు నేడు వ్యతిరేకించి విభేది స్తున్న విషయాలను వారికి వెల్లడిచేయా లన్నది. మరెవరయితే తిరస్కరించారో వారికి తెలిసిపోతుంది తాము అబద్ధం పలికే వారమని. మేము ఏదయినా చేయా లని కోరుకుంటే మేము కేవలం ఒక్క మాట 'ఉనికిలోకి రా' అని పలుకుతాము. అది నెరవేరుతుంది. *(అన్ నహ్ల్: 38-40)*

పరలోకం విషయంలో ఆధారనిదర్శనంగా మానవ సృష్టిని, అతని ఉనికిని, వర్షంతోపాటే భూమిపైన మొలిచే హరితను ముందుంచడం జరిగింది. ఆ తరువాత ఇలా సెలవీయబడింది:

ذٰلِکَ بِاَنَّ اللّٰهَ هُوَ الْحَقُّ وَ اَنَّهٗ یُحْیِ الْمَوْتٰی وَ اَنَّهٗ عَلٰی کُلِّ شَیْءٍ قَدِیْرٌ ۝ وَ اَنَّ السَّاعَةَ اٰتِیَةٌ لَّا رَیْبَ فِیْهَا ۙ وَ اَنَّ اللّٰهَ یَبْعَثُ مَنْ فِی الْقُبُوْرِ ۝ (الحج:٦-٧)

ఇవన్నీ (సృష్టి ప్రదర్శనలు) అల్లాహ్ మాత్రమే సత్యం అనడానికి నిదర్శనాలు. ఆయన మృతులను బ్రతికిస్తాడు. ఆయన ప్రతి విషయంపైనా అధికారం గలవాడు. నిస్సందేహంగా ప్రళయం వచ్చితీరుతుంది. అందులో ఎటువంటి శంకలేదు. గోరీలలో ఉన్న వారినందరినీ అల్లాహ్ లేపుతాడ నడంలోనూ శంక లేదు. *(అల్ హజ్జ్: 6-7)*

ఈ వచనాలలో వ్యక్తమయిన విశ్వాసం దృఢనమ్మకం, దైవగ్రంథాలకే ప్రత్యేక మయినది. అది దివ్యఖుర్ఆన్‌లో మరీ ప్రస్ఫుటంగా కానవస్తోంది. దీన్నిబట్టి, ప్రళయం తప్పక వస్తుందన్న వాదాన్ని మాత్రమే ఇందులో వెల్లడించబడిందని, దానికి తగిన ఆధారం చూపలేదని భావించరాదు. వాస్తవానికి ప్రళయం ఎప్పుడు వస్తుంది, ఎందుకు వస్తుంది, అది రాగల అవకాశాలు కూడా ఉన్నాయి, అది వస్తే ఏ రూపంలో వస్తుంది అన్నటువంటి ప్రశ్నలన్నింటికీ సమాధానాలు స్వయంగా ఆ ఆయత్‌లలో ఉంది. దివ్యఖుర్ఆన్‌లో ఇతర చోట్ల దాని వివరాలెన్నో వచ్చాయి. ముమ్మందు ఖుర్ఆన్‌లోని ఇతర ఆయత్‌ల ఆధారంగా వాటిని కొన్నింటిని విశదపరిచే ప్రయత్నం చేస్తాము:

## ప్రళయం వచ్చినప్పుడు...

ప్రళయం వచ్చినప్పుడు ఈ ప్రపంచం దాని సకల వస్తుసామగ్రితోసహా అంత మయి పోతుంది. భూమ్యాకాశాలు ఛిన్నాభిన్నమయిపోతాయి. మరో నవ వ్యవస్థ ఉనికి లోకి వస్తుంది. దీన్నే 'ప్రళయ దినం' అని అంటారు. అంటే మరణించిన వారు బ్రతికి నిలబడే, దైవం సమక్షంలో హాజరయ్యే రోజు ...

فَاِذَا نُفِخَ فِی الصُّوْرِ نَفْخَةٌ وَّاحِدَةٌ ۙ وَّ حُمِلَتِ الْاَرْضُ وَ الْجِبَالُ فَدُكَّتَا دَكَّةً وَّاحِدَةً ۙ فَیَوْمَئِذٍ وَّقَعَتِ الْوَاقِعَةُ ۙ (الحاقة:١٣-١٥)

ఆపైన బాకాలో ఒకసారి ఊదబడినప్పుడు, నేల, కొండలు పైకి లేపబడతాయి. ఒక్క సారిగా అవన్నీ పిండి పిండిగా చేయబడ తాయి. ఆ రోజున జరిగేదేదో (ప్రళయం) జరిగిపోతుంది. (అల్ హాక్క: 13-15)

మరో దృశ్యాన్ని తిలకించండి;

اِذَا وَقَعَتِ الْوَاقِعَةُ ۙ لَيْسَ لِوَقْعَتِهَا كَاذِبَةٌ ۘ خَافِضَةٌ رَّافِعَةٌ ۙ اِذَا رُجَّتِ الْاَرْضُ رَجًّا ۙ وَّ بُسَّتِ الْجِبَالُ بَسًّا ۙ فَكَانَتْ هَبَآءً مُّنْبَثًّا ۙ (الواقعہ:۱-۶)

సంభవించేదేదో (ప్రళయం) సంభవించినప్పుడు దాని సంభవించడం పట్ల కాదనే వాడెవడూ ఉండడు. అది (ఒకరిని) అణచివేసినట్లయితే (మరొకరిని) సమున్నతపరుస్తుంది. భూమి బాగా కుదిపి వేయబడినప్పుడు కొండలు పిండి పిండి చేయబడినప్పుడు, అవి ఎగిరే ధూళి అయి పోయినప్పుడు (అది సంభవిస్తుంది).

*(అల్ వాకిఅ: 1-6)*

అప్పుడు ఈ గగన భువనాలు మార్చివేయబడతాయి. నక్షత్రాలు, గ్రహాలు, ఈ సౌరకుటుంబం అంతా చెల్లాచెదరయిపోతుంది. మానవులు మళ్ళీ బ్రతికింపబడతారు. ప్రతి ఒక్కరి ఆచరణా పత్రం అతని చేతిలో ఉంటుంది. శుభవరాలు నిండిన స్వర్గం, స్ఫులింగాలు చాచే నరకం ఎదుటనుంటాయి. మానవుడు ఐహిక జీవితంలో చేసినదేదో కళ్ళతో చూస్తూ ఉంటాడు:

اِذَا الشَّمْسُ كُوِّرَتْ ۙ وَ اِذَا النُّجُوْمُ انْكَدَرَتْ ۙ وَ اِذَا الْجِبَالُ سُيِّرَتْ ۙ وَ اِذَا الْعِشَارُ عُطِّلَتْ ۙ وَ اِذَا الْوُحُوْشُ حُشِرَتْ ۙ وَ اِذَا الْبِحَارُ سُجِّرَتْ ۙ وَ اِذَا النُّفُوْسُ زُوِّجَتْ ۙ وَاِذَا الْمَوْءٗدَةُ سُئِلَتْ ۙ بِاَيِّ ذَنْۢبٍ قُتِلَتْ ۙ وَ اِذَا الصُّحُفُ نُشِرَتْ ۙ وَ اِذَا السَّمَآءُ كُشِطَتْ ۙ وَ اِذَا الْجَحِيْمُ سُعِّرَتْ ۙ وَ اِذَا الْجَنَّةُ اُزْلِفَتْ ۙ

సూర్యుడు కాంతి విహీనమయిపోయినప్పుడు, నక్షత్రాలు తెగిపోయి పడిపోయినప్పుడు, పర్వతాలు చలింపజేయబడినప్పుడు, పది నెలలు నిండిన ఒంటెలు వదలివేయబడినప్పుడు, అడవి మృగాలు ఏకత్రం చేయబడినప్పుడు, సముద్రాలు రగిలింపబడినప్పుడు, ఆత్మలు సానుకూలత ఆధారంగా జత చేయబడినప్పుడు, సజీవంగా ఖననం చేయబడిన అమ్మాయిని, నిన్ను ఏ పాపానికి చంపడం జరిగిందని అడిగినప్పుడు, ఆచరణా పత్రాలు అంతా పరచివేయబడినప్పుడు, ఆకాశం తెరచివేయబడినప్పుడు, నరకం

عَلِمَتْ نَفْسٌ مَّآ اَحْضَرَتْ ۝ (التكوير)

రగిలించివేయబడినప్పుడు, స్వర్గం అతిసమీపం చేయబడినప్పుడు, ప్రతి ప్రాణి తెలుసుకుంటుంది, తాను ఏమి తీసుకుని హాజరయినదో. *(అత్ తక్వీర్:1-14)*

మరో దృశ్యం చూడండి:

اِذَا زُلْزِلَتِ الْاَرْضُ زِلْزَالَهَا ۝ وَ اَخْرَجَتِ الْاَرْضُ اَثْقَالَهَا ۝ وَ قَالَ الْاِنْسَانُ مَا لَهَا ۝ يَوْمَئِذٍ تُحَدِّثُ اَخْبَارَهَا ۝ بِاَنَّ رَبَّكَ اَوْحٰى لَهَا ۝ يَوْمَئِذٍ يَّصْدُرُ النَّاسُ اَشْتَاتًا ۝ لِّيُرَوْا اَعْمَالَهُمْ ۝ فَمَنْ يَّعْمَلْ مِثْقَالَ ذَرَّةٍ خَيْرًا يَّرَهٗ ۝ وَ مَنْ يَّعْمَلْ مِثْقَالَ ذَرَّةٍ شَرًّا يَّرَهٗ ۝ (الزلزال)

భూమి భూకంపాలతో కుదిపివేయబడినప్పుడు, అది అందులోని బరువునంతా వెలికి తీసివేసినప్పుడు, దీనికేమయిందీ అని మానవుడు ప్రశ్నించినప్పుడు, ఆ రోజున అది అందులోని సమాచారాన్నంతటినీ వెల్లడిస్తుంది, దానికి దాని ప్రభువు అదే ఆజ్ఞ ఇచ్చి ఉంటాడు. ఆ రోజున జనులు చెల్లాచెదరయి, చిందువందయి తిరిగి వస్తారు. అప్పుడు వారికి వారి ఆచరణలు చూపెట్టబడతాయి. కాగా ఎవరయితే ఏ రవ్వంత సత్కార్యం చేసి ఉన్నా దాన్ని అతను చూసుకుంటాడు. మరెవరయితే ఏమాత్రం చెడు చేసి ఉన్నా దాన్నీ అతను చూసుకుంటాడు. *(అల్ జిల్‌జాల్)*

## ప్రళయం ఎందుకు వస్తుంది

పరలోకం ఎందుకు వస్తుంది? అన్న ప్రశ్నను గురించి కాస్త ఆలోచించండి. దీనికి సమాధానం ఏమిటంటే, మంచీ చెడుల నిజమయిన తీర్పు జరగడానికి, ప్రతి ఒక్కరు తన అంతిమ పరిణామానికి చేరడానికి ప్రళయం వస్తుంది. పరమ ప్రభువు భక్తులు, సజ్జనులయినవారు, ఆయన విధేయత, ఆజ్ఞాపాలనలో జీవితాలు గడిపినవారు, ఎటువంటి పాపం, దోషం లేకుండా పరిశుద్ధంగా గడిపినవారికి బహుమానాలు, పురస్కారాలతో సత్కరించడానికి. మరెవరయితే అల్లాహ్ ఆజ్ఞల్ని ఉల్లంఘించినవారు, దైవవిద్రోహులు, తలబిరుసుతనం, తిరుగుబాటు వైఖరినవలంబించినవారు, పాపపంకిలంలో

తలమునకలయి ఉన్నవారు, వారు తమ కళ్ళతో దైవాగ్రహాన్ని చూడగలగాలని, ఆయనపెట్టే వ్యధాపూర్వకమయిన యాతనను ఎదుర్కోవాలని.

اِلَيْهِ مَرْجِعُكُمْ جَمِيْعًا ؕ وَعْدَ اللّٰهِ حَقًّا ؕ اِنَّهٗ يَبْدَؤُا الْخَلْقَ ثُمَّ يُعِيْدُهٗ لِيَجْزِيَ الَّذِيْنَ اٰمَنُوْا وَ عَمِلُوا الصّٰلِحٰتِ بِالْقِسْطِ ؕ وَالَّذِيْنَ كَفَرُوْا لَهُمْ شَرَابٌ مِّنْ حَمِيْمٍ وَّ عَذَابٌ اَلِيْمٌۢ بِمَا كَانُوْا يَكْفُرُوْنَ ۝ (یونس:۴)

ఆయన వైపునకే మీరంతా మరలిపోవలసి ఉంది. ఇది అల్లాహ్ చేసే నిజమయిన వాగ్దానం. నిస్సందేహంగా ఆయనే తొలి సారీ సృష్టిస్తాడు, తిరిగి దాన్ని పునఃసృష్టి స్తాడు. తద్వారా విశ్వసించి సత్క్రియలను ఆచరించిన వారికి న్యాయబద్ధంగా ప్రతి ఫలమివ్వాలని. మరెవరయితే తిరస్కరిం చారో వారు త్రాగడానికి వేడి నీరు, బాధా కరమయిన యాతన ఉంటుంది, వారు తిరస్కరించినవారు గనక. *(యూనుస్:4)*

## ప్రళయం రావడం సంభవమేనా?

ప్రపంచం అంతమయిపోయి దానిస్థానే మరో ప్రపంచం ఉనికిలోకి రావడం, అక్కడ మానవుడు దైవం సమక్షంలో తన జీవితంలో చేసిన ఆచరణలన్నింటికీ సమాధానం చెప్పుకునే అవసరం రావడం, దాన్నిబట్టి అతను స్వర్గానికో నరకానికో పాత్రుడుగా నిర్ణయమవడం సాధ్యమేనా?

దీనికి అతిసాధారణ సమాధానం, అల్లాహ్ విశ్వాన్నంతటికీ కర్త, స్వామి, ఆయనకు ప్రతిదానిపైనా అధికారం, ఆధిపత్యం ప్రాప్తమయి ఉంది. ఒక కొత్త ప్రపంచాన్ని రూపొందించడం, సదాచారులకు సత్ఫలితాన్నీ, దుష్టులకు శిక్షనూ ప్రసాదించడం ఆయన శక్తిసామర్థ్యాలకు అసాధ్యమయిన విషయమేమీ కాదు. ఏ విషయమూ ఆయనకు అసాధ్యమయినది కాదు. ఈ విషయాన్నే తెలుపడం జరిగింది:

وَ لِلّٰهِ مَا فِي السَّمٰوٰتِ وَمَا فِي الْاَرْضِ ۙ لِيَجْزِيَ الَّذِيْنَ اَسَآءُوْا بِمَا عَمِلُوْا وَ يَجْزِيَ الَّذِيْنَ اَحْسَنُوْا بِالْحُسْنٰى ۝ (النجم:۳۱)

ఆకాశాల్లో ఉన్నవీ, భువిలో ఉన్నవి అన్నీ అల్లాహ్‌కు చెందినవే. తద్వారా ఆయన దుష్టకార్యాలు చేసిన వారికి వారి చేష్టలకు శాస్తి అందజెయ్యాలని, సత్కార్యాలాచరిం చిన వారికి వాటి అత్యుత్తమ ప్రతిఫలాన్ని ప్రసాదించాలని (ప్రళయ ఉద్దేశ్యం.

*(అన్ నజ్మ్:31)*

పరలోకం ఏర్పడటం అసాధ్యమని భావించే వ్యక్తి దైవాన్ని దైవంగా భావిం చడు. అతడు దైవాన్ని గగన భువనాల స్వామిగా ఎంచడు. అతను దైవాన్ని భూమీ ఆకాశాల స్వామిగా పరిగణించడు. ఒక అల్పమయిన పరిమిత శక్తిగల అస్తిత్వంగా భావిస్తాడు. ఆయన అపార శక్తిసామర్థ్యాలను పరిపూర్ణ బలాన్నీ ఊహించడమూ అతని మస్తిష్కానికి వీలుపడని అంశం. అటువంటి వ్యక్తులు తొలుత తమ మనస్సుల సంస్కరణకు సమాయత్తమవ్వాలి.

وَمَا قَدَرُوا اللّٰـهَ حَقَّ قَدْرِهٖ ۖ وَ الْاَرْضُ جَمِيْعًا قَبْضَتُهٗ يَوْمَ الْقِيٰمَةِ وَالسَّمٰوٰتُ مَطْوِيّٰتٌۢ بِيَمِيْنِهٖ ؕ سُبْحٰنَهٗ وَتَعٰلٰى عَمَّا يُشْرِكُوْنَ ۝ (الزمر:٦٧)

వారు దైవాన్ని ఆయన విలువరీత్యా గుర్తిం చలేదు. (ఆయన మహోన్నత వైభవం అనన్యమయినది) భూమి యావత్తు ప్రళయ దినాన ఆయన పిడికిట ఉంటుంది. ఆకాశాలు ఆయన కుడి చేతిలో చుట్టబడి ఉంటాయి. ఆయన పరి శుద్ధుడూ, వీరు చేసే బహుదైవా రాధనకు అతీతుడు. *(అజ్జుమర్ : 67)*

భువన భాండవాల సృష్టికర్తకు ఏ విషయమూ అసాధ్యం కాదు. ఆయన ఏది కోరినా, ఎప్పుడు కోరినా ఉనికిలోకి రాగలదు. ఆయన శక్తిసామర్థ్యాలు అనంత మయునవి, అపరిమితమయినవి. ఏ వస్తువూ ఆయన అధికార పరిధికి వెలుపల లేదు.

اَوَلَيْسَ الَّذِىْ خَلَقَ السَّمٰوٰتِ وَالْاَرْضَ بِقٰدِرٍ عَلٰٓى اَنْ يَّخْلُقَ مِثْلَهُمْ ؕ بَلٰى ۚ وَهُوَ الْخَلّٰقُ الْعَلِيْمُ ۝ اِنَّمَآ اَمْرُهٗٓ اِذَآ اَرَادَ شَيْـًٔا اَنْ يَّقُوْلَ لَهٗ كُنْ فَيَكُوْنُ ۝ فَسُبْحٰنَ الَّذِىْ بِيَدِهٖ مَلَكُوْتُ كُلِّ شَىْءٍ وَّاِلَيْهِ تُرْجَعُوْنَ ۝ (يٰس:٨١-٨٣)

ఆకాశాలను, భూమినీ సృష్టించినటువంటి అస్తిత్వం అటువంటి వాటినే సృష్టించడా నికి సమర్థుడుకాడా? ఆయన మహా సృజనకర్త, మహాజ్ఞాని. ఆయన వ్యవ హారం ఏమిటంటే ఆయన దేన్నయినా సృజించాలని సంకల్పించుకుంటే దాన్ని 'ఉనికిలోకి రా' అని ఆదేశిస్తాడు, అది నెరవేరుతుంది. కాగా ప్రతి విషయంపైన అధికార ప్రభుత ఉన్న ఆ స్వామి చాలా పరిశుద్ధుడు. ఆయన వైపునకే మీరు మరలింపబడతారు. *(యాసీన్: 81-83)*

## పరలోకం సంభవించడం హేతుబద్ధం

బుద్ధి చెప్పేదేమిటంటే ఈ ప్రపంచానికి స్వామి అయిన దేవుడు తన అవిధేయుల పట్లనూ, విధేయులయినవారి పట్లనూ ఒకే విధంగా వ్యవహరించడు. ఆయన న్యాయం, ఆయన విజ్ఞతకు విరుద్ధమయిన విషయం ఇది. ఆయన విధేయులు, విద్రోహులు అందరూ మరణం తరువాత సమమయిపోవడం, ఎటువంటి పరిణామాన్ని ఎదుర్కోక పోవడం న్యాయవిరుద్ధం, విజ్ఞతకు వ్యతిరేకం. సదాచారులు, దుర్వర్తనులు, సచ్ఛీలురు, పాపాత్ములు, ఎవరికీ వారి చేష్టలకు సద్ఫలితమో దుష్ఫలమో ప్రాప్తమవకపోవడం అన్యాయం, అహేతుకం. పరలోకం తేల్చి చెప్పి వేస్తుంది, వాస్తవంగా ఈ ఉభయ వర్గాల మానవుల అంతిమ పరిణామం ఒకటే కాదని. పరలోకం ఏర్పడటం బుద్ధికి సరిగ్గా అతికే విషయం. దాన్ని కాదనడం బుద్ధి కోరే స్పష్టమయిన అగత్యాన్ని కాదనడమే.

وَمَا يَسْتَوِى الْاَعْمٰى وَالْبَصِيْرُ ۙ۬
وَالَّذِيْنَ اٰمَنُوْا وَ عَمِلُوا الصّٰلِحٰتِ
وَلَا الْمُسِیْٓءُ ؕ قَلِيْلًا مَّا تَتَذَكَّرُوْنَ ○
اِنَّ السَّاعَةَ لَاٰتِيَةٌ لَّا رَيْبَ فِيْهَا ز
وَلٰكِنَّ اَكْثَرَ النَّاسِ لَا يُؤْمِنُوْنَ ○
(المومن:۵۸،۵۹)

గుడ్డివాడూ కన్నులున్నవాడూ సమం కాలేరు. విశ్వసించినవారు, సదాచారులు, దుర్వర్తనులూ సమానులు కాజాలరు. మీరు బోధన గ్రహించడం బహుస్వల్పం. నిస్సంకోచంగా ప్రళయం సంభవిస్తుంది. ఇందులో సందేహం లేదు. కాని చాలా మంది దీన్ని విశ్వసించరు.
*(అల్ మూ'మిన్: 58, 59)*

బుద్ధి కోరే ఈ స్పష్టమయిన విషయాన్ని విస్మరించినట్లయితే ఖుర్ఆన్ ఆశ్చర్యంగా ప్రశ్నిస్తుంది.

مَثَلُ الْفَرِيْقَيْنِ كَالْاَعْمٰى وَالْاَصَمِّ
وَالْبَصِيْرِ وَالسَّمِيْعِ هَلْ يَسْتَوِيٰنِ
مَثَلًا ؕ اَفَلَا تَذَكَّرُوْنَ ○ (هود:۲۴)

ఈ ఉభయ వర్గాల ఉదాహరణ గుడ్డివాడు, చెవిటివాడు, చూసేవాడు, వినేవాడు వంటిది. ఈ ఉభయుల పరిస్థితి ఒక్కటేనా? మీరు మార్గబోధనను గ్రహించరెందుకు? *(హూద్:24)*

అతిస్పష్టమయిన ఈ యదార్థాన్ని పలుసందర్భాలలో ఎత్తి చూపడం జరిగింది. ఒక చోట ఈ పదాలు కానవస్తాయి:

اَفَمَنْ كَانَ مُؤْمِنًا كَمَنْ كَانَ فَاسِقًا لَا يَسْتَوٗنَ ○ اَمَّا الَّذِيْنَ اٰمَنُوْا وَ عَمِلُوا الصّٰلِحٰتِ فَلَهُمْ جَنّٰتُ الْمَاْوٰىؗ نُزُلًا بِمَا كَانُوْا يَعْمَلُوْنَ○ وَ اَمَّا الَّذِيْنَ فَسَقُوْا فَمَاْوٰهُمُ النَّارُؕ كُلَّمَآ اَرَادُوْٓا اَنْ يَّخْرُجُوْا مِنْهَآ اُعِيْدُوْا فِيْهَا وَ قِيْلَ لَهُمْ ذُوْقُوْا عَذَابَ النَّارِ الَّذِىْ كُنْتُمْ بِهٖ تُكَذِّبُوْنَ○ (السجدة:١٨-٢٠)

విశ్వాసి అయిన వ్యక్తి పాపాత్ముడయిన వ్యక్తిలా కాగలడా? (వాస్తవంగా) వారు సమానులు కాలేరు. ఎవరయితే విశ్వసించారో, మరెవరయితే సత్కార్యాలు చేశారో వారి కొరకు నివసించేందుకు స్వర్గాలు ప్రాప్తమవుతాయి. వారు చేస్తూ ఉన్న ఆచరణలకు ఫలితంగా ఇచ్చే ఆతిథ్యం ఇది. పోతే ఎవరయితే పాపపూర్వకమయిన వైఖరి నవలంబించారో వారి నివాసం నరకం. వారు దాన్నుండి బయట పడాలని అనుకున్నప్పుడల్లా వారిని అందులోకే తిరిగి పంపించి వేయటం జరుగుతుంది. 'ఇక చవిచూడండి నరక యాతనను, దాన్ని (లోగడ) మీరు తిరస్కరించేవారు' అని వారికి చెప్పడం జరుగుతుంది. *(అస్ సజ్దా: 18-20)*

మరో వివరణ కూడా గమనార్హమయింది. బలోపేతంగా, శక్తిమంతంగా చెప్పడం జరుగుతోంది, చెడ్డవారూ, మంచివారు, సదాచారులూ, దుర్వర్తనులు, సచ్ఛీలురూ, దుచ్ఛీలురు అందరి అంతిమ పరిణామం ఒక్కటే అయినట్లయితే, ఈ సృష్టి కర్మాగారానికి ఏ స్వామీ లేడని, ఏ పాలకుడూ లేడని, లెక్క అడిగేవాడూ లేడని, అధికారీ లేడని, దీనికి ఒక ఆశయమంటూ, ఉద్దేశమంటూ లేదని అర్థమా? ఈ కర్మాగారం ఇట్టే ఉనికిలోకి వచ్చి ఇట్టే ముగిసిపోతుందా? నిజానికి ఈ విశ్వంలోని ఒక్కొక్క వస్తువు సాక్ష్యం పలుకుతోంది, అది ఏదో ఆటగా, కాలక్షేపంగా ఉనికిలోకి రాలేదని. అది ఒక విజ్ఞుడు, వివేచనాపరుడు, అన్నీ ఎరిగిన, అన్నీ తెలిసిన శక్తి చేసిన సృష్టి. ఆయన దీన్ని ఓ ఉన్నత లక్ష్యంతో సృష్టించాడు. ఆ ఉన్నత ఆశయం రీత్యానే అది కొనసాగుతోంది. ఈ లక్ష్యం కోరే దాన్నిబట్టి న్యాయం, న్యాయ తులమానం నెలకొనడం అవసరం. ప్రతిదాన్నీ అందులో తూచి ఆచరణల నిర్ణయం జరగాలి. ఎవరి హక్కునూ కాజేయడం జరగదు, ఎవరికీ అన్యాయం జరగదు. అందరికీ న్యాయం చేకూరుతుంది.

اَمْ حَسِبَ الَّذِيْنَ اجْتَرَحُوا السَّيِّاٰتِ اَنْ نَّجْعَلَهُمْ كَالَّذِيْنَ اٰمَنُوْا وَ عَمِلُوا الصّٰلِحٰتِ ۙ سَوَآءً مَّحْيَاهُمْ وَ مَمَاتُهُمْ ؕ سَآءَ مَا يَحْكُمُوْنَ ۝ وَ خَلَقَ اللّٰهُ السَّمٰوٰتِ وَالْاَرْضَ بِالْحَقِّ وَ لِتُجْزٰى كُلُّ نَفْسٍ بِمَا كَسَبَتْ وَهُمْ لَا يُظْلَمُوْنَ ۝ (الجاثية:٢١-٢٢)

దుష్కార్యాలను ఆచరించిన ఈ జనం ఏమని అనుకుంటున్నారు, మేము వీరిని విశ్వసించి సత్కార్యాలాచరించిన వారివలే చేసివేస్తామని అనుకుంటున్నారా? వారి జనన మరణాలు అన్నీ సమానమయి పోతాయని అనుకుంటున్నారా? వారు చేసే ఈ నిర్ణయం మాచెడ్డ నిర్ణయం. పరమ ప్రభువు ఆకాశాలను, భూమినీ ధర్మ బద్ధంగా సృష్టించాడు. తద్వారా ప్రతి ప్రాణికి అది సంపాదించుకున్నదేదో దాని ప్రతి ఫలం అందజేయడానికి, వారికి ఎటు వంటి అన్యాయం జరగరాదనీను.

*(అల్ జాసియ : 21, 22)*

## పరలోకంలో ఏమవుతుంది?

పరలోకంలో మానవులంతా, ఆది నుండి అంతం వరకు అందరూ దైవం సమక్షంలో ఉంటారు. ఎవరికీ దాక్కునే ఎటువంటి స్థలమూ దొరకదు. మానవుని పూర్తి జీవితం నగ్నంగా, నిరాచ్ఛాదితంగా ముందుకు వస్తుంది. ప్రతి వ్యక్తి ఆచరణా పత్రం అతని చేతిలో ఉంటుంది. దానికనుగుణంగా అతని పట్ల శాశ్వత సద్ఫలితమో దుష్ఫలితమో నిర్ణయమవుతుంది. మనిషికి శాశ్వత స్వర్గమయినా ప్రాప్తమవుతుంది, లేదా నిత్య నరకమయినా లభిస్తుంది. ఆ సమయాన మానవుని స్థితిని గురించి ఖుర్ఆన్ ఈ విధంగా అభివర్ణిస్తుంది.

يَوْمَ تَجِدُ كُلُّ نَفْسٍ مَّا عَمِلَتْ مِنْ خَيْرٍ مُّحْضَرًا ۛ وَمَا عَمِلَتْ مِنْ سُوْٓءٍ ۛ تَوَدُّ لَوْ اَنَّ بَيْنَهَا وَ بَيْنَهٗٓ اَمَدًا ۢ بَعِيْدًا ؕ وَيُحَذِّرُكُمُ اللّٰهُ نَفْسَهٗ ؕ وَاللّٰهُ رَءُوْفٌ ۢ بِالْعِبَادِ ۝ (آل عمران:٣٠)

ఆ రోజున ప్రతి వ్యక్తి తాను ఇక్కడ చేసిన ఏ మంచి అయినా చెడు అయినా దాన్ని తన సమక్షంలో చూసుకుంటాడు. (ఈ దినం ఇలా రాకపోతే), తనకూ ఈ దినానికీ మధ్యన ఓ సుదీర్ఘ వ్యవధి అడ్డుగా వస్తే ఎంతబావుండేది అని కోరుకుంటాడు. అల్లాహ్ మిమ్మల్ని తన్ను గురించి భయ

పెడుతున్నాడు. అల్లాహ్ నిజానికి తన దాసులంటే ఎంతో దయగలవాడు.

*(ఆలి ఇమ్రాన్:30)*

ఆ రోజున విశ్వసనీయమయిన సంబంధాలుగా భావించబడే సంబంధాలన్నీ ఒక్కటొక్కటిగా తెగిపోతాయి. వీటి కొరకు, వీరి ప్రేమలో పడి మనిషి దైవాన్నే మరచి పోతాడు. తల్లీదండ్రి, భార్యా పిల్లలు, సన్నిహిత బంధుగణం వీరిలో ఏ ఒక్కరూ మరొకరికి ఉపకరించరు. ప్రతి వ్యక్తి తన స్వయం కోసమే పరితపిస్తూ ఉంటాడు. ప్రతి వ్యక్తి తన ప్రాణాలు కాపాడుకోవాలని చింతిస్తుంటాడు. ఆ రోజున అల్లాహ్ శిక్షాయాతనను చూసి ఆయనకు అవిధేయులయినవారు, తమ వద్ద ప్రపంచం, దాని సర్వధన సంపదలుంటే వాటిని సమర్పించుకుని ఈ యాతన నుండి విముక్తిని పొందేవారమని అనుకుంటారు. కాని ఈ కోరిక ఈడేరే ఏ దారీ కానరాదు.

يَوْمَ تَكُوْنُ السَّمَآءُ كَالْمُهْلِ ۙ وَ تَكُوْنُ الْجِبَالُ كَالْعِهْنِ ۙ وَلَا يَسْئَلُ حَمِيْمٌ حَمِيْمًا ۚ يُّبَصَّرُوْنَهُمْ ؕ يَوَدُّ الْمُجْرِمُ لَوْ يَفْتَدِيْ مِنْ عَذَابِ يَوْمِئِذٍ ۭبِبَنِيْهِ ۙ وَ صَاحِبَتِهٖ وَ اَخِيْهِ ۙ وَ فَصِيْلَتِهِ الَّتِيْ تُـْٔوِيْهِ ۙ وَ مَنْ فِي الْاَرْضِ جَمِيْعًا ۙ ثُمَّ يُنْجِيْهِ ۙ كَلَّا ؕ اِنَّهَا لَظٰى ۙ نَزَّاعَةً لِّلشَّوٰى ۚ

(المعارج:٨-١٦)

ఏ రోజునయితే ఆకాశం కరిగించిన రాగిలా మారిపోతుందో, కొండలు రంగు రంగుల ఉన్నీలా అయిపోయి ఎగురుతుంటాయో, ఏ మిత్రుడూ మరో మిత్రుణ్ణి పలుకరించడు. వారిని ఒకరినొకరికి చూపించడమూ జరుగుతుంది. ప్రతి వ్యక్తీ ఎదుటివాని బాధ గురించి బాగా ఎరిగే ఉంటాడు. అపరాధి ఆ రోజున ప్రాప్త మయ్యే యాతన నుండి కాపాడుకునేందుకు తన కొడుకును, తన భార్యను, తన సోదరుణ్ణి, తనకు ఆశ్రయం కల్పించిన కుటుంబాన్ని, భూలోకంలోని మానవుల నందరినీ పరిహారంగా చెల్లించి ఆ శిక్ష నుండి తప్పించుకోవాలని కోరుకుంటాడు. కాని అలా ఎంతమాత్రం సంభవం కాదు. అది భగభగ మండే నిప్పు, తోలును పూర్తిగా తొలిచి పారవేస్తుంది.

*(అల్ మఆరిజ్ : 8-16)*

ప్రళయం ఒక భయంకరమయిన ప్రేలుడుతో ప్రారంభమవుతుంది. ఈ ప్రేలుడు సంభవించినప్పుడు మనిషి బంధుత్వాలు, అనుబంధాలు, సంబంధాలను మరచిపోతాడు. ఎవరూ ఎవరికీ ఉపకరించరు మనిషి ఒంటరిగానే తన చేష్టలకు సమాధానం చెప్పుకో వలసి ఉంటుంది. పరమ ప్రభువు అల్లాహ్ తీర్పును విని కొందరు సంతుష్టులు, పరమానందభరితులు అవుతారు. వారి ముఖాలు ప్రమోదంతో మెరుస్తూ ఉంటాయి. మరికొందరు బాధ, ఆవేదన, దుఃఖ సాగరంలో మునిగిపోతారు.

فَاِذَا جَآءَتِ الصَّآخَّةُ ۝ يَوْمَ يَفِرُّ الْمَرْءُ مِنْ اَخِيْهِ ۝ وَ اُمِّهٖ وَاَبِيْهِ ۝ وَصَاحِبَتِهٖ وَ بَنِيْهِ ۝ لِكُلِّ امْرِئٍ مِّنْهُمْ يَوْمَئِذٍ شَاْنٌ يُّغْنِيْهِ ۝ وُجُوْهٌ يَّوْمَئِذٍ مُّسْفِرَةٌ ۝ ضَاحِكَةٌ مُّسْتَبْشِرَةٌ ۝ وَوُجُوْهٌ يَّوْمَئِذٍ عَلَيْهَا غَبَرَةٌ ۝ تَرْهَقُهَا قَتَرَةٌ ۝ اُولٰٓئِكَ هُمُ الْكَفَرَةُ الْفَجَرَةُ ۝ (عبس:۳۳-۴۲)

**మరి చెవులు చిల్లులుపడే ప్రేలుడు సంభవించినప్పుడు, ఆ రోజున మనిషి పలాయనమవుతాడు. తన సోదరుణ్ణుండి, తన తల్లి నుండి, తన తండ్రి నుండి, తన భార్య, సంతానం నుండి; ప్రతి మనిషి తన చింతలో తప్పిపోయి ఉంటాడు. మరో వైపున శ్రద్ధ చూపనూలేదు. ఆ రోజున కొన్ని ముఖాలు వెలుగుతూ ఉంటాయి. నవ్వులు చిందిస్తూ ఉంటాయి. సంతోషం, ఆనందభరితమయి ఉంటాయి. మరికొన్ని ముఖాలు ధూళిపట్టి ఉంటాయి, మసిబారి ఉంటాయి; వీరు దైవ తిరస్కారులు, దుర్వర్తనులయినవారు.** *(అబస్:33-42)*

## పరలోకం పరిహాస విషయం కాదు

పరలోకాన్ని నమ్మనివారు, దాన్ని తిరస్కరించడంతోపాటు దాన్ని పరిహసిస్తారు, ఎంత అవివేకులు. వారు తమ పరిణామం పట్ల ఏమరుపాటుకు లోనయి ఉన్నారు, నిశ్చింతగా గడుపుతున్నారు, నిజానికి వారి అంతం వారి వెనకాలనే వారి వెంట వస్తూనే ఉంది. పరలోకం వచ్చినప్పుడు, మనిషి తన చర్మచక్షువులతో తన జీవన ఆచరణాపత్రం, దాని ఫలితాలు చూసుకున్నప్పుడు అతను బిత్తరపోతాడు, స్పృహకోల్పోతాడు, తప్పించుకు పారిపోయే దారిని కనుగొనలేడు. రాబోయే ఆ దినాన్ని గురించి పరిహాస విషయంగా చేసుకోరాదని, గంభీరంగా, శ్రద్ధగా తమ అంతిమ పరిణామాన్ని గురించి ఆలోచించాలని ఖుర్ఆన్ హెచ్చరిస్తుంది.

يَسْئَلُ اَيَّانَ يَوْمُ الْقِيٰمَةِ ۝ فَاِذَا بَرِقَ الْبَصَرُ ۝ وَ خَسَفَ الْقَمَرُ ۝ وَ جُمِعَ الشَّمْسُ وَالْقَمَرُ ۝ يَقُوْلُ الْاِنْسَانُ يَوْمَئِذٍ اَيْنَ الْمَفَرُّ ۝ كَلَّا لَا وَزَرَ ۝ اِلٰى رَبِّكَ يَوْمَئِذِ ِالْمُسْتَقَرُّ ۝ يُنَبَّؤُ الْاِنْسَانُ يَوْمَئِذٍ بِمَا قَدَّمَ وَ اَخَّرَ ۝

(القيامة:٦-١٣)

ప్రళయ దినం ఎప్పుడు వస్తుందని మనిషి అడుగుతున్నాడు. (చెప్పు, ప్రళయం వచ్చినప్పుడు) కనుగుడ్లు తేలిపోతాయి, చంద్రుడు మసకబారిపోతాడు, సూర్యుడూ చంద్రుల (మధ్యదూరం తగ్గించి) చేరవ చేయబడతాయి. ఆ రోజున మానవుడు అంటాడు, ఎక్కడికి పారిపోను? అని. ఎంతమాత్రం కుదరదు. మరో ఆశ్రయ మేదీ లేదు, నీ ప్రభువు సన్నిధిలోనే నీకు ఆశ్రయం. ఆ రోజున మనిషికి, తాను ముందు పంపినదేదో, వెనక వదలివచ్చిన దేదో తెలుపడం జరుగుతుంది.

*(అల్ కియామ:6-13)*

## పరలోకాన్ని గురించి చింతించాలి

ఈ విశ్వంలో సంభవించబోయే మహాగొప్ప సంఘటన ఏమిటంటే మనిషి దేవుని యాతనకో, పుణ్యఫలానికో గురవనున్నాడు. మనిషి తప్పించుకునే ప్రయత్నం చేయవలసిన విషయాల్లో దేవుని యాతనకు మించిన భయంకరమయిన విషయం మరొకటి లేదు. మనిషి కాంక్షించే విషయాలలో దేవుని పుణ్యఫలానికి మించిన మరో వరప్రసాదమూ ఏదీ లేదు. దివ్యఖుర్ఆన్ మాటిమాటికీ ఈ పరిణామాన్ని గురించే మనిషికి తెలుపుతూ ఉంటుంది.

رَفِيْعُ الدَّرَجٰتِ ذُو الْعَرْشِ ۚ يُلْقِى الرُّوْحَ مِنْ اَمْرِهٖ عَلٰى مَنْ يَّشَآءُ مِنْ عِبَادِهٖ لِيُنْذِرَ يَوْمَ التَّلَاقِ ۝ يَوْمَ هُمْ بَارِزُوْنَ ۚ لَا يَخْفٰى عَلَى اللّٰهِ مِنْهُمْ شَىْءٌ ؕ لِمَنِ الْمُلْكُ الْيَوْمَ ؕ لِلّٰهِ

ఆయన మహోన్నత స్థానాలు గలవాడు, విశ్వపాలనా ఆసనానికి స్వామి. తన దాసులలో తాను కోరిన వారికి వహీని అవతరింపజేస్తాడు. తద్వారా కలసుకునే దినం (ప్రళయం) గురించి భయపెట్టాలని. ఏ రోజునయితే వారు దైవసన్నిధిలో ఉంటారో ఆ రోజున వారికి సంబంధించిన

الْوَاحِدِ الْقَهَّارِ ○ اَلْيَوْمَ تُجْزٰى كُلُّ نَفْسٍ بِمَا كَسَبَتْ ؕ لَا ظُلْمَ الْيَوْمَ ؕ اِنَّ اللّٰهَ سَرِيْعُ الْحِسَابِ ○ وَ اَنْذِرْهُمْ يَوْمَ الْاٰزِفَةِ اِذِ الْقُلُوْبُ لَدَى الْحَنَاجِرِ كٰظِمِيْنَ ؕ مَا لِلظّٰلِمِيْنَ مِنْ حَمِيْمٍ وَّلَا شَفِيْعٍ يُّطَاعُ ○

(المؤمن:۱۵-۱۸)

ఏ విషయమూ దైవానికి మరుగయి ఉండదు. (ప్రశ్నించబడుతుంది) ఈ రోజున అధికారం ప్రభుత ఎవరికి చెందింది అని. (అన్ని వైపుల నుండి సమాధానం వస్తుంది) ప్రభుత అల్లాహ్‌కే చెందినది. ఆయన ఒక్కడే, అన్నింటిపైనా ఆధికృత గలవాడు. నేడు ప్రతి వ్యక్తికి అతను సంపాదించుకున్న దానికి ప్రతిఫలాన్ని ఇవ్వడం జరుగుతుంది. నేడు ఎవరికీ అన్యాయం చేయడం జరగదు. నిస్సంకోచంగా అల్లాహ్ అతిత్వరలోనే లెక్కచూడనున్నాడు. అది చేరువయి వచ్చేసిన దినం గురించి వారికి భయపెట్టు. ఆనాడు గుండెలు గొంతుకలోకి వచ్చేస్తాయి. బాధను లోలోనే దిగమ్రింగుకుంటూ ఉంటారు. దుర్మార్గులకు మిత్రుడూ ఉండడు, మాట పట్టించుకోదగిన సిఫారసు చేసే వాడూ ఉండడు.

*(అల్ మూ'మిన్:15-18)*

లుక్మాన్ సూరాలో ఈ పరిణామాన్ని ఇలా తెలుపడం జరిగింది:

يٰاَيُّهَا النَّاسُ اتَّقُوْا رَبَّكُمْ وَاخْشَوْا يَوْمًا لَّا يَجْزِىْ وَالِدٌ عَنْ وَّلَدِهٖ ۚ وَلَا مَوْلُوْدٌ هُوَ جَازٍ عَنْ وَّالِدِهٖ شَيْـًٔا ؕ اِنَّ وَعْدَ اللّٰهِ حَقٌّ فَلَا تَغُرَّنَّكُمُ الْحَيٰوةُ الدُّنْيَا ٞ وَلَا يَغُرَّنَّكُمْ بِاللّٰهِ الْغَرُوْرُ ○

(لقمان:۳۳)

జనులారా, మీ ప్రభువు పట్ల నిష్ఠాభావాన్ని కలిగి మెలగండి. ఆ దినానికి భయపడండి, అప్పుడు ఏ తండ్రీ తన తనయునికి ఉపకరించడు, ఏ సంతానమూ తన తండ్రికి ఉపకరించదు. నిస్సంకోచంగా అల్లాహ్ వాగ్దానం తిరుగులేనిది. కాగా, ప్రపంచ జీవితమూ మిమ్మల్ని మోసపుచ్చరాదు, దైవం గురించి

మహా మోసగాడు షైతాన్ కూడా మిమ్మల్ని
మోసపుచ్చరాదు. *(లుక్మాన్ : 33)*

నబా సూరాలో ఇలా సెలవీయబడింది:

ذٰلِکَ الْیَوْمُ الْحَقُّ فَمَنْ شَآءَ
اتَّخَذَ اِلٰی رَبِّہٖ مَاٰبًا اِنَّا اَنْذَرْنٰکُمْ
عَذَابًا قَرِیْبًا یَوْمَ یَنْظُرُ الْمَرْءُ مَا
قَدَّمَتْ یَدٰہُ وَ یَقُوْلُ الْکٰفِرُ یٰلَیْتَنِیْ
کُنْتُ تُرٰبًا (النبا:٣٩،٤٠)

ఆ దినం రావడం తథ్యం. కాగా ఏ వ్యక్తి అయినా సరే తన ప్రభువు సన్నిధిలో తన నివాసం ఏర్పరచుకోవాలి. మేము మిమ్మల్ని ఆ శిక్షాయాతనను గురించి హెచ్చరించాము. అది అతి సమీపానే వచ్చేసింది. ఆ రోజున మనిషి, తన చేతులు ముస్ముందుగా ఏమేమి పంపావో చూసుకుంటాడు. ఆ రోజున తిరస్కారి ఇలా విలపిస్తాడు, 'అయ్యో, నా పాడు గాను, నేను మట్టినయిపోతే ఎంత బావుం డేది?" *(అన్ నబా : 39,40)*

## ప్రపంచం నశ్వరమయింది, పరలోకం శాశ్వతమయింది

ఈ ప్రపంచం నశ్వరమయింది. ఇక్కడ ఏ వస్తువూ శాశ్వతమయింది కాదు. ఏ జీవి పుడుతుందో అది అరువు బతుకును తీసుకువస్తుంది. ఒక రోజున వినాశ రూపు ధరిస్తుంది. ఇక్కడ జీవితమూ, యవ్వనమూ, సుఖమూ, సంతోషమూ, కష్టమూ, దుఃఖమూ అన్నీ తాత్కాలికమయినవే. కాని మరో ప్రపంచం ఉంది, అది అనశ్వరమయినది. అనంతానంత కాలాల వరకు ఉంటుంది, ఎన్నడూ ముగియదు. అక్కడ మానవునికి శాశ్వత జీవనం ప్రాప్తమవుతుంది. అక్కడ మృత్యువంటే ఏమో తెలియని జీవితం ఉంటుంది. అక్కడి వరప్రసాదాలు, సుఖాలు, కష్టాలు, ఇబ్బందులు అన్నీ శాశ్వత మయినవి. అక్కడ మనిషికి ప్రాప్తమయినది ఏదైనా తిరిగి దూరమయ్యే ప్రమాదముండదు. ఒకటి దూరమయిన తరువాత అది ప్రాప్తమయ్యే అవకాశముండదు. అక్కడ నెమ్మది, ప్రశాంతత, సుఖం, సౌలభ్యాలు కూడా ఎల్లకాలాలకు ప్రాప్తమవుతాయి, బాధలు, ఆవేదనలు, వ్యధలు, దుఃఖం, యాతన, సంతాపం, విచారం కూడా ఎన్నడూ అంతం కావు.

దీన్నే పరలోకం అని అంటారు. పరలోకంలో మనిషికి స్వర్గమయినా ప్రాప్తమవు తుంది లేదా నరకమయినా ప్రాప్తమవుతుంది. స్వర్గం శాశ్వత వరప్రసాదాల గృహం.

నరకం శాశ్వత యాతనలు, శిక్షకు కేంద్రం. స్వర్గం దేవుని సదాచారులయిన, విధేయులయిన దాసులకు ప్రాప్తమవుతుంది, నరకం దేవుని అవిధేయులు, దైవధిక్కారుల నివాసం. మానవ ప్రకృతిలో స్వర్గవాంఛ నిబిడీకృతమయి ఉంది. అతను దుఃఖం, ఆవేదన, బాధలులేని ప్రపంచాన్ని, అక్కడ అనంతమయిన వరప్రసాదాలను కోరుకుంటాడు. అక్కడ తాను సదా విలాసమయ సుఖమయ జీవితం గడపగలగాలని కోరుకుంటాడు. కాని విచారకరమయిన విషయం ఏమిటంటే అతను ఇహలోకపు ఆకర్షణలో మైమరచి తన ప్రకృతి కోరే ఈ కోరికని విస్మరిస్తాడు. పరలోకం ఎన్నటికీ రాదన్నట్టుగానే జీవితాన్ని గడుపుతాడు. తన్ను లెక్క అడగటం జరగదని, తాను స్వర్గనరకాలను ఎదుర్కోబోవడం లేదన్నట్టుగానే గడుపుతాడు. పరలోకం వైపునకు అతన్ని ఆకర్షింపజేసినా, దాని విషయంలో ఆధారాలు, నిదర్శనాలు చూపెట్టినా అప్పటికీ అతని నిరాకరణ స్వీకారం వైపునకు, అతని అనిశ్చితత నిశ్చితత వైపునకు మారదు.

وَ اِذَا قِيۡلَ اِنَّ وَعۡدَ اللّٰهِ حَقٌّ وَّالسَّاعَةُ لَا رَيۡبَ فِيۡهَا قُلۡتُمۡ مَّا نَدۡرِىۡ مَا السَّاعَةُ ۙ اِنۡ نَّظُنُّ اِلَّا ظَنًّا وَّمَا نَحۡنُ بِمُسۡتَيۡقِنِيۡنَ ۝ (الجاثیہ:۳۲)

**అల్లాహ్ వాగ్దానం తిరుగులేనిదని చెప్పబడినప్పుడు, ప్రళయం రాకలో ఎటువంటి అనుమానంలేదని ప్రకటించినప్పుడు మీరు సమాధానంగా, ప్రళయం అంటే ఏమిటో మాకు తెలియదని, దాని విషయంలో కేవలం ఒక ఊహగా మాత్రమే మాకు తెలుసు అనీ, మేము దాన్ని నమ్మమనీ మీరన్నారు.** ***(అల్ జాసియ: 32)***

పరలోకం పట్ల నమ్మకం లేనివారు ప్రపంచ కలుషితాలను, మురికి మాలిన్యాలను పూసుకు జీవిస్తుంటారు. వారు ఇక్కడి సుఖమే నిజమయిన సుఖమన్న తృప్తితో సంతుష్టులయి ఉంటారు. వారు ప్రపంచమే ప్రథమం, ప్రపంచమే అంతిమం అనీ అనుకుంటారు. దీని తరువాత మరో జీవితం లేదని, దాని కొరకు పరితపించవలసిన అవసరమూ లేదని భావిస్తూ ఉంటారు. మళ్ళీ ఈ ప్రపంచం ఎలాగూ లేదు, ఆస్వాదించుకోవలసింది అంతా ఇప్పుడే జుర్రుకోవాలి అని జీవిస్తూ ఉంటారు. ఇటువంటి మనస్తత్వాన్నే ఈ వచనంలో పేర్కొనడం జరిగింది.

وَمَاۤ اَظُنُّ السَّاعَةَ قَآئِمَةً وَّلَئِنۡ رُّدِدۡتُّ اِلٰى رَبِّىۡ لَاَجِدَنَّ خَيۡرًا مِّنۡهَا

**నేను ప్రళయం వస్తుందని అనుకోవడం లేదు. ఒకవేళ నేను నా ప్రభువు వైపునకు తిరిగి పంపించబడినా నాకు ఇంతకన్నా**

مُنۡقَلَبًا۝ (الكهف:٣٦) ఉత్తమమయిన స్థానమే ప్రాప్తమవుతుంది. *(అల్ కహ్ఫ్: 36)*

## ప్రపంచం మనస్సును ఆక్రమించుకుంటే...

ప్రపంచం మనస్సును ఆలోచనల్ని ఆక్రమించుకున్నప్పుడు, మనిషి దాని రంగుల వలయంలో చిక్కుకున్నప్పుడు, పరలోకం పట్ల ఏమరుపాటుకు గురయినప్పుడు మనిషి కడకు ప్రపంచ దాసుడయిపోతాడు, తన పరలోకాన్ని పూర్తిగా సర్వనాశనం చేసుకుంటాడు.

اِنَّ الَّذِيۡنَ لَا يُؤۡمِنُوۡنَ بِالۡاٰخِرَةِ زَيَّنَّا لَهُمۡ اَعۡمَالَهُمۡ فَهُمۡ يَعۡمَهُوۡنَ۝ اُولٰٓئِكَ الَّذِيۡنَ لَهُمۡ سُوۡٓءُ الۡعَذَابِ وَهُمۡ فِى الۡاٰخِرَةِ هُمُ الۡاَخۡسَرُوۡنَ۝ (النمل:٤،٥)

నిస్సందేహంగా ఎవరయితే పరలోకాన్ని విశ్వసించరో వారి కొరకు మేము వారి చేష్టలనే శోభాయమానంగా తీర్చిదిద్దాము. కాగా వారు తచ్చాడుతూ తిరుగుతున్నారు. వీరి కొరకే మాచెడ్డ యాతన నిరీక్షిస్తోంది. వారు పరలోకంలో మహా నష్టాన్ని పొందనున్నారు. *(అన్ నమ్ల్ : 4,5)*

ఎవరికయితే ప్రపంచమే లక్ష్యమయిపోతుందో వారు దాని తరువాత ఆలోచించరు, ఆలోచించగోరరు. వారు ప్రపంచం కొరకే జీవిస్తారు, ప్రపంచం కొరకే మరణిస్తారు. వారికి దైవం, పరలోకం అన్నవి, సమయం వెచ్చించవలసిన విషయాలు కావు. వీటి ఆధారంగా జరిగే జీవన నిర్మాణాన్ని వారు ఆలోచించనూలేరు.

పరలోకాన్ని విస్మరించిన వ్యక్తి సమక్షంలో దైవధర్మం వచ్చినా తను దాని పట్ల కళ్ళు మూసుకుని ఏమీ పట్టనట్టుగా దాటిపోతాడు. అది తనకు అసలు సంబోధించనే లేదని అనుకుంటాడు. అతను అది అందజేసే నిదర్శనాల పట్ల అలక్ష్యం చూపుతాడు. వాటిని తన శ్రద్ధాసక్తులకు అర్హమయినవిగా భావించడు. అతను దైవధర్మాన్ని నిరాకరించడమే కాదు, దాని దారిలో పెద్ద బండరాయిలా రూపొందుతాడు.

وَ وَيۡلٌ لِّلۡكٰفِرِيۡنَ مِنۡ عَذَابٍ شَدِيۡدِ۝ۙ الَّذِيۡنَ يَسۡتَحِبُّوۡنَ الۡحَيٰوةَ الدُّنۡيَا عَلَى الۡاٰخِرَةِ وَيَصُدُّوۡنَ عَنۡ

తిరస్కరించే వారికి కఠినమయిన శిక్ష లభించనుంది. వీరు పరలోకానికి ప్రతిగా ప్రపంచ జీవితాన్ని ఇష్టపడతారు. దైవ మార్గంలో ఇతరుల్ని అడ్డుకుంటారు.

سَبِيْلِ اللّٰـهِ وَ يَبْغُـوْنَهَا عِوَجًـا اُولٰٓئِكَ فِيْ ضَلٰلٍ ۢ بَعِيْدٍ ۝ (ابراہیم:۲،۳)

అందులో వక్రత సృష్టించగోరుతారు. వీరు అపమార్గాన బహుదూరాలకు వెళ్ళి పోయారు. *(ఇబ్రాహీమ్ : 2,3)*

ఎవరయితే ప్రపంచ జీవితంలో నిమగ్నులయి ధర్మాన్ని పరిహాసంగా భావిస్తారో వారిని ఉపేక్షించాలన్నది దైవాదేశం. కాని ప్రళయం ఎట్టి పరిస్థితిలోనూ దాని భయంకర రూపంలో రానున్నదన్న సత్యాన్ని మటుకు వారికి విశదపరుస్తూ ఉండాలి. ప్రపంచ వ్యామోహంలో పడిపోయిన జనులకు అది చాలా చెడ్డ సమయమని, అప్పుడు వారి మోక్షానికి మరో మార్గమేదీ ఉండదనీ వారికి వివరంగా తెలుపుతూ ఉండాలి.

وَ ذَرِ الَّذِيْنَ اتَّخَذُوْا دِيْنَهُمْ لَعِبًا وَّ لَهْوًا وَّ غَرَّتْهُـمُ الْحَيٰوةُ الدُّنْيَـا وَ ذَكِّـرْ بِـهٖٓ اَنْ تُبْسَلَ نَفْسٌۢ بِمَـا كَسَبَتْ ۖ لَيْسَ لَهَـا مِنْ دُوْنِ اللّٰـهِ وَلِيٌّ وَّلَا شَفِيْعٌ ۚ وَ اِنْ تَعْـدِلْ كُلَّ عَـدْلٍ لَّا يُؤْخَـذْ مِنْهَـا ؕ اُولٰٓئِكَ الَّـذِيْنَ اُبْسِلُـوْا بِمَـا كَسَبُوْا ۚ لَهُـمْ شَرَابٌ مِّنْ حَمِيْـمٍ وَّ عَذَابٌ اَلِيْمٌۢ بِمَا كَانُوْا يَكْفُرُوْنَ ۝ (الانعام:۷۰)

తమ ధర్మాన్ని ఆటవస్తువుగా కాలక్షేపంగా చేసుకున్న వారిని వదలిపెట్టండి. వారిని ప్రపంచ జీవితం మోసంలో పడవేసింది. వారికి ఈ ఖుర్ఆన్ ద్వారా సద్బోధ చేస్తూ ఉండండి. ఏ ప్రాణీ తన చేష్టల కారణంగా వినాశానికి గురికాకుండా ఉండాలి. నిజానికి అల్లాహ్ తప్ప దానికి సమర్థకులు లేరు మరే సహాయకులూ లేరు, ఇంకా సిఫారసు చేసేవారూ లేరు. అది పూర్తి పరిహారం ఇచ్చినా తీసుకోబడదు. వీరు, తమ చేష్టల మూలంగా వినాశానికి లోనయినవారు. వీరు త్రాగేందుకు వేడి నీరు ఉంటుంది, వీరు చేస్తూ ఉన్న తిరస్కారానికిగాను వ్యధాభరితమయిన శిక్ష వీరికి పడుతుంది. *(అల్ అన్ఆమ్ : 70)*

## దైవవిశ్వాసం, పరలోక విశ్వాసాల సంబంధం

దైవవిశ్వాసం, పరలోక విశ్వాసాల మధ్య ప్రగాఢ సంబంధం ఉంది. దైవవిశ్వాసం ద్వారానే పరలోక విశ్వాసం ఉత్పన్నమవుతుంది. పరలోక విశ్వాసం దైవవిశ్వాసం వైపునకు తీసుకుపోతుంది. దివ్యఖుర్ఆన్‌లో ఈ వాస్తవికతను చాలా వివరంగా బోధపరచడం

జరిగింది. పరలోకం పట్ల నమ్మకం లేకపోతే దైవం పట్ల, దైవధర్మం పట్ల నమ్మకానికి కూడా మనసులో చోటు ఏర్పడదు. మనిషి గర్వం, అహంకారాల వైఖరినవలంబిస్తాడు. ఒక చోట ఇలా సెలవీయబడింది:

اِلٰهُكُمْ اِلٰـهٌ وَّاحِدٌ ۚ فَالَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِالْاٰخِرَةِ قُلُوْبُهُمْ مُّنْكِرَةٌ وَّهُمْ مُّسْتَكْبِرُوْنَ ۝ لَا جَرَمَ اَنَّ اللّٰهَ يَعْلَمُ مَا يُسِرُّوْنَ وَ مَا يُعْلِنُوْنَ ؕ اِنَّهٗ لَا يُحِبُّ الْمُسْتَكْبِرِيْنَ ۝ وَ اِذَا قِيْلَ لَهُمْ مَّاذَاۤ اَنْزَلَ رَبُّكُمْ ۙ قَالُوْۤا اَسَاطِيْرُ الْاَوَّلِيْنَ ۝ لِيَحْمِلُوْۤا اَوْزَارَهُمْ كَامِلَةً يَّوْمَ الْقِيٰمَةِ ۙ وَ مِنْ اَوْزَارِ الَّذِيْنَ يُضِلُّوْنَهُمْ بِغَيْرِ عِلْمٍ ؕ اَلَا سَآءَ مَا يَزِرُوْنَ ۝ (النحل:٢٢-٢٥)

మీ ఆరాధ్యుడు ఒక్కడే ఆరాధ్యుడు. ఎవరయితే పరలోకాన్ని విశ్వసించరో వారి హృదయాలు ఆయన్ని తిరస్కరిస్తాయి. వారు అహంకారానికి లోనయ్యారు. వారు దాచేదేదో, వారు వ్యక్తపరిచేదేదో అల్లాహ్‌కు బాగా తెలుసునన్న విషయం ఖచ్చితమయినది. నిస్సందేహంగా ఆయన అహంకారులను ఇష్టపడడు. మీ ప్రభువు అవతరింపజేసినదేమిటి అని వారినడిగినప్పుడల్లా వారు, అవన్నీ పూర్వకాలపు ప్రాచీన జనుల గాథలు అని అంటారు. దీని ఫలితంగా వారు తమ పాపాల మూటను పూర్తిగా మోస్తున్నారు. దానితో పాటు తమ వైఖరి వల్ల తమకు తెలియకుండానే వారు ఎవరిని దారి తప్పిస్తున్నారో వారి భారాన్ని మోస్తున్నారు. వీరు మోసేది మాపెద్ద భారం.

*(అన్ నహ్ల్ : 22-25)*

దివ్యఖుర్‌ఆన్ ద్వారా ఆలోచన, ఆచరణల అంధకారాలు పటాపంచలయిపోతాయి. కాని పరలోక విశ్వాసమే లేకపోతే మనోదర్పణంలో మెరుగురాదు, దివ్యఖుర్‌ఆన్ దాని మీద ప్రతిఫలించదు. ఈ విషయాన్ని ఎంత ప్రభావవంతంగా సెలవీయబడిందో గమనించండి.

وَ اِذَا قَـرَاْتَ الْقُـرْاٰنَ جَعَلْنَا بَيْنَكَ وَ بَيْنَ الَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِالْاٰخِرَةِ

మీరు ఖుర్‌ఆన్ పారాయణం చేసేటప్పుడు, మేము మీకూ పరలోకాన్ని నమ్మని వ్యక్తులకూ మధ్యన కానరాని తెరను ఒక

حِجَابًا مَّسْتُوْرًا ۝ وَ جَعَلْنَا عَلٰى قُلُوْبِهِمْ اَكِنَّةً اَنْ يَّفْقَهُوْهُ وَ فِيْٓ اٰذَانِهِمْ وَقْرًا ؕ وَ اِذَا ذَكَرْتَ رَبَّكَ فِى الْقُرْاٰنِ وَحْدَهٗ وَلَّوْا عَلٰٓى اَدْبَارِهِمْ نُفُوْرًا ۝ (بنی اسرائیل:۴۵،۴۶)

దాన్ని అడ్డుగా నిలుపుతాము. మేము వారి హృదయాల పైన తెరలు కప్పివేస్తాము, వారు దాన్ని అర్థం చేసుకోలేరు. వారి చెవుల్లో భారమయిన మూతలు పడ వేస్తాము. మీరు ఖుర్‌ఆన్‌లో ఒక్కగానొక్కడే అయిన మీ ప్రభువు ప్రస్తావన తెచ్చినప్పుడు వీరు విద్వేషంతో వెనుదిరిగి వెళ్ళిపోతారు. *(బనీ ఇస్రాయీల్ : 45,46)*

ఇదే విషయాన్ని మరో చోట ఇలా చెప్పడం జరిగింది:

وَ اِنَّكَ لَتَدْعُوْهُمْ اِلٰى صِرَاطٍ مُّسْتَقِيْمٍ ۝ وَ اِنَّ الَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِالْاٰخِرَةِ عَنِ الصِّرَاطِ لَنَاكِبُوْنَ ۝ (المؤمنون:۷۳،۷۴)

నిస్సందేహంగా మీరు వీరిని రుజుమార్గం వైపునకు పిలుపునిస్తున్నారు. మరెవరయితే పరలోకాన్ని విశ్వసించరో వారు రుజు మార్గానికి విముఖులయి ఉన్నారు. *(అల్ మూ'మినూన్ : 73,74)*

ఏ వ్యక్తికి, తాను పరమ ప్రభువు అల్లాహ్‌కు దాసుడు అనే స్పృహే లేదో, మరణానంతరం అల్లాహ్ సమక్షంలో జవాబు చెప్పుకోవలసి ఉందని నమ్మకం లేదో అతను ఈ ధర్మం ఆవశ్యకతను గుర్తించడు. కాని మనిషి పరలోకం వస్తుందని నమ్మినట్లయితే, అది వచ్చినప్పుడు అల్లాహ్ విధేయులయినవారు ఆయన బహుమానాలకు అర్హులవుతారు, ఆయనకు అవిధేయులయినవారు అత్యంత హీనమయిన శిక్షకు పాత్రులవుతారు అని నమ్మే మాటయితే దైవధర్మాన్ని తిరస్కరించే సాహసం చేయలేడు. దైవధర్మం లేకుండా అతను అనునిత్యం తన్ను తాను దైవశిక్షకు గురి అయ్యే ప్రమాదానికిలోనయి ఉన్నట్లు గమనిస్తాడు. ఈ కారణంగానే ఖుర్‌ఆన్ అంటుంది.

وَالَّذِيْنَ يُؤْمِنُوْنَ بِالْاٰخِرَةِ يُؤْمِنُوْنَ بِهٖ ... (الانعام:۹۲)

ఎవరయితే పరలోకాన్ని విశ్వసిస్తారో వారు ఈ గ్రంథాన్ని నమ్ముతారు. *(అల్ అన్‌ఆమ్: 92)*

పరలోక విశ్వాసం ద్వారానే దైవవిధేయతకు ఆయన ఆజ్ఞోల్లంఘన, అవిధేయతల నుండి కాపాడుకునేందుకు ఆంతర్యంలో సంకల్పం ఏర్పడుతుంది. జీవన మార్గంలో ఏ అడుగులేసేటప్పుడయినా మనిషి ముందుగా ఆలోచించుకునేందుకు బద్ధుడయిపోతాడు.

రేపు ప్రళయ దినాన దైవం దీన్ని గురించి నన్ను తప్పక అడగనున్నాడని తలపోస్తాడు. నేను తప్పు దిశలో సాగితే ఆయన పట్టు నుండి నన్ను ఏదీ తప్పించజాలదు. దేవుని సదాచారులయిన దాసులు ప్రళయ దినాన సౌభాగ్యాలు నిండిన స్వర్గాలలో ఉన్నప్పుడు, తమ ఉత్తమ కార్యాలకు ప్రతిఫలాన్ని ఆస్వాదిస్తున్నప్పుడు, వారు తమలో తాము ఆలోచించుకుంటారు, మాటలాడుకుంటారు, పరమ ప్రభువు మనకు ఈ శుభవరాలనివ్వ డానికి కారణం మనం ప్రపంచంలో ఈ దినం గురించి భయపడుతూ గడిపాము, మేము దైవ అవిధేయతను తప్పించుకుంటూ జీవించాము.

وَ اَقْبَلَ بَعْضُهُمْ عَلٰى بَعْضٍ يَّتَسَآءَلُوْنَ ۝ قَالُوْٓا اِنَّا كُنَّا قَبْلُ فِيْٓ اَهْلِنَا مُشْفِقِيْنَ ۝ فَمَنَّ اللّٰهُ عَلَيْنَا وَ وَقٰنَا عَذَابَ السَّمُوْمِ ۝ اِنَّا كُنَّا مِنْ قَبْلُ نَدْعُوْهُ ؕ اِنَّهٗ هُوَ الْبَرُّ الرَّحِيْمُ ۝
(الطور:٢٥-٢٨)

వారు ఒకరినొకరు సంబోధించుకుని విచారించుకుంటారు. అప్పుడు అంటారు, మనం నిస్సంకోచంగా దీనికి పూర్వం (ప్రపంచంలో) మన భార్యాపిల్లలతో పాటు (పరలోక శిక్ష) పట్ల భయపడుతూ గడిపే వారము. కాగా అల్లాహ్ మనకు ఎంతో మేలు చేశాడు. మనల్ని నరకాగ్ని యాతన నుండి కాపాడాడు. మనం ఇతఃపూర్వం ప్రపంచంలో ఆయనకు మొరపెట్టుకునే వారము. నిస్సంకోచంగా ఆయన మహా మహోపకారి. *(అత్‌తూర్:25-28)*

స్వర్గవాసుల మరో సంభాషణ వినండి. వారి ఆనందం ఏ స్థాయిలో ఉంటుందో గమనించండి.

فَاَمَّا مَنْ اُوْتِيَ كِتٰبَهٗ بِيَمِيْنِهٖ فَيَقُوْلُ هَآؤُمُ اقْرَءُوْا كِتٰبِيَهْ ۝ اِنِّيْ ظَنَنْتُ اَنِّيْ مُلٰقٍ حِسَابِيَهْ ۝ فَهُوَ فِيْ عِيْشَةٍ رَّاضِيَةٍ ۝ فِيْ جَنَّةٍ عَالِيَةٍ ۝ قُطُوْفُهَا

ఏ వ్యక్తికయితే అతని ఆచరణా పత్రం కుడి చేతికి అందజేయబడుతుందో అతనంటాడు, ఇదో చదవండి, నా ఆచరణా పత్రం. నాకు ముందే గట్టి నమ్మకం, నా లెక్క చూడటం తథ్యమని, నేను దీన్ని ఎదుర్కోవలసి ఉంటుందనీను. అతను తనకు ఇష్టమయిన సుఖవిలాసాన్ని అనుభవిస్తూ ఉంటాడు, ఉన్నత స్వర్గ వనంలో

دَانِيَةٌ ۝ كُلُوْا وَاشْرَبُوْا هَنِيْٓـًٔا بِمَآ اَسْلَفْتُمْ فِى الْاَيَّامِ الْخَالِيَةِ ۝

(الحاقة: ١٩-٢٤)

ఉంటాడు.దాని ఫలాలు అతనికి చేరువయి ఉంటాయి. (అతనికి చెప్పబడుతుంది), మీరు వెనుకటి రోజులలో చేసిన ఆచరణల ఫలితంగా, హాయిగా ఆనందంగా తినండి, త్రాగండి.

*(అల్ హాక్క : 19-24)*

## జీవితంపైన పరలోక విశ్వాస ప్రభావం

దివ్యఖుర్ఆన్‌లో దేవుని సదాచారులయిన దాసుల చరిత్రలోని ప్రకాశమానమయిన కోణాలను ప్రస్తావించబడినప్పుడు, వారి పరలోక భీతిని సయితం పేర్కొనడం జరుగుతుంది. పరలోకంలో జవాబు చెప్పుకోవలసి ఉంటుందన్న భావన వారిని ఆవహించి ఉంటుంది. వారు అనుక్షణం దాని పట్ల కంపిస్తూ భయపడుతూ ఉంటారు. దీని ఫలంగా వారి జీవితంలో వచ్చే ధార్మిక, నైతిక విప్లవం, వారి శీలస్వభావాలలో వచ్చే ప్రఫుల్లతను సయితం వెల్లడిస్తుంది దివ్యఖుర్ఆన్. ఒక చోట ఇలా సెలవీయడం జరిగింది.

اِنَّ الَّذِيْنَ هُمْ مِّنْ خَشْيَةِ رَبِّهِمْ مُّشْفِقُوْنَ ۝ وَالَّذِيْنَ هُمْ بِاٰيٰتِ رَبِّهِمْ يُؤْمِنُوْنَ ۝ وَالَّذِيْنَ هُمْ بِرَبِّهِمْ لَا يُشْرِكُوْنَ ۝ وَالَّذِيْنَ يُؤْتُوْنَ مَآ اٰتَوْا وَّقُلُوْبُهُمْ وَجِلَةٌ اَنَّهُمْ اِلٰى رَبِّهِمْ رٰجِعُوْنَ ۝ اُولٰٓئِكَ يُسٰرِعُوْنَ فِى الْخَيْرٰتِ وَهُمْ لَهَا سٰبِقُوْنَ ۝

(المومنون: ٥٧-٦١)

నిస్సందేహంగా, ఎవరయితే తమ ప్రభువు భయంచేత వినమ్రులయి ఉంటారో, మరెవరయితే తమ ప్రభువు వచనాలను విశ్వసిస్తారో, మరెవరయితే తమ ప్రభువుతో పాటు ఎవరినీ సహవర్తులుగా భావించరో, తాము (అవసరార్థులకు) ఇచ్చేదేదో ఇస్తారో- వారి హృదయాలు వణుకుతూ ఉంటాయి, తాము తిరిగి తమ ప్రభువు సన్నిధికి వెళ్ళవలసి ఉందని. వీరే సత్కార్యాల మార్గాన పరుగిడి పోయేవారు, వాటిని అందరికన్నా ముందుగా చేరుకునేవారు.

*(అల్ మూ'మినూన్ : 57-61)*

మరో చోట ఇలా సెలవీయడం జరిగింది.

وَالَّذِيْنَ يُصَدِّقُوْنَ بِيَوْمِ الدِّيْنِ ۝ وَالَّذِيْنَ هُمْ مِّنْ عَذَابِ رَبِّهِمْ مُّشْفِقُوْنَ ۝ اِنَّ عَذَابَ رَبِّهِمْ غَيْرُ مَأْمُوْنٍ ۝ (المعارج:٢٦-٢٨)

(వారు) పరలోక దినాన్ని విశ్వసించేవారు, తమ ప్రభువు శిక్ష పట్ల భయపడేవారు. నిస్సందేహంగా ప్రభువు శిక్ష పట్ల ఎవ్వరూ నిర్భయులయి మెలగరాదు.

*(అల్ మఆరిజ్ : 26–28)*

ఇదే విషయాన్ని తెలిపే మరో వచనం

...رِجَالٌ لَّا تُلْهِيْهِمْ تِجَارَةٌ وَّلَا بَيْعٌ عَنْ ذِكْرِ اللّٰهِ وَ اِقَامِ الصَّلٰوةِ وَ اِيْتَآءِ الزَّكٰوةِ ۙ يَخَافُوْنَ يَوْمًا تَتَقَلَّبُ فِيْهِ الْقُلُوْبُ وَالْاَبْصَارُ ۝ (النور:٣٠)

(దైవగృహాలలో) ఉన్న వారిలో ఇలాంటి వారూ ఉన్నారు, వారికి ఏ వ్యాపారా లయినా ఎటువంటి లావాదేవీలయినా అల్లాహ్ సంస్మరణ నుండి, నమాజ్ సంస్థాపన నుండి, జకాత్ చెల్లింపు నుండి అలక్ష్యానికి గురిచెయ్యవు. వారు భయపడుతూ ఉంటారు. ఆ రోజున గుండెలు, కళ్ళూ మరలి తేలిపోయితాయి.

*(అన్ నూర్ : 30)*

## ప్రపంచం ఆశయమయిపోరాదు

ఇస్లామ్ సన్యాసాన్ని బోధించలేదు. అది వైరాగ్యానికి కడువిరుద్ధం. (అల్ హదీద్ : 27). అయితే ప్రపంచాన్నే తమ జీవన లక్ష్యం చేసుకోవడాన్ని అది వారిస్తుంది. జీవితం దానికే అంకితమవడాన్ని అది కాదంటుంది. పరలోకాన్ని విస్మరించడాన్ని అది నిరసిస్తుంది. దాని ప్రకారం ప్రపంచ జీవితాన్ని పరలోక సాఫల్యం కొరకు వినియోగించాలని అది కోరు తుంది. ప్రపంచంలోని ప్రతి వస్తువూ నశ్వరమయినదన్న భావనతో జీవితం గడపాలని ఆభిలషిస్తుంది. ప్రపంచం కొరకు అనంతమయిన అనశ్వరమయిన పరలోకాన్ని వదలు కోవడం జరగరాదు. అలా జరిగినట్లయితే అది మహానష్టానికి గురిచేసే బేరంగా పరిణ మిస్తుంది.

وَمَآ اُوْتِيْتُمْ مِّنْ شَيْءٍ فَمَتَاعُ الْحَيٰوةِ الدُّنْيَا وَ زِيْنَتُهَا ۚ وَ مَا عِنْدَ اللّٰهِ

ఏదయితే మీకు ఇవ్వబడిందో అది ప్రపంచ జీవితపు సామగ్రి, దాని శోభ, అలంకారం. మరేదైతే అల్లాహ్ వద్దనున్నదో అది దానికన్నా ఎంతో ఉత్తమయినది, సతతం

خَيْرٌ وَّ اَبْقٰى اَفَلَا تَعْقِلُوْنَ ۝ (القصص:٦٠)

ఉండేది. మీరు బుద్ధివివేకాలను వినియోగించరా? *(అల్ కసస్: 60)*

పరలోకానికి ప్రాధాన్యతనివ్వడానికి బదులు ప్రపంచానికి ప్రాధాన్యతనివ్వడం వల్ల అది మానవుణ్ణి వినాశం వైపునకు తీసుకుపోతుంది. అతను దాన్ని తెలుసుకుంటే ఎంత బావుండేది.

بَلْ تُؤْثِرُوْنَ الْحَيٰوةَ الدُّنْيَا وَالْاٰخِرَةُ خَيْرٌ وَّ اَبْقٰى ۝ (الاعلىٰ:١٦-١٧)

మీరయితే ప్రపంచ జీవితానికి ప్రాధాన్యతనిస్తున్నారు, నిజానికి పరలోకం ఇంతకన్నా ఎన్నో రెట్లు ఉత్తమమయింది, అది శాశ్వతంగా ఉండేది కూడా.

*(అల్ ఆలా : 16,17)*

మరో చోట ఇలా ఉంది:

وَمَا هٰذِهِ الْحَيٰوةُ الدُّنْيَا اِلَّا لَهْوٌ وَّ لَعِبٌ وَّ اِنَّ الدَّارَ الْاٰخِرَةَ لَهِىَ الْحَيَوٰنُ لَوْ كَانُوْا يَعْلَمُوْنَ ۝ (العنكبوت:٦٤)

ఇహలోక జీవితమయితే కేవలం ఆట పాటలవంటిది. నిస్సందేహంగా పరలోక జీవితమే నిజ జీవితం. వారు దీన్ని తెలుసుకుంటే ఎంత బావుంటుంది!

*(అల్ అన్కబూత్ : 64)*

## ప్రపంచం అశాశ్వతమయింది

ఈ ప్రపంచం, ఇందులోని వెలుగులు, మెరుగులు, రంగులు, హంగులు వీటిలో దేనికీ శాశ్వతత లేదు, వీటిని దేన్నీ నమ్మలేము. ఈ వేళ ఉంటుంది, రేపు మాయమవుతుంది. కాని ఎంత శోచనీయం, మనిషి ఈ అశాశ్వత సౌందర్యానికే పిచ్చివాడయిపోతున్నాడు. దాని వెనకాల పరిగెడుతూ తన అంతిమ పరిణామాన్ని పూర్తిగా విస్మరిస్తున్నాడు. నవనవలాడే శోభ, ఈ ఆకర్షణీయమయిన సౌందర్యం తాత్కాలిక మయిందని ఎన్నడూ ఆలోచించడు. వేడిగాలి ఒక్కసారి వీచినా ఇవన్నీ మాడిపోతాయని, తాను నిరాశ నిస్పృహలతో చేతులు నులుముకుంటూ ఉండిపోతాడని ఊహించడు. హదీద్ సూరాలో ఇదే మాట ఎంతో అందంగా తెలుపడం జరిగింది, చూడండి :

اِعْلَمُوْٓا اَنَّمَا الْحَيٰوةُ الدُّنْيَا لَعِبٌ وَّ لَهْوٌ وَّ زِيْنَةٌ وَّ تَفَاخُرٌۢ بَيْنَكُمْ وَ

తెలుసుకోండి, ప్రపంచం, జీవితమయితే కేవలం ఆటపాటలు, అలంకరణ, పరస్పరం గర్వం ప్రదర్శించుకోవడం, ధన

تَكَاثُـرٌ فِي الْاَمْوَالِ وَالْاَوْلَادِ ؕ كَمَثَلِ غَيْثٍ اَعْجَبَ الْكُفَّارَ نَبَاتُهٗ ثُمَّ يَهِيْجُ فَتَرٰهُ مُصْفَـرًّا ثُمَّ يَكُوْنُ حُطَامًا ؕ وَ فِي الْاٰخِـرَةِ عَذَابٌ شَدِيْدٌ ۙ وَّ مَغْفِرَةٌ مِّنَ اللّٰهِ وَ رِضْوَانٌ ؕ وَّمَـا الْحَيٰوةُ الدُّنْيَـا اِلَّا مَتَـاعُ الْغُـــرُوْرِ ۝ (الحديد:٢٠)

సంపత్తులు, సంతానాల విషయంలో ఒకరిపైనొకరు అధిక్యత పొందడం మాత్రమే. దీని ఉపమానం ఏమిటంటే, వర్షం వల్ల పచ్చదనం ఉద్భవించినప్పుడు అది రైతులకు ఎంతో శోభాయమానంగా అగుపిస్తుంది. ఆపైన అది ఎండిపోగా మీరు దాన్ని పేలవమయిపోయినట్లు గమనిస్తారు. తరువాత (ఏదయినా ఆకస్మిక విపత్తు ద్వారా) అది పిండిపిండయిపోతుంది (ఇదే ప్రపంచ స్థితి). మరి పరలోకంలో తీవ్రయాతన లేదా దేవుని క్షమాభిక్ష, ఆయన ఇష్టం, ప్రసన్నతలు ప్రాప్తమవుతాయి. ప్రపంచ జీవితమయితే కేవలం వంచనా సామగ్రి మాత్రమే.

***(అల్ హదీద్: 20)***

ప్రపంచ జీవితాన్ని ఆటపాటగా వర్ణించడానికి కారణం, ఆటపాటలు మనసుకు ఒప్పనయితే ఒప్పుతాయి కాని ముఖ్య విషయాల పట్ల ఏమరుపాటుకు గురిచేస్తాయి. అలంకరణలు, అందాలు బాహ్యాశోభలు. ఇవి మానవుని ఔన్నత్యానికి గొప్పదనానికి ఆనవాళ్ళుకావు. ఒక కేన్సరు రోగి, లేదా నీతిహీనుడయిన వ్యక్తి విలువయిన పట్టు వస్త్రాలు ధరిస్తే అతను ఆరోగ్యవంతుడో లేక నీతిమంతుడో కాలేడు. ఇదే స్థితి ప్రపంచానికి సంబంధించింది. అది ప్రాప్తమవడం, ఆ వ్యక్తి దైవ దృష్టిలో, దైవసృష్టి అయిన మానవుల దృష్టిలో విలువయిన వాడో ఉన్నతుడో అని అర్థం కాదు. అయినా ప్రపంచం ప్రాప్తమవడం కూడా ఒక ప్రాప్తియేనా–

దొరికినట్టే దొరికి చేజారిపోతుంది. ఈ అశాశ్వత ప్రపంచంపైన మోజు పడటం, ప్రాణాలివ్వడానికి సమాయత్తమవడం చాలా అవివేకం. మనిషి ఏదయినా ఆశిస్తే, కాంక్షిస్తే పరలోకాన్ని గురించి చేయాలి. పరుగిడిపోవాలంటే, అదుకోడానికి ఉరకాలంటే పరలోకం వైపునకు సాగాలి. కోరుకుంటే స్వర్గాన్ని కోరుకోవాలి. చింతన చేస్తే స్వర్గం గురించి చింతించాలి. అది శాశ్వత సుఖాల గృహం. దాని వరప్రసాదాలు అనశ్వరమయినవి. అది ప్రాప్తమయిన తరువాత ఎన్నడూ ఏదీ కోల్పోయిన స్పృహే కలగదు.

కాగా పైన పేర్కొన్న హదీద్ సూరా ఆయత్ వెనువెంటనే ఈ విషయాన్నే తెలుపడం జరిగింది:

سَابِقُوْٓا اِلٰى مَغْفِرَةٍ مِّنْ رَّبِّكُمْ وَ جَنَّةٍ عَرْضُهَا كَعَرْضِ السَّمَآءِ وَالْاَرْضِ اُعِدَّتْ لِلَّذِيْنَ اٰمَنُوْا بِاللّٰهِ وَ رُسُلِهٖ ذٰلِكَ فَضْلُ اللّٰهِ يُؤْتِيْهِ مَنْ يَّشَآءُ وَاللّٰهُ ذُو الْفَضْلِ الْعَظِيْمِ۝ (الحديد:٢١)

పరుగిడండి, మీ ప్రభువు క్షమాభిక్ష వైపునకు భూమ్యాకాశాలంత విశాలమయిన స్వర్గం వైపునకు, అది అల్లాహ్‌ను ఆయన ప్రవక్తల్ని నమ్మే వారి కొరకు సిద్ధపరచబడింది. ఇది అల్లాహ్ అనుగ్రహం, తాను కోరిన వారికి ప్రసాదిస్తాడు. ఆయన మహా అనుగ్రహశీలి. *(అల్ హదీద్ : 21)*

తన ప్రయత్నం, పరిశ్రమ ద్వారా ప్రపంచాన్నయితే నిర్మించుకుని పరలోకాన్ని వినాశపరచుకునే వ్యక్తి ఎంత దురదృష్టవంతుడు. దీనికి భిన్నంగా తన విశ్వాసం, ఆచరణ సౌందర్యం వల్ల నిత్య స్వర్గానికి అర్హుడయి అక్కడ అతిథిగా గడిపే వ్యక్తి ఎంత సౌభాగ్యవంతుడు, మరెంత అసూయపడదగిన వ్యక్తి.

قُلْ هَلْ نُنَبِّئُكُمْ بِالْاَخْسَرِيْنَ اَعْمَالًا۝ اَلَّذِيْنَ ضَلَّ سَعْيُهُمْ فِى الْحَيٰوةِ الدُّنْيَا وَهُمْ يَحْسَبُوْنَ اَنَّهُمْ يُحْسِنُوْنَ صُنْعًا۝ اُولٰٓئِكَ الَّذِيْنَ كَفَرُوْا بِاٰيٰتِ رَبِّهِمْ وَ لِقَآئِهٖ فَحَبِطَتْ اَعْمَالُهُمْ فَلَا نُقِيْمُ لَهُمْ يَوْمَ الْقِيٰمَةِ وَزْنًا۝ ذٰلِكَ جَزَآؤُهُمْ جَهَنَّمُ بِمَا كَفَرُوْا وَاتَّخَذُوْٓا اٰيٰتِىْ وَ رُسُلِىْ هُزُوًا۝ اِنَّ الَّذِيْنَ اٰمَنُوْا وَ عَمِلُوا الصّٰلِحٰتِ كَانَتْ لَهُمْ

వారికి చెప్పు. మీకు చెప్పనా, ఆచరణల రీత్యా అందరికన్నా అత్యంత నష్టంలో ఉన్నవారెవరో. వారు, తమ కృషి ప్రయత్నాలన్నీ, ప్రపంచ జీవితంలో వృధా పోగొట్టుకున్నవారు. తాము చేస్తున్నదంతా ఎంతో ఉత్తమమయినదని వారనుకునేవారు. వీరు, తమ ప్రభువు వచనాలను, ఆయన్ని కలసుకునే విషయాన్ని నిరాకరించినటువంటి వారు. కాగా వీరి ఆచరణలన్నీ వృధా పోయాయి. మేము ప్రళయ దినాన వాటికి ఎటువంటి బరువును విలువను ఇవ్వము. ఇది వారి ప్రతిఫలం, నరకం, వారు తిరస్కారానికి ఒడిగట్టినందుకు, నా వచనాలను, నా సందేశహరుల్ని పరిహాసంగా పరిగణించినందుకు. (దీనికి

جَنّٰتُ الْفِـرْدَوْسِ نُـزُلاً ۝ خٰلِـدِيْنَ فِيْهَـا لَا يَبْغُوْنَ عَنْهَـا حِوَلاً ۝

(الکہف:۱۰۳-۱۰۸)

భిన్నంగా) ఎవరయితే విశ్వసించారో సత్కార్యాలాచరించారో వారి ఆతిథ్యానికి ఫిర్‌దౌస్ ఉద్యానవనాలున్నాయి. వాటిలో వారు సదా ఉంటారు. వాటిని వదలి పోవాలని యోచించరు.

*(అల్ కహ్ఫ : 103-108)*

విశ్వాసి, తిరస్కారుల మధ్య పెద్ద వ్యత్యాసం ఇదే. విశ్వాసి ప్రతి వ్యవహారంలోనూ పరలోక లాభనష్టాలను పరిశీలిస్తాడు. తిరస్కారి సమక్షంలో కేవలం ప్రపంచం, దాని ప్రయోజనాలుంటాయి. అల్లాహ్ ఏర్పరచిన ధర్మం ఏమిటంటే ఏ వ్యక్తి ప్రపంచాన్ని పొందగోరుతాడో అతనికి అల్లాహ్ నియమానుసారం, నిబంధనల మేరకు, ఆయన సమ్మతితో ప్రపంచం ప్రాప్తమవుతుంది. మరెవరయితే పరలోకాన్ని కాంక్షిస్తాడో అతను అల్లాహ్ అనుగ్రహంతో పరలోకాన్ని పొందుతాడు. దివ్యఖుర్‌ఆన్‌లో ఈ అల్లాహ్ ధర్మం ఇలా ప్రస్తావించబడింది:

مَنْ كَانَ يُرِيْـدُ الْعَاجِلَةَ عَجَّلْنَا لَـهٗ فِيْهَا مَا نَشَآءُ لِمَنْ نُّرِيْدُ ثُمَّ جَعَلْنَا لَهٗ جَهَنَّمَ ۚ يَصْلٰهَا مَذْمُوْمًا مَّدْحُوْرًا ۝ وَمَنْ اَرَادَ الْاٰخِرَةَ وَ سَعٰى لَهَا سَعْيَهَا وَهُوَ مُؤْمِنٌ فَاُولٰٓئِكَ كَانَ سَعْيُهُمْ مَشْكُـوْرًا ۝ كُلًّا نُّمِـدُّ هٰـؤُلَآءِ وَ هٰـؤُلَآءِ مِنْ عَطَـآءِ رَبِّكَ ؕ وَ مَـا كَانَ عَطَـآءُ رَبِّكَ مَحْظُـوْرًا ۝ اُنْظُـرْ كَيْفَ فَضَّلْنَا بَعْضَهُـمْ عَلٰى

ఎవరయితే ప్రపంచ ప్రయోజనాన్ని కోరుకుంటాడో మేము అతి త్వరగానే మేము కోరిన మేరకు, అనుకున్న వారికి ఇచ్చి వేస్తాము. ఆ పైన మేము అతనికి నరకాన్ని నిర్ణయించి పెడతాము. అందులో అతను, శాపగ్రస్తుడయి, ప్రభు సన్నిధి నుండి గెంటి వేయబడినవాడయి ప్రవేశిస్తాడు. కాని ఎవరయితే పరలోకాన్ని కోరుకుంటాడో, మరి దాని కోసం ఏ విధంగానయితే ప్రయత్నించవలసి ఉంటుందో అలా ప్రయత్నిస్తాడో, ఇంకా అతను విశ్వాసి అయినట్లయితే ఇటువంటి వారెల్లరి కృషికి ఆదరణ లభిస్తుంది. మేము నీ ప్రభువు అనుగ్రహంతోటే (ఇహలోకంలో) వారికీ ప్రసాదిస్తాము. నీ ప్రభువు కృపకు ఎటువంటి నిర్బంధం

بَعْضٍ وَّ لَلْاٰخِرَةُ اَكْبَرُ دَرَجٰتٍ وَّ اَكْبَرُ تَفْضِيْلًا ۝

(بنی اسرائیل:۱۸-۲۱)

లేదు. మేము ప్రపంచంలో ఏ విధంగా ఒకరిపైనొకరికి ఆధిక్యతనిచ్చామో గమనించు; పరలోకంలోనయితే (దీనికి సదృశంగా) మహాస్థానాలున్నాయి, గొప్ప ఘనత, ఔన్నత్యం ఉన్నాయి.

*(బనీ ఇస్రాయీల్ : **18 : 21**)*

మరో చోట ఇలా సెలవీయబడింది:

مَنْ كَانَ يُرِيْدُ حَرْثَ الْاٰخِرَةِ نَزِدْ لَهٗ فِيْ حَرْثِهٖ ۚ وَمَنْ كَانَ يُرِيْدُ حَرْثَ الدُّنْيَا نُؤْتِهٖ مِنْهَا ۙ وَمَا لَهٗ فِي الْاٰخِرَةِ مِنْ نَّصِيْبٍ ۝ (الشوریٰ:۲۱)

ఏ వ్యక్తి అయితే పరలోక పంటను కోరుకుంటాడో మేము అతని పంటలో అతని కోసం ఆధిక్యతను ప్రసాదిస్తాము. మరెవరు ప్రపంచ పంటను కాంక్షిస్తాడో మేము ఇందులో నుంచి కొంత అతనికి ప్రసాదిస్తాము. పరలోకంలో మటుకు అతనికి ఎటువంటి వాటా మిగులదు.

*(అష్ షూరా : **21**)*

ఇదే అర్థాన్ని సూచించే మరో ఆయత్‌ని చూడండి:

... وَ مَنْ يُّرِدْ ثَوَابَ الدُّنْيَا نُؤْتِهٖ مِنْهَا ۚ وَ مَنْ يُّرِدْ ثَوَابَ الْاٰخِرَةِ نُؤْتِهٖ مِنْهَا وَ سَنَجْزِی الشّٰكِرِيْنَ ۝

(آل عمران:۱۴۵)

.... ఎవరయితే ప్రపంచ ప్రతిఫలాన్ని ఆశిస్తాడో మేము అతనికి అందులో నుంచి కొంత ఇచ్చివేస్తాము. మరెవరయితే పరలోక ప్రతిఫలాన్ని కోరుకుంటాడో అతనికి అందులో నుంచి ప్రసాదిస్తాము. ఇంకా కృతజ్ఞతగల దాసులకు అతి త్వరగానే ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాము.

*(ఆలి ఇమ్రాన్ : **145**)*

అల్లాహ్ చేసిన ఈ నియమానుసారమే ప్రపంచాన్ని కాంక్షించే వారికి ఇలా చెప్పడం జరిగింది:

مَنْ كَانَ يُرِيْدُ الْحَيٰوةَ الدُّنْيَا وَ زِيْنَتَهَا نُوَفِّ اِلَيْهِمْ اَعْمَالَهُمْ فِيْهَا وَهُمْ فِيْهَا لَا يُبْخَسُوْنَ○ اُولٰٓئِكَ الَّذِيْنَ لَيْسَ لَهُمْ فِي الْاٰخِرَةِ اِلَّا النَّارُ ۖ وَ حَبِطَ مَا صَنَعُوْا فِيْهَا وَ بٰطِلٌ مَّا كَانُوْا يَعْمَلُوْنَ○

(هود:١٥،١٦)

ఎవరయితే ప్రపంచ జీవితం దాని అలంకారాలు, శోభలను కాంక్షిస్తారో వారికి వారి ఆచరణల ఫలాలు మేము ఇహలోకంలోనే పూర్తిగా ఇచ్చివేస్తాము. వీరికి ఈ లోకంలో ఎటువంటి కొరత ఉండదు. ఈ జనులకు పరలోకంలో నరకాగ్ని తప్ప మరేమీ ప్రాప్తం కాదు. ప్రపంచంలో వారు చేసుకున్నదంతా వృథాపోతుంది. వారు చేస్తున్న ఆచరణ అంతా నిష్ప్రయోజనమయిపోతుంది.

*(హూద్ : 15,16)*

## పరలోక సాఫల్యం నిజమయిన సాఫల్యం

దైవం పట్ల, పరలోకం పట్ల విశ్వాసంలేని వ్యక్తులు ప్రపంచాన్ని పొందేందుకే కృషి చేస్తూ తలమునకలయి ఉంటారు. కాని విశ్వాసులయిన వారి దృష్టి పరలోకంపైన లగ్నమయి ఉంటుంది. వారు దాని కొరకే జీవిస్తారు, దాని కొరకే కృషి, ప్రయత్నాలు చేస్తారు. ఇందులో సఫలత అల్లాహ్, ఆయన ప్రవక్తల విధేయత ద్వారా ప్రాప్తమవుతుంది. దివ్యఖుర్ఆన్ రీత్యా ఇదే నిజమయిన సఫలత, ఇదే మహత్తరమయిన విజయం.

وَ مَنْ يُّطِعِ اللّٰهَ وَ رَسُوْلَهٗ يُدْخِلْهُ جَنّٰتٍ تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ خٰلِدِيْنَ فِيْهَا وَ ذٰلِكَ الْفَوْزُ الْعَظِيْمُ○ (النساء:١٣)

అల్లాహ్, ఆయన సందేశహరుని విధేయత పాటించే వారిని ఆయన స్వర్గ ఉద్యాన వనాలలో ప్రవేశింపజేస్తాడు, వాటి దిగువన సెలయేరులు పారుతుంటాయి. వాటిలో వారు సర్వదా ఉంటారు. ఇదే సర్వోత్తమమయిన సాఫల్యం. *(అన్ నిసా: 14)*

మరో చోట, మీరు ఇహలోకంలో దైవం, దైవప్రవక్తలను విశ్వసించి ఆ మార్గంలో కృషి, ప్రయత్నాలు, త్యాగాలు చేసినట్లు నిరూపించుకుంటే చూడండి దేవుని అనుగ్రహాలెలా ఉంటాయో.

يَغْفِرْ لَكُمْ ذُنُوْبَكُمْ وَ يُدْخِلْكُمْ

అల్లాహ్ మీ అపరాధాలను మన్నించి వేస్తాడు, మిమ్మల్ని స్వర్గ ఉద్యాన వనాలలో

جَنّٰتٍ تَجۡرِیۡ مِنۡ تَحۡتِهَا الۡاَنۡهٰرُ وَ مَسٰكِنَ طَیِّبَةً فِیۡ جَنّٰتِ عَدۡنٍ ؕ ذٰلِكَ الۡفَوۡزُ الۡعَظِیۡمُ ۙ (الصف:١٢)

ప్రవేశింపజేస్తాడు, వాటి దిగువన కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి, పరిశుద్ధమయిన నివాస గృహాలు ప్రసాదిస్తాడు, అవి శాశ్వత స్వర్గాలలో ఉంటాయి. ఇది మహత్తరమయిన సఫలత.

(అస్ సఫ్: 12)

విశ్వాసం, సదాచరణల మూలంగా మనిషి పరలోకంలో స్వర్గానికి అర్హుడవుతాడు. అది అతనికి గొప్ప సాఫల్యం. ఇంతకన్నా గొప్ప సఫలత అంటూ మరో సఫలత ఏదీలేదు.

اِنَّ الَّذِیۡنَ اٰمَنُوۡا وَ عَمِلُوا الصّٰلِحٰتِ لَهُمۡ جَنّٰتٌ تَجۡرِیۡ مِنۡ تَحۡتِهَا الۡاَنۡهٰرُ ذٰلِكَ الۡفَوۡزُ الۡكَبِیۡرُ ؕ (البروج:١١)

నిస్సందేహంగా విశ్వసించినవారు మరి సదాచరణను పాటించిన వారి కొరకు దిగువన కాలువలు పారే స్వర్గ వనాలున్నాయి. ఇది గొప్ప సఫలత.

*(అల్ బురూజ్ : 11)*

ఇదే దేవుని మహా గొప్ప అనుగ్రహం. అది ఆయన సదాచారులయిన దాసులకు ప్రాప్తమవుతుంది. వారు విశ్వాసం, సదాచరణల సంపదతో ఆయన సన్నిధిలో చేరుతారు.

تَرَی الظّٰلِمِیۡنَ مُشۡفِقِیۡنَ مِمَّا كَسَبُوۡا وَهُوَ وَاقِعٌۢ بِهِمۡ ؕ وَالَّذِیۡنَ اٰمَنُوۡا وَ عَمِلُوا الصّٰلِحٰتِ فِیۡ رَوۡضٰتِ الۡجَنّٰتِ ۚ لَهُمۡ مَّا یَشَآءُوۡنَ عِنۡدَ رَبِّهِمۡ ؕ ذٰلِكَ هُوَ الۡفَضۡلُ الۡكَبِیۡرُ ○ (الشوریٰ:٢٢)

దుర్మార్గులను నీవు గమనిస్తావు, తాము సంపాదించుకున్న దాని కారణంగా భయపడుతూ ఉంటారు, కాని శిక్ష వారికి పడి తీరుతుంది. మరెవరయితే విశ్వసించారో, సత్కార్యాలాచరించారో వారి కొరకు స్వర్గ వనాలున్నాయి. వారి కొరకు వారి ప్రభువు వద్ద వారు కోరుకున్నవన్నీ ఉంటాయి. ఇవి మహా అనుగ్రహం. *(అష్ షూరా : 22)*

ఆ మనిషి సౌభాగ్యవంతుడు, అసూయపడదగినవాడు, అతని వాటాలో పరలోక సఫలత ప్రాప్తమవుతుంది, అతను స్వర్గానికి అర్హుడవుతాడు.

## ఇస్లామ్ పిలుపు, పరలోక చింతన

ఇస్లామ్ పిలుపునివ్వడం పరలోకం పట్ల ఏమరుపాటుకు లోనయి ఉన్న వారి పని కాదు. దీని కొరకు, ప్రపంచంపైన పరలోకానికి ప్రాధాన్యతనిచ్చేటటువంటి వారి

అవసరముంటుంది. తాము దైవం సమక్షంలో హాజరుపరచబడతామన్న ఆలోచనతోనే వారు కంపిస్తూ ఉంటారు. దైవధర్మం పట్ల చేసిన సేవ పట్ల తమను అడగటం జరుగుతుందని భయపడుతూ ఉంటారు.

ఇస్లామ్ పిలుపు సాధారణమయిన పని కాదు. ఇది మహత్తరమయిన పోరాటం. ఇదొక సుదీర్ఘ పోరాటం. అనేక దిశలలో పోరాడవలసిన పోరాటం. దైవాదేశం:

وَجٰهِدْهُمْ بِهٖ جِهَادًا كَبِيْرًا ۝
(الفرقان:٥٢)

**మీరు వారితో ఖుర్‌ఆన్ ద్వారా పెద్ద జిహాద్ (పెద్ద పోరాటం) చెయ్యండి.**

*(అల్ ఫుర్‌కాన్ : 52)*

దైవం ఏ జిహాద్ పోరాటాన్ని గురించి తెలిపాడో దాన్ని మాటల్లో చెప్పడం సులువే కాని అందులో పాల్గొనడం, తన పాత్ర పోషించడం సులవయినది కాదు. ఇందులో అసంఖ్యాక జనుల వ్యతిరేకతను ఎదుర్కోవలసి ఉంటుంది. వారు దైవధర్మాన్ని వ్యతిరేకించే వారయి ఉంటారు. వారు దాన్ని ఇష్టపడనివారు. వారు దాన్ని తుడిచివెయ్యాలని కోరుకునే వారు. ఇది చాలా తీవ్రమయిన పోరాటం. ఇందులో పలుమార్లు మనిషి తన ఉత్తమమయిన సంబంధాలను తెంచుకోవలసివస్తుంది. రక్తసంబంధాలను వదలుకోవలసి వస్తుంది. ఆప్తులను సయితం మనిషి విడిచిపెట్టడం తప్పదు. ఇంత గొప్ప పోరాటం చేయడం సాధారణ వ్యక్తి వల్ల అయ్యే పనికాదు. ధర్మం కొరకు ఒకరి అయిష్టతను కొని తెచ్చుకోగోరని వ్యక్తి, ఒకరి సంబంధాన్ని తెంచుకోగోరని వ్యక్తి, ఒక మిత్రునితో దూరమవడాన్ని భరించలేని వ్యక్తి దీన్ని చేయలేడు. దీన్ని ప్రారంభించాలన్నా ప్రారంభించి కొనసాగించాలన్నా అందరి వల్ల అయ్యే పని కాదు. ప్రపంచంలోని ప్రతి విషయంకన్నా దైవధర్మం ప్రీతిపాత్రమైన వ్యక్తి, దైవాన్ని అప్రసన్నుడిగా చేసి మరెవరినయినా ప్రసన్నుడిగా చేసేందుకు సిద్ధంకాని వ్యక్తి, పరలోకాన్ని గట్టిగా నమ్మి అక్కడ ప్రపంచంలోని ఏ సంబంధమూ తనకు ఉపకరించబోదని ఎరిగిన వ్యక్తి–ఇటువంటి వ్యక్తి ద్వారానే సాధ్యం.

لَا تَجِدُ قَوْمًا يُّؤْمِنُوْنَ بِاللّٰهِ وَالْيَوْمِ
الْاٰخِرِ يُوَآدُّوْنَ مَنْ حَآدَّ اللّٰهَ وَ
رَسُوْلَهٗ وَلَوْ كَانُوْٓا اٰبَآءَهُمْ اَوْ
اَبْنَآءَهُمْ اَوْ اِخْوَانَهُمْ اَوْ عَشِيْرَتَهُمْ ؕ
اُولٰٓئِكَ كَتَبَ فِيْ قُلُوْبِهِمُ الْاِيْمَانَ

ఎవరయితే దైవం, పరలోక దినం పట్ల గట్టి నమ్మకం కలిగి ఉంటారో వారిని నీవు, దైవాన్నీ దైవసందేశహరుల్ని వ్యతిరేకించే వారితో సంబంధాలు పెట్టుకున్నట్లు గమనించవు - అటువంటి వారు వారి తండ్రులు, తనయులు, సోదరులు లేదా వారి కుటుంబంలోని వారే అయినప్పటికీ.

وَ اَيَّدَهُمْ بِرُوْحٍ مِّنْهُ ؕ وَ يُدْخِلُهُمْ جَنّٰتٍ تَجْرِىْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ خٰلِدِيْنَ فِيْهَا ؕ رَضِىَ اللّٰهُ عَنْهُمْ وَ رَضُوْا عَنْهُ ؕ اُولٰٓئِكَ حِزْبُ اللّٰهِ ؕ اَلَاۤ اِنَّ حِزْبَ اللّٰهِ هُمُ الْمُفْلِحُوْنَ ۝ (المجادلۃ:۲۲)

ఇటువంటి వారి హృదయంలోనే దైవం విశ్వాసాన్ని పాదుకొలిపాడు. వారికి తన ప్రత్యేక అనుగ్రహం ద్వారా శక్తినిచ్చాడు. వారిని దైవం స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు, వాటి దిగువన సెలయేరులు ప్రవహిస్తూ ఉంటాయి. వాటిలో వారు ఎల్లకాలాలూ ఉంటారు. అల్లాహ్ వారంటే ఇష్టపడతాడు, వారు ఆయన పట్ల సంతుష్టులయి ఉంటారు. ఇది అల్లాహ్ వర్గం. బాగా వినండి, అల్లాహ్ వర్గమే సఫలత పొందే వర్గం. *(అల్ ముజాదిల : 22)*

ఇస్లామ్ పిలుపునివ్వడం అంటే తన్ను తాను పరీక్షకు గురిచేసుకోవడమే. ఈ పనిని స్వీకరించిన తరువాత సుఖం, సౌలభ్యం, ఆనందాల అన్వేషణ నిష్ప్రయోజనం. ఈ దారిలో ముందుకు సాగే మనిషిని పలుమార్లు పరీక్షించడం జరుగుతోంది, అన్ని విధాలా పరీక్షించడం జరుగుతుంది. అతనికి మానసిక శారీరక బాధలు కలుగజేయబడతాయి. భయపెట్టడం, బెదరించడమూ జరుగుతుంది. అతని ధనసంపదలకూ నష్టం వాటిల్లజెయ్యబడుతుంది. అతన్ని బేడీలు, గుదిబండలతో అలంకరించడం జరుగుతుంది. అతన్ని ఖైదులో, జైళ్ళల్లో నిర్బంధించడం జరుగుతుంది. అంతేకాదు, అతనికి తన తల పణంగా పెట్టి ఇస్లామ్ సేవ చేసే అవకాశాలూ ఎదురవవచ్చు. ఇంతటి పెద్ద చర్య తీసుకునే వ్యక్తి పరలోకం పట్ల దృఢవిశ్వాసం గలవాడే కాగలడు. అతనికి తన శరీరం ప్రాణాల సుఖం కన్నా పరలోక సఫలతే చింతనకు కేంద్రమయి ఉండాలి. అతనికి ఇక్కడి కష్టాలు, వెతలకన్నా అక్కడి యాతన శిక్షల భయమే అధికమయి ఉండాలి. కాని పరలోకం పట్ల విశ్వాసం లేకపోతే మనిషి మృత్యువు నుంచే పారిపోయే మార్గాలు వెతుకుతూ ఉంటాడు ఎలాగయినా ప్రాణం దక్కాలని. అతను పొందగోరేదల్లా ఈ లోకంలోనే పొందాలని కాంక్షిస్తాడు. అతని కోసం మరో ప్రపంచం లేదు, అందులో ఏదయినా పొందే ఆశ అతనికి ఉండదు; అందువల్లనే ఖుర్ఆన్ అంటుంది:

لَا يَسْتَاْذِنُكَ الَّذِيْنَ يُؤْمِنُوْنَ بِاللّٰهِ وَالْيَوْمِ الْاٰخِرِ اَنْ يُّجَاهِدُوْا بِاَمْوَالِهِمْ وَ اَنْفُسِهِمْ ؕ وَاللّٰهُ عَلِيْمٌ

(ప్రవక్తా!) దైవాన్నీ, పరలోకాన్నీ నమ్మే వ్యక్తులు నీ ద్వారా అనుమతిని కోరుతూ, తమ ధన ప్రాణాలతో సతత సమరం నుండి తమను తప్పించుకునేందుకు అనుమతించాలని కాంక్షించరు. అల్లాహ్‌కు

بِالْمُتَّقِيْنَ ○ اِنَّمَا يَسْتَاْذِنُكَ الَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِاللّٰهِ وَالْيَوْمِ الْاٰخِرِ وَارْتَابَتْ قُلُوْبُهُمْ فَهُمْ فِيْ رَيْبِهِمْ يَتَرَدَّدُوْنَ ○

(التوبة:٤٤-٤٥)

తెలుసు దైవం పట్ల భయభక్తులు కలవా రెవరో. దైవాన్నీ, పరలోక దినాన్నీ నమ్మని వారే ఇటువంటి అనుమతి కొరకు నిన్ను అర్థిస్తారు. వీరి హృదయాలలో కుశంక చోటు చేసుకుంది. వారు తమ శంకా వస్థలో చకితులయి చేసేదేమిటో, చేయ కూడనిదేమిటో పాలుపోక ఉండి పోయారు. *(అత్ తౌబా: 44, 45)*

ఇస్లామ్ పిలుపునివ్వడం సులువయిన కార్యం కాదు. ఇది తమ్ము తాము ఇబ్బంది లకు ఇక్కట్లకు గురిచేసుకోవడమే. ఇందులో అతి సున్నితమయిన దశలు ఆసన్న మయ్యాయి, మున్ముందు కూడా ముందుకురావచ్చు. ఇస్లామ్ ప్రస్తావన రాగానే నాలుక గొంతుక నుండి లాక్కునే సమయమూ రావచ్చు; దైవమార్గంలో నడవటం, నిప్పు కణికల మీద నడవటంకన్నా కఠినతరమయిపోయే ప్రమాదమూ ముంచుకు రావచ్చు; ధర్మం సమర్థనలో వేసే ప్రతి చెయ్యి ఖండించబడటమూ సాధ్యమే. ప్రపంచం ఇటువంటి దృశ్యాలు చూసింది. అయినప్పటికీ మనం, ఈ ప్రపంచానికి ఇస్లామ్ పిలుపునివ్వాలని సంకల్పించుకున్నాము, ఈ ధర్మాన్ని సమున్నత పరచాలని నిర్ణయించుకున్నాము. మనం ఈ సంకల్పంలో కృతకృత్యులమవ్వాలంటే మన ముందు కేవలం పరలోకం, దాని ప్రయోజనాలు మటుకే ఉండాలి. ఈ ప్రపంచం నశ్వరం, పరలోకం మాత్రమే శాశ్వతమన్న యదార్థం మన ఆంతర్యంలో, మన నరనరాల్లో జీర్ణించుకుపోయి రక్తంలా పారాలి.

مَا عِنْدَكُمْ يَنْفَدُ وَمَا عِنْدَ اللّٰهِ بَاقٍ ۗ وَلَنَجْزِيَنَّ الَّذِيْنَ صَبَرُوْا اَجْرَهُمْ بِاَحْسَنِ مَا كَانُوْا يَعْمَلُوْنَ ○

(النحل:٩٦)

మీ వద్ద ఉన్నదేదో నాశనమయి పోయేది, మరి అల్లాహ్ వద్ద ఉన్నదంతా శాశ్వతంగా ఉండేది. ఎవరయితే సహనం వహించారో (స్థిరత్వం కనబరచారో)మేము వారు చేసిన ఉత్తమ ఆచరణలకు వారి ప్రతిఫలాన్ని ఇచ్చితీరుతాము. *(అన్ నహ్ల్ : 96)*

మనకు ఒక వైపున దేవుని స్వర్గముంది. దుఃఖం, ఆవేదనలు లేని పరిశుద్ధ జీవిత ముంది, ఏ కన్నూ చూసి ఎరుగని, ఏ చెవీ విని ఎరుగని, ఏ మానవమాత్రుడు ఊహించ లేనిదంతా ఉంది. రెండవ వైపున ప్రపంచ భోగవిలాసాలున్నాయి, నిర్నిబంధమయిన జీవితముంది, ధర్మాధర్మాల తారతమ్యం లేకుండా ప్రగతి గడించే అవకాశాలున్నాయి.

ఈ రెంటిలో ఏదో ఒకటి మనం ఎన్నుకోవలసి ఉంటుంది. ఎందుకంటే ఈ రెండు విష యాలూ ఒక్కసారిగా ప్రాప్తం కాజాలవు. ప్రపంచానికి బందీ అయిపోయిన వ్యక్తికి నిశ్చ యంగా పరలోకంలో అతని వాటా ప్రాప్తం కాదు, మరెవరయితే తన కోసం పరలోకాన్ని ఎన్నుకుంటాడో అతనికి తప్పనిసరిగా ప్రపంచంలో నష్టం వాటిల్లుతుంది. దైవసందేశహరులు మహనీయ ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లమ్) అతి స్పష్టంగా చెప్పి వేశారు:

مَنْ اَحَبَّ دُنْيَاهُ اَضَرَّ بِاٰخِرَتِهٖ وَ مَنْ اَحَبَّ اٰخِرَتَهٗ اَضَرَّ بِدُنْيَاهُ فَاٰثِرُوْا مَا يَبْقٰى عَلٰى مَا يَفْنٰى

**ఏ వ్యక్తి తన ప్రపంచాన్ని ప్రేమిస్తాడో అతను తన పరలోకానికి నష్టం చేకూర్చు కుంటాడు. మరెవరయితే పరలోకాన్ని ఆశి స్తాడో అతను తన ప్రపంచాన్ని నష్టపరచు కుంటాడు. కాగా మీరు శాశ్వతంగా ఉండే (పరలోకానికి) నశ్వరమయిన (ప్రపంచం) పైన ప్రాధాన్యతనివ్వండి.** ***(మిష్కాత్: కితాబుర్రికాక్-ముస్నద్ అహ్మద్, బైహఖి)***

ఈ హదీసు మనల్ని ఆదేశిస్తోంది, మనం ప్రపంచానికి ప్రతిగా పరలోకానికి ప్రాధాన్యతనివ్వాలని. మనం ఈ ఆదేశాన్ని స్వీకరించినట్లయితే, పరలోక ప్రయోజనార్థం ప్రపంచ నష్టాన్ని భరించడానికి సిద్ధపడితే మనం ధర్మసేవ చేయగలం లేకపోతే లేదు.

సందేశ మార్గంలో కష్టాల ద్వారానే పరీక్షించడం జరగదు. సుఖాల ద్వారానూ, పరీక్షించబడుతుంది. పిలుపును నొక్కివేయడానికి కేవలం జైలు ద్వారాలు మటుకే తెరవబడవు, అధికారాసనాలు అందజేయబడతాయి. అత్యాచారం, దౌర్జన్యాలు జరిగినా పిలుపు వ్యాపిస్తూ పోతే దాని ముందర సిరిసంపదల అడ్డుకట్టలు నిర్మించబడతాయి. ఈ పరీక్ష చాలా కఠినమయినది. ఎవరయితే ఉక్కు సంకెళ్ళను త్రెంచివేస్తారో వారు బంగరు సంకెళ్ళతో సంతోషంగా ఖైదీలయిపోతారు. ఈ పరీక్షలో నెగ్గాలంటే, ఇక్కడి మహా గొప్ప ఆనందాన్ని సయితం అత్యల్పమయినదిగా భావించేవారికే సాధ్యం. పరలోక వరాలను పొందే సంతోషంలో ఇక్కడి సుఖాలను విస్మరించేవారికి, అక్కడి శిక్షాయాతనల ఊహ ఇక్కడి ప్రతి కష్టాన్ని సులభతరం చేయగల వారికి, పరలోక సాఫల్యమే వాస్తవ సాఫల్యంగా, పరలోక నిష్ఫలతే నిజమయిన నిష్ఫలతగా నమ్మే వారికి మాత్రమే ఇది సాధ్యం.

فَمَنْ زُحْزِحَ عَنِ النَّارِ وَ اُدْخِلَ

**ఎవరయితే నరకాగ్ని నుండి కాపాడబడి, స్వర్గంలోకి ప్రవేశింపజేయబడతాడో అతనే**

الْجَنَّةَ فَقَدْ فَازَ ط وَ مَا الْحَيٰوةُ الدُّنْيَا إِلَّا مَتَاعُ الْغُرُوْرِ ○ (آل عمران:۱۸۵)

సఫలీకృతుడు. మరి ఈ ప్రపంచమయితే కేవలం వంచనా సామగ్రి.

*(అలి ఇమ్రాన్ : **185**)*

దైవధర్మ సందేశకుడు, ప్రళయం వస్తుందని ప్రపంచానికి చాటిచెప్పినప్పుడు, ఏ విషయమూ మానవుణ్ణి తన అంతిమ పరిణామం వరకు చేరకుండా ఆపజాలదని తెలిపినప్పుడు, సాధారణ బుద్ధివివేకాల ప్రకారం, అతను ఒక్క క్షణంపాటు కూడా తన పరిణామం గురించి నిశ్చింతగా నిలువలేడు. ఏ వ్యక్తికయితే ప్రళయం రాక గురించి తెలియదో అతను దాన్ని గురించి ఏమరుపాటుకు లోనవవచ్చు. కాని ఏ వ్యక్తి దివా రాత్రులు అది వస్తుందన్న సమాచారమే అందజేస్తూ ఉంటాడో అతనికి విస్మరణా నిద్ర ఆవహించడమన్నది సాధ్యమయిన విషయం కాదు. పరలోకం గురించి భయపెట్టేవాని జీవితం, దాని భయం లేకుండా సాగుతూ ఉంటే, అతను ఏదో ఓ అబద్ధపు సమాచారం ద్వారా ప్రపంచ ప్రజలను మోసపుచ్చుతున్నాడని అనుకోవలసి ఉంటుంది. దీని ద్వారా అతను ప్రజల సుఖాన్ని భంగపరచదలిచాడని అనవలసివస్తుంది. మానవుడు ఇతరుల్ని పరలోక శిక్ష నుండి తప్పించాలని దైవం మానవునికి ఆదేశమిచ్చిన చోటనే మనిషి తన వ్యక్తిత్వాన్ని సయితం దాన్నుండి కాపాడుకోవాలని నిర్దేశించాడు. ప్రపంచంలో ఏ వ్యక్తి అయినా మోక్షాన్ని పొందేందుకు ఎంతగా అగత్యపరుడో అంతే అవసరం స్వయంగా మనిషికీ ఉంది. మనిషి ఇతరులనయితే నరకయాతన నుండి రక్షించి స్వయంగా తాను అందులోకి దుమకడం కన్నా పెద్ద ఆత్మహత్య మరేది కాగలదు? దైవ సన్నిధిలో మానవుని ఒక్కొక్క చర్యకు లెక్కకట్టడం జరుగుతుంది. ఈ ప్రపంచంలో అతను చేస్తున్న ప్రతి పనికి పూర్తిగా ప్రతిఫలం ఇవ్వడం జరుగుతుంది. అక్కడ మోక్షం అన్నది కేవలం, చిత్తశుద్ధితో దైవధర్మాన్ని స్వీకరించి, దాన్ని మనఃపూర్వకంగా అనుసరించేందుకు సిద్ధమయిన వ్యక్తికే ప్రాప్తమవుతుంది. వాస్తవమేమిటంటే, ఏ వ్యక్తి దృష్టిలో ఈ భయంకర దినం ఉంటుందో అతను తన అంతిమ పరిణామం గురించి అనవరతం చింతిస్తూ ఉంటాడు. అటువంటి వ్యక్తి ఇతరులనయితే దైవశిక్షను గురించి భయపెడ్తూ తాను మటుకు ఆయన సమక్షంలో ఇట్టే ఎటువంటి సన్నద్ధత లేకుండా హాజరవుతాడని ఊహించడం కూడా సరయినది కాదు. ఇంత పెద్ద సాహసం అతను చేస్తాడంటే అది, పరలోకాన్ని అతను మాటిమాటికీ పేర్కొంటున్నప్పటికీ దాన్ని వాస్తవంగా తాను మరచిపోయే ఉంటాడు, అక్కడి సద్ఫలితమయినా దుష్ఫలితమయినా అంతా కేవలం ఒక పరిహాసంగా పరిగణిస్తూ ఉంటాడు, అప్పుడే అది సాధ్యం.



# దివ్యఖుర్‌ఆన్ అంతిమ దైవగ్రంథం

## ఖుర్‌ఆన్ పరిచయం

ఖుర్‌ఆన్ భువిపైన దేవుని అంతిమ గ్రంథం. ఇది "మానవాళికి మార్గబోధన" (అల్ బకర: 185). ఇది ప్రళయం వరకు మానవులందరికీ మార్గదర్శకత్వం, సన్మార్గదర్శినిగా అవతరింపజేయబడింది. దీని ద్వారా మానవులు ప్రపంచంలోనూ సఫలీకృతులు, తేజోముఖులవుతారు, పరలోకంలోనూ శాశ్వత సాఫల్యానికీ విజయానికీ చేరువవుతారు. ఇది జీవితానికి రుజుమార్గం. ప్రపంచంలో మానవునికి విభిన్న మార్గాలు తెరువబడి ఉన్నాయి. ఈ గ్రంథం అతి సరళమయిన, రుజుమార్గాన్ని, నిజమార్గాన్ని చూపుతుంది. దీన్ని అనుసరించేవాడు ఎన్నడూ మార్గవిహీనతకు లోనవడు. దీన్ని వదలి మరే వేరే మార్గమయినా అనుసరించే వారు అసలు గమ్యం వరకు చేరడం సాధ్యంకాదు.

قَدْ جَآءَ كُمْ مِنَ اللّٰهِ نُوْرٌ وَّ كِتٰبٌ مُّبِيْنٌ ۝ يَهْدِىْ بِهِ اللّٰهُ مَنِ اتَّبَعَ رِضْوَانَهٗ سُبُلَ السَّلٰمِ وَ يُخْرِجُهُمْ مِنَ الظُّلُمٰتِ اِلَى النُّوْرِ بِاِذْنِهٖ وَ يَهْدِيْهِمْ اِلٰى صِرَاطٍ مُّسْتَقِيْمٍ۝

(المائدة:١٥،١٦)

నిస్సందేహంగా మీ వద్దకు దైవం వద్ద నుండి ఒక కాంతి, స్పష్టమయిన గ్రంథం వచ్చేసింది. దీని ద్వారా దేవుని అభీష్టం మేరకు అనుసరించదలచిన వ్యక్తికి అల్లాహ్ శ్రేయోసుఖాల దారి చూపిస్తాడు. వారిని ఆయన అంధకారాల నుండి వెలికి తీసి తన అనుజ్ఞతో వెలుగులోకి తీసుకు వస్తాడు, రుజుమార్గం వైపునకు వారికి దర్శకత్వం వహిస్తాడు.

*(అల్ మాఇద : 15,16)*

దివ్యఖుర్‌ఆన్ శుభవార్త, హెచ్చరిక, బెదరింపు కూడా కలిగి ఉంది. ఇది చూపే బాటలో నడిచే వారికి ఇది శుభవార్తనిస్తుంది. ఆ దారికి విముఖులయిన వారిని అది

జాగరూకపరుస్తుంది, వారు శాశ్వత నిష్ఫలతకు లోనవుతారని హెచ్చరిస్తుంది.

اِنَّ هٰذَا الْقُرْاٰنَ يَهْدِىْ لِلَّتِىْ هِىَ اَقْوَمُ وَ يُبَشِّـــرُ الْمُؤْمِنِيْنَ الَّـــذِيْنَ يَعْمَلُوْنَ الصّٰلِحٰتِ اَنَّ لَهُمْ اَجْرًا كَبِيْرًا ۝ وَّ اَنَّ الَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِالْاٰخِرَةِ اَعْتَدْنَا لَهُمْ عَذَابًا اَلِيْمًا ۝

(بنی اسرائیل:۹،۱۰)

నిస్సందేహంగా ఈ ఖుర్‌ఆన్ ఎంతో సరళమయిన రుజుమార్గాన్ని చూపెడుతుంది. విశ్వసించి సదాచరణ చేసే వారికి శుభవార్తనిస్తుంది. వారికి మహాప్రతిఫలముంది. మరెవరయితే పరలోకాన్ని విశ్వసించరో వారి కొరకు మేము భయంకరమయిన యాతన సిద్ధపరచిపెట్టాము.

***(బనీ ఇస్రాయీల్ : 9,10)***

దివ్యఖుర్‌ఆన్ మానవుని సహజ కంఠధ్వని. ఈ శబ్దం వినగానే అతను పరుగిడిపోవాలి. కాని మనిషి సాధారణంగా తన ప్రకృతినిచ్చే ఈ పిలుపును వినడు. విన్నా సమాధానం ఇవ్వడు. దీనికి ఎన్నో బాహ్యపరమయిన అంతర్గతమయిన కారణాలున్నాయి. ఖుర్‌ఆన్ మానవునికి అతని ప్రకృతి మరచిపోయిన పాఠాన్ని గుర్తుచేస్తుంది. సత్యాన్ని స్వీకరించమని ఆహ్వానిస్తుంది. అందువల్లనే దీన్ని 'జిక్ర్' లేక 'జ్ఞాపిక' అని పిలువడం జరిగింది. హజ్రత్ మూసా, హారూన్‌ల (అ)కు తౌరాత్ ఇవ్వబడింది. ఇది సత్యాసత్యాల వ్యత్యాసాన్ని విడమర్చి తెలిపేది. అందులో మార్గబోధన వెలుగు ఉండేది. ఇది అల్లాహ్‌కు, పరలోకానికి భయపడే వారికి జ్ఞాపికగా ఉపకరించేది. అందులో అల్లాహ్ ఆదేశాలుండేవి, షరీఅత్ ధర్మశాస్త్రముండేది. కాని కాలక్రమేణ స్వయంగా దాని అనుయాయులు చేజేతులా అందులో ప్రక్షిప్తాలకు పాల్పడ్డారు. ఆ తరువాత ఈ ఖుర్‌ఆన్ అవతరించింది.

وَ هٰذَا ذِكْرٌ مُّبٰرَكٌ اَنْزَلْنٰهُ اَفَاَنْتُمْ لَهٗ مُنْكِرُوْنَ ۝ (الانبیاء:۵۰)

ఇదొక శుభప్రదమయిన జ్ఞాపిక, దీన్ని మేము అవతరింపజేశాము, ఏమిటీ, మీరు దీన్ని నిరాకరిస్తున్నారా?

***(అల్ అన్బియా : 50)***

మనిషి ఖుర్‌ఆన్‌ని నిరాకరించినప్పుడు అది ఎంతో ఆశ్చర్యంగా అంటుంది:

بَلْ اَتَيْنٰـهُمْ بِذِكْرِهِـــمْ فَهُـــمْ عَنْ ذِكْرِهِمْ مُّعْرِضُوْنَ ۝

(المومنون:۷۱)

నిజానికి మేమయితే వీరి వద్దకు వీరి కొరకు జ్ఞాపికను తీసుకువచ్చాము, కాని వీరేమో తమ ఈ జ్ఞాపిక పట్ల విముఖులవుతున్నారు. ***(అల్ మూ'మినూన్ : 71)***

'జిక్ర్' 'జ్ఞాపిక' అంటే జ్ఞాపకం చేసేది, గుర్తు చేసేది అని అర్థం. ఇందులో ఉన్నత స్థానం, విశిష్టత, శ్రేష్టత, మహత్వమూ అన్న భావనలూ ఉన్నాయి. ఎందుకంటే ఖుర్ఆన్ మానవాళి కొరకు ఉత్కృష్టతా హేతువయినది. అది మానవాళికి మహత్తును, సమున్నతిని, ప్రసాదిస్తుంది.

لَقَدْ اَنْزَلْنَا اِلَيْكُمْ كِتَابًا فِيْهِ ذِكْرُكُمْ اَفَلاَ تَعْقِلُوْنَ٥ (الانبياء:١٠)

**మేము నీ వైపునకు గ్రంథాన్ని అవతరింప జేశాము, అందులో మీ ప్రస్తావన ఉంది, మీరు బుద్ధిని ఉపయోగించరా?**

***(అల్ అన్బియా: 10)***

ఎవరయితే 'జిక్ర్' (జ్ఞాపిక)ను తిరస్కరిస్తాడో అతను స్వయంగా తనకే శత్రువు. అతను తన మేలును కోరుకోవడం లేదు. ఈ ఏమరుపాటు, అశ్రద్ధలని దైవసన్నిధిలో తప్పక ప్రశ్నించడం జరుగుతుంది.

وَ اِنَّهٗ لَذِكْرٌ لَّكَ وَ لِقَوْمِكَ وَ سَوْفَ تُسْئَلُوْنَ٥ (الزخرف:٤٤)

**నిస్సందేహంగా ఇది జ్ఞాపిక నీకూ నీ జాతి వారి కొరకు. అనతి కాలంలోనే నిన్ను అడగటం జరుగుతుంది.**

***(అజ్ జుఖ్రుఫ్ : 44)***

ఈ గ్రంథం ఆసాంతం సత్యమయినది. ఇందులో మిథ్య అన్నది లేశమయినా మిశ్రమం కాలేదు, కాజాలదు కూడా.

اِنَّ الَّذِيْنَ كَفَرُوْا بِالذِّكْرِ لَمَّا جَآءَهُمْ ۚ وَاِنَّهٗ لَكِتٰبٌ عَزِيْزٌ٥ لاَ يَاْتِيْهِ الْبَاطِلُ مِنْ بَيْنِ يَدَيْهِ وَلاَ مِنْ خَلْفِهٖ ؕ تَنْزِيْلٌ مِّنْ حَكِيْمٍ حَمِيْدٍ٥

(حٰمٓ السجدة:٤١،٤٢)

**నిశ్చయంగా ఎవరయితే జ్ఞాపిక (ఖుర్ఆన్) వచ్చేసిన తరువాత కూడా దాన్ని తిరస్కరించారో వారు (తమ చేష్టల పరిణామాన్ని తప్పక చవిచూడనున్నారు). నిస్సందేహంగా ఈ గ్రంథం అన్నిటిపైనా ఆధిక్యత గలది. మిథ్య దీని ముందు నుంచీ రాజాలదు, వెనుక నుంచీ రాజాలదు. ఇది దైవం తరఫున అవతరించింది, ఆయన పరమ వివేకవంతుడు, అత్యంత స్తవనీయ గుణ శీలుడు.**

***(హామీమ్ అస్సజ్దా : 41-42)***

إِنَّا نَحْنُ نَزَّلْنَا الذِّكْرَ وَإِنَّا لَهُ لَحَافِظُونَ ○ (الحجر:٩)

**నిస్సందేహంగా మేమే ఈ జ్ఞాపిక (ఖుర్‌ఆన్)ని అవతరింపజేశాము, మేమే నిస్సంకోచంగా దీన్ని పరిరక్షించేవార మున్నూ.** *(అల్ హిజ్ర్ : 9)*

పరమ ప్రభువు చేసిన ఈ వాగ్దానం నెరవేరింది. దైవగ్రంథాలలో నేడు కేవలం ఒక్క ఖుర్‌ఆన్‌కు మటుకే సుభద్ర గ్రంథస్థానం ప్రాప్తమయి ఉంది. ఇది మహనీయ ముహమ్మద్ (స)కు అవతరించిన రీతిలోనే, ఆయన నోటి ద్వారా విన్న విధంగానే నేటికీ చదవబడుతుంది, చదివించబడుతుంది. దీన్ని అన్ని కాలాల్లోనూ వేనవేల జనులు కంఠస్థం చేసుకున్నారు, అది వారి నోట ధారాళంగా పారింది. అంతేకాదు, దీని స్థానం ఒక పవిత్ర గ్రంథం వంటిది. ఇది తొలి రోజు నుంచీ గ్రంథస్థమవుతూ వచ్చింది, ప్రపంచంలో మూలమూలన దీన్ని ప్రచురించడం జరిగింది. ఇంకా జరుగుతూనే ఉంది. ఇందులో నేటి వరకు ఒక్క అక్షరం కాదు ఒక్క పొల్లు కూడా మారలేదు, ఇంకా అలా జరిగే అవకాశమూ లేదు.

ఇది 'ప్రస్ఫుట గ్రంథం' (యూసుఫ్ : 1). ఇది ప్రకాశమానమయిన అరబీలో అవతరించింది. (అన్ నహ్ల్ : 103). దీని అవతరణా లక్ష్యం, దీని ఆశయం, ఉద్దేశ్యం అన్నీ స్పష్టంగా ఉన్నాయి. దీని విషయాలు సకల విధాల చిక్కులతో శుద్ధపరచబడి ఉన్నాయి.

وَالْكِتٰبِ الْمُبِيْنِ ○ إِنَّا جَعَلْنٰهُ قُرْاٰنًا عَرَبِيًّا لَّعَلَّكُمْ تَعْقِلُوْنَ ○ (الزخرف:٢،٣)

**అతి స్పష్టమయిన ఈ గ్రంథంపై ఒట్టు. దీన్ని మేము అరబీ ఖుర్‌ఆన్‌గా చేశాము, మీరు అర్థం చేసుకోగలగాలనీ.** *(అజ్‌జుఖ్రుఫ్ : 2,3)*

ఈ గ్రంథాన్ని చదవడం, అర్థం చేసుకోవడం, దీని మార్గదర్శకత్వం ద్వారా ప్రయోజనం పొందడంలో ఎటువంటి ఇబ్బంది లేదు. ఇది జీవితంలోని అతి సున్నితమయిన సమస్యల్ని సయితం చర్చించింది. దాని ద్వారా ఓ సాధారణ వ్యక్తి కూడా తన అవగాహనా శక్తి మేరకు దాన్ని సునాయాసంగా అర్థం చేసుకోగలడు. ఏ విషయంలో నయినా దీని అభిప్రాయాన్ని తెలుసుకోవడంలో అతనికి ఎటువంటి కష్టమూ కలగదు. ఈ కారణంగానే ప్రపంచంలోని ప్రతి వ్యక్తీ దీని సంబోధితుడే.

وَلَقَدْ يَسَّرْنَا الْقُرْاٰنَ لِلذِّكْرِ فَهَلْ

**మేము ఖుర్‌ఆన్‌ని హితబోధన కొరకు సులభతరం చేశాము, ఉన్నారా ఎవ**

مِنۡ مُّدَّكِرٍ ۝ (القمر:١٧)

రయినా హితవు పొందేవారు?

*(అల్ కమర్ : 17)*

ఖుర్ఆన్ కోరేదేమిటంటే దాని మాటల్ని శ్రద్ధగా ఆసక్తిగా వినాలి, అప్పుడే దాని సత్యత అభివ్యక్తమవుతుంది.

هٰذَا بَصَائِرُ مِنۡ رَّبِّكُمۡ وَ هُدًى وَّ رَحۡمَةٌ لِّقَوۡمٍ يُّؤۡمِنُوۡنَ ۝ وَ اِذَا قُرِئَ الۡقُرۡاٰنُ فَاسۡتَمِعُوۡا لَهٗ وَ اَنۡصِتُوۡا لَعَلَّكُمۡ تُرۡحَمُوۡنَ ۝ (الاعراف:٢٠٣،٢٠٤)

**ఇవి మీ ప్రభువు వద్ద నుంచి వచ్చిన నిదర్శనాలు, ఆధారాలు. ఇది విశ్వసించే వారి కొరకు మార్గబోధన, కారుణ్యం. ఖుర్ఆన్ పఠించబడినప్పుడు దాన్ని పూర్తి శ్రద్ధాసక్తులతో మౌనంగా వినండి. తద్వారా మీకు అల్లాహ్ కారుణ్యం కలుగుతుంది.**

*(అల్ ఆరాఫ్ : 203, 204)*

ఖుర్ఆన్ తన వచనాలను గురించి ఆలోచించాలని, యోచించాలని మాటిమాటికీ ఆహ్వానిస్తుంది. చింతనాపరులు, అంతర్దృష్టి కలవారు దాన్ని నిరాకరించరని దానికి పూర్తిగా నమ్మకముంది. దీని ద్వారా వారు హితబోధ పొందగలరనీ అది ఆశిస్తుంది:

كِتٰبٌ اَنۡزَلۡنٰهُ اِلَيۡكَ مُبٰرَكٌ لِّيَدَّبَّرُوۡا اٰيٰتِهٖ وَ لِيَتَذَكَّرَ اُولُوا الۡاَلۡبَابِ ۝ (ص:٢٩)

**ఇదొక శుభప్రదమయిన గ్రంథం. దీన్ని (ప్రవక్తా,) మేము నీకు అవతరింపజేశాము తద్వారా ఈ జనులు దీని వచనాలను గురించి యోచన చేయాలని, బుద్ధిగల వారు దీని ద్వారా హితబోధన పొందాలనీను.** *(సాద్ : 29)*

## వ్యతిరేకుల వైఖరి

దేవుని ఈ గ్రంథం పట్ల దీని వ్యతిరేకులు ఆశ్చర్యకరమయిన వైఖరి నవలంబించారు. వారు దీని సత్యతను, వాస్తవికతను, దీని ఆధారాలు, నిదర్శనాలనుస్వయంగా ఈ గ్రంథంలో వెదకడానికి బదులు మహిమలు చూపమని కోరసాగారు. నిజానికి ఈ గ్రంథం తనదయిన ప్రత్యేక భాష, భావప్రకటనా విధానం, అనుపమ బోధనల రీత్యా స్వయంగానే ప్రపంచంలో ఓ మహత్తరమయిన మహిమ. ఇది ఉండగా మరో మహిమ అవసరమే మిగులదు. అందువల్లనే ఖుర్ఆన్ స్వయంగా అంటుంది:

وَ قَالُوْا لَوْلَآ اُنْزِلَ عَلَيْهِ اٰيٰتٌ مِّنْ رَّبِّهٖ قُلْ اِنَّمَا الْاٰيٰتُ عِنْدَ اللّٰهِ ؕ وَ اِنَّمَآ اَنَا نَذِيْرٌ مُّبِيْنٌ ۝ اَوَلَمْ يَكْفِهِمْ اَنَّآ اَنْزَلْنَا عَلَيْكَ الْكِتٰبَ يُتْلٰى عَلَيْهِمْ ؕ اِنَّ فِيْ ذٰلِكَ لَرَحْمَةً وَّ ذِكْرٰى لِقَوْمٍ يُّؤْمِنُوْنَ ۝

(العنكبوت:۵۰،۵۱)

వారంటున్నారు ముహమ్మద్ (స) కు అతని ప్రభువు పక్షాన ఏవయినా సూచ నలు (మహిమలు) ఎందుకు అవతరించ లేదు. వారికి చెప్పు, మహిమలు అల్లాహ్ హస్తగతమయి ఉన్నాయి. నేనయితే కేవలం అతి స్పష్టంగా భయపెట్టేవాణ్ణి మాత్రమే. వీరికి ఇది (సూచన) సరిపోదా, మేము నీకు ఈ గ్రంథాన్ని అవతరింప జేశాము, వీరికి చదివి వినిపించబడుతూ కూడా ఉంది. నిస్సందేహంగా ఇందులో కారుణ్యం, ఉపదేశం ఉన్నాయి, దీన్ని నమ్మే జనుల కొరకు.

*(అల్ అన్కబూత్ : 50, 51)*

దివ్యఖుర్ఆన్ సూరాల వారీగా విభజించబడి ఉంది. ఇందులోని అత్యంత కనిష్ఠ సూరా (కౌసర్ సూరా)లో కేవలం మూడు ఆయత్‌లున్నాయి. దీని అత్యంత గరిష్ఠ సూరా బకర సూరా. ఇందులో రెండు వందల ఎనభయి ఆరు ఆయత్‌లున్నాయి. కాని దీని ప్రతి చిన్న పెద్ద సూరా ఒక మహిమే. ఖుర్ఆన్ వ్యతిరేకుల్ని ఛాలెంజి చేసింది, మీరు ఇలాంటిది ఒక్క సూరానయినా తీసుకువచ్చి చూపండి అని. దీనికి వారు ఎటువంటి సమాధానం ఇవ్వలేదు. ఇది అతి స్పష్టమయిన ఆధారం, నిదర్శనం, ఇది దైవగ్రంథమనడానికి, ఈ వచనం దైవ వచనమనడానికి, మానవ వచనం కాదనడానికి.

وَ اِنْ كُنْتُمْ فِيْ رَيْبٍ مِّمَّا نَزَّلْنَا عَلٰى عَبْدِنَا فَاْتُوْا بِسُوْرَةٍ مِّنْ مِّثْلِهٖ ۪ وَادْعُوْا شُهَدَآءَكُمْ مِّنْ دُوْنِ اللّٰهِ اِنْ كُنْتُمْ صٰدِقِيْنَ ۝ (البقرة:۲۳)

మేము మా దాసునికి అవతరింపజేసిన ఈ గ్రంథం వట్ల మీకు అనుమానం ఏదయినా ఉంటే ఇటువంటి ఒక సూరా మీరు తీసుకురండి, అల్లాహ్ తప్ప మీరు మొరపెట్టు కునే వారిని పిలుచుకోండి. మీరు (ఇది దైవం తరఫున అవతరించ లేదన్న మీ వాదనలో) సత్యవంతులయితే.

*(అల్ బకర : 23)*

దివ్యఖుర్ఆన్ ఆలోచించేందుకు ఆహ్వానిస్తోంది. కాని విరోధుల జాతీయ, వంశానుగత, వర్గదురభిమానాలు వారిని వారిస్తున్నాయి. ఏ మాటనయినా ఆధారాల

ద్వారా అర్థం చేసుకునే బదులు వారు తమ ప్రాచీన సంప్రదాయాలు, పాతపడిన భావాల కొరకే పట్టుపడుతున్నారు. తమ ఈ సంప్రదాయాలు తప్పు కాగలవని వారు నమ్మడానికి సిద్ధంగా లేరు. వారు గతాన్ని గుడ్డిగా ప్రేమిస్తున్నారు. వారి దృష్టిలో వారి పూర్వీకులు జ్ఞానం, ఘనతల్లో, బుద్ధివివేకాలలో అందరినీ మించినవారని శ్రేష్ఠులని వారు అనుకుంటున్నారు. వారిని అధిగమించి మరెవరూ పోలేరని కూడా వారి నమ్మకం. వారు చెప్పినదేదయినా, చేసినదేమయినా అంతా సరయినదే సవ్యమయినదేనని వారి భావం. వారిని విమర్శించే హక్కు అధికారం ఎవరికీ లేదన్న మాటనూ వారు గట్టిగా నమ్మేవారు.

## పెద్దల తప్పు పట్టడమూ తప్పే అని నమ్మేవారు!

ఇది నిజానికి ఒక ఆచరణాయోగ్యంకాని అసమంజసమయిన నిర్హేతుకమైన వైఖరి. సత్యాన్ని అన్వేషించే మాటయితే ఈ వైఖరిని విడనాడాలని ఖుర్ఆన్ హెచ్చరించింది:

وَ اِذَا قِيۡلَ لَهُمُ اتَّبِعُوۡا مَآ اَنۡزَلَ اللّٰهُ
قَالُوۡا بَلۡ نَتَّبِعُ مَآ اَلۡفَيۡنَا عَلَيۡهِ اٰبَآءَنَا
اَوَلَوۡ كَانَ اٰبَآؤُهُمۡ لَا يَعۡقِلُوۡنَ شَيۡـًٔا
وَّلَا يَهۡتَدُوۡنَ ○ (البقرة:١٧٠)

**దైవం అవతరింపజేసిన ఈ గ్రంథాన్ని అనుసరించండని వారికి చెప్పినప్పుడల్లా వారు, మేము మా తండ్రీ, తాతలను ఏ మార్గాన చూశామో దాన్ని అనుసరిస్తాము అని బదులు పలుకుతారు. ఏమిటీ? వీరు తమ తండ్రీ తాతలు సరయిన అవగాహన లేని వారయినా వారు రుజుమార్గాన లేకపోయినా వారినే అనుసరిస్తారా?**

***(అల్ బకర : 170)***

దివ్యఖుర్ఆన్ బోధనలు ఒకదాని తరువాత మరొకటి ఆధారసహితంగా ముందుకు వస్తున్నాయి. విరోధుల మిథ్యాభావాలు, బూటకపు ఆలోచనల పట్ల ఎంతో సంస్కారవంతంగా, సభ్యతతో విమర్శించడంతోపాటు, ప్రపంచంలోనూ పరలోకంలోనూ దాని దుష్ఫలితాలను గురించి హెచ్చరించడమూ జరుగుతుంది. దీనికి ప్రతి వారి పక్షాన ఎంతో భావావేశం ప్రదర్శించడంతోపాటు గలబా, రణగొణధ్వనులు, హంగామా ద్వారా ఖుర్ఆన్ గొంతుకను నొక్కివేయడానికి సకల ప్రయత్నాలూ జరుగుతున్నాయి. ఇదీ విరోధుల వైఖరి:

وَ قَالَ الَّذِيۡنَ كَفَرُوۡا لَا تَسۡمَعُوۡا
لِهٰذَا الۡقُرۡاٰنِ وَالۡغَوۡا فِيۡهِ لَعَلَّكُمۡ

**ఎవరయితే తిరస్కార మార్గాన్ని అవలంబించారో, వారు ఇలా అంటారు, 'ఈ ఖుర్ఆన్ని వినకండి, అది చదివేటప్పుడు**

تغلِبون○ (حٰمٓ السجدة:٢٦)

వృధా మాటలతో గలభా సృష్టించండి, ఈ విధంగా మీరే ఆధిక్యత నొందగలరని ఆశించవచ్చు.' *(హామీమ్ అస్‌సజ్దా : 26)*

వారు ఖుర్‌ఆన్ ధ్వనిని అణచివేయడానికి ఆటలుపాటలు, సాంస్కృతిక కార్యక్రమాలను ఏర్పరిచారు. తద్వారా కాలక్షేపం, భావోద్రేకాల వాతావరణం నెలకొనాలని, ఖుర్‌ఆన్ గంభీర బోధనల వైపునకు ఎవరి దృష్టీ మరలరాదని ఆశించారు. వారి ఈ చేష్టల వల్ల వారు జ్ఞానం, అవగాహనం, బుద్ధివివేకాల క్షేత్రంలో ఓడిపోయారని తేలిపోయింది. కాని శక్తి, అధికారాల పొగరులో వారు దాన్ని స్వీకరించడానికి సిద్ధంగా లేరు. దానికి బదులు, అసలు ఖుర్‌ఆన్ సందేశమే శ్రద్ధ చూపే అర్హత లేనిదని చాటేవారు, దాని పట్ల శ్రద్ధ చూపడం తమ గొప్పదనానికి తగదని చెప్పేవారు.

وَمِنَ النَّاسِ مَنْ يَّشْتَرِىْ لَهْوَ الْحَدِيْثِ لِيُضِلَّ عَنْ سَبِيْلِ اللّٰهِ بِغَيْرِ عِلْمٍ وَّ يَتَّخِذَهَا هُزُوًا، اُولٰٓئِكَ لَهُمْ عَذَابٌ مُّهِيْنٌ○ وَ اِذَا تُتْلٰى عَلَيْهِ اٰيٰتُنَا وَلّٰى مُسْتَكْبِرًا كَاَنْ لَّمْ يَسْمَعْهَا كَاَنَّ فِىْٓ اُذُنَيْهِ وَقْرًا ۚ فَبَشِّرْهُ بِعَذَابٍ اَلِيْمٍ○

(لقمان:٦،٧)

జనుల్లో కొందరున్నారు. వారు, దైవం పట్ల అశ్రద్ధను అధికం చేసే విషయాలను కొని తెచ్చుకుంటారు. తద్వారా తమకు తెలియకపోయినా జనుల్ని దైవమార్గం నుండి తొలిగించాలని చూస్తుంటారు, దాన్ని పరిహాసంపాలు చేయాలని అనుకుంటారు. వీరి కొరకు పరాభవకరమయిన యాతన విధితమయి ఉంది. వారిలో ఎవరికయినా మా వచనాలను వినిపించినప్పుడు వారు గర్వంతో వెనుతిరిగిపోతారు, తామసలు విననే లేదన్నట్టు. ఇటువంటి వారికి వ్యధాభరితమయిన శిక్ష శుభవార్తనివ్వు.

*(లుక్మాన్ : 6,7)*

ఇటువంటి అత్యంత అసమంజస, అహేతుక వైఖరి సత్యమార్గాలలోఅన్నింటికన్నా పెద్ద అవరోధం. దీన్ని అవలంబించిన వ్యక్తి ఎన్నటికీ సత్యాన్ని పొందలేడు. కాగా మిథ్యావాదపు తెరల్ని చీల్చివేసే ఖుర్‌ఆన్, దాని వ్యతిరేకుల కొరకు ఒక అడ్డు తెరగా రూపొందింది.

وَ اِذَا قَرَأْتَ الْقُرْاٰنَ جَعَلْنَا بَيْنَكَ وَ بَيْنَ الَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِالْاٰخِرَةِ حِجَابًا مَّسْتُوْرًا ۝ وَّ جَعَلْنَا عَلٰى قُلُوْبِهِمْ اَكِنَّةً اَنْ يَّفْقَهُوْهُ وَ فِيْٓ اٰذَانِهِمْ وَقْرًا ۚ وَّ اِذَا ذَكَرْتَ رَبَّكَ فِي الْقُرْاٰنِ وَحْدَهٗ وَلَّوْا عَلٰٓى اَدْبَارِهِمْ نُفُوْرًا ۝

(بنی اسرائیل:۴۵،۴۶)

నీవు ఖుర్‌ఆన్ పఠిస్తూ ఉన్నప్పుడు, మేము నీకూ పరలోకాన్ని విశ్వసించని వారికీ మధ్యన ఓ కానరాని అడ్డు తెరను వేస్తాము, వారి హృదయాలను మరుగుపరుస్తాము. వారు అవగతపరచుకోలేరు. వారి చెవులను బండబారజేస్తాము. ఖుర్‌ఆన్‌లో నీవు ఒకే దేవుని ప్రస్తావన చేసినప్పుడు వారు వెగటుతో వెనుదిరిగి పారిపోతారు.

*(బనీ ఇస్రాయీల్ : 45, 46)*

నేడు ఖుర్‌ఆన్ పట్ల ఈ వైఖరి నవలంబించేవారు రేపు పశ్చాత్తాపంతో చేతులు నులుముకుంటారు, మమ్మల్ని మా నాయకులు నాశనం చేశారు, మేము వారి వెనుక నడవకపోతే ఎంత బావుండేది, ఇలా నాశనమయిపోయేవారము కామే అని అనుకుంటారు. ఆ సమయాన దేవుని సందేశహరులు (స) కూడా ఇలా విన్నవించు కుంటారు:

وَ قَالَ الرَّسُوْلُ يٰرَبِّ اِنَّ قَوْمِي اتَّخَذُوْا هٰذَا الْقُرْاٰنَ مَهْجُوْرًا ۝

(الفرقان:۳۰)

అప్పుడు దైవసందేశహరుడు అంటాడు, నా ప్రభూ, నా జాతి జనులు ఈ ఖుర్‌ఆన్‌ని పూర్తిగా వదలివేశారు.

*(అల్‌ఫుర్‌కాన్ : 30)*

## విశ్వసించే వారిని ఖుర్‌ఆన్ కోరేది....

ఖుర్‌ఆన్ అల్లాహ్ అవతరింపజేసిన గ్రంథమని నమ్మేవారిని, దీన్ని మార్గబోధనా గ్రంథమని, మోక్షమార్గమని భావించే వారిని ఖుర్‌ఆన్ కొన్ని విషయాలను కోరింది. ఇలా కోరడం, దాన్ని విశ్వసించడం వల్ల తారసిల్లే సరయిన ఆవశ్యకతలు, ఖుర్‌ఆన్‌ని దైవ గ్రంథమని నమ్మే ఏ వ్యక్తీ వీటిని నిరాకరించలేడు.

## ఖుర్‌ఆన్‌ని గట్టిగా పట్టుకోవాలి

దైవగ్రంథం కోరే మొట్టమొదటి అంశం, మనిషి దాన్ని గట్టిగా పట్టుకోవాలి. దాని పట్ల అతని మానసిక ఆచరణాత్మక సంబంధం పటిష్టమయి ఉండాలి. జీవితంలో అత్యంత

సున్నితమయిన, కఠినతరమయిన కాలంలోనూ, మరే దశలోనయినా అతని పట్టు సడల రాదు, అతను దాని బోధనల్ని సక్రమంగా పాటిస్తూ ఉండాలి. హజ్రత్ యహ్యా (అలైహిస్సలామ్) కు ఆదేశమయింది,

يٰيَحْيٰى خُذِ الْكِتٰبَ بِقُوَّةٍ (مریم:١٢)

"యహ్యా! గ్రంథాన్ని గట్టిగా పట్టుకో." *(మర్యమ్ : 12)*

ప్రవక్త మహనీయులు (స)కు ఆదేశమయింది :

فَاسْتَمْسِكْ بِالَّذِيْٓ اُوْحِيَ اِلَيْكَ ۚ اِنَّكَ عَلٰى صِرَاطٍ مُّسْتَقِيْمٍ ○ (الزخرف:٤٣)

**కాగా నీవు, నీకు అవతరింపజేయబడు తున్న ఈ వహీని గట్టిగా పట్టుకో, నిస్సం దేహంగా నీవు రుజుమార్గాన ఉన్నావు.** *(అజ్‌జుఖ్రుఫ్ : 43)*

అంటే వహీ ద్వారా అవతరిస్తున్న గ్రంథాన్ని గట్టిగా పట్టుకోండి, ఈ వెలుగు మీతో పాటు ఉన్నంత వరకు రుజుమార్గం మీకు స్పష్టం అవుతుందని గట్టి నమ్మకం కలిగి ఉండింది, మీరు దాన్నే అనుసరిస్తున్నారన్నదీ నిశ్చయ విషయం. ఇందులో ఓ మహా సత్యాన్ని విడమర్చి తెలుపడం జరిగింది. ఏ వ్యక్తి అయితే ఈ గ్రంథం చూపిన దారిన నడుస్తాడో, అతనికి తాను సరయిన బాటలో పయనిస్తున్నాడని, నిజగమ్యానికి తప్పని సరిగా చేరి తీరు తాడని సంతృప్తి కలగాలి. మనిషికి, తాను సత్యపథాన ఉన్నట్లు, రుజు మార్గాన్నే నడుస్తున్నట్లు గట్టి నమ్మకం, సంతృప్తి ప్రాప్తమయినట్లయితే అతనిలో మహాశక్తి, ధైర్యసాహసాలు పుడతాయి. దారిలోని కష్టాలు అతనికి సులువయిపోతాయి. దీన్నే ఖుర్‌ఆన్‌లో "తమస్సుక్ బిల్ కితాబ్" (గ్రంథాన్ని గట్టిగా పట్టుకోవడం) అనడం జరిగింది. దీనివల్ల మనిషి రుజుమార్గాన స్థిరంగా నిలబడటం మాత్రమే కాక, ప్రపంచానికి మార్గదర్శిగా, సంస్కర్తగా పైకి వస్తాడు. అతని వల్ల ప్రపంచానికి సాఫల్యం, సంస్కరణా మార్గాలు ప్రాప్తమవుతాయి. దివ్యఖుర్‌ఆన్ సంస్కర్తల ఓ ప్రత్యేక గుర్తుగా ఈ 'తమస్సుక్ బిల్ కితాబ్'నే సూచించింది.

وَالَّذِيْنَ يُمَسِّكُوْنَ بِالْكِتٰبِ وَ اَقَامُوا الصَّلٰوةَ ۭ اِنَّا لَا نُضِيْعُ اَجْرَ الْمُصْلِحِيْنَ ○ (الاعراف:١٧)

**ఎవరయితే గ్రంథాన్ని గట్టిగా పట్టు కుంటారో, నమాజ్‌ని స్థాపిస్తారో (వారే సంస్కర్తలు). నిస్సందేహంగా మేము సంస్కర్తలు, సదాచారుల ప్రతిఫలాన్ని వృథా చేయము.** *(అల్ ఆ'రాఫ్ : 17)*

ఒక యదార్థాన్ని మరువరాదు. దైవగ్రంథాన్ని గట్టిగా పట్టుకుని నమాజ్‌ని స్థాపించిన వారి ద్వారానే ప్రపంచ సంస్కరణా విధి నిర్వహించబడుతుంది. అల్లాహ్ దృష్టిలో వారి కృషి స్వీకారయోగ్యమవుతుంది. వారు మహా ప్రతిఫలానికి అర్హులవుతారు. అల్లాహ్ వారి ప్రతిఫలాన్ని ఎన్నడూ వృధా చెయ్యడు. దైవగ్రంథం చూపే మార్గదర్శకత్వం స్వీకరించకుండా, నమాజ్‌ని స్థాపించకుండా ప్రపంచ సంస్కరణా కార్యం ఎన్నడూ నెరవేరనూ లేదు, ఇకపై నెరవేరజాలదు కూడా.

## ఖుర్ఆన్ పారాయణం

దైవసందేశహరులకు ఇలా ఉపదేశించడం జరిగింది:

وَاتْلُ مَآ اُوْحِيَ اِلَيْكَ مِنْ كِتَابِ رَبِّكَ ۚ لَا مُبَدِّلَ لِكَلِمٰتِهٖ ۚ وَلَنْ تَجِدَ مِنْ دُوْنِهٖ مُلْتَحَدًا ۝ (الكهف:٢٧)

నీ ప్రభువు గ్రంథంలో నుంచి నీకు వహీ చేయబడుతున్న దాని పారాయణం చెయ్యి. దీని వచనాలను ఎవ్వరూ మార్చలేరు. నీకు అదొక్కటే తప్ప మరో ఆశ్రయం దొరకదు.
**(అల్ కహ్ఫ్ : 27)**

మరో చోట ఇలా సెలవీయబడింది:

اُتْلُ مَآ اُوْحِيَ اِلَيْكَ مِنَ الْكِتَابِ وَ اَقِمِ الصَّلٰوةَ ۭ (العنكبوت:٤٥)

**ఈ ఉద్గ్రంథంలో నీకు వహీ చేయబడుతున్న దానిలో నుంచి పారాయణం చెయ్యి, నమాజ్‌ని స్థాపించు.**
***(అల్ అన్కబూత్ : 45)***

దైవప్రవక్తకు పారాయణం చేయాలని ఇచ్చిన ఆదేశం, ఆయన అనుచర సమాజమయిన ముస్లిములకూ వర్తిస్తుంది. దివ్యఖుర్ఆన్ పారాయణం చేయడం అంటే కేవలం పఠించడం మాత్రమే కాదు, దాన్ని అర్థం చేసుకోవడం, దాని పట్ల యోచించడం కూడా ఆ భావంలోనే చేరి ఉన్నాయి. పారాయణం కూడా ఏదో లాంఛనంగా కాదు, వాస్తవంగా జరగాలి. పారాయణం చేస్తే మనస్సు శరీరాలపైన దాని ప్రభావం కానరావాలి. హృదయం కంపించాలి, శరీరంపైన భయభక్తుల స్థితి ఆవహించాలి. ఇది దైవగ్రంథం ద్వారా మనిషి దాని శుభసౌభాగ్యాలను పరిగ్రహిస్తున్నాడనడానికి ఆనవాలు. అతనికి సన్మార్గ బోధన ప్రాప్తమయిందనడానికి ఇది చిహ్నం.

اَللّٰهُ نَزَّلَ اَحۡسَنَ الۡحَدِيۡثِ كِتٰبًا مُّتَشَابِهًا مَّثَانِىَ ۖ تَقۡشَعِرُّ مِنۡهُ جُلُوۡدُ الَّذِيۡنَ يَخۡشَوۡنَ رَبَّهُمۡ ۚ ثُمَّ تَلِيۡنُ جُلُوۡدُهُمۡ وَ قُلُوۡبُهُمۡ اِلٰى ذِكۡرِ اللّٰهِ ؕ ذٰلِكَ هُدَى اللّٰهِ يَهۡدِىۡ بِهٖ مَنۡ يَّشَآءُ ؕ وَ مَنۡ يُّضۡلِلِ اللّٰهُ فَمَا لَهٗ مِنۡ هَادٍ ۝ (الزمر:٢٣)

అల్లాహ్ అవతరింపజేసింది ఉత్తమ మయిన మాట. అంటే పరస్పరం ఒకే లాగున్న గ్రంథం. జతలలో ఉన్నటు వంటిది. దీని ద్వారా, తమ ప్రభువు పట్ల భయమున్న వారి హృదయాలు కంపిస్తూ ఉంటాయి. ఆపైన వారి అంతర్యాలు, వారి హృదయాలు, అల్లాహ్ సంస్మరణ కొరకు మృదువయిపోతాయి. ఇది అల్లాహ్ సన్మార్గ బోధన. దీని ద్వారా ఆయన తాను కోరిన వారికి రుజుమార్గం చూపుతాడు. మరెవరికయితే అల్లాహ్ సన్మార్గం నుండి తప్పిస్తాడో అతనికి దారి చూపేవాడు మరొకడెవడూ లేదు. *(అజ్ జుమర్ : 23)*

దివ్యఖుర్ఆన్ పారాయణం వల్ల ఒక విశ్వాసిలో ఉత్పన్నమయ్యే పరిశుద్ధభావాలు, మానసిక ప్రేరణలు, దివ్యఖుర్ఆన్‌ని విన్న వానిలోనూ అవే భావాలు ప్రేరణలు ఉత్పన్నమవుతాయి. అతను అల్లాహ్ వచనాలను విని కంపిస్తాడు, అతని విశ్వాసం ద్విగుణీకృతమవుతుంది. అతను అల్లాహ్ పట్ల నమ్మకం, ఆయనపై భారం మోపడం వంటి భావాలతో మైమరచిపోతాడు. అతని ఈ స్థితినే ఈ పదాలలో వర్ణించడం జరిగింది.

اِنَّمَا الۡمُؤۡمِنُوۡنَ الَّذِيۡنَ اِذَا ذُكِرَ اللّٰهُ وَجِلَتۡ قُلُوۡبُهُمۡ وَ اِذَا تُلِيَتۡ عَلَيۡهِمۡ اٰيٰتُهٗ زَادَتۡهُمۡ اِيۡمَانًا وَّ عَلٰى رَبِّهِمۡ يَتَوَكَّلُوۡنَ ۝ (الانفال:٢)

విశ్వాసులయితే, కేవలం వారి సమక్షంలో అల్లాహ్ ప్రస్తావన రాగానే వారి హృద యాలు కుదిపివేయబడతాయి. వారికి ఆయన వచనాలు చదివి వినిపించబడి నప్పుడు అవి వారి విశ్వాసంలో వృద్ధినే చేస్తాయి. వారు తమ ప్రభువుపైనే భారం మోపుతారు. *(అల్ అన్ ఫాల్ : 2)*

దివ్యఖుర్ఆన్‌ని దాని వ్యతిరేకులు 'ప్రాచీన గాథలు' (అల్ అన్ఆమ్-25) అనేవారు. వారి దృష్టిలో ఇది కేవలం ఒక కథ లేక Fiction మాత్రమే. దాని బోధనల్ని

వినడానికి సయితం వారు సిద్ధమయ్యేవారు కారు. కాని విశ్వసించేవారి వైఖరి పూర్తిగా భిన్నమయింది. వారు దాన్ని తమ నిండు కన్నులతో చూసేవారు, పూర్తి స్పృహతో వినేవారు. దాని బోధనలు వారి కొరకు గుణపాఠం గరిపే, ఉపదేశం అందజేసే పాఠాల వంటివి. ఖుర్‌ఆన్‌ని వినడం ద్వారా వారి స్థితి తిరస్కారులు, విరోధుల స్థితికి పూర్తిగా భిన్నంగా ఉండేది.

وَ الَّذِيْنَ اِذَا ذُكِّرُوْا بِاٰيٰتِ رَبِّهِمْ لَمْ يَخِرُّوْا عَلَيْهَا صُمًّا وَّ عُمْيَانًا ○

(الفرقان:٧٣)

**వీరు ఎటువంటి వారంటే వారికి వారి ప్రభువు వచనాల ద్వారా ఉద్బోధ చేసినప్పుడు వాటి పట్ల వారు చెవిటి వారు, గుడ్డివారుగా మారి పడిపోరు.**

*(అల్ ఫుర్‌కాన్ : **73**)*

యూదులు తీవ్రమయిన వంశానుగత దురభిమానానికి లోనయి ఉండేవారు. వారి వంశానుగత సంబంధం హజ్రత్ యాకూబ్ (అ)తో ఉండేది. ఆయనేమో హజ్రత్ ఇబ్రాహీమ్ (అ) పుత్రులయిన హజ్రత్ ఇస్‌హాక్ (అ) సంతానంలోని వారు. యూదులు, హజ్రత్ ఇస్‌హాక్ సంతానంలోని వాడు కానటువంటి వ్యక్తిని దేవుని ప్రవక్తగా అంగీకరించడానికి సిద్ధంగా లేరు. కాగా వారు మహనీయ ముహమ్మద్ (స)ని అల్లాహ్ సందేశహరుడుగాను, దివ్యఖుర్‌ఆన్‌ని దైవగ్రంథంగాను స్వీకరించడాన్ని పూర్తిగా నిరాకరించారు. ఆయన (స) పట్ల తీవ్ర వ్యతిరేకత కనబరచసాగారు. ఎందుకంటే ప్రవక్త మహనీయుల (స) సంబంధం హజ్రత్ ఇబ్రాహీమ్ (అ) జ్యేష్ఠ పుత్రుడు హజ్రత్ ఇస్మాయీల్ సంతానంతోనే ఉండేది. కాని వారిలో కొందరు అతి స్పష్టమయిన ఆలోచనతో, ఎటువంటి దురభిమానానికి లోనవకుండా తౌరాత్‌ని అధ్యయనం చేసేవారు. వారు దివ్యఖుర్‌ఆన్ దైవగ్రంథమన్న నిర్ణయానికి వచ్చారు. వారు దాన్ని ధ్రువపరిచారు, దాన్ని విశ్వసించారు; ఈ సత్యప్రియులయినటువంటి వారి ప్రస్తావన ఇలా ఉంది:

اَلَّذِيْنَ اٰتَيْنٰهُمُ الْكِتٰبَ يَتْلُوْنَهٗ حَقَّ تِلَاوَتِهٖ ط اُولٰٓئِكَ يُؤْمِنُوْنَ بِهٖ ط وَ مَنْ يَّكْفُرْ بِهٖ فَاُولٰٓئِكَ هُمُ الْخٰسِرُوْنَ ○

(البقرة:١٢١)

**మేము (తౌరాత్)గ్రంథాన్ని ఇచ్చిన వారిలో దాన్ని పారాయణం చేస్తారు. దాన్ని పారాయణం చేయవలసిన రీతిలో పారాయణం చేస్తారు. వారే ఈ ఖుర్‌ఆన్‌ని విశ్వసిస్తారు. మరెవరయితే దీన్ని తిరస్కరిస్తారో అటువంటి వారే నష్టపోయేవారు.**

*(అల్ బకర : **121**)*

ఇక్కడ కేవలం పారాయణం చేయడం కాదు, పారాయణం చేసే రీతిలో పారా యణం చేయడాన్ని పేర్కొనడం జరిగింది. యూదులలో ఎవరయితే దాన్ని పఠించవలసిన ధర్మం రీత్యా పఠించారో వారికి ఖుర్ఆన్ పట్ల విశ్వాస భాగ్యం ప్రాప్తమయింది. ఎవరయితే తౌరాత్‌ని పఠించలేదో, లేదా పఠించినా పఠించవలసిన ధర్మం రీత్యా పఠించలేదో వారు విశ్వాస సంపదకు దూరమయ్యారు. దీన్నిబట్టి రూఢీ అయ్యేదేమిటంటే దైవగ్రంథాన్ని పారా యణం చేసే నిష్ఠతో పారాయణం చేసినట్లయితే విశ్వాసభాగ్యం ప్రాప్తమవుతుంది. మరెవరయితే ఈ పారాయణ విధిని పాటిస్తున్నారో, మరెవరయితే ఖుర్ఆన్ పట్ల విశ్వాసంతో అలంకృతులయ్యారో వారిని "జ్ఞాన పరిపుష్టి"గల వారుగా పేర్కొనడం జరిగింది.

لٰكِنِ الرّٰسِخُوْنَ فِى الْعِلْمِ مِنْهُمْ وَالْمُؤْمِنُوْنَ يُؤْمِنُوْنَ بِمَآ اُنْزِلَ اِلَيْكَ وَمَآ اُنْزِلَ مِنْ قَبْلِكَ...

(النساء:١٦٢)

కాని వీరిలో ఎవరయితే ధర్మజ్ఞానంలో పరిపుష్టిగలవారో, విశ్వసించినవారో వారు నీకు అవతరించిన గ్రంథాన్నీ విశ్వసిస్తారు, నీకు పూర్వం అవతరించిన దాన్నీ విశ్వసిస్తారు. *(అన్ నిసా : 162)*

అల్లాహ్ గ్రంథం పారాయణం చేయడం వల్ల వారి ఆంతర్యాలపైన ఎటువంటి స్థితి ఆవహిస్తుందో అదే స్థితి దాని వచనాలను విన్నప్పుడు కూడా వారి పైన ఆవహిస్తుంది. స్వయంగా ఖుర్ఆన్ సాక్ష్యం పలుకుతోంది,

**"ఎవరికయితే ఇతఃపూర్వం గ్రంథ జ్ఞానం ఇవ్వబడిందో వారికి ఖుర్ఆన్ ఆయత్‌లు వినిపించబడినప్పుడు వారు చుబుకాలపైన సజ్దాలో పడిపోతారు. ఇంకా ఇలా అంటారు, మా ప్రభువు ప్రతి బలహీనతకు అతీతుడు. నిస్సంశయంగా మా ప్రభువు వాగ్దానం నెరవేరితీరుతుంది. వారు శోకిస్తూ సజ్దా స్థితిలో పడిపోతారు. ఖుర్ఆన్ వారిలో వినయవినమ్రతలను, ఏకాగ్రచిత్తతను మరీ వృద్ధి పరుస్తుంది."**
*(బనీ ఇస్రాయీల్ : 107-109)*

మరో చోట ఇలా సెలవీయబడింది,

**"వారికి కృపాకరుని ఆయత్‌లను వినిపించినప్పుడు అశ్రుపూరిత నయనాలతో సజ్దాలో పడిపోతారు."** *(మర్యమ్ : 58)*

క్రైస్తవుల సత్యప్రియులయిన సన్యాసులు, త్యాగులయినటువంటి వారిని గురించి కూడా ఒక చోట ఇదే మాట తెలుపడం జరిగింది:

وَاِذَا سَمِعُوْا مَآ اُنْزِلَ اِلَى الرَّسُوْلِ تَرٰى اَعْيُنَهُمْ تَفِيْضُ مِنَ الدَّمْعِ مِمَّا عَرَفُوْا مِنَ الْحَقِّ يَقُوْلُوْنَ رَبَّنَآ اٰمَنَّا فَاكْتُبْنَا مَعَ الشّٰهِدِيْنَ○ وَمَا لَنَا لَا نُؤْمِنُ بِاللّٰهِ وَمَا جَآءَنَا مِنَ الْحَقِّ وَ نَطْمَعُ اَنْ يُّدْخِلَنَا رَبُّنَا مَعَ الْقَوْمِ الصّٰلِحِيْنَ○ (المائدة:۸۳،۸۴)

దైవసందేశహరునికి అవతరింపజేయబడిన గ్రంథాన్ని వారు విన్నప్పుడు, సత్యాన్ని గ్రహించడంచేత వారి కనుల నుండి అశ్రువులు ఉబికి వస్తాయన్న యదార్థాన్ని నీవు గమనించగలవు. వారు ఇలా అంటారు, మా ప్రభూ, మేము విశ్వసిస్తున్నాము, మమ్మల్ని కూడా నీ ధర్మం సత్యమని సాక్ష్యం పలికేవారితోపాటు చేర్చుకో. అల్లాహ్‌ను, మా ముందుకు వచ్చిన సత్యాన్ని మేము విశ్వసించక పోవడానికి కారణమేముందని, మా ప్రభువు మమ్మల్ని సదాచారులయిన వారిలో చేర్చగలడని మాకు నమ్మకముంది. *(అల్ మాఇద : 83, 84)*

ఇదీ అల్లాహ్‌కు కావలసిన పారాయణం. ఈ విధంగా ఖుర్ఆన్‌ని చదవడం, వినడం ద్వారా హృదయంపైని తుప్పు వదులుతుంది. మనిషికి దాని అద్దంలో తన రూపు కానవస్తుంది. పరిస్థితుల సంస్కరణ వైపునకు మరలుతాడు. దైవంతో సంబంధం, ఏకాగ్రత, ఏకోన్ముఖత, వినయవినమ్రతలు జనిస్తాయి. ఖుర్ఆన్‌లోని వాస్తవికతలు, జ్ఞాన నిధులు వ్యక్తమవుతాయి. విశ్వాస మాధుర్యం, ఆచరణా సద్బుద్ధి, ధైర్యసాహసాలు, స్థయిర్యం ప్రాప్తమవుతాయి.

## ఖుర్ఆన్ ద్వారా మార్గబోధన

ఖుర్ఆన్ మార్గదర్శకత్వానికి మహా సరోవరం. పరమ ప్రభువుకు ఇష్టమయిన జీవితం ఏదో మనిషి ఖుర్ఆన్ ద్వారానే గ్రహించగలుగుతాడు. ప్రపంచపు చిక్కుముడులలో, పరమ ప్రభువు బహుమానాలకు పాత్రమయ్యే మరో మార్గాన్ని చూపగలిగేది కూడా దివ్యఖుర్ఆన్ ఒక్కటే. దివ్యఖుర్ఆన్‌ని పట్టుకున్న వ్యక్తి గుడ్డివానిలా కుడి ఎడమలకు దారి తప్పి తచ్చాడే అవసరముండదు. పగటి వెలుగులో తన జీవన పథాన్ని అనుసరిస్తాడు. ఖుర్ఆన్ సత్యాసత్యాల మధ్య వ్యత్యాసాన్ని చూపే మార్గం. ఈ మార్గానికి దూరమయిన

వ్యక్తి అసలు సత్యమేదో అసత్యమేదో తెలుసుకోనేలేడు. ఖుర్ఆన్ ఒక కాంతి, అది మానవునికి అల్లాహ్ ఇష్టాయిష్టాలను ప్రకాశమానం చేస్తుంది. తన్ను తాను ఖుర్ఆన్‌కు దూరం చేసుకున్న వ్యక్తి అల్లాహ్ ప్రసన్నతను పొందనేలేడు. ఆ గడప వరకు అతను చేరడం అన్నది అసాధ్యం.

قَدْ جَآءَكُم مِّنَ اللّٰهِ نُورٌ وَّ كِتَابٌ مُّبِينٌ ۝ يَهْدِىْ بِهِ اللّٰهُ مَنِ اتَّبَعَ رِضْوَانَهٗ سُبُلَ السَّلَامِ ۝ (المائدة:١٦)

**నిస్సందేహంగా మీకు అల్లాహ్ వద్ద నుండి ఒక జ్యోతి, ప్రకాశమానమయిన గ్రంథం అందజేయబడింది. అల్లాహ్ దీని ద్వారా, దేవుని అభీష్టాన్ని అనుసరించదలచిన వ్యక్తికి శ్రేయస్కరమయిన మార్గం చూపుతాడు. *(అల్ మాయిద: 16)***

ప్రతి వ్యక్తి సహజంగా కొన్ని పదార్థాలను ఇష్టపడతాడు, మరి కొన్నింటిని ఇష్టపడడు. అదే విధంగా ఒక వ్యక్తి ప్రవృత్తి మరో వ్యక్తి ప్రవృత్తికి పూర్తిగా భిన్నమయి ఉంటుంది. మీ అలవాట్లు, ప్రవృత్తులు, మీ స్వభావానికి అంతర్భాగమయిపోయాయి. వాటికి భిన్నంగా మీరు ఎన్నడూ ఆలోచించనూ లేరు. కాని అవి నాకు ఎంత మాత్రం ఇష్టంకాకపోవడం సాధ్యమే. మానవుడు దైవభక్తుడు, నిష్ఠగలవాడు కావాలంటే, తన ప్రవృత్తులను దేవుని ఆదేశాలకనుగుణంగా మార్చుకున్నప్పుడే అది సాధ్యం. ఒక వ్యక్తి ఒక పనిని, తన నైజం మొగ్గుదల అటు ఉన్నదన్న కారణంగా చేయనూరాదు, మరో పనిని, దాని పట్ల తనలో ఆసక్తి లేనందున వదలిపెట్టనూరాదు. అతను తన ప్రభువు, స్వామి వద్ద నుండి లభించిన ప్రతి ఆదేశాన్ని, అది తన సహజ ప్రవృత్తికి, అభిరుచికి అనుకూలంగా ఉన్నా వ్యతిరేకంగా ఉన్నా దాన్ని నిర్వర్తించడానికి సన్నద్ధుడవ్వాలి. అలాగనే అల్లాహ్ ఆదేశమయినట్లయితే తాను తన ఆంతర్యంలో దాచుకున్న వాటిని, అవి లేకుండా తాను తన జీవితాన్నీ ఊహించలేనటువంటి వాటినీ, ఎటువంటి జంకు గొంకు లేకుండా వదలివేయాలి, విసిరివేయాలి. తన్ను తాను వాటి నుండి ప్రక్షాళించుకోవాలి. ఎవరయితే ఈ విధంగా తన సిద్ధాంతాలను, తన ప్రవృత్తుల్ని, తన అలవాట్లను అల్లాహ్ ఆదేశాలకు విధేయంగా చేసుకోడో అతను నిష్ఠగలవాడు, భయభక్తులుగలవాడు కాలేడు. ఇటువంటి వ్యక్తి కేవలం తన మనోకాంక్షలను అనుసరిస్తున్నాడు, అతను తన ఊహలో అల్లాహ్ ప్రసన్నత పొందేందుకే ప్రయత్నిస్తున్నట్లు ఎంతగా అనుకున్నా సరే. అతన్ని ప్రళయ దినాన అల్లాహ్ సన్నిధానంలోకి తీసుకువచ్చినప్పుడు అతను చూసుకుంటాడు తాను ప్రపంచంలో అల్లాహ్ విధేయత ఊహలో తన మనోభావాల వెంట పరిగెడుతూ ఉండేవాడినని. అల్లాహ్

గ్రంథం ఓ తులమానం. దీని ద్వారా మనిషి తెలుసుకోగలడు, తాను వాస్తవంగా దేవుని అభీష్టం ప్రకారం నడుస్తున్నాడో లేదా తన మనోభిరామం ప్రకారం వ్యవహరిస్తున్నాడో. అల్లాహ్ గ్రంథాన్ని వదలి దేవుని ఇష్టాయిష్టాలను వెదికే వ్యక్తి చీకటిలో పయనించేటటు వంటివాడు. అతను జీవితాంతం దారి తప్పి తిరుగాడుతుంటాడు. కాని ఎన్నటికీ గమ్యాన్ని చేరలేడు.

يَـٰٓاَيُّهَا النَّاسُ قَدْ جَآءَكُمْ بُرْهَانٌ مِّنْ رَّبِّكُمْ وَ اَنْزَلْنَآ اِلَيْكُمْ نُوْرًا مُّبِيْنًا○ فَاَمَّا الَّذِيْنَ اٰمَنُوْا بِاللّٰهِ وَاعْتَصَمُوْا بِهٖ فَسَيُدْخِلُهُمْ فِىْ رَحْمَةٍ مِّنْهُ وَ فَضْلٍ وَّ يَهْدِيْهِمْ اِلَيْهِ صِرَاطًا مُّسْتَقِيْمًا○

(النساء:۴:۱۷۴،۱۷۵)

**జనులారా, నిస్సంకోచంగా మీ ప్రభువు వద్ద నుండి మీకు నిదర్శనం వచ్చేసింది. మేము మీ వద్దకు అతి స్పష్టమయిన కాంతిని అవతరింపజేశాము. కాగా ఎవరయితే అల్లాహ్‌ను విశ్వసించారో, ఆయన్ని గట్టిగా పట్టుకున్నారో వారిని అల్లాహ్ తన కారుణ్యంలో, అత్యుత్తమ అనుగ్రహంతో ప్రవేశింపజేస్తాడు. ఇంకా తన వద్దకు వచ్చేందుకు రుజు మార్గాన్నిస్తాడు.** ***(అన్ నిసా : 174, 175)***

ఏ వ్యక్తి వద్ద దివ్యఖుర్‌ఆన్ ఉంటుందో అతని వద్ద అల్లాహ్ కారుణ్య ద్వారాలు తెరిచే తాళంచెవి ఉందన్న మాట. అల్లాహ్ ఇష్టపడేదేమిటో ఇష్టపడనిదేమిటో అతను దాని ద్వారా తెలుసుకోగలుగుతాడు. దైవానికి ఇష్టమయిన జీవన సిద్ధాంతాలు, నియమాలు, సూత్రాలేవో, మరే పనులు ఆయన అప్రసన్నతకు మూలమవుతాయో గ్రహించగలుగు తాడు. ఈ గ్రంథ పారాయణం చేసి దివారాత్రులు దాని ప్రబోధాల పట్ల చింతన చేసే సౌభాగ్యం ప్రాప్తమయిన వ్యక్తి అదృష్టవంతుడు. ఏ వ్యక్తి ఆంతర్యంలో దీని ఆయత్‌లు నిండి ఉన్నాయో, ఎవరి మనోమస్తిష్కాలపైన దీని ఆదేశాల పరిపాలన కొనసాగుతోందో అటువంటి వ్యక్తి పట్ల ప్రపంచంలోని రాజసింహాసనాల పాలనాధీశులు సయితం అసూయ చెందవలసి ఉంటుంది. ఎందుకంటే వీరికి ప్రాప్తమయినదల్లా అతి త్వరగా నాశనమయిపోయేది, మరతని సంపద అనశ్వరమయినది. వీరు తమకు ఎన్ని సంపద లున్నప్పటికీ రేపు అల్లాహ్ ఆగ్రహాన్నుండి తమ్ము తాము రక్షించుకోలేరు, అతనిపైనేమో ప్రభు వరాల వర్షం కురుస్తూ ఉంటుంది.

## ఖుర్ఆన్ అనుసరణ

దివ్యఖుర్ఆన్ మార్గబోధన స్వీకరించడమంటే భావం ప్రతి విషయంలోనూ దాని ఆదేశాల పాలన. కేవలం దాని మార్గదర్శకత్వం, దాని నాయకత్వాన్ని మటుకే స్వీకరించాలి. అదొక్కటే తప్ప మరెవనికీ దారిచూపే, నాయకత్వం వహించే స్థానం ఇవ్వరాదు. అది కోరేది కూడా పూర్తి జీవితం దాని నిర్దేశాలకు కట్టుబడి ఉండాలని, మరే ఇతర నిర్దేశానికీ కట్టుబడకుండా స్వతంత్రంగా ఉండాలన్నదీను.

اِتَّبِعُوْا مَآ اُنْزِلَ اِلَيْكُمْ مِّنْ رَّبِّكُمْ وَلَا تَتَّبِعُوْا مِنْ دُوْنِهٖٓ اَوْلِيَآءَ قَلِيْلًا مَّا تَذَكَّرُوْنَ ○ (الاعراف:٣)

**మీ ప్రభువు వద్ద నుండి మీ వద్దకు వచ్చిన గ్రంథాన్ని అనుసరించండి, దాన్ని వదలి ఇతర సహచరులను అనుసరించకండి. అయినా మీరు మార్గబోధన స్వీకరించడం బహు అరుదు.** *(అల్ ఆరాఫ్ : 3)*

ప్రపంచంలో అనేక ఆలోచనలు, ఫిలాసఫీలున్నాయి. ఇవన్నీ దైవవిరోధ ఆలోచనలు, ఫిలాసఫీలు. ఖుర్ఆన్ వాటికి ప్రతిగా తనదయిన జీవిత ఫిలాసఫీనే అందజేస్తుంది. ఇది అన్నింటికన్నా ఉన్నతమయింది, సత్యబద్ధమయిన ఒకే జీవనతత్వం, విశ్వసించేవారి జీవితం దీని ఆధారంగానే నిర్మాణమవ్వాలి. ఇదే బుద్ధికుశలతకు, విజ్ఞతకు సరయిన ఆనవాలు.

وَالَّذِيْنَ اجْتَنَبُوا الطَّاغُوْتَ اَنْ يَّعْبُدُوْهَا وَ اَنَابُوْٓا اِلَى اللّٰهِ لَهُمُ الْبُشْرٰى ۚ فَبَشِّرْ عِبَادِ ۙ الَّذِيْنَ يَسْتَمِعُوْنَ الْقَوْلَ فَيَتَّبِعُوْنَ اَحْسَنَهٗ اُولٰٓئِكَ الَّذِيْنَ هَدٰىهُمُ اللّٰهُ اُولٰٓئِكَ هُمْ اُولُوا الْاَلْبَابِ ○ (الزمر:١٧،١٨)

**ఎవరయితే తాగూత్ (దైవేతర శక్తులు) ఆరాధనకు దూరమయి అల్లాహ్ వైపునకు మరిలారో వారికి శుభవార్త. కనుక నీవు మాటను వినే వారికి, ఉత్తమమయిన దాన్ని (ఖుర్ఆన్‌ని) అనుసరించే వారికి శుభవార్తనివ్వు. వీరే అల్లాహ్ మార్గ బోధనతో సత్కరించబడినవారు, వీరే బుద్ధి కుశలత గలవారు.** *(అజ్ జుమర్ : 17,18)*

## ఖుర్ఆన్ ప్రకారం ఆచరించడం

ఖుర్ఆన్‌ని విశ్వసించడమంటే మనిషి తన పూర్తి జీవితాన్ని దాని పోతలో

మలచుకోవాలి. నోటితో ఖుర్‌ఆన్‌ని తన మార్గదర్శిగా అంగీకరించి ఆచరణా రంగంలో దాని మార్గబోధనను స్వీకరించని వ్యక్తి ఖుర్‌ఆన్ పట్ల పరిహాసమాడుతున్నాడు. దైవ సందేశహరులు (స) ఇలా సెలవిచ్చారు.

اهله الذين يعملون به فى الدنيا

**ఖుర్‌ఆన్‌కి చెందిన వారు ఈ ప్రపంచంలో దాని ప్రకారం ఆచరించేవారు. *(సహీహ్ ముస్లిమ్, కితాబ్ సలాతుల్ ముసాఫిరీన్, బాబ్ కిర్అతుల్ ఖుర్‌ఆన్; జామి'తిర్మిజీ, కితాబ్ ఫజాయిలిల్ ఖుర్ ఆన్, మాజాఅ ఫీ సురతి ఆలి ఇమ్రాన్)***

ప్రపంచంలో దైవభక్తులకు అనేక ఆనవాళ్ళు నిర్ణయించుకున్నారు జనం. నిజానికి (ఈ హదీసు ప్రకారం) వారి గుర్తు ఒక్కటే, వారిలో ఖుర్‌ఆన్ దర్శనమివ్వాలి. ఖుర్‌ఆన్‌కు దూరమయి ఒక వ్యక్తి ఆకాశాలపైన ఎగిరినా అతను అల్లాహ్‌ను, ఆయన కారుణ్యాన్ని, ఆయన అనుగ్రహాన్ని పొందలేడు. అల్లాహ్‌ను పొందే వ్యక్తి. అల్లాహ్ కరుణాకటాక్షాలకు పాత్రుడయ్యే వ్యక్తి ఆయన గ్రంథాన్ని అనుసరించేవాడు, ఆ గ్రంథాన్ని పొందిన తరువాత అన్ని వైపుల నుండి ముఖం త్రిప్పుకున్న వ్యక్తి. దైవభక్తుల ఆనవాలు ప్రత్యేక దుస్తులూ కాదు, ప్రత్యేక ఆహారమూ కాదు; వారి ఆనవాలు ఒక్కటే, వారు తమ వ్యవహారాలన్నింటిలో దైవగ్రంథాన్నే నిర్ణేతగా ఎన్నుకుంటారు. వారి ప్రతి ఆచరణ దైవగ్రంథం వెలుగులో నిర్వర్తింపబడుతుంది. వారు తమ్ముతాము ఖుర్‌ఆన్ చిత్రపటంలో అమర్చుకుంటారు. వారి జీవితంపైన అన్ని వైపుల నుంచి ఖుర్‌ఆన్ ప్రభుత ఏర్పడుతుంది. జీవితంపైన దైవగ్రంథం ప్రభుత ఏర్పడని వ్యక్తి దైవానికి దూరంగా ఉన్నాడు, దైవమూ అతనికి దూరమయి ఉన్నాడన్న మాట.

## పిలుపు, ఖుర్‌ఆన్ వైపునకు

ఖుర్‌ఆన్ ఒక సందేశం. ఈ సందేశం మానవునిలో ఉట్టిగనే ప్రవేశించదు. అదొక విప్లవమయి వస్తుంది. అతని ఆలోచన, ఆచరణల్లో కల్లోలాన్ని సృజిస్తుంది. మనిషి ఒక సందేశాన్ని స్వీకరించినప్పుడు అతని జీవితమంతా ఛిద్రమయిపోతుంది, కూలగొట్టడాలు సంభవిస్తాయి. అతను తన ప్రాచీన సిద్ధాంతాల కోటల్ని పడగొట్టవలసి ఉంటుంది. వాటి స్థానే కొత్త సిద్ధాంతాలను నిర్మించుకోవలసి ఉంటుంది. అతను తనకు ప్రియమయిన అనేక విషయాలను వదలుకుంటాడు. అనేక కొత్త విషయాలకు జీవితంలో చోటు ఇస్తాడు.

ఇంతేకాదు, సహజంగా అతనిలో ఓ కోరిక జనిస్తుంది. తాను ఏ విషయాలకు దూరమయి పోయాడో ప్రజలంతా దానికి దూరమయిపోవాలని, మరే సంపదలు తనకు ప్రాప్తమయ్యాయో వాటి ద్వారా ప్రపంచ ప్రజలంతా శ్రీమంతులయిపోవాలని ఆశిస్తాడు. తాను ఏ ఆలోచనల్ని, సిద్ధాంతాలను తప్పయినవిగా భావిస్తాడో వాటిని తుడిచిపెట్టాలని, ప్రపంచంలోని ఒక్కొక్క భూభాగంపైన తాను సరయినవిగా భావించి స్వీకరించే ఆలోచనలు సిద్ధాంతాల ప్రభుత నెలకొనాలని కోరుకుంటాడు.

ఈ ప్రపంచంలో ఖుర్ఆన్ని అనుసరించే వ్యక్తి, ఇతరుల్ని దాన్ని అనుసరించాలని పిలుపునిచ్చే వ్యక్తి, అత్యంత సఫలీకృతుడయిన వ్యక్తి. ఎందుకంటే ఖుర్ఆన్ అనుసరణ దేవుని అనుసరణ, ఖుర్ఆన్ వైపునకు ఆహ్వానం దైవం వైపునకు ఆహ్వానం. ఈ లోకం లోనూ ఇదే అత్యంత విజయవంతమయిన జీవిత విధానం, ఇదే ఒక మానవునికి అంద జేయబడే అత్యుత్తమ సందేశం. ఖుర్ఆన్ ప్రపంచంలో గౌరవోన్నతుల మార్గం. ఏ వ్యక్తి ఖుర్ఆన్ ప్రకారం ఆచరిస్తాడో, ఇతరులకూ ఆచరించమని పిలుపునిస్తాడో అతను స్వయం గానూ సాఫల్య మార్గాన పయనిస్తున్నాడు, ఇతరుల్నీ సాఫల్యం వైపునకు ఆహ్వానిస్తున్నాడు. అతను ఎన్నడూ తన శక్తిసామర్థ్యాలను వృథా చేశానని బాధపడడు. కాని ఖుర్ఆన్ చూపిన బాటను వదలి ఏ మార్గాన మనిషి శక్తిసామర్థ్యాలు వెచ్చించినా దాని ఫలితంగా కేవలం పశ్చాత్తాపం, బాధ తప్ప మరేమీ చేతికందదు.

దైవప్రవక్తల చరిత్ర సాక్ష్యం పలికేదేమిటంటే దైవవాణి ఈ పుడమిపైన ఆయన శక్తి రూపంలో అవతరిస్తుంది. ఏ జాతి ముందుకు వచ్చి దాన్ని స్వీకరిస్తుందో, అది బలహీనమయినట్లయితే, బలోపేతమయి పోతుంది. అది వెనకపాటుకు గురయి ఉంటే దానికి సమున్నతి ప్రాప్తిస్తుంది. ఆ జాతిపైన ఆధిక్యతగల జాతులు, వ్యక్తులు చూస్తూ ఉండగానే దానికి పాదాక్రాంతమయిపోతారు. ప్రభుత్వాధికారం, పరిపాలన దాని అధీనంలోకి వచ్చేస్తాయి. జాతులు, వర్గాల మధ్య నిర్ణయాధికారం దాని హస్తగత మవుతుంది.

وَ نُرِيْدُ اَنْ نَّمُنَّ عَلَى الَّذِيْنَ اسْتُضْعِفُوْا فِى الْاَرْضِ وَ نَجْعَلَهُمْ اَئِمَّةً وَّ نَجْعَلَهُمُ الْوَارِثِيْنَ۝ (القصص:٥)

**నేడు భువిలో బలహీనులయిపోయిన వారి పట్ల మేము అత్యుత్తమ రీతిలో మేలు చేయ గోరుతున్నాము. మేము వారిని నాయకులుగా, దేవుని భూమికి వారసులుగా చేయనున్నాము.** ***(అల్ కసస్ : 5)***

దైవప్రవక్త (స) ఈ గ్రంథం గురించి ఇలా సెలవిచ్చారు:

ان اللہ یرفع بھٰذا الکتاب اقواما و یضع بہ اٰخرین

**అల్లాహ్ ఈ గ్రంథం ద్వారా కొన్ని జాతుల్ని సమున్నతపరుస్తాడు, మరికొన్నింటిని అధఃపతనానికి త్రోసివేస్తాడు. *(సహీహ్ ముస్లిమ్, కితాబ్ సలాతుల్ ముసాఫిరీన్, బాబ్ మంయ్యకూము బిల్ ఖుర్ఆని వ యుల్లిముహా)***

దివ్యఖుర్ఆన్ నిర్ణయం చేయడానికి వచ్చింది. ఇక్కడ గౌరవోన్నతులు ఎవరికి ప్రాప్తం కావలసి ఉందో, పరాభవం, పరాధీనతలు ఎవరి భాగ్యంలోకి రానున్నయో అది నిర్ణయిస్తుంది. ఏ జాతి దీన్ని తన స్వంతం చేసుకుంటుందో, ప్రపంచ జాతుల్లో దాని స్థానం, ఉన్నతి పెరిగిపోతాయి. మరే అధికారం దాన్ని కించపరచజాలదు. దాన్ని ఎదుర్కొన్న శక్తి ఏదయినా అది పిండి పిండి అయిపోతుంది. ఖుర్ఆన్ దేవుని పరిపాలనా ప్రణాళిక. అది ఎవరి చేతుల్లోకి వస్తుందో, అల్లాహ్ హస్తం అతనికి తోడయి ఉంటుంది. అందువల్లనే.

وَمَا رَمَيْتَ اِذْ رَمَيْتَ وَلٰكِنَّ اللّٰهَ رَمٰى (الانفال:١٧)

**(ముహమ్మద్!) నీవు శత్రువు పైకి బాణం వేస్తున్నపుడు, ఆ వేసేది నీవు కాదు, అల్లాహ్ వేస్తున్నాడు.**

***(అల్ అన్ఫాల్ : 17)***

మరో చోట సెలవీయబడింది:

فَاِنَّهُمْ لَا يُكَذِّبُوْنَكَ وَلٰكِنَّ الظّٰلِمِيْنَ بِاٰيٰتِ اللّٰهِ يَجْحَدُوْنَ○ (الانعام:٣٣)

**(ఎవరయితే నిన్ను అబద్ధీకరిస్తున్నారో) వారు వాస్తవంగా నిన్ను కాదు అబద్ధీకరిస్తున్నది, ఈ దుర్మార్గులు దేవుని వచనాలను తిరస్కరిస్తున్నారు.**

***(అల్ అన్ఆమ్ : 33)***

ఏ వ్యక్తికి అల్లాహ్ తోడ్పాటు ప్రాప్తమవుతుందో అతన్ని ఎవరయినా లోబరచుకోవడం సాధ్యమయ్యే విషయం కాదు. ఎందుకంటే, అతనితో పోరాడటమంటే అల్లాహ్‌తో పోరాడటమన్న మాట. మరెవరయితే అల్లాహ్‌తో చెయ్యిచేసుకోవాలన్న సాహసం చేస్తారో అతని చెయ్యి క్షేమంగా మిగులదు.



# నమాజ్, ధర్మసందేశం

దైవగ్రంథం ఖుర్ఆన్‌ని తెరచి నమాజ్ ప్రస్తావనను పరిశీలించండి. ఆయన ధర్మంలో ప్రప్రథమమయిన ఆదేశం, ప్రప్రధానమయిన ఆదేశం నమాజ్ అని మీరు ఇట్టే గమనిస్తారు. ధర్మం సుస్థాపితమయిన ఆధారాలలో అన్నింటికన్నా ముఖ్యమయిన ఆధారం నమాజ్. నమాజ్ దైవాన్ని సంస్మరించే అత్యుత్తమమయిన మార్గం. దీనికన్నా మంచిది, ఉన్నతమయింది, శ్రేష్ఠమయింది మరో మార్గాన్ని ఊహించడమయినా అసాధ్యం. నమాజ్ క్రమబద్ధంగా చేసే దాసుడు దైవం పట్ల ఏమరుపాటుకు లోనవడు. దైవం వైపునకు మరలే అవకాశం దొరుకుతుంది. పశ్చాత్తాపం చెందే సద్బుద్ధి ప్రాప్తమవుతుంది. అపరాధాల మన్నింపు లభిస్తుంది. నమాజ్ ద్వారా ఆత్మప్రక్షాళన లభిస్తుంది. శీలస్వభావాలలో ఉజ్వలత జనిస్తుంది, జీవితపు వ్యవహారాలన్నీ చక్కబడతాయి. రుజుమార్గం ప్రస్ఫుటమవుతుంది, దాన్ని అనుసరించడం సులభతరమవుతుంది.

నమాజ్ దైవభక్తులు, నిష్ఠాపరులయిన మానవుల బృహత్తరమయిన ఆనవాలు. మనిషి అల్లాహ్ పట్ల పటిష్ఠంగా విశ్వాసం కలిగి ఉన్నాడనడానికి సాక్ష్యం. మనిషి దేవుని ఆరాధన, విధేయతలకు అనుక్షణం సిద్ధంగా ఉన్నాడనడానికి, వెనుకా ముందు ఆలోచించకుండా ఆయన ఆదేశాలను ప్రతిదాన్ని పాటిస్తాడనడానికి నిదర్శనం.

అల్లాహ్ సందేశహరుల స్వీయ చరిత్రలో నమాజ్‌కు ప్రముఖ స్థానం గలదిగా, వారి బోధనల్లో ఇతర బోధనల్లోకెల్లా బలవత్తరమయినదిగా, వారి జీవితాల్లో అణువణువునా ముద్రితమయి, వారి ఆచరణల్లో అన్నిటా ఆవరించి గోచరిస్తుంది. వారు తమ అనుచర సమాజాలకు దీని గురించి మాటిమాటికీ తీవ్రంగా తాకీదు చేశారు. దీన్ని పాటిస్తారని ప్రతిన చేయించుకున్నారు. నమాజ్‌ను వదలడాన్ని, లేదా దాని పట్ల ఏమరుపాటు వహించడాన్ని వారించారు. ఇటువంటి చర్య వల్ల కలిగే దుష్పరిణామాలను గురించి హెచ్చరించారు.

దైవప్రవక్తల బోధనల్ని, వారి నిర్దేశాలను జవదాటి, వాటికి తిరుగుబాటు వహిం

చిన ప్రతి చోటా నమాజ్‌ని వదిలే విధానమూ కానవస్తుంది. అల్లాహ్ తిరస్కారులు, విద్రోహుల్ని గురించి ఖుర్‌ఆన్ అతి స్పష్టంగా చెబుతుంది, వారు ఒకే అల్లాహ్ సమక్షంలో వినమ్రులవడానికీ, సజ్దా చేయడానికీ సన్నద్ధులుకారు అని. వారి జీవితాలు నమాజ్ లేని జీవితాలని, కాంతి విహీనమయిన జీవితాలని, తత్కారణంగా వారి ఆలోచన, ఆచరణల దిశయే తప్పుగా రూపొందుతుందని, వారు ప్రపంచంలో అన్ని వైపులా దారి తప్పి తిరుగుతుంటారని, పరలోకంలో నిష్ఫలత, నిష్కామితార్థత వారి కళ్ళెదుట నిలుస్తుంది. వారు అక్కడ నిష్ఫలత నుండి ఏ విధంగానూ తప్పించుకోలేరు.

నమాజ్ రోజుకు అయిదు పూటల సమయ నిర్ధారణతో విధిగా నియమించబడింది. ఈ సమయాలను పాటించడం అవసరం. విధి అయిన ఫర్జ్ నమాజులను మస్జిద్‌లో నిర్వర్తించే ఆదేశం ఉంది. దీనిగ్గాను మస్జిదుల నిర్మాణం, వాటి నివేశనా కృషి కొరకు నిర్దేశాలున్నాయి. దీన్ని ఘనకార్యంగా అభివర్ణించడం జరిగింది. ఇంట చేసే నమాజ్ కన్నా మస్జిద్‌లో చేసే నమాజ్ పుణ్యఫలం పాతికరెట్లు, ఇరువయి ఏడు రెట్లు ఉన్నట్లు హదీసుల్లో ఉంది.

విధి అయిన ఫర్జ్ నమాజుల తరువాత సునన్ ముఅక్కిద ప్రాముఖ్యత అధికమయింది. దైవసందేశహరులు (స) వాటిని క్రమం తప్పకుండా పాటించినట్లు ఆధారాలున్నాయి. వాటిని కావాలని వదలిపెట్టడానికి వీల్లేదు. ఇవేకాక అదనపు నఫిల్ నమాజులు సయితం ప్రోత్సహించబడ్డాయి. ఒక్కొక్క సజ్దా మనిషి తప్పిదాల మన్నింపునకు, స్థానాల పెరుగుదలకు మార్గమవుతుంది. తహజ్జుద్ నమాజ్ అల్లాహ్‌తో సన్నిహితత్వానికి పెద్ద మార్గం. దైవసందేశహరులు (స)కు తహజ్జుద్ నమాజ్ తప్పనిసరిగా నిర్ణయించబడింది. దేవుని సదాచార సంపన్నులయిన దాసులకు గుర్తు రాత్రిళ్ళల్లో సజీవులయి ఉంటారన్నది. ఆ సమయాన అల్లాహ్ సన్నిధానంలో చేతులు కట్టుకుని నిల్చుని ఉంటారు. అప్పుడు ప్రపంచమేమో మధుర నిద్రలో మైమరచి నిద్ర రుచి మరుగుతూ ఉంటుంది. నమాజ్ విషయంలో దాన్ని ప్రారంభ కాలంలో నెరవేర్చాలన్నది ఆదేశం. దాన్ని దాట వేయడం, ఆలస్యం చేయడం సరయినది కాదు. నమాజ్ నెమ్మదిగా, సంతృప్తిగా చేయాలి, త్వరత్వరగా ఏదో బరువు దించివేస్తున్నట్లు చేయరాదు, లేదా కోడి గింజల్ని ఏరుతున్నట్లు చేయరాదు. నమాజ్‌ని అశ్రద్ధగా, అన్యమనస్కంగా చేయరాదు, వినయ వినమ్రతలతో, భయభక్తులతో చేయాలి. అందులో దైవం వైపునకు మరలే లక్షణం కానరావాలి.★

★ ఈ కోణాలన్నింటి మీద నమాజ్‌కు సంబంధించిన పుస్తకం ఈ రచయిత వ్రాస్తున్నారు, ఇన్షాఅల్లాహ్ అందులో సవివరమయిన చర్చ వస్తుంది.

నమాజ్‌కు ధర్మంలో ఎంతో ప్రాముఖ్యముంది. అల్లాహ్‌తో సంబంధం ఏర్పరచుకునేందుకు, దాన్ని పటిష్ఠపరచుకునేందుకు అది మహత్పూర్వకమయిన సాధనం. విశ్వాసి అయిన దాసుడు దాని పట్ల ఎన్నడూ ఏమరపాటు వహించలేడు. అది అతని జీవితంలో ఓ తప్పనిసరి అంశమయి ఉంటుంది. అతని సకల కార్యకలాపాలలో పైకి వచ్చి ప్రస్ఫుటమయి ఉంటుంది. ధర్మం వైపునకు పిలుపునిచ్చే కార్యంలో నిమగ్నమయి ఉన్నవారు అందరికన్నా అధికంగా నమాజ్‌ని పాటించేవారయి ఉండాలి. వారు దీని పట్ల ఎట్టి పరిస్థితిలోనూ అలక్ష్యాన్ని ప్రదర్శించలేరు. ధర్మంలో ఏ ఆచరణ అయితే అన్నింటికన్నా ప్రథమమయిందో దాన్ని ఎట్టి పరిస్థితిలోనూ ప్రథమంగానే ఉంచాలి. దాన్ని వెనకవేసి లేదా వదలి ధర్మసందేశ కార్యం నిర్వర్తించడం అసాధ్యమయిన విషయం.

## సందేశం, నమాజ్‌ల సంబంధం

సందేశంతో నమాజ్‌కు ప్రగాఢమయిన సంబంధముంది. రెంటినీ పరస్పరం వేరుచేయలేము. సందేశం ప్రారంభంలోనూ నమాజ్ ఆదేశముంది, దాని చివరిలో నమాజ్, దైవసంస్మరణల నిర్దేశనే ఉంది. దైవసందేశహరులు (స)ను సందేశకార్యాన నియోగించినప్పుడు వెంటనే తహజ్జుద్ నమాజ్ ఆదేశమూ ఇవ్వబడింది. ఇలా సెలవీయబడింది, పగటి పూటనయితే నీకు చాలా పనులుంటాయి, అందువల్ల రాత్రివేళలో దైవాన్ని సంస్మరించు. రాత్రి పూట అత్యధిక సమయం, సగం రాత్రి లేదా దానికన్నా తక్కువ లేదా ఎక్కువ భాగం నమాజ్‌లో గడుపు అని ఆదేశమయింది.

يٰٓاَيُّهَا الْمُزَّمِّلُ قُمِ الَّيْلَ اِلَّا قَلِيْلًا ۝ نِّصْفَهٗٓ اَوِ انْقُصْ مِنْهُ قَلِيْلًا ۝ اَوْزِدْ عَلَيْهِ وَ رَتِّلِ الْقُرْاٰنَ تَرْتِيْلًا ۝ اِنَّا سَنُلْقِيْ عَلَيْكَ قَوْلًا ثَقِيْلًا ۝ اِنَّ نَاشِئَةَ الَّيْلِ هِيَ اَشَدُّ وَطْاً وَّ اَقْوَمُ قِيْلًا ۝ اِنَّ لَكَ فِي النَّهَارِ سَبْحًا طَوِيْلًا ۝ وَاذْكُرِ اسْمَ رَبِّكَ وَ تَبَتَّلْ اِلَيْهِ تَبْتِيْلًا ۝ رَبُّ الْمَشْرِقِ وَ

దుప్పటి కప్పుకునేవాడా, రాత్రి పూట నిలబడు, కాని కొంత (విశ్రమించు). రాత్రిలో సగం లేదా అంతకన్నా కాస్త తక్కువ లేదా అంతకన్నా కాస్త అధికం. ఖుర్‌ఆన్ కడు నెమ్మదిగా అతిస్పష్టంగా పఠించు. మేము నీపైన ఒక భారీ మాటను మోపనున్నాము. నిస్సందేహంగా రాత్రి పూట లేవడం మనసును కఠినంగా అణిచివేస్తుంది. దీని వల్ల మాట అతిస్థిరమయి నిలుస్తుంది. నిస్సంశయంగా నీకు పగటి పూట చాలా నిమగ్నత ఉంటుంది. నీ ప్రభువు నామ సంస్మరణ చేస్తూ గడుపు, అందరికీ

رَبُّ الْمَغْرِبِ لَآ اِلٰـــهَ اِلَّا هُوَ فَاتَّخِذْهُ وَكِيْلًاo

(المزمل:١-٩)

దూరమయి ఆయనకే అంకితమయిపో. ఆయన తూర్పు పడమరలకు ప్రభువు. ఆయన తప్ప మరో ఆరాధ్యుడు లేడు. ఆయన్నే నీ పనులు చేసిపెట్టేవానిగా భావించు. అల్ ముజ్జమ్మిల్: *1-9)*

దైవధర్మం కొరకు అనుక్షణం నిమగ్నుడయి ఉండే వ్యక్తికి, పగలంతా సందేశ ప్రచార కార్యకలాపాల వల్ల అలసిసొలసిపోయిన వ్యక్తికి సాధారణంగానయితే రాత్రి వేళ విశ్రాంతి తీసుకోవాలన్న సలహా ఇవ్వవలసి ఉంటుంది. దానికి బదులు సుదీర్ఘమయిన నమాజ్ చెయ్యాలన్న ఆదేశం ఇవ్వబడింది. దీన్నిబట్టి లభించే సూచన ఏమిటంటే, పగటిన నిర్వర్తించవలసిన బలోపేతమయిన సందేశ కార్యకలాపాలకు శక్తి రాత్రి పూట నమాజ్ ద్వారానే ప్రాప్తమవుతుంది. ఆపైన ముప్ఫయి ఏళ్ళ కృషి తరువాత సందేశం సఫలమయి నపుడు కురైష్ శక్తి విచ్ఛిన్నమయిపోయినప్పుడు, మక్కా విజయం సంభవించిన తరువాత, దైవగృహం, కాబా, దేవుని దాసుల నిర్వహణలోకి వచ్చినపుడు అప్పుడు కూడా దేవుని సమక్షంలో తలవంచాలని, ఆయన పవిత్రతను కొనియాడాలని, ఆయన నవనం కీర్తించాలని ఆదేశమయింది.

اِذَا جَآءَ نَصْرُ اللّٰهِ وَالْفَتْحُo وَ رَاَيْتَ النَّاسَ يَدْخُلُوْنَ فِيْ دِيْنِ اللّٰهِ اَفْوَاجًاo فَسَبِّحْ بِحَمْـــدِ رَبِّكَ وَاسْتَغْفِرْهُ اِنَّهٗ كَانَ تَوَّابًاo

(النصر)

దేవుని సహాయం, విజయం ప్రాప్తమయి నప్పుడు, జనం తండోపతండాలుగా దైవ ధర్మంలో ప్రవేశించడం నీవు గమనించి నపుడు నీ ప్రభువు స్తోత్రంతోపాటు ఆయన పరిశుద్ధతను కొనియాడు, ఆయన సన్నిధిలో క్షమాభిక్ష కొరకు వేడుకో. నిస్సందేహంగా ఆయన ప్రార్థనలాలకించే వాడే. *(అన్ నస్ర్ : 1-3)*

దివ్యఖుర్ఆన్‌లో ధర్మసందేశం, నమాజ్‌లను పరస్పరం ఎలా సమైక్యపరచడం జరిగిందో కాస్త వివరంగా పరిశీలిద్దాము. ఖుర్ఆన్‌లో ఒక చోట సందేశ ప్రచారాన్ని ప్రస్తావిస్తే మరో చోట దానికి నమాజ్ పాటింపును గట్టిగా తాకీదు చేయడం జరిగింది. దీన్నిబట్టి సందేశ కార్యానికి కావలసిన శక్తిసామర్థ్యాలు, బలం నమాజ్ ద్వారానే జనిస్తుం దన్న సత్యం అవగతమవుతుంది.

## తజ్‌కీర్ (జ్ఞాపకం చేయడం)

ధర్మసందేశాన్ని ఖుర్‌ఆన్ 'తజ్‌కీర్'గా పేర్కొన్నది. అంటే మానవుల్లో దేవుని సంస్మరణను జనింపజేయడం. దేవుని సంస్మరణ అసలు ధర్మానికే ప్రాణం వంటిది. ధర్మం ధ్యేయమే మానవులు దైవాన్ని మరువరాదన్నది, అనునిత్యం ఆయన్ని గుర్తుంచుకోవాలన్నది. దైవం పట్ల ఏమరుపాటుకు లోనయిన వ్యక్తి అంతర్యం జీవకళ లేని మరుభూమి వంటిది, మార్గబోధనా దీపం వెలగని శిథిల ప్రదేశం వంటిది. దైవాన్ని ప్రతిక్షణం గుర్తుంచుకోవడం మానవుని ధర్మం. ఎందుకంటే ఆయన అతని సృష్టికర్త, స్వామి, ఆరాధ్యుడు. కాని మానవుడు ఒక్కోసారి తన ఏమరుపాటు వల్ల, అవివేకం వల్ల, మరొకప్పుడు తన మనోవాంఛల బలిమి వల్ల, ఇంకొకప్పుడు తప్పుడు శిక్షణ, బోధనల వల్ల దైవాన్ని మరచిపోతాడు. ధర్మసందేశం అంటే మనిషిని అతని ఈ ఏమరుపాటు నుండి జాగృత పరచడం, అతని అజ్ఞానాన్ని దూరం చేయడం, అతన్ని దైవానికి చేరువ చేయడం. దైవసందేశహరులకు ఆదేశమయింది:

فَذَكِّرْ اِنْ نَّفَعَتِ الذِّكْرٰى ○ سَيَذَّكَّرُ مَنْ يَّخْشٰى ○ (الاعلىٰ: ٩، ١٠)

**మీరు జ్ఞాపకం చేస్తూ ఉండండి, జ్ఞాపకం చెయ్యడం ప్రయోజనకరమయితే. ఏ వ్యక్తి హృదయంలో దైవభయం చోటు చేసుకుంటుందో అతను దీని ద్వారా ప్రయోజనం పొందుతాడు.** ***(అల్‌అ'లా : 9,10)***

ఇతరుల్ని దైవం వైపునకు మరల్చడానికి, వారి అంతర్యాలలో దేవుని సంస్మరణను జనింపజేయడానికి, స్వయంగా ఆయన పనిని చేపట్టిన వ్యక్తి దేవుని మరచి ఉండటానికి వీల్లేదు. దేవుని సంస్మరణ స్వయంగా అతని హృదయంలో చోటు చేసుకోలేకపోతే అతను ఇతరుల హృదయాలలో ఆ దేవుని సంస్మరణను సృజించడం సాధ్యమా? దేవుని నిత్యం జ్ఞాపకం ఉంచుకోదలచిన వ్యక్తి నమాజ్‌ని వదలకుండా చేయడం అవసరం. నమాజ్ దేవుని జ్ఞాపకం చేసుకునే అత్యుత్తమ మార్గం, అంతేకాదు అది ఆసాంతం దేవుని సంస్మరణే. అందువల్లనే ఇలా సెలవీయబడింది:

اَقِمِ الصَّلٰوةَ لِذِكْرِىْ ○ (طٰهٰ: ١٤)

**నా సంస్మరణ నిమిత్తం నమాజ్‌ని స్థాపించు.** ***(తాహా :14)***

నమాజ్ దైవ సంస్మరణకు మారుపేరు. ఖుర్‌ఆన్ మాటల్లో చెప్పాలంటే, 'దేవుని సంస్మరణ మహత్తర విషయం'. వాస్తవానికి మృత హృదయాలకు జీవనం దైవసంస్మరణ

ద్వారానే ప్రాప్తమవుతుంది. దేవుని సంస్మరణ నమాజ్ ద్వారా ప్రాప్తమవుతుంది. నమాజ్ మనిషిని దైవం వైపునకు మరలిస్తుంది. తద్వారా అతన్ని దైవసంస్మరణ పట్ల ఏమరు పాటుకు లోనవనివ్వదు. ఏ వ్యక్తి దైవసంస్మరణ పట్ల అశ్రద్ధకు, అలక్ష్యానికి గురవడో అతనే ఇతరుల్ని సయితం దేవుని సంస్మరణ పట్ల పిలుపునివ్వగలడు, వారిలో దేవుని సంస్మరణా భావాన్ని జనింపజేయగలడు.

## మానవుల సమక్షంలో సాక్ష్యం

ధర్మసందేశ ప్రచారాన్ని ఖుర్ఆన్ 'షహాదత్ అలన్నాస్' (మానవుల సమక్షంలో సాక్ష్యం) అని కూడా పేర్కొన్నది. అంటే మానవుల ముందు దేవుని ధర్మాన్ని అంద జేయడం, అది సత్యమయినదని సాక్ష్యం పలకడం. ఇంత మహాకార్యం నిర్వర్తించడం, ఆ ధర్మం పోతలో జీవితాన్ని మలచుకున్న వ్యక్తి ద్వారానే సాధ్యం. ఏ వ్యక్తి తన ఆచరణ ద్వారా ధర్మానికి సాక్ష్యంగా నిలువలేడో అతను మానవుల మధ్య సాక్ష్యం ఇచ్చే విధిని నిర్వర్తించడం అసాధ్యం. నమాజ్ ద్వారా మనిషి జీవితం ధర్మానికి ప్రతిరూపమయి పోతుంది. తద్వారా అతను, ప్రపంచం సమక్షంలో అందజేస్తున్న ధర్మానికి తన ఆచరణ ద్వారా సాక్ష్యం పలకడం కూడా అతనికి సులభమవుతుంది. ఇదే సత్యం హజ్జ్ సూరా లోని చివరి ఆయత్‌లో దర్శనమిస్తుంది. ఇందులో మానవుల మధ్య సాక్ష్యం ఇచ్చే ఆదేశం తరువాత వెనువెంటనే నమాజ్ నిర్దేశం ఇవ్వబడింది. కాగా ఇలా సెలవీయ బడింది:

لِيَكُوْنَ الرَّسُوْلُ شَهِيْدًا عَلَيْكُمْ وَ تَكُوْنُوْا شُهَدَآءَ عَلَى النَّاسِ فَاَقِيْمُوا الصَّلٰوةَ وَ اٰتُوا الزَّكٰوةَ وَاعْتَصِمُوْا بِاللّٰهِ هُوَ مَوْلٰكُمْ فَنِعْمَ الْمَوْلٰى وَ نِعْمَ النَّصِيْرُ ۝ (الحج:٧٨)

తద్వారా దైవసందేశహరుడు మీపైన సాక్ష్యం కాగలగాలని మరి మీరు జనుల పైన సాక్ష్యం కావాలని (ఆదేశించడం జరిగింది). కాగా మీరు నమాజ్‌ని స్థాపించండి, జకాత్ ఇవ్వండి, అల్లాహ్‌ను పటిష్ఠంగా పట్టుకోండి. ఆయన మీ సంరక్షకుడు; ఎంత ఉత్తమ సంరక్షకుడాయన, ఎంత ఉత్తమ సహాయకుడు!

*(అల్ హజ్జ్ : 78)*

## మంచిని ఆదేశించడం, చెడును రూపుమాపడం

ధర్మసందేశం అందజేయడాన్ని ఖుర్ఆన్ ఒక పారిభాషిక పదబంధం, "అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్" అన్నది ప్రయోగిస్తుంది. దీని భావం, దైవం ఆదేశించిన

సత్కార్యాలను ప్రపంచానికి చాటిచెప్పడం, దైవం వారించిన చెడుల నుండి ప్రపంచాన్ని వారించడం. ఈ ముస్లిమ్ సమాజాన్ని ఉత్తమ సమాజం (ఖైర్ ఉమ్మత్) గా అభివర్ణించడం జరిగింది. అది ఓ ప్రక్కన దైవాన్ని విశ్వసిస్తుంది, ఆయన విధేయతను పాటిస్తుంది. మరో ప్రక్కన ప్రపంచానికి మంచిని ఆదేశిస్తుంది, చెడు నుండి వారిస్తుంది.

"మంచిని ఆదేశించడం, చెడును నిరోధించడం" (అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్) ఉన్నత శీలస్వభావాలను పటిష్ఠమయిన చరితను ఆకాంక్షిస్తుంది. దీనికి మనిషి స్వయంగానూ మంచిని అమలుపరచేవాడు, చెడు నుండి తన్ను తాను కాపాడుకునే వాడు కాగలగాలి. శీలస్వభావాల విషయంలో పరిపక్వత లేనివాడు, లోపభూయిష్ట చరితుడు అయిన వ్యక్తి మంచిని ఆదేశించడమయినా చెడును వారించడమయినా కష్టమే కాని సులభం కాదు. నమాజ్ మనిషిలో మంచిని అమలుపరచే, చెడుకు దూరంగా మెలిగే సామర్థ్యాన్ని సృజిస్తుంది. అందువల్లనే దైవాజ్ఞ అయింది.

**నమాజ్‌ని స్థాపించండి, నిశ్చయంగా నమాజ్ సిగ్గుమాలిన పనులనుండి, చెడుల నుండి వారిస్తుంది.** ***(అల్ అన్కబూత్ : 45)***

اَقِمِ الصَّلٰوةَ اِنَّ الصَّلٰوةَ تَنۡهٰى عَنِ الۡفَحۡشَآءِ وَالۡمُنۡكَرِ (العنکبوت: ۴۵)

దివ్యఖుర్ఆన్, గ్రంథవహుల సామాన్య జనుల్ని, వారి పండితుల్ని, వారి సన్యాసుల్ని తీవ్రంగా విమర్శించింది. వారి ప్రపంచ వ్యామోహాన్ని, పరలోకం పట్ల ఏమరుపాటును, నైతిక రుగ్మతల్ని అతి తీవ్ర పదజాలంతో ఖండించింది. దానితోపాటు వారిలోని సద్వర్తనులు, సంస్కారవంతులయిన వారిని ప్రశంసించింది కూడా. ఇలా చెప్పింది –

**"అందరూ ఒకేలా లేరు. వారిలో ఒక వర్గం ధర్మాన్ని నిలకడగా పాటిస్తుంది, వీరు రాత్రి వేళల్లో అల్లాహ్ వచనాలను పఠిస్తారు. ఆయన సమక్షంలో సజ్దా చేస్తారు. అల్లాహ్‌ను, పరలోకాన్ని విశ్వసిస్తారు, మంచిని బోధిస్తారు, చెడును వారిస్తారు, సత్కార్యాచరణలో వడివడిగా పరిగెడుతారు."**

***(ఆలి ఇమ్రాన్ : 113,114)***

గ్రంథవహులలోని సజ్జనులయిన దైవదాసుల ఎనిమిది సుగుణాలు ఇక్కడ వివరించబడ్డాయి. ఈ గుణాలు ఒకదానికొకటి అనివార్యమయినవిగా ముందుకు వస్తాయి. ఒక గుణం ఉన్న చోట మరో గుణం కూడా తప్పక కానవస్తుంది. ఇవి ఒకదానికొకటి బలాన్నీ చేకూర్చుతాయి. 'మంచిని ఆదేశించడం చెడును రూపుమాపడం' అనే భావన, ఆ సంకల్పం, ఆ సాహసం మనిషిలో పుట్టాలంటే, అతనిలో ఇతర గుణాలూ ఉన్నప్పుడే సాధ్యం. వాటిలో బాగా ప్రముఖమయిన గుణం, మనిషి అల్లాహ్ వచనాల పారాయణం చేసేవాడయి ఉండాలి. రాత్రిళ్ళలో దైవారాధనలో జాగరణ చేసేవాడయి

ఉండాలి. దీన్నిబట్టి మంచిని పెంచడం, చెడును నిర్మూలించడంలో కావలసిన నమాజ్ ఆవశ్యకతను గురించి అర్థం చేసుకోవచ్చు.

నమాజ్ దైవం ఇచ్చిన ఆదేశాలలో చాలా పెద్ద ఆదేశం, అత్యంత గొప్ప సత్కార్యం. ఏ వ్యక్తి అయితే నమాజ్ వంటి ఆరాధనను వదలివేస్తాడో అతను ఇతర సత్కార్యాలను వదలడం చాలా సులువు. దివ్యఖుర్ఆన్‌లో ఒక చోట కొందరు మహనీయులయిన దైవప్రవక్తల తరువాత వచ్చిన ప్రతినిధులను గురించి ఇలా ప్రస్తావించబడింది:

فَخَلَفَ مِنۢ بَعۡدِهِمۡ خَلۡفٌ اَضَاعُوا الصَّلٰوةَ وَاتَّبَعُوا الشَّهَوٰتِ (مریم:۵۹)

వారి తరువాత వచ్చిన వారు ఎంతగా అయోగ్యులయిన వారంటే వారు నమాజ్‌ను కోల్పోయారు, మనోకాంక్షల వెంటపడిపోయారు. *(మర్యమ్ : 59)*

దీన్నిబట్టి తెలిసేదేమిటంటే, మనిషి నమాజ్‌ను వదలిపెడితే మనోకాంక్షల దాసుడయిపోతాడు. ఆ తరువాత అతను చెడుకు ఏజెంటయితే కాగలడేమో కాని దైవ ధర్మానికి సేవకుడు మాత్రం కాలేడు.

## ప్రపంచ సంస్కరణ - నమాజ్

ధర్మవ్యాప్తి కృషిని సంస్కరణా కృషిగా కూడా పేర్కొనవచ్చు. నిజానికి ఈ కృషి, దేవుని భూమిని కల్లోలం దూరం చేసి, పరిశుద్ధపరిచే కృషి. ఖుర్ఆన్ దృష్టిలో దేవుని ధర్మాన్ని నమ్మనివారు, ఆయన చూపిన నియమనిబంధనల్ని పాటించనివారు ప్రపంచ సంస్కరణా ఉద్దేశ్యం గలవారుకారు, వారు భువిలో కల్లోలాన్ని రేకెత్తిస్తున్నారు. ఇటువంటి వారు ప్రపంచ నాయకత్వపు బాధ్యతల నిర్వహణకు తగరు. వారు ప్రపంచానికి దేవుని పట్ల అవిధేయతా మార్గం చూపుతున్నారు, దాన్ని వినాశం వైపునకు గొనిపోతున్నారు. ఇటు వంటి వారికి దూరంగా మెలగడంలోనే శ్రేయముంది. సమూద్ జాతినుద్దేశించి మహనీయ సాలిహ్ (అ) ఇలా అంటారు.

فَاتَّقُوا اللّٰهَ وَ اَطِيۡعُوۡنِ ۝ وَلَا تُطِيۡعُوۡۤا اَمۡرَ الۡمُسۡرِفِيۡنَ ۝ الَّذِيۡنَ يُفۡسِدُوۡنَ فِى الۡاَرۡضِ وَلَا يُصۡلِحُوۡنَ ۝ (الشعراء:۱۵۰-۱۵۲)

కాగా అల్లాహ్‌కు భయపడండి, నా విధేయతను పాటించండి, మితిమీరి ప్రవర్తిస్తున్న జనుల్ని అనుసరించకండి. వారు భువిలో కల్లోలాన్ని సృష్టిస్తున్నారు, సంస్కరించడం లేదు. *(అష్షు'రా : 150-152)*

హజ్రత్ షుఅయ్‌బ్ తన ప్రయత్నాలను గురించి ఇలా ప్రస్తావిస్తారు:

اِنْ اُرِيْدُ اِلَّا الْاِصْلَاحَ مَا اسْتَطَعْتُ وَمَا تَوْفِيْقِيْٓ اِلَّا بِاللّٰهِ عَلَيْهِ تَوَكَّلْتُ وَ اِلَيْهِ اُنِيْبُ ۝ (ھود:۸۸)

నేను నా వల్ల అయినంత మటుకు కేవలం సంస్కరణను కోరుకుంటున్నాను; నాకు దీని సద్బుద్ధి దైవం తరఫునే ప్రాప్తమవుతుంది. ఆయన్నే నేను నమ్ముకున్నాను, ఆయన వైపునకే నేను మరలుతున్నాను.

*(హూద్ : 88)*

దీన్నిబట్టి తెలిసేదేమిటంటే దేవుని సందేశహరులు ప్రపంచ సంస్కరణకే వస్తారు. ఈ మహత్తర కార్యసిద్ధికి రెండు సద్గుణాలు కలిగి ఉండటం అవసరం. ఒకటి అల్లాహ్ గ్రంథం ద్వారా మార్గదర్శనం పొందడం, రెండవది నమాజ్ ద్వారా అల్లాహ్‌తో సంబంధాన్ని పటిష్ఠపరచుకోవడం. ఇలా సెలవీయబడింది:

وَالَّذِيْنَ يُمَسِّكُوْنَ بِالْكِتٰبِ وَ اَقَامُوا الصَّلٰوةَ اِنَّا لَا نُضِيْعُ اَجْرَ الْمُصْلِحِيْنَ ۝ (الاعراف:۱۷۰)

ఎవరయితే దైవగ్రంథాన్ని పటిష్ఠంగా పట్టుకుంటారో ఇంకా నమాజ్‌ను స్థాపిస్తారో ఇటువంటి సంస్కరణాప్రియుల ప్రతిఫలాన్ని మేము వృథా పోనివ్వము.

*(అల్ ఆరాఫ్ : 170)*

ఇదొక వాస్తవాన్ని చాటుతుంది, దేవుని దృష్టిలో, అల్లాహ్ గ్రంథాన్ని పటిష్ఠంగా పట్టుకుని నమాజ్‌ని స్థాపించే వారే జాతుల సంస్కర్తలు, సేవకులు. ఇటువంటి వారి ద్వారానే జాతుల సంస్కరణ విధి నిర్వర్తించబడుతుంది. వీరి ప్రయత్నాలు వృథా పోవు. పరమ ప్రభువు వారికి పరిపూర్ణ ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాడు.

## ధర్మ సంస్థాపనం - నమాజ్

ధర్మం వైపునకు పిలుపు వాస్తవానికి ధర్మసంస్థాపనా కార్యం. ఈ పని జరగాలంటే మనిషి తనపైన ధర్మాన్ని నెలకొలుపుకోవాలి. ఏ వ్యక్తిలోనయితే తనపై ధర్మాన్ని సంస్థాపించుకునే ధైర్యం ఉండదో అతను దేవుని భూమిపైన ధర్మాన్ని స్థాపించడం అసాధ్యం. జీవితపు ప్రతి వ్యవహారంలోనూ ధర్మాన్ని అనుసరించే స్థోమతను కలుగజేస్తుంది మనిషిలో నమాజ్. దీని వల్ల అతనిలో ధర్మాన్ని పూర్తిగా అనుసరించే, అమలుపరచే శక్తిసామర్థ్యాలు జనిస్తాయి. కాగా హదీసులో ఇలా ఉంది:

الصلوة عماد الدين و من اقامها فقد اقام الدين و من هدمها فقد هدم الدين

నమాజ్ ధర్మానికి స్థంభం లాంటిది. ఎవరయితే నమాజ్‌ని స్థాపిస్తారో అతను ధర్మాన్ని స్థాపించినట్లు, మరెవరయితే నమాజ్‌ని కూలగొడతాడో అతను ధర్మాన్ని కూలగొట్టినట్లు.★

హజ్రత్ ఉమర్ (ర) తన గవర్నర్లకు నమాజ్ వేళల్ని గురించి కొన్ని సూచనలు జారీ చేస్తూ ప్రారంభంలో ఇలా వ్రాశారు:

మీ బాధ్యతల్లో అతిముఖ్యమయిన బాధ్యత, నా దృష్టిలో నమాజ్. ఎవరయితే దీన్ని వృధాపోనివ్వడో, దీన్ని నియమానుసారంగా పాటిస్తాడో అతను తన ధర్మాన్ని వృధా పోకుండా కాపాడుకున్నవాడు. మరెవరయితే దీన్ని వృధాపరచుకున్నారో అతను ఇతర (ఆదేశాలను) అధికంగా వృధాపరిచేవాడవుతాడు. ★★

వాస్తవానికి నమాజ్ లేకుండా మనిషి ధర్మాన్నీ నిలకడగా పాటించలేడు, దాని వైపునకు ప్రపంచాన్నీ పిలువలేడు.

## పిలుపునకు కావలసిన లక్షణాలు, నమాజ్

ధర్మసందేశం వైపునకు పిలిచేందుకు అవసరమయిన గుణగణాలు, లక్షణాలు సయితం నమాజ్ ద్వారానే జనిస్తాయి. ఇక్కడ వాటిలో కొన్నింటిని ప్రస్తావిస్తున్నాము.

## సహనస్థయిర్యాలు

ధర్మం వైపునకు పిలుపు అంటే ఆటలాడటం కాదు. దీనికి అపారమయిన

---

★ *ఈ రచయితకు హదీసు ఈ పదాలలోనే గుర్తుంది. అయితే దీని మూలం ఏదో గుర్తులేదు. ఇమామ్ గజాలీ ఇహ్యా ఉల్ ఉలూమ్‌లో దీన్ని ఇలా పేర్కొన్నారు, "నమాజ్ ధర్మానికి స్థంభం వంటిది. దీన్ని మానుకున్నవాడు ధర్మాన్ని పడగొట్టినట్లే. ఈ పదాలు చాలా క్లుప్తంగా ఉన్నాయి. అల్లామా ఇరాకీ దీన్ని గురించి, "ఈ హదీసులను బైహకీ, షు'బుల్ ఈమాన్‌లో హజ్రత్ ఉమర్ (ర) ద్వారా ఉల్లేఖించారు. దీన్ని బలహీన మయిందిగా కూడా నిర్ణయించారు. హాకిమ్ ప్రకారం దీన్ని ఇక్రమ, హజ్రత్ ఉమర్ (ర) ద్వారా ఉల్లేఖించారు. కాని ఇక్రమకు హజ్రత్ ఉమర్ (ర) ద్వారా హదీసు విన్న దాఖలాలు లేవు. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (ర) ద్వారానూ ఈ ఉల్లేఖనం వచ్చింది. ఇబ్ను సలాహ్ దీన్ని గురించి తనకు తెలియదని ప్రకటించారు. "ముష్కిలుల్ నసీత్"లో దీన్ని అప్రసిద్ధమయిందిగా పేర్కొనడం జరిగింది.*

★★ ముఅత్తా ఇమామ్ మాలిక్, బాబుల్ వకూత్.

సహనం, కొండలాంటి స్థయిర్యం, నిలకడ అవసరం. ఈ సుగుణం మనిషిలో నమాజ్ ద్వారానే జనించగలదు. ఖుర్ఆన్‌లో ఇలా ఉంది:

**اِنَّ الۡاِنۡسَانَ خُلِقَ هَلُوۡعًا○ اِذَا مَسَّهُ الشَّرُّ جَزُوۡعًا○ وَ اِذَا مَسَّهُ الۡخَيۡرُ مَنُوۡعًا○ اِلَّا الۡمُصَلِّيۡنَ○**

(معارج: ۱۹-۲۲)

**నిశ్చయంగా మనిషి అల్పమనస్కునిగా పుట్టించబడ్డాడు. తనకు కష్టం కలగగానే ఆందోళన చెందుతాడు. సుఖం ప్రాప్తం కాగానే చెయ్యివెనిక్కి ముడుచుకుంటాడు. అయితే నమాజ్‌ని ఆచరించేవారికి ఇందులో మినహాయింపు ఉంది.**

***(మఆరిజ్ : 19–22)***

ఒక పనిని కొన్నాళ్ళు నిర్వర్తించడం చాలా సులువు కాని నిలకడగా దాన్ని ఆచరిస్తూ ఉండటం అన్నది సులభం కాదు. కొందరు ఎంతో ఉద్వేగభరితంగా, ఉత్సాహ వంతంగా సందేశ కార్యాన్నయితే ప్రారంభిస్తారు. కాని అతి త్వరగా వారిలోని భావావేశం చల్లబడిపోతుంది. వారు దాన్ని వదలివేస్తారు. దీన్నిబట్టి వారి దృష్టిలో ఈ కార్యానికి ఎటువంటి ప్రాముఖ్యతా లేదని స్పష్టంగా తెలుస్తోంది. వారు ధర్మసందేశ వ్యాప్తికి పూనుకున్నప్పుడు తాను ఎటువంటి మహత్కార్యాన్ని ప్రారంభిస్తున్నాడో అన్న భావమూ వారిలో ఏర్పడలేదు.

అలాగే ఈ సందేశ కార్యాన్ని వదలిపెట్టినప్పుడు కూడా వారికి, తాము ఎంత మహత్పూరకమయిన కార్యాన్ని వదలిపెడుతున్నామో అన్న భావము కూడా లేదు. వాస్తవానికి ధర్మసందేశ భావావేశం మనిషిలో ఒకసారి చోటుచేసుకుంటే చివరి శ్వాస వరకు దాని వెచ్చదనం అతన్నుండి దూరం కారాదు. నమాజ్ మీలో ఈ స్థిరత్వాన్ని నిలకడను జనింపజేస్తుంది. అందువల్ల మీరు వాస్తవంగా నమాజ్‌ను ఆచరించేవారే అయినట్లయితే ధర్మకార్యాల్లోనూ మీకు నిలకడ ప్రాప్తమవుతుంది. లేకపోతే మీరు దానికి దూరమయిపోతారు. ఖుర్ఆన్ నమాజ్‌ని ఆచరించేవారి గుణగణాలను ఇలా అభివర్ణిస్తోంది.

**اَلَّذِيۡنَ هُمۡ عَلٰى صَلٰوتِهِمۡ دَآئِمُوۡنَ○**

(المعارج: ۲۳)

**వారు తమ నమాజ్ పట్ల నిత్యతను పాటించేవారయి ఉంటారు.**

***(అల్ మఆరిజ్ : 23)***

నమాజ్‌లో నిలకడ మిమ్మల్ని సహజంగానే ధర్మాచరణలో నిలకడను అలవడ జేస్తుంది. మీరు సదా ధర్మాదేశాలను పాటించేవారుగా సన్నద్ధులవుతారు. ధర్మప్రచార కార్యాన్ని నిరంతరాయంగా కొనసాగించగలుగుతారు.

## నమాజ్ వల్ల సహనం జనిస్తుంది

నమాజ్ ద్వారా స్థిరత్వం, నిలకడ ప్రాప్తమవుతాయి. దీన్నే సహనమనీ అంటారు. సహనం అంటే దానికి ఎన్నో కోణాలున్నాయి. ఒకటేమిటంటే, మనిషి అన్నిరకాల కష్టాల్లోనూ, పరీక్షా విపత్తుల్లోనూ ధర్మంపైన స్థయిర్యంగా నిలబడాలి. దాన్ని లేశమయినా జవదాటరాదు. ధర్మసందేశ కార్యాన్ని కొనసాగిస్తూ ఉండాలి. ఈ విశేష గుణాలన్నీ సృజించే మార్గం నమాజ్ ఒక్కటే. నమాజ్ ద్వారా ఎటువంటి పరిస్థితుల్లోనయినా సహన స్థయిర్యాలను పాటించే స్థోమత ప్రాప్తమవుతుంది. దివ్యఖుర్‌ఆన్ బోధనలు, ఇస్లామీయ చరిత్ర ద్వారా దీని సాక్ష్యం ప్రాప్తమవుతుంది.

ఇస్లామీయ సందేశం రీత్యా ప్రవక్త జీవితంలో మక్కా కాలం సహనస్థయిర్యాల కాలం. ఆ కాలంలో దైవసందేశహరులు(స) వంటి నిస్వార్థ, సౌశీల్య, సౌజన్య అమాయక వ్యక్తిత్వం బాటలో ముళ్ళు పరచడం జరిగింది. రాళ్ళు కురిపించబడ్డాయి. దైవం మన్నించుగాక, పిచ్చివాడు అని పిలవడం జరిగింది. ధర్మభ్రష్టునిగా చిత్రించడం జరిగింది. కథలల్లేవానిగా అభివర్ణించడం జరిగింది. ఇతరులు నేర్పిస్తే వల్లించేవానిగా పేర్కొనడం జరిగింది. ఆయన(స) ఈ నిరాధారమయిన నిందారోపణ పట్ల ఎన్నడూ ఆగ్రహించలేదు. సహనంగా ప్రశాంతంగా తన సందేశాన్ని అందజేస్తూ వచ్చారు. వ్యతిరేకించేవారి అంతరాత్మను జాగృతపరిచే కృషిజరిపారు. వారు బుద్ధినుపయోగించాలని ప్రేరేపించడం జరిగింది. వారు ఆలోచించాలని, పరిశీలించాలని పురికొల్పడం జరిగింది. గుడ్డిగా వ్యతిరేకించడం వల్ల కలిగే దుష్పరిణామాలను గురించి హెచ్చరించడమూ జరిగింది. ఈ విధంగా వైషమ్యం, విద్వేషాల ఆ వాతావరణంలో తన వాదనను పూర్తిచేశారు.

ఆయన పరిశుద్ధ ఆదర్శాన్ని ఆయన సహచరమాన్యులు అనుసరించారు. వ్యతి రేకతా తుఫానులో సహన పర్వతాలయి నిల్చున్నారు. వారి నిరంతర కృషి అనుపమ మయినదయితే సహనం కూడా అద్వితీయమయినది, అది పిరికివారు, దౌర్జన్యాలను సహించడం వంటిది కాదు, అది యోధానుయోధుల సహనం, మృత్యువుతో ఆటలాడుకునే వారి సహనం. అది మాటిమాటికీ కరవాలాలను ఒరలో నుంచి బయటికి తీసే జాతి ప్రజల సహనం. ఆ జాతి ఆగ్రహోదగ్రత జ్వాలలు, ఎదురు వచ్చేవాని ఎడల ప్రతీకారం

తీర్చుకోనిదే చల్లారేదికాదు. ఆ జాతి తన ఒడంబడికదారులైనా, తన సమర్థకులపైనా ఎవ్వరినీ చెయ్యి చేసుకునేందుకు అనుమతించేదికాదు. అందులోని ప్రతి ఒక్క వ్యక్తి దెబ్బతిన్న తరువాత బెబ్బులిలా ఉగ్రుడయిపోయేవాడు. ఆ జాతి దృష్టిలో అత్యాచారాన్ని భరించడం పిరికితనానికి మారుపేరు. అది అజ్ఞానానికీ, బర్బరత్వానికీ సమాధానం, అంతకన్నా తీవ్రమయిన అజ్ఞానం, బర్బరత్వం ద్వారా ఇవ్వడమే సరయినదని భావించేది.

ఆశ్చర్యకర విషయమేమిటంటే, అటువంటి జాతి ప్రజల్ని, వారిలో అధికులయిన నవయువకుల్ని సహనం, సంయమనాలకు కట్టుబడేవారుగా మలిచింది ఇస్లాం. మక్కా జీవితచరిత్రలో, ఏ అబద్ధపు ఆరోపణకయినా, తప్పుడు ప్రచారానికయినా వారు రెచ్చిపోయిన ఒక్క ఉదాహరణ కూడా ప్రాప్తంకాదు. లేదా అన్యాయం, అత్యాచారానికి ఎదురుగా ప్రతీకార ఆవేశం ఉబికివచ్చిన దృష్టాంతమూ కానరాదు. తూలనాడులకు ప్రతిగా తూలనాడడం, దుర్వర్తన చేసినట్లు ఒక్క సందర్భమూ దర్శనమివ్వదు. ఎదుటి వ్యక్తి కత్తి దూసినప్పుడు వీరు కూడా కత్తిదూసినట్లుగాని, కరవాలం ఎత్తినప్పుడు వీరూ కరవాలం ఎత్తినట్లుగాని ఒక్క ఉదాహరణ దొరకదు. సహనానికి సంబంధించిన ఈ అసాధారణ స్థితి నమాజ్ ద్వారానే ప్రాప్తమవుతుంది. అందువల్లనే దివ్యఖుర్ఆన్‌లో సహనాన్ని ఆదేశించిన ప్రతి చోటా సర్వసాధారణంగా నమాజ్‌ని ఉపదేశించడం జరిగింది. ఒక ఉదాహరణ గమనించండి,

فَاصۡبِرۡ عَلٰی مَا یَقُوۡلُوۡنَ وَ سَبِّحۡ بِحَمۡدِ رَبِّکَ قَبۡلَ طُلُوۡعِ الشَّمۡسِ وَ قَبۡلَ الۡغُرُوۡبِ وَ مِنَ الَّیۡلِ فَسَبِّحۡهُ وَ اَدۡبَارَ السُّجُوۡدِ ۝ (قٓ:۳۹-۴۰)

వీరు చెప్పేదానికంతటికీ సహనం వహించు. నీ ప్రభువు స్తోత్రంతోపాటు ఆయన పరిశుద్ధతను కొనియాడు. సూర్యోదయానికి పూర్వమూ, సూర్యాస్తమయానికి పూర్వం కూడాను; రాత్రివేళలోనూ ఆయన పరిశుద్ధతను కొనియాడు. సజ్దాలు ఆచరించిన తరువాత సయితమూ.

*(కాఫ్ : 39,40)*

## సహనం ప్రాముఖ్యత

ధర్మసందేశకార్యం చెయ్యబూనుకున్నవారు నేడు కూడా సహనం పాటించడం, నిన్నటిలా అంతే అవసరం. ఇప్పుడు ఒక వైపున మత విరోధులు, ధర్మభ్రష్టులయినవారు వారికి ఎదురుగా నిల్చున్నారు. మరో వైపున దైవసందేశహరుని పేరు చెప్పుకునేవారే వారిని ఎదిరిస్తున్నారు. ధర్మవిరోధులయినవారు వీరిని ఛాందసవాదులని, బూజుపట్టిన ఆచారా

లను పాటించేవారని, కాలాన్ని ఎరుగనివారని, దేశద్రోహులని, జాతి విరోధులని, మతతత్వవాదులనీ నిరూపించే ప్రయత్నాలన్నీ చేస్తున్నారు. దీనికి కారణం, వారు ధర్మ సేవకుల్ని అదే రూపంలో చూడటం కాదు, వారు చేసే కృషి అంతా అదే విధంగా వారు గమనించ డమూ కాదు. నిజానికి వారు వీరిని తమ మార్గాన పెద్ద అవరోధంగా పరిగణిస్తున్నారు. వీరి చాటున దైవధర్మాన్ని, అందులోని విశ్వాసాలను, దాని జీవన తత్వాన్ని తమకు గురిగా ఎంచుకున్నారు.

ధర్మపరాయణులుగా పరిగణించబడేవారి పక్షాన కూడా వీరిపైన అబద్ధపు ఆరోపణలు వర్షిస్తున్నాయి. ఓసారి వీరి నమ్మకాలు అశుద్ధమయినవని అంటే మరోసారి వీరు దైవాన్ని విశ్వసిస్తారు, దైవప్రవక్తను నమ్మరు అని అంటారు. దేవుణ్ణి, దైవప్రవక్తనూ నమ్ముతారు కాని మేము నమ్మేలా వీరున్నూ నమ్మరు అని అంటారు. ఒక్కొక్కసారి, వీరి మతం రాజకీయ మతమని, వీరు అధికారకాంక్ష గలవారని, వీరిలో తక్వా, దైవభక్తి అన్నవి ఏ కోశానా లేవని ఆరోపిస్తారు. ఒక్కో కంఠం, వీరు ప్రవక్త సహచరమాన్యులను, ముస్లిమ్ సముదాయంలోని గొప్పవారినీ కించపరుస్తారని చాటితే మరో పెద్దలు, వీరు తమ్ముతాము తప్ప మరెవ్వరినీ ముస్లింలుగా భావించరని నిందమోపుతారు. మరోసారి, వారి దృష్టిలో తాము తప్ప మరెవ్వరూ ధర్మాన్ని సరిగ్గా అవగతం చేసుకోలేదని అంటారు. ఇదంతా ఆసాంతం అబద్ధమని అందరికీ తెలిసిన విషయమే, అంతా అబద్ధపు ఆరోపణ, తప్పుడు ప్రకటనలనీ అందరికీ తెలిసిందే. ఈ అబద్ధపు కల్పనల తుఫానులో సహన స్థయిర్యాల సంపద మీకు నమాజ్ ద్వారానే సంప్రాప్తమవుతుంది.

## నమాజ్, స్థిరచిత్తం

ఒక ఇస్లామేతర వాతావరణంలో నిజమయిన ఇస్లామీయ సందేశం వెలియడం, దాని ఆధారంగా దాని కార్యకర్తలు నిలకడ కనబరచడం చాలా కష్టసాధ్యమయిన విషయం. ఇస్లామీయ ఆలోచనపై ఇస్లామేతర ఆలోచనలు నలువైపుల నుండి దాడి చేస్తున్నప్పుడు, వ్యతిరేక వాతావరణం కఠినంగా, తీవ్రస్థాయి ఒత్తిడి తెస్తున్నప్పుడు, నిరుత్సాహకరమయిన పరిస్థితుల్లో సందేశవ్యాప్తి కార్యకలాపాలు కొనసాగించవలసి వచ్చినప్పుడు, ఒక కార్యకర్తలోని సద్గుణాన్ని అంగీకరించే వాతావరణమే లేకపోతే అతని తప్పిదాలను ప్రశంసించే పొగిడే వాతావరణం ఏర్పడుతున్నప్పుడు, బలహీనతను విజ్ఞతగా ఔచిత్యంగా కొనియాడుతున్నప్పుడు, ముందంజ వేయడాన్ని ఖండించి, వెనుకంజ వేయడాన్ని ప్రశంసిస్తున్నప్పుడు - ఇటువంటి వాతావరణంలో సహన స్థిరత్వాలను ప్రదర్శిం చడం ఓ మహత్కార్యమని అంటే అది అతిశయోక్తి ఎంతమాత్రం కాదు.

ఇస్లామ్ ఎదుగుతున్నట్లుగా వైరిశక్తులు గమనించినప్పుడల్లా అవి దాన్ని బలం ద్వారా అణచివేయాలని కోరుకుంటాయి. కాని అది వారికి సులభసాధ్యం కాదు. ఉద్యమాన్ని దండబలం ద్వారా, బలవంతాన అణచివేయడం వీలుపడని విషయం. అందు వల్ల ఉద్యమాలను ఉద్యమ ధ్వజవాహకులు స్వయంగా ఉద్యమాన్ని అంతమొందించాలని అవి ప్రయత్నం చేస్తాయి. దీనికి అవి బహిరంగంగా అభ్యర్థించవు, అవి కోరేది కేవలం చిన్న విషయం, ఇస్లామ్‌ను నమ్మేవారు తన భూమిక నుండి కాస్త వెనక్కి తగ్గాలి. వారు, ఇతరుల ఆలోచనల్ని, భావాలను సవ్యమయినవని, సత్యమయినవనీ అంగీకరించాలి. అలాగే ఇతరులూ వీరి సిద్ధాంతాలలోని మంచిని గుర్తించాలి. కొన్ని విషయాలను వీరు భరించాలి, మరి కొన్నింటిని వీరి వ్యతిరేకులు సహించాలి. అలాగే పరస్పరం సహజీవనం సాగించే ఏదయినా రూపం ముందుకు వస్తుంది.

ఇది అత్యంత సున్నితమయిన దశ. ఇటువంటి సందర్భాలలోనే ఇస్లామ్‌ని అనుస రించేవారిలోనూ మెతక వైఖరి, సంధిభావం జనించే అవకాశం కలుగుతుంది. వారు తమ ఆలోచనల్లో మార్పునకు సిద్ధమయ్యే వీలు కలుగుతుంది. ఇటువంటి ప్రతి ఒక్క చర్య కూడా ఉద్యమానికి ప్రాణాంతకం వంటిది. అది దాని కార్యకర్తలకూ మృత్యుతుల్యం. మనిషి ఉచ్ఛస్థానం నుండి దొర్లడం మొదలెడితే ఇక మధ్యన ఎక్కడా ఆగడు. పూర్తిగా క్రింది స్థాయికి చేరిన తరువాతనే శ్వాసపీల్చుకుంటాడు. ఒకసారి పరిస్థితులకు అతని శిరస్సు కాస్త లొంగిపోయిందంటే ఇక పరిస్థితులే అతనిచేత సజ్దా (సాష్టాంగ ప్రమాణం) చేయించి తీరుతాయి. అతను ఒక వస్తువు శత్రువుకు హస్తగతం చేస్తే శత్రువు అతన్ని ప్రతి వస్తువుకూ వంచితుణ్ణి చేసివేస్తాడు.

మిథ్యాశక్తులకు ఎదురుగా స్థిరచిత్తంతో నిలవడం పరమ ప్రభువు సంస్మరణ అయిన నమాజ్ ద్వారానే ప్రాప్తమవుతుంది. చూడండి, ఖుర్‌ఆన్ ఎంత విశదంగా చెబుతోందో:

**కాగా, ప్రవక్తా, నీవూ నీ సహచరులు, నీతోపాటు అల్లాహ్ వైపునకు మరలివచ్చిన వారు, రుజుమార్గాన నీకు ఆదేశమిచ్చిన రీతిలో నిలకడ కనబరచండి, హద్దులను మీరకండి. నిశ్చయంగా నీవు చేసేదల్లా ఆయన చూస్తూనే ఉన్నాడు. పోతే, అత్యా**

**فَاسْتَقِمْ كَمَآ اُمِرْتَ وَ مَنْ تَابَ مَعَكَ وَلاَ تَطْغَوْا اِنَّهٗ بِمَا تَعْمَلُوْنَ بَصِيْرٌ ۝ وَلاَ تَرْكَنُوْآ اِلَى الَّذِيْنَ ظَلَمُوْا فَتَمَسَّكُمُ النَّارُ مَا لَكُمْ مِّنْ**

دُوْنِ اللّٰهِ مِنْ اَوْلِيَآءَ ثُمَّ لاَ تُنْصَرُوْنَ○ وَ اَقِمِ الصَّلٰوةَ طَرَفَيِ النَّهَارِ وَ زُلَفًا مِّنَ الَّيْلِ اِنَّ الْحَسَنَاتِ يُذْهِبْنَ السَّيِّاٰتِ ذٰلِكَ ذِكْرٰى لِلذّٰكِرِيْنَ○ وَاصْبِرْ فَاِنَّ اللّٰهَ لاَيُضِيْعُ اَجْرَ الْمُحْسِنِيْنَ○

(هود: ١١٢-١١٥)

చార వైఖరినవలంబించిన వారి వైపునకు ఏకాస్తా మొగ్గరాదు. అలా జరిగితే నరకానికి ఆహుతి అయిపోతావు. నీకు అల్లాహ్ తప్ప మరే సహాయకుడూ లేడు. మరెక్కడి నుండీ నీకు మద్దతు ప్రాప్తం కాదు. నమాజ్‌ని స్థాపించు. పగటి రెండు చివర్ల లోనూ రేయి కొన్ని భాగాల్లోనూ. నిస్సందేహంగా సత్కార్యాలు దుష్కార్యాలను అంత మొందిస్తాయి. దైవాన్ని గుర్తుంచుకున్న వారికి ఇది జ్ఞాపిక. నిశ్చయంగా అల్లాహ్ సదాచరణల ప్రతిఫలాన్ని వృధా పోనివ్వడు. *(హూద్: 112 -115)*

స్థిరత్వపు ఆదేశంతోపాటు అత్యాచారాలు, దైవవిరోధుల వైపునకు ఏమాత్రం మొగ్గరాదన్న నిషేధమూ ఉంది. ఆ తరువాత రేయి, పగటి వేళల్లో కొన్ని భాగాల్లో నమాజ్‌ని స్థాపించవలసిన తాకీదు చేయబడింది. దీని ద్వారా, నమాజ్ ఆధారంగానే మనిషి స్థిరత్వాన్ని కనబరచగలడని తెలుపడమూ జరిగింది. నమాజ్ లేకపోయినట్లయితే అతని అడుగులు తడబడతాయి. అతను బలహీనపడతాడు, దౌర్జన్యపరులు అతన్ని తమ వైపునకు లాక్కుపోతారు.

## ధర్మం- దాని నిజభావన వ్యక్తీకరణ

ధర్మం వైపునకు పిలుపు వల్ల ఏర్పడే ఆవశ్యకత ఒకటి ఏమిటంటే, ధర్మాన్ని ఎటువంటి హెచ్చుతగ్గుల్లేకుండా, దాని నిజమయిన రూపంలో, పరిపూర్ణ రూపంలో అందజేయాలి. దాని సరయిన సామర్థ్యం మీలో జనించాలంటే మీరు నమాజ్‌ని కూడా సరిగ్గా నియమానుసారం పాటించాలి, అందులో ఎటువంటి కొరత రానివ్వరాదు. ఖుర్ఆన్ నమాజ్‌ని ఆచరించేవారిని గురించి చెబుతూ ఇలా అంది.

وَالَّذِيْنَ هُمْ عَلٰى صَلٰوتِهِمْ يُحَافِظُوْنَ○ (المومنون:٩)

ఎవరయితే తమ నమాజులను పరిరక్షించుకుంటారో *(అల్ ము'మినూన్: 9)*

మీరు నమాజ్‌లోని ఒక్కొక్క అంశాన్ని, ఒక్కొక్క ఆవశ్యకతను నెరవేర్చినప్పుడు సరయిన భావంలో నమాజ్‌ని పరిరక్షించినవారవుతారు. అలాగే దైవధర్మాన్నీ సరయిన రీతిలో ప్రపంచం ఎదుట అందజేయగలరు. అప్పుడే దాన్ని అందజేయవలసిన రీతిలో అందజేయగలుగుతారు.

ఖుర్‌ఆన్, హదీసుల ద్వారా తెలిసేదేమిటంటే దైవం అన్నింటికన్నా అధిక ప్రాముఖ్యత నమాజ్‌కే ఇచ్చాడు. మీ జీవితంలోనూ అన్నింటికన్నా ఆధిక్యత నమాజ్‌కే ప్రాప్తం కావాలి. నమాజ్ దైవానికి అన్నింటికన్నా ప్రీతిపాత్రమయిన ఆచరణ. మీకూ అన్నింటికన్నా ఇష్టమయిన ఆచరణ నమాజ్ మాత్రమే కావాలి. ప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు:

నమాజ్‌లో నా కంటి చలువ భద్రపరచబడి ఉంది.★ నమాజ్‌కు కంటి చలువ కావడమూ అవసరమే. మీకు దాని ద్వారా ఆనందం, సుఖం ప్రాప్తం కావాలి. దాని ఒక్కొక్క అంశంలోనూ మాధుర్యం, కమ్మదనం లభించాలి. ఇటువంటి ప్రత్యేకతలు గల నమాజ్ మీ సాఫల్యానికి సోపానమవుతుంది. మీ కొరకు దేవుని కారుణ్యాన్ని కొనితెస్తుంది. మీలో కఠినాతికఠినమైన వాతావరణంలోనూ, వ్యతిరేకతా తుఫానులోనూ దైవధర్మాన్ని అందజేసే సౌభాగ్యాన్ని పొందే యోగ్యతను కలుగజేస్తుంది. కాని మీ నమాజ్‌లో ఈ ప్రత్యేకతలు లేకపోయినట్లయితే మీరు నమాజ్‌ని పాటించినప్పటికీ దైవాన్ని మరచిపోయే ఉంటారు. దైవాన్ని మరచిపోయిన వ్యక్తిని దైవమూ మరచిపోతాడు. ధర్మం వైపునకు పిలిచే మహత్తర కార్యాన్ని నిర్వర్తించడం అటువంటి వ్యక్తికి సాధ్యపడే విషయంకాదు.



★ సునన్ నసాయి, కితాబ్ ఇష్రతున్నిసా, బాబ్‌హుబ్బున్నిసా; ముస్నద్ అహ్మద్ : 3/128

# దైవమార్గంలో ఖర్చుపెట్టడం★

శ్రీమంతుడయిన వ్యక్తి విలాసవంతమయిన జీవితం గడుపుతాడు, తన మనో కాంక్షల్ని నెరవేర్చుకుంటాడు. గొప్ప భవంతుల్ని నిర్మించుకుంటాడు. దైవదాసుల్ని తన బానిసలుగా చేసుకుంటాడు. వారి మధ్యన తన ఉన్నత స్థానాన్ని స్థిరపరచుకుంటాడు. అయితే ధనవంతునికి దైవమార్గంలో ఖర్చుపెట్టమని ఆదేశించింది ఇస్లామ్. ఇన్ఫాక్ ఫీసబీలిల్లాహ్ అంటే ఇదే. దీని ప్రకారం మనిషి తన సంపాదనను దైవమార్గంలో వెచ్చించడం అవసరం. దేవుని దాసునికి దేవుని మార్గాన ఖర్చుపెట్టే హక్కు మాత్రమే ఉంది. అతను ఇతరత్రా తన ధనం ఖర్చుపెట్టినట్లయితే అతను తన పరిధుల్ని అతిక్రమించిన వాడవుతాడు.

## పరమ ప్రభువు మహోపకారాల అంగీకారం

ఇన్ఫాక్ లేక ఖర్చుపెట్టడమన్నది దైవం చేసిన మహోపకారాలను ఆచరణాత్మకంగా అంగీకరించడమన్నమాట. దైవం మానవునిపైన అసంఖ్యాకమయిన ఉపకారాలు చేశాడు. వాటి ఆవశ్యకతగా, తనవంటి మానవుల ఎడల ఉపకార రీతిలో ప్రవర్తించడం అవసరం. దీనికి అత్యుత్తమ రూపం వారికి ధనసహాయం అందజేయడం. ఒక వ్యక్తి తన కష్టార్జితాన్ని ఒక అగత్యపరుని కొరకు ఖర్చుపెట్టినట్లయితే అలా చేసిన వ్యక్తికి దేవుని శుభవరాలున్నా యన్న మాట. అతను ఆయన పట్ల కృతజ్ఞతాభివందనాలు ఇలా తెలుపుకోగోరుతున్నాడన్న మాట. విశ్వాసిలోనూ, అవిశ్వాసిలోనూ గల వ్యత్యాసం ఇదే. విశ్వాసి దేవునికి కృతజ్ఞుడైన దాసుడు. తిరస్కారి అల్లాహ్‌ను మరచిపోయినవాడు, కృతఘ్నుడు కూడా. అల్ బలద్ సూరాలో అల్లాహ్ తాను మానవునికి చేసిన కొన్ని మేళ్ళను ఉదాహరించి ఇలా అంటాడు.

---

★ దైవమార్గంలో ఖర్చుపెట్టడం (ఇన్ఫాక్ ఫీసబీలిల్లాహ్– ఉర్దూ) అన్న పేరుతో రచయిత వ్రాసిన పుస్తకం ఇదివరకే ప్రచురించబడింది. ఈ విషయం అందులోనుంచే గ్రహించడం జరిగింది.

فَلاَ اقْتَحَمَ الْعَقَبَةَ○ وَمَآ اَدْرَاكَ مَا الْعَقَبَةُ○ فَكُّ رَقَبَةٍ○ اَوْ اِطْعٰمٌ فِيْ يَوْمٍ ذِيْ مَسْغَبَةٍ○ يَتِيْمًا ذَا مَقْرَبَةٍ اَوْ مِسْكِيْنًا ذَا مَتْرَبَةٍ○ (البلد:١١-١٦)

కాని అతను దుర్గమ పర్వతశ్రేణికి చేరే సాహసం చేయలేదు. దుర్గమ పర్వతశ్రేణి ఏమిటో నీకేమయినా తెలుసా? అది, ఒకని మెడను బానిసత్వం నుండి విముక్తం చేయడం. లేక ఒక దగ్గరి అనాధకో, లేక నేలవాసి నిరుపేదకో పస్తులున్న రోజుల్లో అన్నం పెట్టడం. *(అల్ బలద్ : 11–16)*

## ధనం ఖర్చుపెట్టడం, దైవభీతికి నిదర్శనం

దైవమార్గంలో ఖర్చుపెట్టడం, ఆయన పట్ల భయభక్తులకు నిదర్శనం. ఖర్చుపెట్టడాన్ని అల్లాహ్ పరలోక శిక్ష నుండి విమోచనానికి మార్గంగా చూపెట్టాడు, అందువల్ల పరలోక భయం ఉన్న హృదయం గల వ్యక్తి నిశ్చయంగా తన సంపదను ఖర్చుపెడతాడు. పరలోక శిక్ష నుండి రక్షించుకునే ప్రయత్నం చేస్తాడు. ఖుర్ఆన్ ప్రకారం, అనాధలను, నిరుపేదలను ఛీత్కరించి గెంటివేసేవారు దైవంపట్లను, పరలోకం పట్లనూ ప్రమత్తుడయిన వాడే అయి ఉంటాడు. (అల్ మాఊన్: 1–3)

అల్లాహ్ భయం, పరలోక చింతన ఎవరి మనోమస్తిష్కాలను ఆక్రమించుకుని ఉంటాయో వారిలో ఇటువంటి కఠిన హృదయత ఉంటుందని ఆశించలేము. వారి స్థితి పూర్తిగా భిన్నమయింది.

وَ يُطْعِمُوْنَ الطَّعَامَ عَلٰى حُبِّهٖ مِسْكِيْنًا وَّ يَتِيْمًا وَّ اَسِيْرًا○ اِنَّمَا نُطْعِمُكُمْ لِوَجْهِ اللّٰهِ لاَ نُرِيْدُ مِنْكُمْ جَزَآءً وَّلاَ شُكُوْرًا○ اِنَّا نَخَافُ مِنْ رَّبِّنَا يَوْمًا عَبُوْسًا قَمْطَرِيْرًا○ (الدہر:٨-١٠)

వారు తమకు భోజనాల పట్ల మక్కువ, ఆవశ్యకత ఉన్నప్పటికీ దాన్ని అగత్యపరులకు, అనాధలకు, ఖైదీలకు పెడతారు. (తమ ఆచరణాత్మక భాషలో) మేమయితే కేవలం దేవుని ప్రసన్నత కొరకు మాత్రమే అన్నం పెడుతున్నాం. మేము మీ నుండి దీని ప్రతిఫలాన్నీ, కృతజ్ఞతనూ కోరడం లేదు. మాకు ఆ కఠినతరమయిన భయంకర దినం పట్ల భయం కలుగుతోంది. అది రావడం మా ప్రభువు తరఫున తథ్యం.

*(అద్దహ్ర్ : 8–10)*

## ధనం ద్వారా మానవ సేవ

మనిషి వద్ద సంపదలున్నట్లయితే అతను దాన్ని తన కోసం ఖర్చుపెడతాడు. తన ఆప్తులు, బంధువుల కొరకు ఖర్చుపెడతాడు. దాన్ని మించి దాతృత్వం జాతి కోసం, తెగవారి కోసమూ కావచ్చు. అయితే ఇస్లామ్ అతని సమక్షంలో ఓ సువిశాల దృక్కోణాన్ని పెడుతుంది. అది మానవుని కోసం మానవునిగా ఖర్చుపెట్టమని ఆదేశిస్తుంది. ఒక ముస్లిమ్ అయిన వ్యక్తి విధిగా ఆకలిగొన్నవానికి భోజనం పెట్టడం, దుస్తుల్లేని వ్యక్తికి దుస్తులు ఇవ్వడం, అవసరమున్న వ్యక్తికి, అగత్యపరునికి చేయూతనివ్వడం తప్పనిసరి అంటుంది. ఆ వ్యక్తి ఆప్తుడయినా, పరాయివాడయినా, అపరిచితుడయినా, తెలిసినవాడయినా, స్వదేశీయుడయినా, పరదేశీయుడయినా, తన స్వమతస్థుడయినా, పరాయి మతస్థుడయినా, తాను ఒక అవసరమున్నవాణ్ణి ఆదుకునే స్థితిలో ఉన్నప్పుడల్లా అతను తప్పనిసరిగా అతనికి సహాయం చేయాలి. ఇంతకు ఈ విధినిర్వహణ అతని శక్యంకాకపోతే అప్పుడు అతన్ని పట్టుకోవడం జరుగదు.

దైవమార్గంలో ఖర్చుపెట్టడం దైవకారుణ్యాన్ని ఆహ్వానించడంతో సమానం. అగత్యపరుడయిన వ్యక్తి తన ఆవశ్యకతను నెరవేర్చిన మనిషికి దైవకారుణ్యానికి పాత్రుడయ్యే అవకాశాన్ని కల్పిస్తాడు. అందువల్లనే హదీసులో ఇలా ఉంది.

**కరుణ చూపేవారిపైన దేవుడు కరుణ చూపుతాడు. మీరు నేలపై నుండేవారిని కనికరించండి, నింగిపై నుండేవాడు మిమ్మల్ని కనికరిస్తాడు.★**

ఖర్చు పెట్టే విషయంలో ఈ సువిస్తర దృష్టిని సదా ముందుంచుకోవాలి. ఇదే, ధర్మం, విశ్వాసాలు కోరేది. వీటి సహజమయిన వాంఛ కూడా ఇదే.

## నమాజ్, ఇన్ఫాక్- తోడుతోడుగా ఆదేశం

నమాజ్ ధర్మానికి స్థంభంవంటిది. దివ్యఖుర్ఆన్‌లో, జకాత్‌ని లేదా ఇన్ఫాక్ ఫీ సబీలిల్లాహ్‌ని నమాజ్‌తోపాటు జోడు కలిపింది. నమాజ్ ప్రస్తావన చేసినప్పుడల్లా సర్వసాధారణంగా దాని పక్కనే ఇన్ఫాక్ ఫీ సబీలిల్లాహ్ ప్రస్తావన కూడా వస్తుంది. దివ్యఖుర్ఆన్ ప్రారంభ భాగంలోనే దైవభక్తిగలవారి, ధర్మనిష్ఠగలవారి ప్రస్తావన ఇలా ఉంది.

اَلَّـذِيْنَ يُؤْمِنُوْنَ بِالْغَيْبِ وَ يُقِيْمُوْنَ الصَّلٰوةَ وَ مِمَّا رَزَقْنٰـهُمْ يُنْفِقُوْنَ ۝ (البقرة:٣)

**వారు అగోచర విషయాలను నమ్ముతారు, నమాజ్ స్థాపిస్తారు, మేము వారికి ప్రసాదించిన సంపదలో నుంచి ఖర్చుపెడతారు.**

*(అల్ బకర : 3)*

★ జామి' తిర్మిజీ, అబ్వాబుల్ బిర్రు వస్సిల, బాబ్ మాజాఅ ఫీ రహ్మతిల్ ముస్లిమీన్.

ఇలా ఇంకా ఎన్నో వచనాలున్నాయి. వాటిలో నమాజ్‌తోపాటు ఖర్చుపెట్టడాన్ని, జకాత్‌ని ప్రస్తావించడం జరిగింది. ఈ రెంటి ఉద్దేశ్యం, సారం ఒక్కటే. ఇస్లామ్ దాని అనుయాయుల్ని కోరేదేమిటంటే, ఒకవైపున వారు నమాజ్‌ని స్థాపించే ఏర్పాటు చేయాలి, మరోవైపున దైవమార్గంలో తమ సంపద ఖర్చుపెట్టాలి. అప్పుడే ఇహపర లోకాల సాఫల్యం ప్రాప్తమయ్యే అవకాశం ఉంటుంది. ఇదే లేకపోతే సఫలతను ఊహించనూలేము.

## తహజ్జుద్ నమాజ్- ఇన్ఫాక్

తహజ్జుద్ నమాజ్ చేయడం దేవుని సదాచారులయిన దాసుల ప్రత్యేకమయిన గుర్తు. దివ్యఖుర్‌ఆన్ దీని ప్రస్తావనతోపాటు కీడు చేసే ఇన్ఫాక్ (ఖర్చు)ను సయితం తప్పక ప్రస్తావిస్తుంది. దీని భావమేమిటంటే, దైవభక్తి పరాయణతను కేవలం రాత్రిళ్ళలో ఆరాధన చేస్తూ జాగరణ చేసేవాళ్ళు మాత్రమే కాదు, అల్లాహ్ వారికి ధనసంపదలను ప్రసాదించినట్లయితే అందులో ఒక భాగాన్ని ఆయన మార్గాన ధారపోయడమూ తమ పద్ధతిగా భావిస్తారు. దైవం వద్ద వారికి ప్రాప్తమయ్యే ప్రతిఫలం ఊహాతీతమయింది.

تَتَجَافٰی جُنُوۡبُهُمۡ عَنِ الۡمَضَاجِعِ يَدۡعُوۡنَ رَبَّهُمۡ خَوۡفًا وَّ طَمَعًا وَّ مِمَّا رَزَقۡنٰهُمۡ يُنۡفِقُوۡنَ ○ فَلَا تَعۡلَمُ نَفۡسٌ مَّاۤ اُخۡفِىَ لَهُمۡ مِّنۡ قُرَّةِ اَعۡيُنٍ‌ۚ جَزَآءًۢ بِمَا كَانُوۡا يَعۡمَلُوۡنَ ○

(السجدة:١٦-١٧)

వారి పక్కలు పడకలకు వేరయి ఉంటాయి. వారు తమ ప్రభువును భయంతోనూ ఆశతోనూ పిలుస్తారు. మేము వారికి ప్రసాదించిన దానిలో నుంచి ఖర్చు పెడతారు. వారి కంటి చలువ కోసం (అల్లాహ్ సన్నిధిలో) భద్రమయి ఉన్నదేమో మరే ప్రాణికీ తెలియనిది. వారు చేస్తున్న సదాచరణలకు ఇదీ ప్రతిఫలం.

*(అస్‌సజ్దా : 16-17)*

## నమాజ్, ఇన్ఫాక్ రెండూ షరీఅత్‌లో మౌలికమయినవి

నమాజ్, ఇన్ఫాక్‌లకు ఈ ప్రాముఖ్యత ప్రాప్తమవడానికి కారణం, ఇవి షరీఅత్‌కు భూమికను ప్రసాదిస్తాయి. వీటి వల్ల ఒక పూర్తి వ్యవస్థ ఉనికిలోకి వస్తుంది. నమాజ్, మానవుని సంబంధాన్ని దైవంతో పటిష్ఠపరుస్తుంది. అతన్ని అల్లాహ్ ఆజ్ఞాబద్ధత, విధేయతలకు సమాయత్తపరుస్తుంది. జకాత్, ఇన్ఫాక్‌లు చూడటానికి ధనసహాయానికి ఒక రూపమే అయినా దీని ద్వారా మానవునిలో తోటి మానవ సోదరుల హక్కులు

నిర్వర్తించే, వారి కష్టాలలో పాలుపంచుకునే భావం ఏర్పడుతుంది. ఇది ఎంతో ప్రముఖమయింది. దీనిద్వారా సేవాభావం, సద్వర్తనం, త్యాగం, సహానుభూతి, శ్రేయోభిలాష వంటి ఉన్నత సద్గుణాలు పెంపొందుతాయి. పరమ ప్రభువు ఆరాధన, ఆయన విధేయత, ఆయన దాసులయిన మానవుల పట్ల ప్రేమ, శ్రేయోభిలాషల ఈ సంబంధం- ఈ రెండు శీర్షికలలోనే షరీఅత్ ఆదేశాలన్నీ వచ్చేస్తాయి. వీటిని సరిగ్గా నిర్వర్తించినట్లయితే అదే మానవుణ్ణి మొత్తం ధర్మాన్ని అనుసరించేవాణ్ణిగా చేస్తుంది. ఈ కారణంగానే దివ్య ఖుర్ఆన్‌లో ధర్మం, విశ్వాసాల ఆవశ్యకతల్ని పేర్కొన్న చోట నమాజ్, ఇన్ఫాక్‌లు ప్రత్యేకంగా ప్రస్ఫుటంగా ప్రస్తావించబడ్డాయి. విశ్వసించినవారు ఈ రెంటినీ సమంగా పాటించా లని ఆదేశం.

قُلْ لِّعِبَادِیَ الَّذِیْنَ اٰمَنُوْا یُقِیْمُوا الصَّلٰوۃَ وَ یُنْفِقُوْا مِمَّا رَزَقْنٰھُمْ سِرًّا وَّ عَلَانِیَۃً مِّنْ قَبْلِ اَنْ یَّاْتِیَ یَوْمٌ لَّا بَیْعٌ فِیْہِ وَ لَا خِلٰلٌ ○ (ابراہیم:۳۱)

విశ్వసించిన నా దాసులకు చెప్పు, నమాజ్ స్థాపించాలని, మేము వారికి ప్రసాదించిన దాన్నుండి గోప్యంగానూ, వ్యక్తంగానూ ఖర్చుపెట్టాలని; క్రయ విక్రయాలూ జరగని, ఎటువంటి మైత్రీ సంబంధం ఉపకరించని ఆ రోజు రాక మునుపే దీన్ని చేయమని చెప్పివెయ్యి.

*(ఇబ్రాహీమ్ : 31)*

## ధనప్రాణాల త్యాగం- స్వర్గప్రాప్తి వాగ్దానం

ధనం, సంపదల కోసమే వ్యాపారి వ్యాపారం చేస్తాడు. దుకాణదారుడు తన అంగడిని అలంకరిస్తాడు. శ్రీమంతుడు కర్మాగారాలు, ఫ్యాక్టరీలు తెరుస్తాడు. శ్రామికుడు తన చెమటోడ్చి కష్టపడతాడు. ఈ ప్రయత్నాలన్నీ ధర్మబద్ధమయిన పరిధుల్లో సాగినట్లయితే ఇస్లామ్ దీన్ని కాదనదు. అయితే అది ఒక వాస్తవికతను మన సమక్షంలో పెడుతుంది. కష్టార్జితమైన సొమ్మును మనిషి పరమ ప్రభువు దైవానికి అమ్మివేసినట్లయితే పరలోకంలో అతనికి దుఃఖాలు లేనటువంటి శాశ్వత సుఖం ప్రాప్తించే స్థానం ప్రాప్తిస్తుంది. అతను సదా సుఖవిలసిత జీవనాన్ని గడపగలడు.

ఏ వ్యక్తి ఇటువంటి స్వర్గం కొరకు తన ధన ప్రాణాలను అల్లాహ్‌కు అప్పగిస్తాడో అతనే విశ్వాసి. ఈ త్యాగనిరతికిగాను ప్రతిఫలంగా అతనికి స్వర్గం ప్రాప్తిస్తుందని అల్లాహ్ వాగ్దానం చేస్తున్నాడు.

إِنَّ اللّٰهَ اشْتَرٰى مِنَ الْمُؤْمِنِينَ أَنْفُسَهُمْ وَ أَمْوَالَهُمْ بِأَنَّ لَهُمُ الْجَنَّةَ ط

నిశ్చయంగా అల్లాహ్ విశ్వాసుల నుండి వారి ప్రాణాలను, సంపదల్ని స్వర్గానికి ప్రతి మూల్యంగా కొనుక్కున్నాడు.

*(అత్ తౌబా: 111)*

ఇంతకన్నా గొప్ప సాఫల్యం మరొకటి ఏమయి ఉంటుంది? మనిషి తన అత్యల్ప మయిన ప్రాణాన్ని, అశాశ్వతమయిన జీవితాన్ని, నిలకడలేని తన సంపదను, నశ్వరమయిన ధనాన్ని అల్లాహ్ మార్గంలో వెచ్చించి స్వర్గంలోని అనంతమయిన, అనశ్వర మయిన వరప్రసాదాలకు, నిత్యత గల ఆనందాలకు, సుఖాలకు పాత్రుడయిపోగలడు.

## దైవమార్గంలో ఖర్చు- ప్రేరణలు

ఖుర్ఆన్, హదీసుల్లో జకాత్‌నిచ్చే విషయంలోనూ, సత్కార్యాల్లో ఖర్చుపెట్టే విషయంలోనూ మాటిమాటికీ ప్రేరేపించడం జరిగింది. దాని మహత్తును, ప్రతిఫలాన్ని, పుణ్యఫలాన్నీ వివరించడం జరిగింది. ముజ్జమ్మిల్ సూరా చివరన ఇలా ప్రస్తావించడం జరిగింది.

وَ أَقِيمُوا الصَّلٰوةَ وَ آتُوا الزَّكٰوةَ وَ أَقْرِضُوا اللّٰهَ قَرْضًا حَسَنًا ط وَ مَا تُقَدِّمُوا لِأَنْفُسِكُمْ مِنْ خَيْرٍ تَجِدُوهُ عِنْدَ اللّٰهِ هُوَ خَيْرًا وَّ أَعْظَمَ أَجْرًا ط وَاسْتَغْفِرُوا اللّٰهَ ط إِنَّ اللّٰهَ غَفُورٌ رَّحِيمٌ ۝ (المزمل:٢٠)

నమాజ్‌ని స్థాపించండి, జకాత్‌నివ్వండి, అల్లాహ్‌కు ఉత్తమ రుణాన్నివ్వండి, మీరు ఏ సత్కార్యమయినా చేసి ముందుకు పంపిస్తే దాన్ని అల్లాహ్ వద్ద కనుగొం టారు. అదే ఉత్తమమయింది, ఇతోధిక పుణ్యప్రదమయింది కూడా. అల్లాహ్‌ను క్షమాపణ అర్థించండి, నిస్సందేహంగా అల్లాహ్ క్షమించేవాడు, కరుణించే వాడూను. *(అల్ ముజ్జమ్మిల్ : 20)*

ఇదీ నమాజ్‌తోపాటు జకాత్‌ని ఆచరించాలని, సత్కార్యాల్లో సంతోషంగా ధనం వెచ్చించాలని నిర్దేశించడం. సదాచరణ మార్గంలో ఖర్చయ్యే సంపద, మానవుడు ప్రపంచంలో వదలివెళ్ళే సంపదకన్నా ఎంతో ఉత్తమమయింది. ఎందువల్లనంటే, దానికి అనంతమయిన ప్రతిఫలమూ పుణ్యఫలమూ దైవసన్నిధిలో ప్రాప్తం కానున్నది.

## ఇన్ఫాక్- లాభకర బేరం

దైవమార్గంలో ఖర్చుపెట్టడం (ఇన్ఫాక్) ఎంతో గొప్ప లాభం చేకూర్చే బేరం. మనిషి దాన్ని సులభంగా ఊహించుకోలేడు. దాని ఉపమానం, ఒక కృషీవలుడు ఒక గింజను నాటి ఏడువందల గింజలను కోసినటువంటిది.

مَثَلُ الَّذِيْنَ يُنْفِقُوْنَ اَمْوَالَهُمْ فِيْ سَبِيْلِ اللّٰهِ كَمَثَلِ حَبَّةٍ اَنْۢبَتَتْ سَبْعَ سَنَابِلَ فِيْ كُلِّ سُنْۢبُلَةٍ مِّائَةُ حَبَّةٍ وَاللّٰهُ يُضٰعِفُ لِمَنْ يَّشَآءُ وَاللّٰهُ وَاسِعٌ عَلِيْمٌ ○ (البقرۃ:۲۶۱)

దైవమార్గంలో తమ సంపదను ఖర్చుపెట్టే వారి ఖర్చుకు ఉపమానం ఒక గింజ నాటి నప్పుడు, అది ఏడు వెన్నులను ఈనగా ప్రతి వెన్నులో వంద గింజలుంటాయి. అల్లాహ్ తాను కోరినవారికి ఇంతకన్నా ఎంతో అధికంగా అనుగ్రహిస్తాడు. అల్లాహ్ ఎంతో వికసితహస్తుడు, జ్ఞాన సంపన్నుడూను. *(అల్ బకర : 261)*

మనిషి నిజానికి మహా అవివేకి, దైవమార్గంలో ఖర్చుపెడితే తనకు నష్టం కలుగు తుందని అనుకుంటాడు. నిజానికి ఇది నష్టం కలిగించేది కాదు, లాభకరమయిన బేరం. అతను నేడు ధనం ఖర్చుపెడితే, రేపు దానికి ఉత్తమ ప్రతిఫలం అతనికి ప్రాప్తమవుతుంది. ఇక్కడ ఒక్క పైసా ఖర్చుపెడితే అది వృద్ధిచెంది పది వంతులు, ఏడు వందల వంతులయి అతని ఎదుటికి వస్తుంది. అంతేకాదు, ఇంకా ఇలా అన్నాడు, "అల్లాహ్ తాను కోరినవారికి ఇంతకన్నా అధికతరమయిన ప్రతిఫలాన్ని అనుగ్రహిస్తాడు, అల్లాహ్ వికసితహస్తుడు, జ్ఞానధనుడు". అంటే మానవుడు ఇహలోకంలో ఖర్చుపెట్టిన దానికి అల్లాహ్ పరలోకంలో దానికి ఏడు వందల రెట్లకన్నా అధికంగా ఇవ్వగలడు. ఆయన వద్ద ఏ వస్తువు కొరతా లేదు. కాస్త ఆలోచించండి, అల్లాహ్ తరపున ప్రాప్తమయ్యే ప్రతిఫలం, అధికతరమయి ప్రాప్తించినప్పుడు ఆ ప్రతిఫలాన్నీ, ఆధిక్యతను ఏ పదాలలో అభివర్ణించగలం? ఏ దాసు డయితే ఈ మహత్తర ప్రతిఫలానికి అర్హుడవుతాడో అతను సౌభాగ్యానికి ఈర్ష్య చెందని వాడెవడు?

హజ్రత్ అబూజర్(ర), రసూలుల్లాహ్(స)ని అడిగారు, సదకా (దానధర్మాల)కు ప్రతిఫలం ఏమిటీ అని. ఆయన ఇలా సెలవిచ్చారు, 'దాని పుణ్యఫలం ఇతోధికంగా పెంచి వృద్ధిచేసి ఇవ్వబడుతుంది. అల్లాహ్ వద్దనయితే అంతకన్నా అధికంగానే ఉంది.★

అల్లాహ్ మార్గంలో ఖర్చుపెట్టేవారు, మనసారా ఖర్చుపెట్టేవారు, ఎంతో సౌభాగ్య

★ ముస్నద్ అహ్మద్ : 5/265

వంతులు. వారి ధనం అగణ్యమయిన వృద్ధి వికాసాలొంది వారికి త్రిప్పి ఇవ్వబడుతుంది. అదీ, వారు ఖాళీ చేతులతో, నిస్సహాయ స్థితిలో ఉన్నప్పుడు తిరిగి ఇవ్వబడుతుంది.

## ఇన్ఫాక్ వల్ల ధనంలో వృద్ధి

ప్రపంచ నియమానుసారం, ఏ వస్తువునయినా ఖర్చుపెడితే అందులో కొరత ఏర్పడుతుంది. కాని దైవమార్గంలో ధనం ఖర్చుపెట్టడం (ఇన్ఫాక్ ఫీ సబీలిల్లాహ్) వ్యవహారం దీనికి భిన్నమయింది. ఇక్కడ ఖర్చుపెట్టడం వల్ల ధనంలో శుభమూ కలుగు తుంది. వృద్ధీ ఇనుమడిస్తుంది, అది మరింతగా పెరుగుతుంది కూడా. దైవమార్గంలో ఏదయినా ఇచ్చివేసినట్లయితే ఆయన దానికన్నా ఉత్తమమయినదాన్ని ప్రసాదిస్తాడు.

قُلْ اِنَّ رَبِّیْ یَبْسُطُ الرِّزْقَ لِمَنْ یَّشَآءُ مِنْ عِبَادِهٖ وَ یَقْدِرُ لَهٗ ؕ وَمَآ اَنْفَقْتُمْ مِّنْ شَیْءٍ فَهُوَ یُخْلِفُهٗ ۚ وَهُوَ خَیْرُ الرّٰزِقِیْنَ۝ (سبا:٣٩)

**వీరికి చెప్పు, నా ప్రభువు తన దాసులలో తాను కోరినవారికి ఉపాధి సముపార్జనలో విస్తృతిని అనుగ్రహిస్తాడు. తాను కోరిన వారికి దాన్ని స్వల్పంగా ప్రసాదిస్తాడు. మీరు (అల్లాహ్ మార్గంలో) ఏమి ఖర్చు చేసినా అల్లాహ్ దానికి ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాడు. ఆయన అందరికన్నా ఉత్తమ ఉపాధి ప్రదాత.** ***(సబా : 39)***

హజ్రత్ అబూహురైరా ఉల్లేఖనం ప్రకారం, దైవసందేశహరులు(స) ఇలా సెలవిచ్చారు, దానధర్మాల వల్ల, బీదసాదలకు ఇవ్వడం వల్ల ధనంలో ఎన్నడూ తరుగుదల ఏర్పడదు; మనిషి తోటి మానవుల ఎడల క్షమాభావం కలిగి ఉంటే అల్లాహ్ అతని గౌరవాన్ని పెంచుతాడు, మనిషి వినయ వినమ్రతలు ప్రదర్శిస్తే అతనికి ఔన్నత్యాన్ని ప్రసాదిస్తాడు.★

## పిసినారితనం ఖండన

ప్రపంచం దృష్టిలో గౌరవ ప్రతిష్ఠలకయినా, నీచత్వానికి, పరాభవానికయినా ప్రమాణం ధనం. ధనం వల్లనే మనిషి హుందాతనం పెరుగుతుంది. అతన్ని ఆదరణీయు డుగా భావించడం జరుగుతుంది. అతన్ని గౌరవించడం జరుగుతుంది. అతడు దేవుని విధేయుడా, ఆజ్ఞా పాలకుడా, లేక ఆయన విరోధియా, తిరుగుబాటుదారుడా అన్న ప్రమేయం లేకుండానే. అంటే ప్రళయంలో మనిషికి ప్రాప్తమయ్యే తీర్పు పట్ల ప్రపంచం ఏమీ ఎరుగదన్న మాట. ఆ రోజున ప్రపంచ సంపదలు పొంది దైవాన్ని మరచిపోయిన

★ సహీహ్ ముస్లిమ్, కితాబుల్ బిర్ర్, వసిల బాబ్ ఇస్తిజాబుల్ అఫ్వు వత్తవాజు

వారందరూ పరాభవానికీ, హీనస్థితికీ లోనయి ఉంటారు. ప్రపంచంలో ప్రోగుచేసుకున్న సంపదలేవీ అక్కడ ఉపకరించవు. దైవమార్గంలో ధారపోసిన సంపదలే అక్కడ ఉపకరిస్తాయి. అందువల్లనే ఖుర్ఆన్ అంటుంది.

وَيْلٌ لِّكُلِّ هُمَزَةٍ لُّمَزَةِۨ ۝ الَّذِىْ جَمَعَ مَالاً وَّ عَدَّدَهٗ ۝ يَحْسَبُ اَنَّ مَالَهٗۤ اَخْلَدَهٗ ۝ كَلَّا لَيُنْۢبَذَنَّ فِى الْحُطَمَةِ ۝ وَمَاۤ اَدْرٰكَ مَا الْحُطَمَةُ نَارُ اللّٰهِ الْمُوْقَدَةُ ۝ الَّتِىْ تَطَّلِعُ عَلَى الْاَفْـِٕدَةِ ۝ اِنَّهَا عَلَيْهِمْ مُّؤْصَدَةٌ ۝ فِىْ عَمَدٍ مُّمَدَّدَةٍ ۝

(الہمزہ:۱-۹)

లోపాలు వెదికే, ఎత్తిపొడుపులు విసిరే ప్రతి వ్యక్తికీ వినాశం తప్పదు. అతను ధనం ప్రోగుచేసుకుంటాడు, ఒక్కొక్కటి ఎంచుకుని మరీ భద్రపరుచుకుంటాడు. తన సంప దలు తన్ను సదా సజీవంగా ఉంచుతా యని భావిస్తాడు. ఇలా ఎన్నడూ జరుగదు. అతను 'హుతమ'లో తప్పకుండా విసిరి వేయబడతాడు. నీకేమయినా తెలుసా 'హుతమ' అంటే ఏమిటో, అది దైవం రగిలించిన మంట. అది హృదయాల వరకు ప్రాకుతుంది. అది వారిని పొడు వాటి స్థంభాలలో బంధించి పెడుతుంది. *(అల్ హుమజ : 1-9)*

## పిసినారితనం - దుష్టపరిణామం

మనిషి నాగుపాములా ధనాన్ని కాపాడతాడు. అది తనకు పటిష్ఠమయిన ఆధారంగా తలపోస్తాడు. అది తనకు నష్టాలల్లో ఆదుకునే ఆదరవు అవుతుందని అనుకుంటాడు. నిజానికి ప్రళయ దినాన అతనికి అన్నింటికన్నా అధికంగా అవసరమయింది ఏదయినా ఆధారమే. అతను భద్రపరుచుకున్నదేదీ అతనికి ప్రయోజనకరం కాదు. నిజానికి ఈ భద్రపరుచుకున్న సంపద అంతా అతనికి పట్ల అభిశాపమయిపోతుంది.

وَالَّذِيْنَ يَكْنِزُوْنَ الذَّهَبَ وَالْفِضَّةَ وَلاَ يُنْفِقُوْنَهَا فِىْ سَبِيْلِ اللّٰهِ فَبَشِّرْهُمْ بِعَذَابٍ اَلِيْمٍ ۝ يَّوْمَ يُحْمٰى عَلَيْهَا فِىْ نَارِ جَهَنَّمَ فَتُكْوٰى بِهَا جِبَاهُهُمْ وَ جُنُوْبُهُمْ ؕ هٰذَا مَا كَنَزْتُمْ

ఎవరయితే వెండి, బంగారాలు ప్రోగుచేసి పెట్టుకుంటారో, దాన్ని దైవమార్గంలో ఖర్చుపెట్టరో వారికి భయానకమయిన యాతనా శుభవార్త నివ్వు. ఒక రోజు రానున్నది, అప్పుడు ఈ వెండి బంగారాలనే నరకాగ్నిలో కాల్చడం జరుగుతుంది. దానితో వీరి నుదిటిపైనా, పక్కలపైనా,

لِاَنۡفُسِكُمۡ فَذُوۡقُوۡا مَا كُنۡتُمۡ تَكۡنِزُوۡنَ۝ (التوبۃ:٣٤-٣٥)

వీపులపైనా వాతలు వేయడం జరుగుతుంది. ఇదో, మీరు మీ కోసం ప్రోగు చేసుకు పెట్టుకున్న నిధులు ఇవే. కాగా మీరు ప్రోగుచేసుకున్న సంపదల రుచులు చవిచూడండి. *(అత్ తౌబా : 34, 35)*

ఈ ఆయత్‌ను విశదీకరిస్తూ హజ్రత్ అబూహురైరా ఉల్లేఖించిన ఓ హదీసు ఉంది. ఆయన ప్రకారం దైవసందేశహరులు(స) ఇలా సెలవిచ్చారు, 'వెండి, బంగారాలు గల వ్యక్తి వాటి హక్కును నిర్వర్తించకపోతే ప్రళయ దినాన అతని సొమ్ముతో ఫలకాలు చేసి వాటిని నరకాగ్నిలో కాల్చి ఆ వ్యక్తి ప్రక్కలపైన, అతని నుదిటిపైన, అతని వీపుపైన వాతలు వేయబడతాయి. అవి చల్లారినట్లు అనిపిస్తే వాటిని మళ్ళీ నరకాగ్నిలో కాల్చడం జరుగుతుంది, వాటి ద్వారా వాతలు వేయబడతాయి. (ఇలా కొనసాగుతూనే ఉంటుంది).'★

అల్లాహ్ అనుగ్రహించిన సొమ్మును ఆయన మార్గంలో ఖర్చుపెట్టే సౌభాగ్యవంతుల కొరకు సఫలత నిరీక్షిస్తూ ఉంది. ధనవ్యామోహంలో పడి సాఫల్యాల ద్వారాలు తమకు మూసివేసుకునే దౌర్భాగ్యుల పట్ల విచారం కలుగుతుంది.

## ధర్మసందేశం, దైవమార్గంలో ఖర్చు

దైవమార్గంలో ఖర్చుపెట్టడం ధర్మానికి మూలమయిన ఒక అంశం. అదే లేకపోతే ధర్మాన్ని ఊహించడం కూడా కష్టమే. దానితోపాటు ధర్మసందేశం, ధర్మప్రచారాలు, ధర్మాన్ని సమున్నతపరచడం కొరకు కూడా ఇన్ఫాక్ ఫీ సబీలిల్లాహ్ ప్రాబల్యం ఎంతో ఉంది. ఇక్కడ దాని కొన్ని కోణాలను పరిశీలిద్దాం.

## మానవుల సేవ, వారి శ్రేయోభిలాష

ధర్మం వైపునకు పిలుపు అంటే మానవుల హితవు కోరడం అన్నమాట. ఈ హితవు కోరడమన్నది పరిమితం కాదు. దానికి అర్హుడయిన ప్రతి వ్యక్తికి అందజేయవలసి ఉంటుంది. ధర్మం వైపునకు పిలుపు అన్నది వాస్తవానికి మానవున్ని పరలోకపు శిక్ష నుండి రక్షించే ప్రయత్నం. ఈ మహత్తర సేవకు లేచి నిలబడే వ్యక్తి మానవాళి పట్ల గొప్ప శ్రేయోభిలాషి అన్నమాట. అతను తన ఈ కార్యంలో చిత్తశుద్ధిగలవాడే అయినట్లయితే సహజంగానే ఇహలోకంలోనూ అతను మానవాళి పట్ల హితైషి అయి ఉంటాడు. బాధను పంచుకునే వాడయి ఉంటాడు, వారి కష్టసుఖాల్లో ఆదుకునేవాడయి ఉంటాడు. రేపు రాబోయే

★ సహీహ్ ముస్లిమ్, కితాబుజ్జకాత్, బాబ్ ఇస్మక మానిఉజ్జకాత్.

శిక్ష నుండి మానవున్ని రక్షించేందుకు వ్యాకులపడి, ఆందోళన చెందుతున్న వ్యక్తి నేడు వారు లోనై ఉన్న కష్టం పట్ల వ్యాకులపడకుండా ఉండటం అన్నది అసాధ్యం. వారిని దాన్నుండి కాపాడేందుకు తన వంతు పాత్ర నిర్వహించకపోవడమన్నది ఊహించలేని విషయం.

ధర్మసందేశకుని ఆంతర్యంలో మానవుల కష్టం పట్ల దయాభావం ఉత్పన్నం కాకపోతే అతను తన సందేశం పట్ల చిత్తశుద్ధి గలవాడు కాడన్నమాట. ప్రపంచం ఎదుట అతను ప్రపంచ ప్రజల శ్రేయోభిలాషిగా ముందుకు వచ్చినట్లయితే అతను తన విధిని నిర్వర్తించినవాడవుతాడు. అతని మాటల్లో ఆకర్షణ ఏర్పడుతుంది. అతని సందేశాన్ని జనం శ్రద్ధగా వింటారు. అతని వైపునకు మొగ్గుతారు. ఈ విధంగా ఇన్ఫాక్ ద్వారా అతను తన విధినీ నిర్వర్తిస్తాడు, తన సందేశానికీ దారి సుగమం చేసుకుంటాడు కూడా.

## సహచరుల పట్ల సహానుభూతి

ధర్మసందేశకుడు, తనతోపాటు కలసి పనిచేస్తూ సందేశ కార్యకలాపాలలో ఒక సంస్థగా ఏర్పడిన తన సహచరగణ్యులను గురించి కూడా గుర్తుంచుకోవలసి ఉంటుంది. వారిలో నిరాశ్రయులు, నిరుపేదలు, బలహీనులు, అనాథలూ ఉంటారు. ఇంకా సాధనాలు, వసతులూ లేనివారు అగత్యపరులు కూడా ఉంటారు. సంస్థాగత పటిష్ఠతకు సంపన్నులయిన సంస్థ సభ్యులు తమ సహచరుల్లో సహాయానికి అర్హులయినవారిని, తమ లేమి వల్ల సంస్థకు సరిగ్గా తోడ్పాటును అందజేయలేకపోతున్నవారిని ఆదుకోవడం అవసరం. సంస్థలో సంపన్నులయినవారు, అల్లాహ్ బాగా ధనసంపత్తులు ప్రసాదించిన వారు, తమ సంబంధం ధర్మసేవకు సమాయత్తమయిన సంస్థలో ఉందన్న సత్యాన్ని మరువరాదు. దాని వ్యక్తుల మధ్య ప్రేమానురాగాల సంబంధం, సోదరులవంటి అనుబంధం ఏర్పడాలి. ఒకే కుటుంబంలోని వ్యక్తులు పరస్పరం తమ సుఖదుఃఖాల్లో భాగం పంచుకున్నట్లే వీరున్నూ తమ సహచరులయిన మిత్రుల సుఖదుఃఖాల్లో పాలుపంచు కోవలసి ఉంటుంది. తన సహచరుల సుఖాన్ని గురించి తెలుసుకోలేని వ్యక్తిని గురించి, అతనిలో సామూహిక భావన ఇంకా ఉత్పన్నం కాలేదన్న భావం వెల్లడవుతుంది.

## సందేశదాతల సహాయం

అలాగే ధర్మసందేశకార్యాల్లో, ధర్మసేవలో నిమగ్నమయి ఉన్న వారి విషయమూ ఉంది. వారి సమయమంతా ఈ కార్యక్రమాలకే అంకితమయిపోయింది. ఈ కార్యకలా పాల వల్ల వారు తమ ఆర్థిక అవసరాల పట్ల శ్రద్ధ చూపలేకపోతున్నారు. వారి వద్ద ఉన్న సాధనా సంపత్తి, ఒనరులూ వారిని వారి ఉపాధి అవసరాల పట్ల నిశ్చింతగా ఉండేలా

చేయగలగవు. వారు ఇతరుల సమక్షాన చెయ్యి చాపరు. ఇది వారి ఆత్మగౌరవానికి, అహానికి సంబంధించిన అంశం. ధర్మకార్యకలాపాలు కొనసాగాలంటే సంపన్నులూ శ్రీమంతులూ వారి అవసరాలను గుర్తించాలి, వారికి ఉపాధి పట్ల నిశ్చింత కల్పించి ఏకాగ్రతతో పనిచేసే వాతావరణం కల్పించాలి.

యుద్ధం కొనసాగుతున్నప్పుడు కొందరు యుద్ధరంగంలో ప్రాణాలొడ్డి పోరాడుతూ ఉంటారు. అత్యధిక జనులు యుద్ధక్షేత్రంలోఉండరు. కాని వారి తోడ్పాటు, సహాయ సహకారాలు యోధులకు ప్రాప్తమయితే వారికి ధైర్యసాహసాలు, సంకల్పబలం చేకూరుతాయి.వారు పూర్తి స్థాయి ఉత్సాహ ఉద్వేగాలతో ముందుకు సాగుతారు. అదేకాక పోతే విజయం, కృతార్థత వారిని స్వాగతించడం దుర్లభం. హదీసు ప్రకారం, దైవమార్గంలో సతత సమరం జరిపేవారున్నూ, వారికి సహాయ సహకారాలు అందజేసేవారున్నూ పుణ్యఫల ప్రాప్తిలో సమానంగా భాగం పంచుకుంటారు.

హజ్రత్ జైద్ బిన్ ఖాలిద్(రజిఅల్లాహు అన్హు) ఉల్లేఖించిన దాని ప్రకారం దైవసందేశహరులు(స) ఇలా సెలవిచ్చారు. ఒకరు ఒక ధర్మమార్గాన పోరాడే వ్యక్తికి అవసరమయిన ఒనరులు చేకూర్చినట్లయితే అతను ఆ వ్యక్తితోపాటు పోరు సలిపినవానితో సమానమే. ఒక యోధుడు దైవమార్గంలో నిమగ్నుడయి ఉన్నప్పుడు ఎవరు అతని భార్యాపిల్లలను కనిపెట్టుకు ఉంటాడో, వారి అవసరాలను తీర్చుతాడో అతను ఆ యోధునితో పోరాడిన వానికి సమానమే.★

జిహాద్ (సతత పోరాటం) అంటే భావం చాలా విస్తృతమయింది. ఇందులో ధర్మసందేశ ప్రచారమూ ఉంది; నిజానికి ఇదే ప్రప్రథమ భావం కూడాను. దీని ద్వారానే ధర్మోన్నతి మార్గాలు సుగమమవుతాయి. ధర్మసందేశం, దాని సేవలో నిమగ్నులయి ఉన్నవారు మాగొప్ప కార్యక్రమాన్ని నిర్వర్తిస్తున్నారు. వారికి సహాయ సహకారాలు అందజేసేవారు కూడా ఇందులో ఆచరణాత్మకంగా పాలుపంచుకుంటున్నట్లే. వారు కార్యరూపంలో ముందు కనిపించకపోయినప్పటికీ వారికి వెన్నుదన్ను, అండదండలు ధర్మసందేశకులకు ఎల్లప్పుడూ ప్రాప్తమయి ఉన్నాయి. అందువల్ల దైవం సమక్షంలో ప్రతిఫలానికీ, పుణ్యఫలానికీ అర్హులవుతారని, వాటిలో భాగస్వాములవుతారనీ ఆశించవచ్చు.

## సందేశకార్యాల ఆర్థిక అవసరాలు

ఈ ప్రపంచం, సాధనాలు, ఒనరుల ప్రపంచం. సాధనా సంపత్తి లేనిదే ఇక్కడ

---

★ సహీహ్ బుఖారి, కితాబుల్ జిహాద్ వస్సియర్, బాబ్ ఫజ్లుమన్ జహజగాజియన్ అజౌలఫబిఖైర్, సహీహ్ ముస్లిమ్, కితాబుల్ జిహాద్.

ఏ ఆశయమూ సిద్ధించదు. దైవధర్మసందేశం ఆశయంగా లేచిన వ్యక్తి దాన్ని విజయవంతం చేయదలిస్తే అతను అవసరమయిన సాధనాలను, ఒనరుల్నీ చేపట్టవలసి ఉంటుంది. వీటిలో అనేక సాధనాలు ధనంతో సంబంధమున్నవీ ఉంటాయి. డబ్బు లేకుండా అవి ప్రాప్తం కావు. దైవధర్మం, దాని సందేశ ప్రచారాలకు సాధనాలను కోరినట్లయితే మీరు ఈ సాధనాలు సమకూర్చగల స్థితిలో ఉన్నప్పటికీ వాటిని సమకూర్చకపోయినట్లయితే అది మీ ధర్మానికీ విశ్వాసానికీ కడు విరుద్ధమయిన విషయం.

ఇస్లామ్ పిలుపు, దాని సమున్నతి కొరకు జరిగే కృషి ఏ భౌతిక ధనాలను కాంక్షిస్తుందో అవి సమాయత్తమవకపోతే ఈ ఆశయంతో పనిచేస్తున్న సంస్థ, వ్యవస్థ బలహీనమయిపోతుంది. అది దాని శక్తినీ, బలాన్నీ కోల్పోతూ ఉంటుంది. దాని ప్రతీప శక్తులు మరింత బలపడుతూ ఉంటాయి. శక్తిమంతమవుతూ పోతాయి. ఇది ఏదో ఒక వ్యక్తికి హానికరం కాదు, మొత్తం సంస్థకు, సముదాయానికీ హానికరం, నష్టదాయకం. దీన్ని మరో విధంగానూ పరిశీలించవలసి ఉంటుంది. సందేశకార్యం మొత్తం 'ఉమ్మత్' (సముదాయం) చేయవలసిన కార్యభారం. ఇది నిర్వర్తించబడకపోతే సమస్త సముదాయం తీవ్రనష్టానికి గురవుతుంది. ఇది చేజేతులా తమ వినాశాన్ని కొనితెచ్చుకోవడంతో సమానం. ఇదే సందర్భంలో ఖుర్ఆన్ ఇలా అంటుంది.

وَ اَنفِقُوا فِي سَبِيلِ اللّٰهِ وَلَا تُلقُوا بِاَيدِيكُم اِلَى التَّهلُكَةِ وَ اَحسِنُوا اِنَّ اللّٰهَ يُحِبُّ المُحسِنِينَ○

(البقرة:١٩٥)

**దైవమార్గంలో ఖర్చుపెట్టండి, చేజేతులా వినాశాన్ని కొనితెచ్చుకోకండి, సదాచారాన్ని, ఉపకార విధానాన్ని అవలంబించండి, నిస్సందేహంగా అల్లాహ్ సదాచారులంటే ఎంతో ఇష్టపడతాడు.**

***(అల్ బకర : 195)***

నేడు ప్రపంచం భౌతికంగా ఎంతో ప్రగతి సాధించింది. ప్రపంచంలో నేడు, ఏ సిద్ధాంతాన్నయినా వ్యాపింపజేయడానికి సమున్నతపరచడానికి, దానికి ఆధిక్యత కల్పించడానికి మునుపటికన్నా ఎన్నో రెట్లు అధికంగా ఎన్నెన్నో విస్తృత, శక్తిమంతమయిన సాధనాలున్నాయి. ఈ సాధనాలను ధర్మప్రచారానికి, ప్రాచుర్యానికి, దాని ఆధిక్యత, సమున్నతికి వినియోగించడం అవసరం. కాని విచారకరమయిన విషయం ఏమిటంటే, దైవతిరస్కార మార్గంలో, దైవధిక్కార మార్గంలో, చెడుల వ్యాప్తి కొరకు, మంచిని రూపు మాపడానికి అవి వినియోగపడుతున్నాయి. నేడు ఏ ధర్మసేవకునిలోనూ ఈ సాధనాసంపత్తి ప్రవాహం దిశను మార్చివేసే శక్తి, దాన్ని ధర్మసందేశం దారినకు మలిచే బలం లేదు. అయితే ఒకటి మాత్రం అతనికి సాధ్యమే. అతను తన వద్దనున్న సాధనాలను, ఒనరుల్ని దైవమార్గంలో

వెచ్చించగలడు, దాని కోసమే అంకితపరచగలడు. నిస్సందేహంగా ఈ ఒనరులు చాలా తక్కువే అయి ఉంటాయి. కాని దైవం తలిస్తే ఆయన ధర్మం ఈ పరిమిత సాధనాల ద్వారానే విజయం సాధించడం, మిథ్యాశక్తులు తమకు విస్తృతమయిన ఒనరులున్నప్పటికీ పరాజితులవడం తథ్యం.

إِنَّ الَّذِينَ كَفَرُوا يُنفِقُونَ أَمْوَالَهُمْ لِيَصُدُّوا عَن سَبِيلِ اللَّهِ فَسَيُنفِقُونَهَا ثُمَّ تَكُونُ عَلَيْهِمْ حَسْرَةً ثُمَّ يُغْلَبُونَ (الانفال:٣٦)

ఎవరయితే దైవాన్ని తిరస్కరించారో వారు తమ సొమ్మును దైవమార్గంలో అవరోధాలు సృష్టించడానికి వినియోగిస్తారు. వారు ఆ మార్గాన్నే ఖర్చుపెడతారు. కాని ఇది వారికి పశ్చాత్తాప కారణమే అవుతుంది. ఆ తరువాత వారు లొంగిపోవలసి ఉంటుంది. *(అల్ అన్ఫాల్ : 36)*

మరో సందర్భంలో దైవం తన వచనంలో, దైవతిరస్కారులు దైవవిరోధులు, తమ పేరుప్రతిష్టలు, ప్రజల ప్రశంసలు, గర్వం, అహంభావాల ప్రదర్శన భావాలతో అల్లాహ్ ధర్మానికి నష్టం చేకూర్చడానికి ఖర్చుచేసేదంతా, పొలాలపైన ఇతోధికంగా మంచు కురిసినప్పుడు వృధా అయినట్లు వృధాపోతుంది అని అన్నారు. వీరు తమ తప్పుడు చేష్టల మూలంగా వినాశమవుతారు. తమ ఆశయంలో ఎన్నడూ సాఫల్యం సాధించలేరు.

مَثَلُ مَا يُنفِقُونَ فِي هَٰذِهِ الْحَيَاةِ الدُّنْيَا كَمَثَلِ رِيحٍ فِيهَا صِرٌّ أَصَابَتْ حَرْثَ قَوْمٍ ظَلَمُوا أَنفُسَهُمْ فَأَهْلَكَتْهُ ۚ وَمَا ظَلَمَهُمُ اللَّهُ وَلَٰكِنْ أَنفُسَهُمْ يَظْلِمُونَ (آل عمران:١١٧)

ఎవరయితే ఈ లోకంలో (ఇహం కొరకు) ఖర్చుపెడతారో వారి ఖర్చుకు ఉపమానం, గాలిలో తీవ్రమైన శీతలం ఉండి, అది తనకుతాను అన్యాయం చేసుకున్న జాతి పొలాలకు సోకినప్పుడు అది ఆ పంటల నన్నింటినీ నాశనం చేసేటటువంటిది. అల్లాహ్ వారి పట్ల ఎటువంటి అన్యాయం చేయలేదు, వారు స్వయంగానే తమకు అన్యాయం చేసుకుంటున్నారు.

*(ఆలి ఇమ్రాన్ : 117)*

## తీవ్రమయిన అవసరమున్నప్పుడు ఇన్ఫాక్

నేడు అల్లాహ్ ధర్మం అత్యంత సున్నితమయిన కాలాన్ని దాటుతోంది. మానవుల పైన ధర్మం పట్టు వదులయిపోయింది. దైవతిరస్కారం, పరలోక విస్మరణ జగమంతా

వ్యాపించింది. దైవ ధర్మాన్ని నమ్మేవారు సయితం దాన్ని తమ జీవితాల నుండి వెలివేసి దూరం చేసుకున్నారు. ఇటువంటి పరిస్థితుల్లో ఎవరయినా దానికి తమ డబ్బుతో బలాన్ని చేకూర్చడం ఎంతో విలువయినది. సాధారణ పరిస్థితుల్లోనూ ఎవరయినా దైవధర్మం కొరకు ఏదయినా ఖర్చుపెడితే దానికి ఎంతో ఘనమయిన ప్రతిఫలం ప్రాప్తమవుతుంది. కాని ధర్మం అత్యంత అత్యాచారానికి గురయి ఉన్నప్పుడు, సహాయం కొరకు, తోడ్పాటు కొరకు అది పిలుపునిస్తున్నప్పుడు సహకారం అందజేసి అంతకన్నా అధికంగా ప్రతిఫలానికి పుణ్యఫలానికీ పాత్రుడవుతాడు మనిషి. దివ్యఖుర్ఆన్ అతిస్పష్టంగా తెలిపింది, ఏ జనులయితే మక్కా విజయానికి పూర్వం దైవమార్గంలో ఖర్చుపెట్టారో, మరెవరయితే మక్కా విజయానంతరం ఖర్చుపెట్టారో ఉభయులూ సమానులు కాజాలరని. మొదటి వర్గంవారు, ధర్మానికి వారి సహాయం అత్యంత తీవ్రంగా అవసరమయినప్పుడు తమ సహాయాన్ని అందజేశారు. రెండవ వర్గం సహకారం, ఇస్లామీయ రాజ్యపతాకం, మొత్తం హిజాజ్ భూభాగాన రెపరెపలాడుతున్నప్పుడు ప్రాప్తమయింది. ఇలా సెలవీయబడింది.

لَا يَسْتَوِیْ مِنْكُمْ مَّنْ اَنْفَقَ مِنْ قَبْلِ الْفَتْحِ وَقَاتَلَ ؕ اُولٰٓئِكَ اَعْظَمُ دَرَجَةً مِّنَ الَّذِيْنَ اَنْفَقُوْا مِنْۢ بَعْدُ وَ قَاتَلُوْا ؕ وَ كُلًّا وَّعَدَ اللّٰهُ الْحُسْنٰى ؕ وَاللّٰهُ بِمَا تَعْمَلُوْنَ خَبِيْرٌ ○

(الحديد:١٠)

మీలో ఎవరయితే మక్కా విజయానికి పూర్వం దైవమార్గంలో ఖర్చుపెట్టారో, దైవవిరోధులతో పోరాడారో వారు, మక్కా విజయానంతరం ఖర్చుపెట్టినవారికి, శత్రువులతో పోరాడినవారికి సమానులు కాదు. నిజానికి (తొలి వర్గం ప్రజలు) ప్రతిఫలం రెండవ వర్గం వారికన్నా ఎంతో అధికం. ప్రతి ఒక్కరికీ అల్లాహ్ ఉత్తమ జీవితాన్నిచ్చే వాగ్దానమయితే చేసే ఉన్నాడు. మీరు చేసేదేమో అల్లాహ్‌కు బాగా తెలుసు. *(అల్ హదీద్ : 10)*

మక్కా విజయం తరువాత విశ్వసించినవారు, త్యాగాలు సమర్పించినవారిని సంబోధించి దైవసందేశహరులు(స) 'నా సహచరుల విషయంలో (మక్కా విజయానికి పూర్వం విశ్వసించినవారి విషయంలో) ఎటువంటి అనుచితమైన మాట పలకకండి. మీలో ఎవరయినా ఊహుద్ పర్వతానికి సమానమయిన బంగారాన్ని ఖర్చుపెట్టినా అది, వారిలో ఒకరు ఒక పలం, అర పలం ఖర్చుచేసిన దానికి కూడా సమానం కాజాలదు.★

★ సహీహ్ బుఖారి, కితాబు అస్‌హాబున్నబీ(స); సహీహ్ ముస్లిమ్, కితాబ్ ఫజాయిలు సహాబా, బాబ్ తహ్రీమ్ సబ్బుస్సహాబా).

## కొంత సొమ్మును ఖర్చు చేసే ఆదేశం

ఖుర్‌ఆన్, హదీసుల్లో ఎక్కడా ధనసంపాదనను, దాన్ని భద్రపరచడాన్నీ పాపంగా పరిగణించడం జరుగలేదు. అలాగే మనిషి తన సొమ్మునంతా దైవమార్గంలో వెచ్చించాలని కూడా చెప్పడం జరుగలేదు. తన సొమ్ములో ఒక భాగాన్ని అల్లాహ్ మార్గంలో ఖర్చుపెట్టే ఆదేశమే ఇవ్వడం జరిగింది. విశ్వాసుల ఈ మహత్తును దివ్యఖుర్‌ఆన్‌లో పలుచోట్ల ప్రస్తావించడం జరిగింది.

وَ مِمَّا رَزَقْنٰهُمْ يُنْفِقُوْنَ ۝ (البقرة:٣)

**మేము ప్రసాదించిన సంపాదన నుండి వారు ఖర్చుపెడతారు.** *(అల్ బకర : 3)*

ఇందులో మొట్టమొదట జకాత్ ఉంటుంది; విధి అయిన దానధర్మాలకు కూడా ఇదే ఆదేశం వర్తిస్తుంది. ఏదయినా ఒక దానం షరీఅత్ ప్రకారం విధి అయినట్లయితే దాన్ని చెల్లించడం తప్పనిసరి అవుతుంది. అలాగే భార్యాపిల్లలు, కుటుంబ సభ్యుల అన్నపానీయాలు, నిత్యావసరాలు తీర్చడమూ ఇందులో చేరి ఉంటుంది. వారి భౌతిక అవసరాలు తీర్చడం వారి ఆర్థిక హక్కుల్ని నిర్వర్తించడం తప్పనిసరి.

## దైవమార్గంలో ధనం ధారపోసేవారు

మానవుడు అల్లాహ్ ఆదేశం మేరకు ధార్మికంగా విధి అయిన పద్దుల్లో ఖర్చు పెట్టడం మొదలెడితే, ధార్మికంగా విధికాని ధార్మిక పద్దుల్లోనూ ఖర్చుపెట్టే సద్బుద్ధి, భావావేశం అతనిలో కలుగుతాయి. అతను కేవలం విధి నిర్వహణ వరకే పరిమితమయి పోడు, అదనపు బాధ్యతలు నిర్వర్తించే సౌభాగ్యాన్నీ పొందగోరుతాడు. అతను ఇన్ఫాక్‌కు సంబంధించిన ఏ సందర్భాన్నీ వదులుకోవడానికి ఇష్టపడడు. దైవధర్మం అతన్ని ఖర్చు చేయమని కోరినప్పుడల్లా తన సంపదల్ని ఖర్చుపెట్టడానికి సిద్ధమవుతాడు. ఈ విధంగా తన సంపాదనలో కొంత భాగం కేటాయించి, తన సర్వసంపదలు దైవం కొరకే అన్న ప్రకటనలు చేస్తాడన్నమాట. దైవధర్మానికి అవశ్యకత ఏర్పడితే అది ఎటువంటి అడ్డు లేకుండా ఖర్చుకాగలదని సూచిస్తాడు. ఇటువంటి ఉత్తమ భావం ఒక రోజు ఏర్పడితే తనకున్నదంతా దైవమార్గంలో వెచ్చించి వట్టిచేతులతో ఇంటికి తిరిగిరావడం అసంభవమేమీ కాదు. ఇటువంటి ఉదాహరణలు మన చరిత్రలో అనేకమున్నాయి.

హజ్రత్ ఉమర్(ర) ఇలా ఉల్లేఖించారు, (తబూక్ వ్యవహారం సందర్భంలో) దైవసందేశహరులు(స) మమ్మల్ని ఇన్ఫాక్ (దైవమార్గంలో ఖర్చుపెట్టమని) ఆదేశమిచ్చారు. అప్పుడు నా వద్ద బాగా ధనముండేది. అప్పుడు నేను ఇలా ఆలోచించాను, ఈసారయితే అబూబక్ర్(ర)ను అధిగమించే అవకాశం వచ్చింది. కాగా నేను నాకున్న సంపద అంతటిలో

సగభాగం తీసుకువచ్చి దైవసందేశహరుల(స) సన్నిధిలో సమర్పించుకున్నాను. ప్రవక్త మహనీయులు(స) ఇంటివారల కోసం ఏమయినా వదిలిపెట్టావా? అని నన్ను అడిగారు, నేను ఇంతే సొమ్ము వారి కోసమూ వదిలి వచ్చాను అని విన్నవించుకున్నాను. ఆ తరువాత హజ్రత్ అబూబక్ర్(ర) తన సంపదనంతా తీసుకుని వచ్చి హాజరయ్యారు. ప్రవక్త శ్రీ(స) ఆయన్ని సయితం అదే ప్రశ్న అడిగారు. దానికి ఆయన (ర) వారి కోసం కేవలం అల్లాహ్‌ను, అల్లాహ్ సందేశహరుణ్ణి వదిలివచ్చాను అని బదులిచ్చారు. అప్పుడు నేననుకున్నాను, నేను ఎట్టి పరిస్థితిలోనూ, అబూబక్ర్‌ని ఏ వ్యవహారంలోనయినా అధిగమించడమన్నది కల్ల అని.★

తబూక్ సందర్భంలోనే దైవప్రవక్త(స) ఇన్ఫాక్ కోసం జనుల్ని ప్రేరేపిస్తే, హజ్రత్ ఉస్మాన్ (ర) లేచి నిలబడి, దైవప్రవక్తా(స)! నేను వంద ఒంటెల బాధ్యత తీసుకుంటున్నాను. నేను వాటి వీపులపై వేసే బట్టలు, గూళ్ళతో సహా అందజేస్తాను అని అన్నారు. దైవప్రవక్త (స) మరోసారి ప్రేరేపిస్తే హజ్రత్ ఉస్మాన్ (ర) లేచి నిలబడి, నేను ఇలాంటి రెండు వందల ఒంటెల బాధ్యత తీసుకుంటాను అని ప్రకటించారు; ఆపైన దైవప్రవక్త మరోసారి ప్రేరణ కలిగిస్తే హజ్రత్ ఉస్మాన్(ర) నేను మూడు వందల ఒంటెల బాధ్యత స్వీకరిస్తాను అని ప్రకటించారు. హదీసును ఉల్లేఖించిన హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఖబ్బాబ్(ర) ప్రకారం, దైవసందేశహరులు(స) మింబర్ (వేదిక) నుండి దిగుతూ ఇక మీదట ఉస్మాన్ ఏది చేసినా అతనికి హాని కలగదు అని అన్నారు. (అంటే, ఆ తరువాత ఆయన ద్వారా ఏదయినా పొరపాటు జరిగితే పరమ ప్రభువు ఈ మహా సేవ కారణంగా ఆయన్ని క్షమించివేస్తాడని భావం).★★

అబ్దుర్రహ్మాన్ బిన్ అబూ సమర(ర) ప్రకారం, అదే వ్యవహారం సందర్భంలో హజ్రత్ ఉస్మాన్ (ర) తన జేబులో ఒక వెయ్యి దీనారులు తీసుకువచ్చి రసూలుల్లాహ్ సన్నిధిలో సమర్పిం చుకున్నారు. నేను గమనించాను, వాటిని ప్రవక్త మహనీయులు చేతుల్లో త్రిప్పుతూ ఇకపైన ఉస్మాన్ ఏది చేసినా అతనికి హాని కలగదు అని అన్నారు.★★★



---

★ సునన్ అబీదావూద్, కితాబుజ్జకాత్, బాబుర్రుఖ్‌సలుఫీ జాలిక్; జామి'తిర్మిజీ కితాబుల్‌మనాసిబ్.

★★ జామి'తిర్మిజీ, అబ్వాబుల్ మనాసిబ్, బాబు ఫీ మనాకిబ్ ఉస్మాన్ బిన్ అఫ్ఫాన్.

★★★ జామి; తిర్మిజీ, మునుపటి ప్రస్తావనే; ముస్నద్ అహ్మద్ 5/63.

# త్యాగం

## మానవులకు మేలు చేసేవారు త్యాగం చేసేవారే

ప్రపంచంలో మానవాళిపైన ఏ విధమయిన మేలు చేసే వారయినా వారు మన వంటి మానవులే. మనలాంటి భావాలు, భావోద్రేకాలున్నవారే. వారికీ కోరిక లుంటాయి. వారికీ ప్రాణాలన్నా ధనమన్నా ప్రేమ ఉంటుంది. అయినా వారు మానవాళికి మేలు చేసినవారుగా పరిగణించబడటానికి కారణం, వారు మానవాళి ప్రయోజనం కోసం తమ భావాలు, ఉద్రేకాలను నిరంతరం త్యాగం చేస్తూ ఉంటారు. వారు తమనుతాము అంతమొందించుకుంటారు, ఇతరులు జీవితాన్ని పొందాలని కోరుకుంటారు. వారి ఆంతర్యం అత్యాచారాల గాయంతో ఛిద్రమయి ఉంటుంది. కాని వారు ఆనందంగా బాధలను భరిస్తారు. వారి వ్యక్తిత్వంపైనే ప్రపంచంలోని అత్యాచారమంతా అంతమయి పోవాలని కోరుకుంటారు. వారి తరువాత మరెవ్వరూ, మరెవ్వరిపైనా అత్యాచారం జరప రాదని కోరుకుంటారు. వారు పస్తులుంటారు. పస్తులుండటం వల్ల వారి శక్తిసామర్థ్యాలు క్షీణిస్తాయి. అయినా ప్రపంచం ఆకలిదప్పుల బాధ నుండి విముక్తి పొందాలని ఆశిస్తారు.

## ఇస్లామ్ పిలుపు త్యాగాన్ని కాంక్షిస్తుంది

మనం ఇస్లామ్ పిలుపు కొరకు నిలబడినామంటే భావం, మనం మానవాళి పట్ల అత్యుత్తమ మేలును కలుగజేయాలని కోరుకుంటున్నామన్న మాట. ఈ మహత్కార్యం నిజమయిన భావంలో నిర్వర్తించబడాలంటే దానివెంట మనల్ని మనం పూర్తిగా అంకితం చేసుకోవాలి. దీనిగ్గాను మన సౌలభ్యాలను, సౌకర్యాలను, సమయాన్ని, విలువయిన జీవన క్షణాలను, మన సంపదల్ని, ధనాన్ని, మనకు చెందిన ప్రతి దాన్ని త్యాగం చేయవలసి ఉంటుంది. ఇదంతా లేకుండా ఈ మహత్కార్యం మునుపెన్నడూ నెరవేరలేదు, నేడూ నెరవేరబోదు.

## కఠిన పరిస్థితుల్లోనూ సందేశం కొనసాగాలి

ఒక విషయం మీ ముందుకు మాటిమాటికీ వచ్చింది. మీరు సత్యమయినదని నమ్మి స్వీకరించిన ధర్మాన్ని ప్రచారం చెయ్యడం మీ ధర్మం, విధి. దాన్ని ఎట్టి పరిస్థితిలోనూ ఇతరులకు అందజేయవలసి ఉంది. సత్యాన్ని స్వీకరించిన తరువాత దాన్ని బహిర్గత పరచడంలో ఎటువంటి విషయమూ అడ్డురాకూడదు. అలా జరగకపోతే అది మన బలహీనత, పిరికితనాలకు సాక్ష్యమవుతుంది. 'సత్యం' పట్ల తీరని అన్యాయమూ అవుతుంది. మీరు దైవధర్మ సందేశకులయినట్లయితే మీ జీవితం యావత్తూ సందేశకునిలా గడవాలి. మీ సందేశాన్ని వినడానికి ప్రపంచంలో జనం ఉన్నంతకాలం మీరు వారికి దైవభక్తి సందేశాన్ని అందజేస్తూ ఉండాలి. ఈ కార్యక్రమంలో మీకున్నదంతా అంతమయి పోయినా, మీపైన దౌర్జన్యకాండ ఆవరించినా, కడకు మీ ప్రాణమూ శరీరాల మధ్య ఉన్న సంభంధమూ తెగిపోయినా– అలా తెగిపోవడం ప్రపంచంలో ప్రతి వ్యక్తికీ ఇష్టంలేనిదే– అయినప్పటికీ మీ పని కొనసాగవలసిందే.

దురదృష్టవశాత్తు మీరు స్వేచ్ఛగా, మీ సహజ హక్కులకు, చట్టపరమయిన హక్కులకు వంచితులయి, సత్యాన్ని వెల్లడించే హక్కును కోల్పోయినట్లయితే లేదా మీకు దేవుని దాసులయిన మానవుల మధ్య జైలు అడ్డుగోడలయి నిలిచినట్లయితే మీ సమక్షంలో యూసుఫ్(అ) ఆదర్శం ఉండాలి. దాని మూలంగా జైలు గోడలు కూడా సత్యసందేశ మార్గంలో అవరోధాలు కాజాలవు. మీరు ఆ ఆదర్శాన్నే ఆచరించండి. హజ్రత్ యూసుఫ్ (అ) నుండి ఆయన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను దోచుకోవడం జరిగింది. ఆయన్ని జైలులో నిర్బంధించడం జరిగింది. అప్పుడు జైలు వాతావరణమంతా సత్యసందేశంతో మార్మోగ సాగింది. స్వేచ్ఛాయుతులయిన మనుషుల వద్దకు ఆయన పిలుపు చేరలేకపోతేనేమి, అపరాధులయిన ఖైదీలకు ఆయన తన పిలుపునివ్వసాగారు:

يَا صَاحِبَيِ السِّجْنِ ءَ اَرْبَابٌ مُّتَفَرِّقُوْنَ خَيْرٌ اَمِ اللّٰهُ الْوَاحِدُ الْقَهَّارُ ۝ مَا تَعْبُدُوْنَ مِنْ دُوْنِهٖٓ اِلَّآ اَسْمَآءً

**నా ఖైదీ సహచరులారా, మీరే చెప్పండి, ఎందరో విభిన్న ప్రభువులుండటం సబబా లేక ఒక్కడే ఒక్కడయిన అందరిపైనా ఆధిక్యత గల దైవముండటం శ్రేయస్కరమా? ఆ దైవాన్ని వదిలి మీరెవరి దాస్యాన్నయితే మీరు పాటిస్తున్నారో అవన్నీ కేవలం కొన్ని పేర్లు మటుకే. వాటిని మీరూ మీ తాతముత్తాతలూ సృష్టించుకున్నారు.**

سَمَّيْتُمُوْهَآ اَنْتُمْ وَ اٰبَآؤُكُمْ مَّآ اَنْزَلَ اللّٰهُ بِهَا مِنْ سُلْطٰنٍ اِنِ الْحُكْمُ اِلَّا لِلّٰهِ اَمَرَ اَلَّا تَعْبُدُوْٓا اِلَّآ اِيَّاهُ ذٰلِكَ الدِّيْنُ الْقَيِّمُ وَ لٰكِنَّ اَكْثَرَ النَّاسِ لَا يَعْلَمُوْنَ۝ (یوسف:۳۹-۵۰)

అల్లాహ్ వారి కోసం ఎటువంటి ప్రామాణికతనూ అవతరింపజేయలేదు. ప్రభుసత్తా అయితే కేవలం అల్లాహ్‌కే చెందినది, ఆయన్ని తప్ప మరెవరినీ మీరు ఆరాధించరాదన్నది ఆయన ఆదేశం. ఇదే నిజ ధర్మం, కాని చాలా మంది ఎరుగరు.
*(యూసుఫ్ : 39-50)*

## త్యాగం వల్ల ధర్మం ఆధిక్యత పొందుతుంది

మీ ముందు గొప్ప ఆశయం ఒకటుంది. మీరు పృధ్విపైన దేవుని పాలన చూడదలిచారు. ఇంత గొప్ప ఆశయసిద్ధిని పొందాలంటే మీరు మీ జీవన సర్వస్వాన్నీ దానికి ధారపోయనిదే అది సాధ్యపడదు. ఈ లక్ష్యసాధనా మార్గంలో అవరోధం కాగల సమస్త కార్యకలాపాలు, సకల నిమగ్నతలకు మీరు దూరం కావాలి, మీ జీవన సామగ్రినంతా ఇందులో వెచ్చించాలి. అప్పుడే ఇది సాధ్యమవుతుంది. ఏ రోజయితే మీ ఈ త్యాగాలు వాటి అంతిమ స్థాయికి చేరుకుంటాయో, నిశ్చయంగా ఆ రోజునే సత్యవిజయా నికి ఆనవాళ్ళు కూడా బయల్పడతాయి.

ఉష్ణోగ్రత మితిమీరి పెరిగినప్పుడు భువి మండిపోతున్నప్పుడు వానలు కురుస్తాయి. రేయి చీకట్లు బాగా క్రమ్ముకుని శిఖరాగ్ర స్థాయికి చేరుకున్నప్పుడు తెల్లవారు చిహ్నాలు వ్యక్తమవసాగుతాయి. పరిస్థితులు తీవ్రస్థాయికి చేరి, కఠినతరమయినట్లయితే నిరాశ చెందనవసరం లేదు, భయపడనవసరమూ లేదు. పరిస్థితులు తీవ్రరూపం దాల్చడం, పరిస్థితులు మారనున్నాయని, విప్లవం క్షితిజానికి ఆవల వేచి ఉందని సూచిస్తోంది. ఇలా చాలాసార్లు జరిగింది, ఇప్పుడూ జరగవచ్చు. అత్యంత అననుకూల పరిస్థితుల్లో సత్యసందేశం వెలువడింది. పరిస్థితులతో పోరాడుతూ విజయ దశను చేరుకుంది. ప్రతీప శక్తులు తుఫానులా విజృంభించాయి, అంతమయిపోయాయి కాని దాన్ని రూపుమాపలేక పోయాయి. మీరు గమనించడంలేదా, ఈజిప్టులో యూసుఫ్(అ) జైలు చీకటిగది నుండి పరిపాలనా తఖతు వరకు చేరుకున్నారు. మూసా జాతి ఎంతో బలహీనతలకు వివశతలకు గురయి ఉండీ 'పవిత్ర భూభాగానికి' వారసురాలుగా చేయబడింది. మహనీయ ముహమ్మద్(స), సత్యం పీడనకు గురవడంచేత మక్కా వదలవలసి వచ్చింది. ఇంకా పదేళ్ళు కూడా గడవక మునుపే సత్యం విజయపతాక ఎగురవేస్తూ ఉండగా ఆయన(స) మక్కా నగర ప్రవేశం చేశారు:

లా ఇలాహ ఇల్లల్లాహ్, వహ్దహూ, అన్జజ వదహూ, వనసర అబ్దుహూ, వహజ్మల్ అహ్జాబు, వహ్దహూ. ★

**ఒకే ఒక్క దైవం తప్ప మరే ఆరాధ్యుడు లేడు. ఆయన తన వాగ్దానం నెరవేర్చాడు. తన దాసునికి సహాయం అందజేశాడు. ఆయన ఒక్కడే మీ (శత్రు) సైన్యాలన్నింటినీ పరాజితులుగా చేశాడు).**

**لا الــه الا اللــه وحـــده انجـز وعـــده و نصر عبـــده و هـــزم الاحزاب وحده**

ఇవి సత్యచరిత్ర తెలిపే దృష్టాంతాలు. మీలో పరిస్థితుల్ని ఎదుర్కొనే సాహసం, సంకల్పం ఉన్నట్లయితే నేడు కూడా ఈ దృష్టాంతాలు పునరావృతం చేయవచ్చు. ఇక్కడ విజయమన్నది సంకల్పం, సాహసంగలవారికే స్వంతం. సత్యం కొరకే జీవించాలని, సత్యం కొరకే మరణించాలని మీరు స్థిరచిత్తంతో నిర్ణయించుకున్నట్లయితే, సత్యం కొరకు మీరు మీ సర్వస్వాన్ని ధారపోయగలిగితే దేవుని ఈ నేలపైన మీరు చూడదలచిన దేదీప్యమానమయిన దృశ్యమూ చూడటం ఎంతో దూరాన లేదు.

**పరమ ప్రభువు, నీవు కోరుకుంటున్న మరో విషయమూ నీకు ప్రసాదిస్తాడు, అది అల్లాహ్ సహాయం, అతి సమీపాన ఉన్న విజయం, నీవు ముహమ్మద్, విశ్వాసులకు శుభవార్తనివ్వు.** *(అస్సఫ్ఫ్ : 13)*

**وَ اُخـرٰى تُحِبُّوْنَهَا نَصْـرٌ مِّنَ اللّٰهِ وَ فَتْحٌ قَرِيْبٌ وَّ بَشِّرِ الْمُؤْمِنِيْنَ٥**

**(الصف:١٣)**

## కృషి వల్లనే ఫలితాలు సాధ్యం

ప్రపంచం కార్యక్షేత్రం అన్న వాస్తవాన్ని మరువరాదు. ఇక్కడ ఏ ఫలితాన్ని పొందాలన్నా అది ఆచరణ ద్వారానే సాధ్యమవుతుంది. ఆచరణ శూన్యమయిన ఆశల వల్ల ఎటువంటి ఫలితాలనూ పొందలేరు. ఆచరణ వదిలి, చేతులు కాళ్ళు ముడుచుకు కూర్చుంటే ఫలితానికి తలుపులు మూసివేసినట్లే. అలాగే కృషి వల్ల, ప్రయత్నాల వల్లనే సత్యమయినా విజయవంతమవగలదు. కాని ఎటువంటి కృషి లేకుండా మాత్రం దానికి ఎన్నటికీ విజయం సాధ్యం కాదు. సత్యమార్గంలో మీరు మీ ప్రయత్నాల ద్వారా సమస్త షరతుల్ని నిర్వర్తించినట్లయితే దైవ నియమానుసారం దాని ఫలితాలూ ఉత్పన్నమవుతాయి. అనేక కార్యకలాపాల ఫలితాలు అప్పటికప్పుడే వెలువడతాయి. కాని కొన్ని పనుల

★ సహీహ్ ముస్లిం, కితాబుల్ హజ్జ్, బాబ్ హజ్జతున్నబీ.

ఫలితాలు వెలువడటానికి సుదీర్ఘకాలం అవసరం. ఈ పనుల నిర్వర్తన కొరకు మనిషి సంకల్పం, సాహసాలు అత్యంత ఉన్నతమయి ఉండాలి. అతను తొందరపాటుతో వ్యవహరించకూడదు. సహనంతో స్థిరత్వంతో వ్యవహరించాలి. మీరు సత్యసందేశానికి విత్తనం నాటినట్లయితే దానితోపాటు దాని విజయానికీ విత్తనంనాటినట్లే. ఇక మీ హృదయాంతరాళాల నుండి రక్తం దానిపైన చిందించండి. నిశ్చయంగా ఆ విత్తనం వృథా పోదు, ఆలస్యంగానయినా సరే దాని ఫలాలు ఉత్పన్నమవుతాయి. మీకు దాని ప్రతిఫలం తప్పక లభించి తీరుతుంది.

فَلْيُقَاتِلْ فِيْ سَبِيْلِ اللّٰهِ الَّذِيْنَ يَشْرُوْنَ الْحَيٰوةَ الدُّنْيَا بِالْاٰخِرَةِ وَ مَنْ يُّقَاتِلْ فِيْ سَبِيْلِ اللّٰهِ فَيُقْتَلْ اَوْ يَغْلِبْ فَسَوْفَ نُؤْتِيْهِ اَجْرًا عَظِيْمًا ۝ (النساء:٧٤)

ఎవరయితే తమ ప్రపంచ జీవితాన్ని పరలోక జీవితం కొరకు అమ్మివేశారో వారు దైవమార్గంలో పోరాడాలి. దైవ మార్గంలో పోరాడే వ్యక్తి అసువులు బాసి అమరగతి పొందినా లేక ఆధిక్యత పొందినా మేము అతనికి తప్పకుండా ప్రతిఫలాన్నిస్తాము. *(అన్ నిసా : 74)*

ఈ మాట చెప్పింది జిహాద్ విషయంలో. ఇదే భావం ధర్మసందేశం, ధర్మాధిక్యతల కృషి విషయంలోనూ ఊహించుకోవచ్చు. ఇదీ జిహాద్‌లో అంతర్గతమయిన అంశమే.

## నేడు ధర్మం త్యాగాన్ని కోరుతుంది

నేడు దైవధర్మం అత్యంత పీడనకు గురయి ఉంది. అది మీ సహకారాన్ని కోరు తోంది. అది మీలోని అత్యుత్తమ శక్తిసామర్థ్యాలను కాంక్షిస్తోంది. అది మీ ఉత్తమ సమయాన్ని, మీ సంపదను కోరుతుంది. అది మీ నిద్ర, విశ్రాంతి, సుఖాన్ని, ఆనందాన్ని కోరుతోంది. మనం ధర్మం కోరే ఈ ఆకాంక్షను నెరవేర్చే నిర్ణయం చేసుకునే దినం మహాశుభప్రదమయిన దినం. సమయం మరీ మౌనంగా పరిగెడుతుంది. మరణం ప్రతి వ్యక్తిని వెంటాడుతోంది. రేపు ఉదయించే సూర్యుడు మనలో ఎవరిని చెప్పడానికి మరెవరిని వినడానికి అవకాశమిస్తుందో తెలియదు. నేడు తనకు దొరికిన అవకాశాన్ని రేపటి కొరకు వాయిదా వేసి నిరీక్షణలో వృథా చేయనివాడు అదృష్టవంతుడు. మృత్యువు అతన్నుండి నిర్ణయం చేసుకునే అధికారాన్ని దోచుకునే ముందే ధర్మం సహాయ సహకారాలకు లేచి నిలబడేవారు సౌభాగ్యవంతుడు.



# చిత్తశుద్ధి ధర్మానికి ప్రాణం

చిత్తశుద్ధియే ధర్మంలో జీవం. ఒక వస్తువును మాలిన్యాల నుండి, మురికి నుండి పరిశుభ్రపరిస్తే శుద్ధమయిపోతుంది. ధర్మం కూడా మిథ్యాభావాలు, మిథ్యా ఆలోచనలు, తప్పుడు భావనలు, తప్పుడు ప్రేరణల మురికి నుండి పరిశుభ్రమయి ఉన్నట్లయితే అది శుద్ధమయి ఉంటుంది. లేకపోతే తరచుగా దాని రూపురేఖలు, ఆకారం పూర్తిగా వికృత మయిపోతుంది. అది తప్పనిసరిగా దాని నిజ జీవాన్ని కోల్పోతుంది. ఇఖ్లాస్ (శుద్ధ పరచడం) అన్న పదంలో ఒక వస్తువును ఇష్టపడటం, ఎన్నుకోవడం అనే అర్థమూ ఉంది. దేవుని 'ముఖ్లిస్' అంటే, తన ఆలోచన, ఆచరణల్లో అల్లాహ్ ఆదేశ నిర్దేశాలకు కట్టుబడి ఉండే సేవకుడు అని, ఆయన ఇష్టాన్ని, ప్రసన్నతను ఆశించే వ్యక్తి, ఆయన తప్ప మరే ఆశయమూ లేనివాడు అని అర్థం. 'ముఖ్లిస్' దాసుడు అంటే అల్లాహ్ తన కోసం ఎన్ను కున్న దాసుడు అని, అల్లాహ్ అతన్ని ఆలోచనలు, ఆచరణల అశుద్ధతల నుండి పరిశుద్ధ పరచినవాడని, తన అనుగ్రహాల అర్హుడుగా నిర్ణయించినవాడని అర్థం. ఈ భావంలోనే దివ్యఖుర్ఆన్‌లో దైవప్రవక్తల్ని 'ముఖ్లిసీన్' (ఎన్నుకోబడిన పరిశుద్ధులు) అని పేర్కొనడం జరిగింది.

## విశ్వాసాల చిత్తశుద్ధి

చిత్తశుద్ధి విశ్వాసాలు, ఆచరణలు రెంటిలోనూ తప్పనిసరి. విశ్వాసాల శుద్ధి ఏమిటంటే, మనిషి దేవుని ఏకత్వాన్ని నమ్మేవాడయి ఉండాలి. అల్లాహ్‌ను ఒకే ఒక్కడు, అసమానుడు, అనన్యుడుగా భావించాలి. ఆయన ఉనికి, గుణగణాలు, ఆయన క్రియలో మరెవ్వరినీ ఆయనకు తోడుగా భాగస్వామిగా ఎంచరాదు. దివ్యఖుర్ఆన్ మౌలిక సిద్ధాంతం దేవుని ఏకత్వ భావనే. ఈ కేంద్ర బిందువు చుట్టే దాని సమస్త బోధనలు పరిభ్రమిస్తూ ఉంటాయి. అది దేవుని ఏకత్వపు భావనను ఎంతగా ప్రస్ఫుటం, కల్తీ లేనిదిగా ముందుంచిం దంటే షిర్క్ లేక బహుదైవారాధనకు ఎటువంటి తావే లేదు. అది ఎంతో విశదంగా, బలంగా, శక్తిమంతంగా మాటిమాటికీ ప్రకటిస్తుంది:

وَ اِلٰهُكُمْ اِلٰهٌ وَّاحِدٌ ۚ لَآ اِلٰهَ اِلَّا هُوَ الرَّحْمٰنُ الرَّحِيْمُ ۝ (البقرہ:١٦٣)

**మీ ఆరాధ్యుడు ఒకే ఆరాధ్యుడు, ఆయన తప్ప మరో ఆరాధ్యుడు లేడు, ఆయన మహా దయాళువు, అత్యంత కరుణ చూపేవాడు.** ***(అల్ బకర : 163)***

ఆయతుల్ కుర్సీ దివ్యఖుర్ఆన్‌లో మహామహిమాన్వితమయిన వచనం. అది ఇలా మొదలవుతుంది.

اَللّٰهُ لَآ اِلٰهَ اِلَّا هُوَ الْحَيُّ الْقَيُّوْمُ... (البقرۃ:٢٥٥)

**అల్లాహ్, ఆయన తప్ప మరో ఆరాధ్యుడు లేడు, నిత్య సజీవుడు, లోక స్థిరంకరుడు.** ***(అల్ బకర: 255)***

తౌహీద్ (దేవుని ఏకత్వపు) సాక్ష్యం, అల్లాహ్ సృష్టించిన ఈ నిఖిల జగత్తు ఇస్తోంది. ఈ వ్యవస్థను నడిపించే దైవదూతలు, జ్ఞానసంపన్నులు, మేధావులందరూ సాక్ష్యం ఇస్తున్నారు.

شَهِدَ اللّٰهُ اَنَّهٗ لَآ اِلٰهَ اِلَّا هُوَ ۙ وَالْمَلٰٓئِكَةُ وَ اُولُوا الْعِلْمِ قَآئِمًا بِالْقِسْطِ ؕ لَآ اِلٰهَ اِلَّا هُوَ الْعَزِيْزُ الْحَكِيْمُ ۝ (آل عمران:١٨)

**అల్లాహ్ స్వయంగా సాక్ష్యమిచ్చాడు, ఆయన తప్ప మరే దేవుడూ లేడని, దైవ దూతలు, జ్ఞానసంపన్నులందరూ, న్యాయం, నిజాయితీలతో దీనికి సాక్షులుగా ఉన్నారు. ఆ బలోపేతుడయిన వివేచనా పరుడు తప్ప వాస్తవానికి మరే దేవుడూ లేడనడానికి.** ***(ఆలి ఇమ్రాన్ : 18)***

అల్ ఇఖ్లాస్ సూరాలో దేవుని ఏకత్వపు (తౌహీద్) ప్రకటనతోపాటు బహు దైవభావనల ఖండన కూడా ఉంది. అందులో, పరమ ప్రభువు ఉనికి అన్నింటికీ ఉన్నత మయింది, అతీతమయిందని, అన్ని విధాల ఆవశ్యకతలకు పరిశుద్ధమయిందని చెప్పడం జరిగింది. ఇంకా సర్వమూ ఆయనకు బద్ధులయి, ఆయన పట్ల ఆపేక్ష గలవారయి ఉన్నారని, ఆయనే అందరి ఆపద్బాంధవుడు, అవసరాలను తీర్చేవాడని ప్రకటించడం జరిగింది. ఆయనకు ఎటువంటి కుటుంబమూ లేదని, అందువల్ల ఎటువంటి దైవత్వపు పరంపర కూడా కొనసాగడంలేదని, ఆయన అనాది, అనంతమయినవాడు, అనన్యుడు, ఒకే ఒక్కడని, ఆయనకు ఏ ఉపమానమూ, ఉదాహరణ, దృష్టాంతమూ లేదని వక్కాణించడం జరిగింది.

قُلْ هُوَ اللّٰهُ اَحَدٌ○ اَللّٰهُ الصَّمَدُ○ لَمْ يَلِدْ وَ لَمْ يُوْلَدْ○ وَلَمْ يَكُنْ لَّهٗ كُفُوًا اَحَدٌ○

(الاخلاص)

చెప్పు, ఆయన అల్లాహ్, ఒక్కడే ఒక్కడు; అల్లాహ్ అందరి పట్లా నిరపేక్షాపరుడు, అందరూ ఆయన సమక్షంలో అగత్య పరులే. ఆయనకు సంతానం లేదు. మరా యనా ఎవ్వరికీ సంతానం కాదు. మరే ఒక్కడూ ఆయనకు సహవర్తి కాదు.

*(అల్ ఇఖ్లాస్ : 1 -4)*

దేవుని ఉనికిలో సమస్త ఉత్తమ గుణాలు, పరిపూర్ణ లక్షణాలూ మనం ఊహిం చగలిగిన మేరకు ఉన్నాయి. సకల ఉత్తమ నామములన్నీ ఆయనకు చెందినవీ. ఇవి ఆయన గుణగణాలు, ఆయన ప్రతి పేరు ఒక గొప్పదనాన్ని చాటుతుంది.

اَللّٰهُ لَآ اِلٰهَ اِلَّا هُوَ لَهُ الْاَسْمَآءُ الْحُسْنٰى ○ (طٰہٰ:٨)

ఆయనే అల్లాహ్, ఆయన తప్ప మరే ఆరాధ్యుడు లేడు; ఆయనకే చెందినవి సమస్త ఉత్తమమయిన పేర్లు. *(తాహా : 8)*

మరో చోట ఇలా ఉంది:

قُلِ ادْعُوا اللّٰهَ اَوِ ادْعُوا الرَّحْمٰنَ ؕ اَيًّا مَّا تَدْعُوْا فَلَهُ الْاَسْمَآءُ الْحُسْنٰى○ (الاسراء:١١)

చెప్పు, అల్లాహ్ పేరుతో పిలిచినా, రహ్మాన్ పేరుతో పిలిచినా, ఏ పేరుతో పిలిచినా సమస్త ఉత్తమ నామములన్నీ ఆయనకు చెందినవే. *(అల్ ఇస్రా :11)*

పరమ ప్రభువు ఉనికి సకల లోపాలకు, కొరతలకు అతీతమయినది, పరిశుద్ధ మయినది. బహు దైవారాధకులు అల్లాహ్‌ను ఆయన సృష్టితాల వలే ఊహించుకుని, సృష్టిరాశుల్లో ఉండే సమస్త బలహీనతలను ఆయనకు ఆపాదించారు. అయితే అల్లాహ్ ఉనికి వీటన్నింటికీ అతీతమయింది, పరిశుద్ధమయింది, ఉన్నతమయింది.

سُبْحٰنَ رَبِّ السَّمٰوٰتِ وَالْاَرْضِ رَبِّ الْعَرْشِ عَمَّا يَصِفُوْنَ○ (الزخرف:٨٢)

పరిశుద్ధుడు, భూమీ ఆకాశాల ప్రభువు, అర్ష్ జగతి పాలనాసనాధీశుడయిన ప్రభువు – వీరు పలికే ఈ మాటలకు అతీతుడు, పరిశుద్ధుడు. *(అజ్ జుఖ్రుఫ్ : 82)*

మరో చోట ఇలా సెలవీయబడింది:

سُبۡحٰنَ رَبِّکَ رَبِّ الۡعِزَّةِ عَمَّا يَصِفُوۡنَ ۝ وَ سَلٰمٌ عَلَى الۡمُرۡسَلِيۡنَ ۝ وَالۡحَمۡدُ لِلّٰهِ رَبِّ الۡعٰلَمِيۡنَ ۝

(الصافات:۱۸۰-۱۸۲)

నీ ప్రభువు పరిశుద్ధుడు, ఆయన గౌరవనీయుడు, ఆధిక్యత గలవాడు. వీరు పలికే మాటలకు అతీతుడు. దైవసందేశ హరులకు శాంతి కలుగుతుంది. సమస్త స్తోత్రములు అల్లాహ్‌కు చెందినవే. ఆయన నిఖిల జగతికి ప్రభువు.

*(అస్ సాఫ్ఫాత్ : **180- 182**)*

వాస్తవానికి దేవుని ప్రవక్తల ద్వారా ప్రాప్తమయిన దేవుని ఏకత్వపు బోధన మటుకే సత్యమయినది. అందులోనే శ్రేయముంది, క్షేమముంది. మరెవరయితే బహుదైవారాధనా మార్గాన్ని అనుసరిస్తారో వారి మోక్షానికి మార్గమే లేదు.

తౌహీద్ (దేవుని ఏకత్వపు) నమ్మకాన్ని అంగీకరించినదాని తప్పనిసరి పరిణామం ఏమిటంటే, పరమ ప్రభువు అల్లాహ్ ఉనికి అత్యంత ప్రాచీనమయినది, అనాది, అనంత మయినది అన్న విషయాన్ని మనఃపూర్వకంగా నమ్మాలి. దానితోపాటు ఆయన నిత్య సజీవుడు, స్థిరంకరుడు అనీ ఆయన భూమ్యాకాశాలకు, సకల విశ్వానికీ సృష్టికర్త అనీ, ఆయనే దీనంతటికీ స్వామి అనీ విశ్వాసం కలిగి ఉండాలి. ఇంకా ఇలా నమ్మాలి ఇక్కడున్న ప్రతి వస్తువూ ఆయనకే చెందినది, ఆయనే ఈ జగతికి వ్యూహరచయిత, ఆయనే నిర్వహణ కర్త, ఆయనే దీన్ని నడిపిస్తున్నవాడు. ఆ విశ్వప్రభువే సకల సృష్టిరాశులకు పోషణకర్త, ఆయనే అందరికీ ఉపాధి ప్రదాత, అందరి అవసరాలను తీర్చేవాడు, ఆపద్బాంధవుడు. ఆయనే జీవన్మరణాల స్వామి, ఆయన సర్వోపరిజ్ఞాని, సమాచారమంతా ఎరిగిన వాడు; అంతర్‌బాహ్య జ్ఞానధనుడు, కరుణామయుడు, కృపాకరుడు; లాభనష్టాలు ఆయన హస్తగతమే అయి ఉన్నాయి; ఆయన ఒకరికి లాభం చేకూర్చదలిస్తే మరెవరూ అతనికి నష్టం చేకూర్చలేరు; మరాయన ఎవరికి నష్టం కలిగించగోరితే మరెవరూ అతనికి లాభం ఒనగూర్చలేరు; ఆయన అధికారాలు అపరిమితమయినవి; ఆయన కోరింది క్షణ కాలంలో నెరవేరుతుంది.

ఆయన దూతలు జగతిలో అంతటా అన్ని చోట్లా సిద్ధంగా ఉన్నారు. మారు పలకక ఆయన ఆజ్ఞల్ని పాలిస్తూ ఉన్నారు. ఆయనే శాసనకర్త, చట్టనిర్మాణమూ ఆయన బాధ్యతే. ఆయనే నిజమయిన అధికారి, పరమోన్నత పరిపాలకుడు. ఆయన మానవుల మార్గబోధ నకు దైవసందేశహరుల్ని ప్రభవింపజేశాడు, గ్రంథాలు అవతరింపజేశాడు, తన ఆదేశా లను, ఫర్మానాలను పంపాడు. మహనీయ ముహమ్మద్ (స) దేవుని అంతిమ ప్రవక్త. దివ్యఖుర్ఆన్ ఆయన అంతిమ గ్రంథం. అందులో ప్రళయం వరకు మానవాళికి మార్గ

బోధనా సమాచారముంది. ఆయన న్యాయశీలుడు, న్యాయకర్త కూడా. ఆయన సాధికార విచారణాధికారి కూడా. ఆయన ఆదేశానుసారమే ఒక రోజున ప్రళయం ఏర్పడుతుంది. ఆనాడు ప్రతి మానవునికి అతని ఆచరణ మేరకు అనంతమయిన సద్ఫలితమో శిక్షయో లభిస్తుంది.

ఒకే దైవాన్ని నమ్మిన తరువాత ఇటువంటి గుణగణాలన్నింటినీ నమ్మవలసి ఉంటుంది. అవి దివ్యఖుర్‌ఆన్‌లో వక్కాణించబడ్డాయి. దానితోపాటు ఈ గుణగణాలు గల అస్తిత్వం ఒక్క అల్లాహ్‌కు తప్ప మరొకరిదెవరిదీ లేదని కూడా నమ్మవలసి ఉంటుంది. ఆయన తన ఉనికిలోను, గుణగణాలలోనూ ఒక్కగానొక్కడే. ఆయనకు మరో సహవర్తి కూడా లేదు. దీని ద్వారానే మనిషి విశ్వాసంలో చిత్తశుద్ధి జనిస్తుంది.

## ఆచరణ శుద్ధి

ఈ శుద్ధజీవనమే ఆరాధనల్లోనూ తప్పనిసరి. ఇందులో బహుదైవారాధన ఏ మాత్రం కలుషితమయినా దాన్ని ఇస్లామ్ సహించదు, ఎంత విశదంగా ఉందో గమనించండి.

إِنَّآ أَنزَلْنَآ إِلَيْكَ الْكِتٰبَ بِالْحَقِّ فَاعْبُدِ اللّٰهَ مُخْلِصًا لَّهُ الدِّيْنَ ۝ (الزمر:٢)

నిస్సందేహంగా మేము నీకు ఈ గ్రంథాన్ని సత్యం ఆధారంగా అవతరింపజేశాము. కాగా మీరు అల్లాహ్ కొరకు ధర్మాన్ని శుద్ధపరచుకుని మరీ ఆయన ఆరాధన చేయండి. *(అజ్ జుమర్ : 2)*

ఈ ఆయత్ జుమర్ సూరా ప్రారంభంలోనే వచ్చింది. ఇదే సూరాలో మరి కాస్త ముందుకు సాగిన తరువాత దైవసందేశహరులు(స)కు ఇదే శుద్ధతను ప్రకటించాలని ఆదేశించడం జరిగింది.

قُلْ إِنِّيْ أُمِرْتُ أَنْ أَعْبُدَ اللّٰهَ مُخْلِصًا لَّهُ الدِّيْنَ ۝ وَ أُمِرْتُ لِأَنْ أَكُوْنَ أَوَّلَ الْمُسْلِمِيْنَ ۝ قُلْ إِنِّيْ

చెప్పు, నన్ను ఆదేశించడం జరిగింది, ఆయన ధర్మాన్ని పరిశుద్ధపరుకుని మరీ ఆయన ఆరాధన చేయాలని. నేను ప్రప్రథమ ఆజ్ఞాపాలకునిగా అవ్వాలనీ నన్ను ఆదేశించడం జరిగింది. చెప్పివెయ్యి, నేను నా ప్రభువు ఆజ్ఞల్ని పాలించకపోతే నాకు మహాదినాన (ప్రళయం) సంభవించే

اَخَافُ اِنْ عَصَيْتُ رَبِّىْ عَذَابَ يَوْمٍ عَظِيْمٍo قُلِ اللّٰهَ اَعْبُدُ مُخْلِصًا لَّهٗ دِيْنِىْo (الزمر:۱۱-۱۴)

శిక్షకు సంబంధించిన భయముంది. చెప్పి వెయ్యి, నేనయితే నా ధర్మాన్ని అల్లాహ్ కొరకు ఏకోన్ముఖం చేసుకుని మరీ ఆయన్ని ఆరాధిస్తాను అని.
*(అజ్ జుమర్ : 11-14)*

ఈ వచనాలలో దైవారాధన చేయాలన్న ఆదేశముంది. అల్లాహ్‌నే పూజించాలని, ఆయన్నే సేవించాలని, ఆయన మహత్తును, మహనీయతను, దైవత్వపు భావనను హృదయాంతరాళాలలో, మేధో కుహరాలలో నిబిడీకృతం చేసుకోవాలనీ ఉద్దేశించబడింది. ఆయన సమక్షంలో వినయవినమ్రతలు అవలంబించాలని, ఆయన కొరకే నమాజ్, సజ్దాలు, త్యాగాలు, ప్రార్థనలు, పరిశుద్ధతా కీర్తనలు, స్తోత్రగానాలు కొనసాగాలని నిర్దేశించడం జరిగింది. దీంతోపాటు ఆయన ఆజ్ఞాపాలనే చేయాలని, ఆయన ఆదేశాలనే శిరసా వహించాలని, ఆయన అవతరింపజేసిన షరీఅత్ శాసనాంగానికే కట్టుబడి ఉండాలని ఆజ్ఞాపించడం జరిగింది.

ఈ విధంగా దైవంతో ఏర్పడే సంబంధం, ఆరాధ్యుడు, ఆరాధకుని సంబంధం, దాసుడు, స్వామి సంబంధం. ఇదే ధర్మం అంటే, ఇఖ్లాస్ అంటే ఈ పూర్తి ధర్మం కేవలం అల్లాహ్ కొరకే అంకితమయిపోవాలి. అది అన్నివిధాల షిర్క్ నుండి పరిశుద్ధమయిపోవాలి. ఇందులో దైవేతర శక్తులకు ఏమాత్రం వాటా ప్రాప్తం కారాదు. ఈ కారణంగానే దివ్యఖుర్ఆన్ అల్లాహ్ ఆరాధనాజ్ఞతోపాటు బహుదైవభావనకు దూరంగా మెలగాలని సయితమూ నిర్దేశించింది. దైవాదేశం ఇది.

وَاعْبُدُوا اللّٰهَ وَلَا تُشْرِكُوْا بِهٖ شَيْئًا (النساء:۳۶)

ఇంకా అల్లాహ్‌ను ఆరాధించండి, ఆయనతోపాటు మరే విషయాన్నీ సహవర్తిగా చేయకండి. *(అన్ నిసా :36)*

అల్లాహ్ ఆరాధన జరగాలని ఇస్లామ్ కోరే చోటనే అది విశ్వంలోని ఏ పెద్ద వస్తువునయినా, చిన్న వస్తువునయినా ఆయనకు సహవర్తిగా ఎంచరాదని పట్టుపట్టి మరీ కోరుతుంది. అల్లాహ్‌తోపాటు మరెవరినయినా సహవర్తిగా భావించడమంటే భావం, ఆరాధన అన్నది ఆయనకు ప్రత్యేకం, పరిశుద్ధం కాదన్న మాట. దేవుని ఏకత్వం వేరుగా, తప్పనిసరిగా కోరేదాన్నిబట్టి ఆరాధన, ఆజ్ఞాపాలన కేవలం అల్లాహ్‌కే జరగాలి, మరెవరికీ అందులో ఎటువంటి భాగస్వామ్యం మిగులరాదు.

... اَنَّمَآ اِلٰهُكُمْ اِلٰهٌ وَّاحِدٌ ۚ فَمَنْ كَانَ يَرْجُوْا لِقَآءَ رَبِّهٖ فَلْيَعْمَلْ عَمَلًا صَالِحًا وَّ لَا يُشْرِكْ بِعِبَادَةِ رَبِّهٖٓ اَحَدًا ۝ (الكهف:١١)

నిస్సందేహంగా మీ ప్రభువు దైవం ఒకే దేవుడు, అందువల్ల తన ప్రభువును కలుసుకోగల ఆశ ఉన్న వ్యక్తి సదాచార పాలకుడయి ఉండాలి, తన ప్రభువు ఆరాధనలో మరెవరినీ సహవర్తిగా ఎంచరాదు. *(అల్ కహ్ఫ్ : 11)*

ఇస్లామ్, విశ్వాసంలోనూ, ఆరాధనలోనూ ఎంతమాత్రం ఎటువంటి బహు దైవభావనాంశాన్ని సహించదు, భరించజాలదు. దేవుని ఏకత్వం (తౌహీద్)ని ఎవరయితే వదలుకుంటారో, మరెవరయితే బహుదైవారాధనతో సంబంధం ఏర్పరచుకుంటారో వారు నరక మార్గాన బయలుదేరినట్లే. దేవుని క్షమాభిక్షకు చిరకాలానికి దూరమయి పోయినట్లే.

اِنَّ اللّٰهَ لَا يَغْفِرُ اَنْ يُّشْرَكَ بِهٖ وَ يَغْفِرُ مَا دُوْنَ ذٰلِكَ لِمَنْ يَّشَآءُ ۚ وَ مَنْ يُّشْرِكْ بِاللّٰهِ فَقَدِ افْتَرٰىٓ اِثْمًا عَظِيْمًا ۝ (النساء:٤٨)

నిశ్చయంగా అల్లాహ్, తనతోపాటు మరెవరినీ సహవర్తిగా చేసే మహా పాపాన్ని ఎంతమాత్రం మన్నించదు. ఇదొక్కటి తప్ప మరే ఇతర పాపాలనయినా ఆయన కోరుకున్నదాన్ని మన్నించవచ్చు. మరెవరయితే అల్లాహ్‌తోపాటు ఇతరుల్ని సహవర్తిగా భావిస్తాడో మహా అపరాధాన్నే చేసినవాడు. *(అన్ నిసా : 48)*

## ప్రదర్శనాబుద్ధి చిత్తశుద్ధికి వ్యతిరేకం

ఇఖ్లాస్ వ్యతిరేక భావం 'రియా'. అంటే బాహ్యంలో దేన్నయినా అలంకార ప్రాయంగా ప్రదర్శించడం అన్నమాట. రియా– ప్రదర్శనాబుద్ధి ఉన్న చోట ఇఖ్లాస్ మిగులదు. చిత్తశుద్ధిగల ఆచరణలో ప్రదర్శనాబుద్ధి చూచాయగా కూడా మిగులదు. ఈ రెండు భావాలూ ఒకే చోట ఏకత్రం కాలేవు. రియా వల్ల ఆచరణల వాస్తవ సౌందర్యం అంతరించిపోతుంది. పరమ ప్రభువు ఈ విశాల జగతిలో మనిషిని సృజించింది, అతని ఆచరణను మాత్రమేకాదు, 'ఉత్తమ ఆచరణ'ను చూడటానికి. ఇదే ఆయన కోరుకునేది.

لِيَبْلُوَكُمْ اَيُّكُمْ اَحْسَنُ عَمَلًا ۝ (هود:٧)

తద్వారా మిమ్మల్ని పరీక్షించాలి. మీలో అత్యుత్తమ ఆచరణ చేసేవారెవరో గమనించాలనీను. *(హూద్ :7)*

ఉత్తమ ఆచరణకు రెండు నియమాలు చెప్పబడతాయి. ఒకటి, అది సరిగ్గా దైవం, దైవప్రవక్తల ఆదేశాలకనుగుణంగా ఉండాలి. రెండు, అందులో చిత్తశుద్ధి ఉండాలి. అది కేవలం పరమ ప్రభువు అల్లాహ్ ప్రసన్నత బడయటానికి, ఆయన సంతోషాన్ని కాంక్షిస్తూ చేయాలి. అదొక్కటే తప్ప మరే ప్రేరణా దాని వెనుక ఉండరాదు. మరో మాటలో చెప్పాలంటే, ఒక ఆచరణ కేవలం అనుమతింపబడింది, సరయినదొక్కటే కావడం సరిపోదు, దాని వెనుక ప్రేరకశక్తి కూడా సరయినదే కావడం అవసరం. ఒక ఆచరణ ఉత్తమ ఆచరణ రూపం ధరిస్తే దాని ప్రతిఫలం, పుణ్యఫలం ఎక్కడా వృధాపోదు. పరమ ప్రభువు అల్లాహ్ దానికి పూర్తి స్థాయి ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాడు.

إِنَّ الَّذِيْنَ اٰمَنُوْا وَعَمِلُوا الصّٰلِحٰتِ اِنَّا لَا نُضِيْعُ اَجْرَ مَنْ اَحْسَنَ عَمَلًا ۝ اُولٰٓئِكَ لَهُمْ جَنّٰتُ عَدْنٍ تَجْرِىْ مِنْ تَحْتِهِمُ الْاَنْهٰرُ يُحَلَّوْنَ فِيْهَا مِنْ اَسَاوِرَ مِنْ ذَهَبٍ وَّ يَلْبَسُوْنَ ثِيَابًا خُضْرًا مِّنْ سُنْدُسٍ وَّ اِسْتَبْرَقٍ مُّتَّكِئِيْنَ فِيْهَا عَلَى الْاَرَآئِكِ ؕ نِعْمَ الثَّوَابُ ؕ وَحَسُنَتْ مُرْتَفَقًا ۝ (الكهف:٣٠،٣١)

నిస్సందేహంగా, విశ్వసించి సదాచరణ చేసినవారు (వారికి వారి ఆచరణల ప్రతిఫలం తప్పక లభిస్తుంది). మేము, సదాచరణ చేసిన ఏ వ్యక్తి ప్రతిఫలాన్నీ వృధా పరచము. ఇటువంటివారికి చిరకాలం ఉండే తోటలుంటాయి. వాటి దిగువన కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి. అక్కడ వారికి సువర్ణ కంకణాలు తొడిగిస్తారు. వారు పట్టుబట్టలు, పల్చనయినవీ, దట్టమయినవీ పచ్చని బట్టలు తొడుగుతారు. ఆసనాలపైన ఒరుగుదిండ్లు అమర్చబడి ఉంటాయి. ఎంత ఉత్తమమయిన ప్రతిఫలం, ఎంత ఉత్తమమయిన విశ్రాంతి, విరామం. *(అల్ కహ్ఫ్ : 30,31)*

ఒక ఆచరణ వెనుక చిత్తశుద్ధి ప్రేరణగా ఉందా, లేదా అది ప్రదర్శనాబుద్ధితో నిర్వర్తించబడుతుందా అన్న విషయం మనిషి చేసుకునే సంకల్పబుద్ధిపైన ఆధారపడి ఉంటుంది. దీని ఆధారంగానే అతను దేవుని సన్నిధిలో ఆమోదముద్రను పొందగలుగు తాడు, లేదా అక్కడినుండి త్రిప్పి పంపబడతాడు. మహనీయ ఉమర్(ర) ఉల్లేఖనం ప్రకారం:

سمعت رسول الله صلى الله عليه وسلم يقول انما الاعمال

దైవప్రవక్త(స) ఇలా చెప్పారు, ఆచరణ మంచీ చెడ్డలు సంకల్పాలపైన ఆధారపడి ఉన్నాయి. ప్రతి వ్యక్తికీ అతను చేసు

بالنيات و انما لكل امرئ مانوىٰ فمن كانت هجرته الى الله و رسوله فهجرته الى الله و رسوله و من كانت هجرته الى دنيا يصيبها او الى امرأة ينكحها فهجرته الى ما هاجر اليه

కున్న సంకల్పం ఆధారంగానే ఏదయినా ప్రాప్తమవుతుంది. ఎవరయితే అల్లాహ్, ఆయన సందేశహరుని కోసం హిజ్రత్ చేశాడో అతను నిజంగానే అల్లాహ్, ఆయన ప్రవక్త కొరకు చేసినట్లు. కాని ఎవరయితే ప్రపంచ ప్రాప్తికి హిజ్రత్ చేశాడో లేదా ఏ స్త్రీతోనయినా పెళ్ళాడటానికి హిజ్రత్ చేశాడో అతను తాను ఏ ఉద్దేశంతో హిజ్రత్ చేశాడో అతని హిజ్రత్ ఆ ఉద్దేశానికే పరిగణించబడుతుంది. (దీనికిగాను అతనికి ఎటువంటి ప్రతిఫలమూ పుణ్యఫలమూ ప్రాప్తంకాదు.)

**(బుఖారి, కితాబుల్ ఈమాన్, బాబ్ ఇన్నమల్ ఆమాలుబిన్నియ్య; ముస్లిమ్, కితాబుల్ ఇమార, బాబ్‌కౌలుహు ఇన్నమల్ ఆమాలుబిన్నియ్య)**

హదీసు భావమేమిటంటే, ఆచరణల ప్రతిఫలం మానవుని సంకల్పం ఆధారంగా ఇవ్వబడుతుంది. మనిషి, అల్లాహ్ ప్రసన్నత బడయటానికి పనిచేసినట్లయితే అతను బహుమానాలకు, ఆదరణలకు పాత్రుడవుతాడు. దాని వెనుక ఏదయినా ప్రాపంచిక లక్ష్యం ఉన్నట్లయితే అతను ఎటువంటి పుణ్యఫలాన్నీ ఆశించలేడు. హిజ్రత్ అన్నది పవిత్రమయిన, ఉన్నతమయిన ఆచరణ. దీనికి చిత్తశుద్ధి నియమం ఉంటుంది. ఎవరయితే దేవుని ప్రసన్నత, ప్రీతిబడయటానికి హిజ్రత్ చేస్తారో అతనికి అనంతమయిన ప్రతిఫలమూ పుణ్యఫలమూ, అనుగ్రహించబడతాయి. మరెవరయితే ప్రపంచాన్ని ఆర్జించడానికి, లేదా లైంగిక తృష్ణను తీర్చుకోవడానికే ఈ చర్యను తీసుకుంటాడో అతను తన లక్ష్యసాధనలో నయితే విజయం పొందుతాడు. కాని రేపు ప్రళయ దినాన అక్కడి సత్కార్యాలకు ఎట్టి పరిస్థితిలోనూ నోచుకోజాలడు.

సంపూర్ణ చిత్తశుద్ధితో అత్యుత్తమ సదాచరణలు జరిపినప్పటికీ విశ్వసించినవారు కంపిస్తూ ఉంటారు, తమ చిత్తశుద్ధిలో ఎక్కడయినా ఏదయినా లోపముండిపోయిందో ఏమోనని, అది దైవసన్నిధిలో స్వీకారయోగ్యమవుతుందో లేదోనని. వారి మానసిక స్థితిని

దివ్యఖుర్ఆన్‌లో ఇలా అభివర్ణించడం జరిగింది.

وَ الَّذِيْنَ يُؤْتُوْنَ مَآ اٰتَوْا وَّ قُلُوْبُهُمْ وَجِلَةٌ اَنَّهُمْ اِلٰى رَبِّهِمْ رَاجِعُوْنَ۝ اُولٰٓئِكَ يُسَارِعُوْنَ فِى الْخَيْرَاتِ وَهُمْ لَهَا سٰبِقُوْنَ۝

(المومنون:٦٠-٦١)

ఎవరయితే తాము దైవ మార్గంలో ఇచ్చే దేదో ఇస్తారో, వారి హృదయాలు కంపిస్తూ ఉంటాయి, తాము తమ ప్రభువు వైపునకు తిరిగిపోవలసి ఉందని. ఇటువంటి వారే సత్కార్యాల్లో అగ్రగాములయినవారు. వారు ముమ్మందు స్థానాన్ని తప్పక పొందుతారు. *(అల్ మూ'మినూన్ : 60, 61)*

హజ్రత్ ఆయిషా దైవసందేశహరుల్ని (స) ఈ ఆయత్‌లలో దుశ్చేష్టలు చేసేవారి ప్రస్తావన వచ్చిందా, సారాయి త్రాగేవారు, దొంగతనాలు చేసేవారు ప్రస్తావించబడ్డారా? అని అడిగారు. దానికి ఆయన ఇలా సమాధానం పలికారు;

لا يا بنت الصديق لكنهم الذين يصومون و يصلون و يتصدقون وهم يخافون ان لا تقبل منهم اولئك الذين..الخ

సిద్దీక్ కుమార్తె (ఆయిషా), విషయం ఇది కాదు, వాస్తవానికి వీరు రోజా వ్రతాన్ని పాటించేవారు, నమాజ్ ఆచరించేవారు, దానధర్మాలు చేసేవారు, అయినా వారికి భయం పట్టుకుంటుంది, తమ ఈ ఆచరణలు స్వీకరించబడవేమో అని. వీరిని గురించే చెప్పడం జరిగింది, వీరు సత్కార్యాల్లో అగ్రగాములయి ఉంటారని, దాన్ని పొందేవారనీను. *(తిర్మిజీ, అబ్వాబు తఫ్సీర్, సూరా అల్ మూ'మినూన్)*

ఏ ఆచరణ అయితే ప్రదర్శనాబుద్ధి రహితంగా పరిశుద్ధంగా ఉంటుందో, అది కేవలం అల్లాహ్ కొరకే చేయబడాలి. అటువంటి ఆచరణే ఆయనకు చాలా ఇష్టమయినది. అవి దానధర్మాలయినా, నమాజ్, రోజాలయినా, ఆరాధనలయినా, సతత సమరంలో పాల్గొనడమయినా; అందువల్లనే హజ్రత్ అబూజర్ గిఫారీ (ర) ద్వారా ఓ హదీసు ఉల్లేఖించబడింది. అందులో దైవసందేశహరులు (స) ఇలా సెలవిచ్చారు:

ثلثة يحبهم الله و ثلاثة يبغضهم الله فاما الذين يحبهم الله فرجل

మూడు రకాల మానవుణ్ణి అల్లాహ్ ప్రేమిస్తాడు. మరి మూడు రకాల మనుషుల్ని

ద్వేషిస్తాడు. అల్లాహ్ ప్రేమించే వారిలో ఒక పాత్ర ఎటువంటిదంటే, ఒక వ్యక్తి కొందరి వద్దకు వస్తాడు, వారిని దైవం పేరిట అర్థిస్తాడు. ఇలా అర్థించడం, అతనికీ వారికీ మధ్య ఉన్న ఏదో బంధుత్వం వల్ల కాదు. (దైవం పేరిట అర్థించినప్పటికీ) వారు అతనికి ఏదయినా ఇవ్వడానికి నిరాకరించారు. ఇది చూసి ఒక సదాచార దాసుడు ముందుకు వచ్చి గప్‌చిప్‌గా తాను ఇవ్వగలిగిందేదో ఇచ్చాడు. అతని దానాన్ని అల్లాహ్, ఆ దానం పొందిన వ్యక్తి తప్ప ఎవ్వరూ ఎరుగరు. మరో వ్యక్తి పరిస్థితి ఏమిటంటే, రాత్రివేళ ఒక సేనతో బయలుదేరాడు. (అలసిపోయినందువల్ల) అతని సేనకు నిద్ర మరే వస్తువుకన్నా ఇతోధికంగా ప్రియపాత్రమయింది. వారు తల ఆనించి నిద్రపోయారు. అప్పుడు అతను (నమాజ్‌లో) నాతో వేడుకోలు జరిపాడు, రహస్యంగా ముచ్చటించాడు, నా వచనాలను పఠించాడు. మూడవ వ్యక్తి సేనలో ఒక దళంలో ఉన్నాడు, శత్రువుని ఎదుర్కొన్నారు, మొత్తం దళం ఓడిపోయింది. అయినా అతను తన రొమ్ము విరుచుకుని ముందుకు సాగాడు. ప్రాణం పోయినా లేదా విజయం ప్రాప్తించినా ఫరవాలేదన్న భావంతో సాగాడు. పోతే పరమ ప్రభువు ద్వేషించే ఆ మూడు విధాల మనుషులు వీరు: ముసలి వాడయిన వ్యభిచారి, అహంకారి అయిన భిక్షువు, దౌర్జన్యపరుడయిన శ్రీమంతుడు.

اتی قوما فسألهم بالله ولم يسألهم بالله و لم يسألهم لقرابة بينه و بينهم، فمنعوه فتخلف رجل باعيانهم فاعطاه سرا لايعلم بعطيته الا الله والذى اعطاه و قوم ساروا ليلتهم حتى اذا كان النوم احب اليهم مما يعدل به فوضعوا رؤسهم فقام يتملقنى و يتلو أياتى و رجل كان فى سرية فلقى العدو فهزموا فاقبل بصدره حتى يقتل او يفتح له والثلاثة الذين يبغضهم الله الشيخ الزانى والفقير المختال والغنى الظلوم[1]

*(ముస్నద్ అహ్మద్, 5/152; తిర్మిజీ, అబ్వాబ్ సుఫ్ఫతుల్ జన్న, బాబ్ మాజా అఫీసుఫ్ఫతు అన్వారుల్ జన్న; నసాయి, కితాబు జ్జకాత్, బాబ్ సవాబ్ మయ్యూతా.)*

## ప్రదర్శనాబుద్ధి కూడా బహుదైవభావనే

హదీసుల్లో 'రియా' కాక ప్రదర్శనాబుద్ధిని బహుదైవభావనగా అర్థాన్వయం చేయడం జరిగింది. ఎందువల్లనంటే ఈ బుద్ధిలో ఆచరణలకు అల్లాహ్‌ను ప్రసన్నుడిగా చేసుకోవాలన్న భావన ఒక్కటే ప్రేరణగా ఉండదు, దానితోపాటు అనేక ఇతర ప్రేరణలూ చోటు చేసుకుంటాయి. దేవుని ఏకత్వం కోరే చిత్తశుద్ధికి ఇది వ్యతిరేకభావం.

హజ్రత్ షద్దాద్ బిన్ ఔస్ (ర) కొందరు సహచరమాన్యుల మధ్య ఒక ప్రశ్నను లేవనెత్తారు,

لو رأيتم رجلا يصلى لرجل او يصوم له او يتصدق له اترون انه قد اشرک؟

మీరు ఒకవేళ ఒక వ్యక్తిని, మరో వ్యక్తి కొరకు నమాజ్ చేయడాన్ని, లేక అతని కోసమే ఉపవాస వ్రతాన్ని పాటించడాన్ని, లేక అతని కొరకే దానధర్మాలు చేయడాన్ని గమనిస్తే అతను షిర్క్ (బహుదైవారాధన) చేస్తున్నట్లా కాదా చెప్పండి.

దానికి అందరూ ఏకీభవిస్తూ జవాబిచ్చారు.

نعم والله انه من صلي للرجل او صام له او تصدق له لقد اشرک

దైవం మీద ఒట్టు, ఎవరయితే మరెవరి కొరకు నమాజ్ చేశారో, లేక రోజా వ్రతాన్ని పాటించారో లేక దానధర్మాలు చేశారో వారు నిశ్చయంగా బహుదైవా రాధనకు పాల్పడినట్లే.

దాని మీదట హజ్రత్ షద్దాద్ (ర) ఇలా అన్నారు :

انی قد سمعت رسول الله صلی الله علیه وسلم یقول من صلی

నేను నిస్సందేహంగా దైవప్రవక్త (స) సెల వీయగా విన్నాను, ఎవరయితే ప్రదర్శనా బుద్ధితో నమాజ్ చేశాడో అతను షిర్క్

يرائى فقد اشرك و من صام يرائى فقد اشرك و من تصدق يرائى فقد اشرك

**చేసినట్లే. ఎవరయితే ప్రదర్శనాబుద్ధితో రోజా పాటించాడో అతనూ షిర్క్ చేసినట్లే. మరెవరయితే ప్రదర్శనాబుద్ధితో దాన ధర్మాలు చేశాడో అతను కూడా షిర్క్ చేసినట్లే.★**

ప్రదర్శనాబుద్ధిలో దాగి ఉండే షిర్క్‌ని ఈ హదీసు అతి స్పష్టంగా విశదీకరిస్తుంది. దీనివల్ల ప్రదర్శనా బుద్ధిలోగల దౌష్ట్యం, హైన్యం మరింత పెరుగుతుంది.

దైవాన్ని నమ్మనివారు కూడా ప్రదర్శనాబుద్ధికి ఒడిగడతారు, దైవాన్ని నమ్ముతున్నామని ప్రకటించేవారి ఆచరణలు సయితం ప్రదర్శనాబుద్ధికి అతీతం కావు. ఇంతకూ మనిషి ప్రదర్శనాబుద్ధికి ఎందుకు పాల్పడతాడు. దీని ద్వారా అతను పొందగోరేదేమిటీ? దీనికి ఎన్నయినా లక్ష్యాలు కావచ్చు.

మానవునిలో తన పనులకు మెప్పు పొందాలన్న, పొగడ్త గడించాలన్న కోరిక సహజంగానే ఉంటుంది. ప్రతి వ్యక్తీ తన ప్రస్తావన మంచి మాటల్లో జరగాలని కోరుకుంటాడు. తన పట్ల మంచి పనులు, ఉత్తమ లక్షణాలూ వర్తింపజేయాలని, చెడు లక్షణాలను తనకు ఆపాదించరాదని ఆశిస్తాడు. ఈ భావం ఒక ప్రత్యేక పరిమితి వరకు అవాంఛనీయం కాదు. కాని అది హద్దులు మీరితే అదే అతని ఆచరణలన్నింటిపైనా ఆవరిస్తుంది. అతను ఏదయినా సత్కార్యం చేసినట్లయితే మెప్పుదల కోసం నలువైపులా దృష్టిసారిస్తాడు. తానొక మంచి పని చేసినందుకు దాన్ని అందరూ తప్పక అంగీకరించాలని అతను ఆశిస్తాడు. అతని దృష్టిలో అతని పట్ల జనం ప్రశంసలు, పొగడ్తలు కురిపించడం తన హక్కుగా పరిగణిస్తాడు. ఎటునుండయినా తన సత్కార్యానికి మెప్పుదల ప్రాప్తం కాకపోతే నిరాదరణకు గురయినట్లు నిందలు మోపుతాడు. మెప్పు ప్రాప్తం కానంత వరకు అతని ఈ భావానికి తృప్తి కలగదు.

కొన్ని సందర్భాలలో ఆచరణాశూన్యుడు, దురాచార వ్యవహర్త కూడా అందమయిన సాకుల ద్వారా తన తప్పుడు కార్యాలను, కొరతలను మరుగుపరచడమే కాక వాటిని ఎంతో వివేచనతో కూడుకున్నవిగా ఔచిత్యంగలవిగా నిరూపించడానికి ప్రయత్నిస్తాడు. అలా దానికీ మెప్పును కోరుకుంటాడు. యూదులు తమ ధర్మాన్ని అమ్ముకునే వారయినప్పటికీ తమను ఉత్తమ ధర్మపరాయణులుగా ప్రపంచం గుర్తించాలని కోరుకునే వారు. మునాఫికులు చేసే కుట్రలు పన్నే కుతంత్రాలను విస్మరించి వారిని సముదాయ

★ ముస్నద్ అహ్మద్ : 4/126.

సేవకులుగా పరిగణించాలని వాంఛించేవారు. దివ్యఖుర్ఆన్ ఈ ధోరణినే ఖండిస్తూ ఇలా చెబుతుంది.

لَا تَحۡسَبَنَّ الَّذِيۡنَ يَفۡرَحُوۡنَ بِمَا اَتَوۡا وَّيُحِبُّوۡنَ اَنۡ يُحۡمَدُوۡا بِمَا لَمۡ يَفۡعَلُوۡا فَلَا تَحۡسَبَنَّهُمۡ بِمَفَازَةٍ مِّنَ الۡعَذَابِ‌ۚ وَلَهُمۡ عَذَابٌ اَلِيۡمٌ○ (آل عمران:۱۸۸)

ఎవరయితే తమ చేష్టలకు ఆనందభరితు లవుతున్నారో, తాము చేసిన దానికి వారిని ప్రశంసించాలని కూడా కోరుకుంటున్నారో వారు శిక్ష నుండి తప్పించుకుంటారని అనుకోకండి, వారికి భయంకరమయిన యాతన విధించబడుతుంది.★

*(అలి ఇమ్రాన్ : **188**)*

మనిషి 'అబద్ధపు వస్త్రధారణ'తో జనుల ముందు రావడాన్ని హదీసులో వారించడం జరిగింది. వట్టి చేతులతో ఉంటూ ధనవంతునిగా నిరూపించ ప్రయత్నించడం,ఆకలితో ఉంటూ కడుపునిండా ఉన్నట్టుగా చూపెట్టడం, వంటి నిండా కప్పుకునే బట్టలు లేకపోయినా అడుక్కున్న మెరిసే వస్త్రాలు ధరించి ఉన్నత స్థితిపరునిగా ప్రకటించుకోవడం ఈ కోవకు చెందిన చేష్టలే. హజ్రత్ అస్మా బిన్తు అబూబక్ర్ ఉల్లేఖనం ప్రకారం:

اِنَّ امرأةً قالت يا رسولَ الله اِنَّ لِى ضَـرَّةً فهل علىَّ جنـاحٌ اِن تشبَّعتُ من زوجى غير الـذى يعطى فقال رسول الله صلى الله عليه وسلم المتشبع بما لم يعط كلابس ثوبى زور

ఒక స్త్రీ వచ్చి, దైవప్రవక్తా, నాకు ఒక సవితి ఉంది. నాకు నా భర్త ఇచ్చిన దాని మీద, నా భర్త నాకు అంతకుమించి ఇచ్చాడని బూటకంగా వ్యక్తం చేయడం ఏమయినా పాపమా? అని అడిగింది. ఆయన ఇలా సెలవిచ్చారు, ఎవరికయినా ఇవ్వనిదాన్ని గురించి అది తనకు ఇచ్చి నట్లు ప్రకటించుకోవడం, ఎవరయినా బూటకపు వస్త్రధారణ చేసుకున్న దానికి సమానం. ★★

---

★ *ఆయత్ పూర్వరంగాన్ని గురించి తెలుసుకునేందుకు తఫ్సీర్ ఇబ్నె కసీర్, 1/436 చూడండి.*

★★ *బుఖారి, కితాబుల్నికాహ్, బాబ్ అత్ తషబ్బు; ముస్లిమ్ కితాబుల్లిబాస్, బాబ్ అన్నహీ అనిత్తజ్వీరు ఫిల్లిబాస్.*

ఈ హదీసుకు పూర్వరంగం, ఇటువంటి అబద్ధపు వ్యక్తీకరణ వల్ల ఆ స్త్రీ సవితికీ ఆమె భర్తకు మధ్య వివాదం, విభేదం జనించవచ్చు. ఇది చాలా ఖండనీయమయిన చేష్ట. ధర్మవేత్తల దృష్టిలో దైవభక్తి పట్ల బూటకపు ప్రదర్శన కూడా ఈ కోవకు చెందినదే. అలాగే దైవభక్తిపరాయణుల వస్త్రధారణ చేసి ధర్మనిష్ఠగలవానిగా తన సదాచరణను, తక్వాను వంచనగా చూపెడుతూ తిరిగే ప్రపంచ ప్రియుడు కూడా ఈ కోవకు చెందినవాడే. ★

పొగడ్త, ప్రశంసల కోరిక మితిమీరిపోతే ఖ్యాతి, పేరుప్రతిష్ఠల అభిలాషగా మారుతుంది. మనిషి చేసే సకల ప్రయత్నాలు ఈ కేంద్రం చుట్టే తిరగనారంభిస్తాయి. పేరు ప్రతిష్ఠల ఈ కాంక్ష చాలా బలమయినది. మనిషిని కార్యశీలునిగా చేయడంలో చాలా ఉపకరిస్తుంది. దీని కోసం అతను ధనం, ప్రాణాలు అన్నీ సమర్పించడానికి సమాయత్త మవుతాడు. పేరుప్రతిష్ఠల ఆకాంక్షలో మనిషి శక్తి, సామర్థ్యాల ఆశ్చర్యకరమయిన పోకడలు దర్శనమిస్తాయి.

ప్రతిష్ఠ కోరిక వల్ల స్వీయోత్కర్ష రోగం జనిస్తుంది. పేరు ప్రతిష్ఠల ఆకలి తీరకపోతే మనిషి స్వయంగా తానే తన్ను కీర్తించుకుంటూ కీర్తనలు వ్రాసుకుంటాడు. గ్రంథాలు వ్రాసుకుంటాడు. అతనికి, తన కార్యకుశలతల్ని బహిరంగంగా అంగీకరించనంత వరకు అతనికి తృప్తి కలగదు, నిద్రపట్టదు. ఒక హదీసు ప్రకారం ఒక వ్యక్తి ఏదయినా సత్కార్యం చేసి దాన్ని ప్రచారం చేస్తూ తిరిగితే ప్రళయ దినాన పరమ ప్రభువు అతని సంకల్పంలోని కల్తీని జగతినంతటికీ ఎరుకపరుస్తాడు. అతను బహిరంగంగా ప్రజలందరి ముందు పరాభవానికి లోనవుతాడు. హజ్రత్ జున్దుబ్ (అబూ అబ్దుల్లా అబ్ బిజ్లీ) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవిచ్చారు,

من سمَّعَ سَمَّعَ اللّٰهُ بِه و مَنْ يُرائِى يُرائِى اللّٰهُ بِهِ

**ఎవరయితే తన మహాకార్యాలు ఇతరులకు వినిపిస్తాడో, వాటిని ప్రచారం చేస్తాడో, పరమ ప్రభువు ప్రళయ దినాన దాన్ని అందరికీ వినిపిస్తాడు, అతను ఏ సంకల్పంతో ఇదంతా చేశాడో తెలుపుతాడు. ఎవరయితే తన ఆచరణలు ఇతరులకు చూపిస్తాడో అతను ఏ సంకల్పంతో అలా చేశాడో అల్లాహ్ అందరికీ వెల్లడిస్తాడు.** ★★

---

★ నవవి, షరహ్ ముస్లిమ్, *2/706.*

★★ బుఖారి, కితాబుర్రికాక్, బాబుర్రియా, వసమ్అ; ముస్లిమ్ కితాబుజ్జుహ్ద, బాబ్ తహ్రీముర్రియా.

పేరు ప్రతిష్ఠల కోసమేదయినా మంచి పనిని నిర్వర్తించడం దేవుని యాతనను ఆహ్వానించడమే. ఇటువంటి చేష్టల వల్ల ఆయన ఆగ్రహం ప్రజ్వలిస్తుంది. దీనికి అందే అభిశాపాన్ని గురించి చెబుతూ అబూ హురైరా (ర) మాటిమాటికీ స్పృహతప్పిపోయారు, హజ్రత్ ముఆవియా (ర) దీన్ని విని భోరుభోరున వగిచారు.

హజ్రత్ అబూ హురైరా (ర) ఉల్లేఖించిన దాని ప్రకారం దైవసందేశహరులు (స) ఇలా సెలవిచ్చారు: ప్రళయంనాడు అల్లాహ్ తన దాసుల ఆచరణల తీర్పు చేయడానికి కొలువుదీరినప్పుడు మొదట మూడు రకాల మనుషుల తీర్పు చేస్తాడు. వీరిలో ఒకరు షహీద్ (అమరగతి పొందినవాడు). అతను ముందుకు వచ్చినప్పుడు పరమ ప్రభువు అతనికి ప్రపంచంలో ప్రసాదించిన శక్తిసామర్థ్యాలు, బలాలను గురించి జ్ఞాపకం చేస్తాడు. అతను వాటిని అంగీకరిస్తాడు. దాని మీదట అతన్ని ప్రశ్నించడం జరుగుతుంది- ఈ ఉపకారానికి నీవు ఏ విధంగా కృతజ్ఞతాభివందనాలు తెలుపుకున్నావు, నీ శక్తిసామర్థ్యాలను ఎక్కడ వినియోగించుకున్నావు అని. దానికి అతను ఇలా విన్నవించుకుంటాడు. ప్రభువా, నీవు జిహాద్ చేయమని ఆదేశించావు, నేను దాన్ని పాలించాను. నా శక్తుల్ని నీ మార్గాన వినియో గించాను. నీ శత్రువులతో పోరాడుతూ ప్రాణాలు అర్పించుకున్నాను. అప్పుడు పురమా యించబడుతుంది- అబద్ధం పలుకుతున్నావు, నీవు జిహాద్ చేసింది నిన్ను సాహసో పేతుడని, మహాయోధుడని ప్రస్తుతించాలని. ప్రపంచంలో నీ ధైర్యసాహసాలను, శౌర్యాలను బాగా పొగిడారు, పేరుప్రతిష్ఠలు ప్రాప్తించాయి, నీ ఉద్దేశ్యం నెరవేరింది, అని చెప్పిన తరువాత, ఇతన్ని బోర్లా లాక్కుపోయి నరకంలో పడవేయవలసిందని ఆజ్ఞాపించడం జరుగుతుంది.

రెండవ వ్యక్తి పండితుడు, ఖుర్ఆన్ జ్ఞాని. పరమ ప్రభువు అతనికి జ్ఞాపకం చేస్తాడు, మేము నీకు మా గ్రంథజ్ఞానం ఇప్పించలేదా? అతను దాన్ని అంగీకరిస్తాడు. అప్పుడు. నీవు దానికి ఏ విధంగా కృతజ్ఞత తెలుపుకున్నావు అని ప్రశ్నించడం జరుగుతుంది. అతను విన్నవించుకుంటాడు, నీవు నాకు అనుగ్రహించిన జ్ఞానాన్ని నేను బాగా వ్యాపింపజేశాను. దివ్యఖుర్ఆన్‌ని పఠించాను, కంఠస్థం చేసుకున్నాను, రేబవళ్ళు దాన్ని పారాయణం చేశాను. అప్పుడు ఇలా సెలవీయబడుతుంది, నీవు అబద్ధం పలుకు తున్నావు. నీవు ఇదంతా చేసింది నిన్ను పండితుడని, ఖుర్ఆన్ జ్ఞాని అని పేరు ప్రతిష్ఠలు లభించాలని మాత్రమే. నీకు ఆ ప్రతిష్ఠ ప్రాప్తమయింది. నీకు లభించవలసిన ప్రతిఫలం ప్రాప్తమయింది. అప్పుడు ఆదేశమవుతుంది, బోర్లాపడవేసి లాక్కుపోయి ఇతన్ని కూడా నరకంలో పడవేయవలసిం దని. అతన్ని అలానే పడవేస్తారు. మూడవ వ్యక్తి స్థితిపరుడు, శ్రీమంతుడయిన వ్యక్తి, అతన్ని ముందుకు తెస్తారు. మేము నిన్ను అన్ని విధాలా సుసం

పన్నం చేయలేదా ధనవంతుణ్ణిగా చేయలేదా అని అల్లాహ్ అడుగుతాడు. అతను అల్లాహ్ మహోపకారాలను అంగీకరిస్తాడు. అయితే నీవు ఆ మహోపకారాలకు బదులుగా చేసినదేమిటీ అని ప్రశ్నించడం జరుగు తుంది. అతను విన్నవించుకుంటాడు, నేను బంధువులయిన అగత్యపరుల్ని ఆదుకున్నాను. సత్కార్యాల్లో ధనం ఖర్చుపెట్టాను. అప్పుడు సెలవీయబడుతుంది. నీవు చెప్పేదంతా అబద్ధం, నీవు ఇదంతా చేసింది అందరూ నిన్ను అన్నదాత అని, దానగుణంగలవాడని పొగడాలని మాత్రమే. అదికాస్తా నెరవేరింది. ప్రపంచంలో నీ దాతృత్వపు ప్రచారం బాగా జరిగింది. ఆ తరువాత అతన్నీ బోర్లా లాక్కుపోయి నరకంలో విసిరివేయడం జరుగుతుంది.★

ప్రదర్శనాబుద్ధిగల దేవుని దాసులను ప్రప్రథమంగా ఏ విషయాన్ని గురించి ప్రశ్నించడం జరుగుతుందో వాటి సంబంధం కొన్ని ప్రముఖ ధార్మిక సేవలతో ఉంటుంది. జ్ఞానాన్ని విస్తరింపజేయడం, సత్కార్యాల్లో ధనాన్ని వెచ్చించడం, దైవధర్మాన్ని సంస్థాపించడానికీ, ఆధిక్యత కల్పించడానికీ, ప్రపంచం నుండి దుర్మార్గాన్నీ దౌర్జన్యాన్ని అంతమొందించడానికీ, సతత సమరం జరుపడానికీ, ప్రాణాలొడ్డి పోరాడటం వంటి మహత్తర సేవల వెనక పేరు ప్రతిష్ఠలు పొందే భావం ఉన్నట్లయితే కేవలం ఆ సత్కార్యాల పుణ్యఫలం వృథాపోవడం మాత్రమేకాక మనిషి దేవుని ఆగ్రహానికి పాత్రుడయ్యే ప్రమాదమూ ఉంటుంది.

ఏ ఆచరణయితే చిత్తశుద్ధి లేనిదయి, దైవేతరుల్ని ప్రసన్నపరచడానికి చేయబడుతుందో, హదీసు ప్రకారం, అల్లాహ్ దానితో తనకు సంబంధం లేదని, అది తనకు ఇష్టం లేనిదని ప్రకటిస్తాడు. హజ్రత్ అబూ హురైరా (ర) ప్రకారం దైవసందేశహరులు (స) ఇలా ప్రవచించారు:

قال اللـه تبارک تعالٰی انا اغنی الشرکاء عن الشرک من عَمِل عملا اشرک فیـــه معی غیری ترکتـه و شرکـــه

**దేవుడు ఇలా సెలవిస్తున్నాడు, ఇతరులు భాగస్వాములుగా ఎంచబడే వారిలోకెల్లా నేను అందరికన్నా అధికంగా భాగస్వామ్యానికి అతీతమయినవాణ్ణి. ఒకరు ఏదయినా ఆచరణ చేసి అందులో నాతోపాటు ఇతరుల్నీ సహవర్తులుగా చేసినట్లయితే నేను**

★ ఈ హదీసు 'ముస్లిమ్' లో కాస్త క్లుప్తంగా ఉంది: కితాబుల్ ఇమార, బాబ్ మన్‌కాత్‌ల లిర్రియాయి, వస్సుమ్అ; తిర్మిజీలో పూర్తి వివరణ ఉంది. అబ్వాబుజ్జుహ్ద్, బాబ్ మా జాఅ ఫిర్రియా వస్సుమఅ.

**అతన్నీ అతని సహవర్తినీ (వారి మానాన వారిని) వదలి వేశాను.★**

భావమేమిటంటే ఏ ఆచరణ అయితే దైవంతోపాటు ఇతరుల్నీ దృష్టిలో ఉంచుకుని మరీ చేయబడుతుందో దాని అవసరం అల్లాహ్‌కు ఎంతమాత్రం ఉండదు. ఆయన, ఏ ఆచరణ చేసినా తన ఆదేశాలను పూర్తిగా అనుసరిస్తూ చేయాలని, కేవలం ఆయన కొరకే చేయాలని కోరుకుంటాడు. ఆయన స్వాభిమానం ఇతరుల భాగస్వామ్యాన్ని ఎంతమాత్రం ఇష్టపడదు, కొంత ఆయన కోసం మరికొంత ఇతరుల కోసం జరగడం ఆయన ఇష్టపడడు. ఏ పనయితే, ఆయనతోపాటు ఇతరులూ సంతోషపడాలని చేయబడుతుందో దాన్ని ఆయన వారి కోసమే వదలిపెడతాడు, దానికి తాను పూర్తిగా వేరయిపోతాడు. ఈ ఉల్లేఖనంలో చివరి వాక్యంలోని పదాలు కొన్ని ఉల్లేఖనాల్లో ఇలా కనిపిస్తాయి.

**من عمل عملا اشرک فیه غیری فانا منه بریء وهو للذی اشرک**

**ఎవరయితే ఒక సదాచరణను చేసి నాతో పాటు ఇతరుల్నీ అందులో భాగస్వాములుగా చేస్తాడో అటువంటి ఆచరణతో నాకు సంబంధంలేదు. ఆ ఆచరణ ఎవరిని సహవర్తిగా ఎంచి చేయడం జరిగిందో అది వారికే వర్తిస్తుంది.★★**

పరమ ప్రభువు అల్లాహ్ చాలా స్వాభిమానంగలవాడు. ఆయన షిర్క్, బహుదైవ భావనను ఎంతమాత్రం భరించడు. ఆయన ప్రతి ఆచరణలో చిత్తశుద్ధిని కోరుకుంటాడు. కేవలం ఆయన ప్రసన్నతే కాక ఇతరుల సంతోషమూ ఆశించబడే ఆచరణ ఆయనకు స్వీకారయోగ్యం కాదు. దీని వల్ల ఇతరులు సంతసించడం సాధ్యమేనేమో కాని, పరమ ప్రభువు అల్లాహ్ ప్రసన్నత ప్రాప్తం కాదు.★★★



---

★ *ముస్లిమ్: కితాబుజుహ్ద్, బాబ్‌తహ్రీముర్రియా.*

★★ *ఇబ్నుమాజా, అబ్వాబుజ్జుహ్ద్, బాబుర్రియా వస్సుమ్అ; ముస్నద్ అహ్మద్: 2/301, 434.*

★★★ చిత్తశుద్ధి అంశంపైన మరిన్ని వివరాలకు రచయిత పుస్తకం 'ఇస్లామ్‌లో సంఘ సేవ'లో 'చిత్తశుద్ధి' అనే చర్చ చదవండి.

# స్థిరచిత్తం

## విశ్వాసం, స్థిరత్వం

ఈమాన్ (విశ్వాసం), ఇస్తికామత్ (స్థిరత్వం) అన్న ఈ రెండు పదాలు ఇస్లామ్‌కు సారాంశం. ఇస్లామ్ మానవుని జీవితం మొత్తాన్ని ఆవరించి ఉంది. అది ఈ రెండు పదాలలో ఇమిడిపోయింది. విశ్వాసం అన్నది నమ్మకానికి సంబంధించిన విషయమయితే స్థిరత్వం అన్నది ఆచరణతో సంబంధమున్న విషయం. ఇలా నమ్మకాన్నీ ఆచరణనూ కలిపితే మానవుని ధర్మం పరిపూర్ణమవుతుంది. ఆపైన మనిషికి ధర్మానికి సంబంధించి నంత వరకు మరే విషయమూ అవసరముండదు. మనందరి కృషికి లక్ష్యం, అల్లాహ్ ప్రసన్నతను, పరలోక సాఫల్యతను సాధించడమే. ఖుర్‌ఆన్ ప్రకారం ఇది కేవలం విశ్వాసం, స్థిరత్వం ద్వారానే ప్రాప్తమవుతుంది. రాబోతున్న భయంకర దినం ప్రమాదాన్నుండి మనిషికి రక్షణ కావాలంటే, దైవదూతలు అతనికి స్వర్గశుభవార్త అందజేయాలంటే ఒకటే మార్గం, అతనికి ప్రపంచంలో విశ్వాసం, స్థిరత్వాల జీవితం ప్రాప్తమయి ఉండాలి.

إِنَّ الَّذِينَ قَالُوا رَبُّنَا اللَّهُ ثُمَّ اسْتَقَامُوا تَتَنَزَّلُ عَلَيْهِمُ الْمَلَٰئِكَةُ أَلَّا تَخَافُوا وَلَا تَحْزَنُوا وَأَبْشِرُوا بِالْجَنَّةِ الَّتِي كُنتُمْ تُوعَدُونَ ۝ نَحْنُ أَوْلِيَاؤُكُمْ فِي الْحَيَوٰةِ الدُّنْيَا وَفِي الْآخِرَةِ وَلَكُمْ فِيهَا مَا تَشْتَهِي

ఎవరయితే, మా ప్రభువు అల్లాహ్ అని పలికి ఆపైన దానిపైనే స్థయిర్యం కనబరుస్తారో వారికి దైవదూతలు అవతరించి మీరు భయపడకండి, ఖేదపడకండి, మీకు శుభవార్తనిస్తున్నాము స్వర్గం ప్రాప్తమవుతుందని, దాన్ని గురించి మీకు వాగ్దానం చేయడం జరిగింది, ప్రపంచంలోనూ మేము మీకు మిత్రునిగా ఉన్నాము, పరలోకంలోనూ ఉంటాము. స్వర్గంలోనయితే మీకొరకు మీరు కోరుకునేదల్లా ఉంటుంది.

اَنْفُسُكُمْ وَلَكُمْ فِيْهَا مَا تَدَّعُوْنَ○ نُزُلاً مِّنْ غَفُوْرٍ رَّحِيْمٍ○

(حٰمٓ السجدة:٣٠-٣٢)

మీరు అడిగిందల్లా ఇక్కడ మీకు ప్రాప్తమవుతుంది. ఇది క్షమాశీలుడు, కరుణామయుడు ఇచ్చే ఆతిథ్యం.

*(హామీమ్ అస్సజ్దా : 30–32)*

హజ్రత్ సుఫ్యాన్ బిన్ అబ్దుల్లా సల్ఫీ తనకూ మనకూ ప్రపంచం మొత్తానికీ మహోపకారి అయిన మహనీయ ముహమ్మద్ (స)ని అభ్యర్థించారు, ప్రవక్తశ్రీ, ఇస్లామ్‌ను గురించి నాకు ఏదయినా ఒక మాట చెప్పండి. మిమ్మల్ని అడిగిన తరువాత ఇక నాకు మరెవరినీ అడిగే అవసరం ఉండకూడదు అని. దానికి ఆయన ఇలా సెలవిచ్చారు:

قُلْ اٰمَنْتُ بِاللّٰهِ ثُمَّ اسْتَقِمْ

నేను దైవాన్ని విశ్వసించాను అని పలుకు. ఆపైన దాని మీద స్థిరత్వం కనబరచు.★

ఇస్లామ్ పిలుపునకు కావలసిన ప్రాథమిక లక్షణాల ప్రస్తావన దైవవిశ్వాసంతో ప్రారంభించబడింది, వాటి ముగింపు స్థిరత్వంతో చేయబడుతోంది.

## విశ్వాసం, స్థిరత్వాల సంబంధం

దైవాన్ని విశ్వసించడం ఒక మహత్తరమయిన విప్లవం. అది మానవుని ఆలోచన, ఆచరణల జగత్తులో వ్యక్తమవుతుంది, దాన్ని పూర్తిగా మార్చివేస్తుంది. ఈ విప్లవం ఏదో తాత్కాలిక భావోద్వేగంతో జనించేది కాదు. నిజానికి ఇది సరయిన భావంలో రూపుదాల్చినపుడు అది చివరి క్షణం వరకూ నిలిచి ఉంటుంది. విశ్వాసపు జీవితం అంటే సత్యం మీద నిలకడ చూపే జీవితం. ఒక వ్యక్తి పూర్తి చేతనతో విశ్వసించినట్లయితే అతనికి స్థిరత్వమూ ప్రాప్తమవుతుంది. అతనికి ప్రాప్తమయ్యే ఆత్మ జీవితంలో కనబరిచే సంకల్ప నిరతి, సాహ సాలను ప్రపంచంలోని ఏ శక్తీ జయించజాలదు. అతను ఎట్టి పరిస్థితిలోనూ సత్యం మీద నిలకడగానే ఉంటాడు. ఎంత పెద్ద భయమయినా మరెంత గొప్ప ఆశ అయినా అతన్ని సత్యమార్గాన్నుంచి తొలగించజాలదు.

అల్లాహ్‌ను నమ్మిన దాని ఆవశ్యకత ఏమిటంటే, మానవుని పూర్తి ఉనికి మీద ఆయన పరిపాలనే నెలకొనాలి. మనిషి తీసుకునే ఒక్కొక్క చర్య కూడా అల్లాహ్ ఇష్టానికి కట్టుబడే ఉండాలి. తన జీవితమే మానవుని అన్నింటికన్నా విలువయిన సొత్తు. విశ్వాసం గల ఒక వ్యక్తికి, తన ఈ విలువయిన సొత్తును అల్లాహ్ పేరిట త్యాగం చేయవలసి

★ సహీహ్ ముస్లిమ్, కితాబుల్ ఈమాన్, బాబ్‌జామి'ఔసాఫుల్ ఇస్లామ్.

వస్తే చేయగల సాహసం, సంకల్పం ఉండాలి. ప్రతి వ్యక్తీ ఈ ప్రపంచంలో సుఖభోగాలను కోరుకుంటాడు. విశ్వాసి అల్లాహ్ కొరకు తనకు ప్రీతిపాత్రమయిన ప్రతి విలాసమయ సుఖాన్నీ విరమించుకుంటాడు. ధనం, సంపాదన కొరకు ప్రతి వ్యక్తీ పరిభ్రమిస్తుంటాడు. దీన్ని ఏ వ్యక్తీ వదలుకోవడానికి ఇష్టపడదు. ఈ విషయంలోనూ విశ్వాసి తన్ను తాను దీని చిక్కులకు గురి చేసుకోనన్న తీర్మానానికి రావాలి.

జీవితపు ఆశలు, ధన వ్యామోహం, సుఖభోగాల ఆకాంక్ష మానవుణ్ణి త్యాగాలకు దూరంగా ఉంచుతుంది. కాని వాస్తవానికి విశ్వాసపు సోపానాలు నిరంతర త్యాగాలతోనే సిద్ధిస్తూ ఉంటాయి. ఇక్కడ తన కోసం అన్నీ భద్రపరచుకునే వ్యక్తి కాదు సమస్తం పొందిన వాడు, తనకు చెందినదంతా ధారపోసినవాడే సర్వమూ పొందేవాడు. పరమ ప్రభువు పట్ల ప్రేమ కడమ ప్రేమలన్నింటిపైనా ఆధిక్యతగా పొందిననాడు సౌభాగ్యవంతుడు. దేవుని అప్రసన్నతకు కారణమయ్యే ప్రతిదానినీ దైవప్రసన్నత కొరకు వదలుకునే వ్యక్తి సౌభాగ్య వంతుడు.

అల్లాహ్ మనల్ని పుట్టించిన తీరులో విశ్వాస మార్గం పూర్తిగా తేలికయినదిగా చేయబడలేదు. మన ఆంతర్యంలో, ఆ మార్గం నుండి విద్రోహం, తిరుగుబాటు భావాలు సహజంగానే ఉన్నాయి. మనకు విశ్వాస జీవితం ప్రాప్తం కావాలంటే మనం మన ఆంతర్యంలోని ఈ తిరుగుబాటును అణగద్రొక్కడంలో విజయం సాధించినప్పుడే సాధ్యం. ఈమాన్ లేక విశ్వాసం కోరే జీవితం సుఖంగా, సౌలభ్యంగా ప్రాప్తమయ్యేదికాదు. దాని కొరకు కఠిన సాధన, తీవ్ర సంఘర్షణ జరపవలసి ఉంటుంది. మన ఆంతర్యం కోరే అన్నింటికన్నా పెద్ద కోరిక అది స్వేచ్ఛగా ఉండాలన్నది. దానికి దాని వాంఛల పరిపూర్తికి ఎటువంటి అవరోధాలు ఉండరాదన్నది. కాని విశ్వాసం పరిధుల్లేని జీవితం గడిపే అనుమతినివ్వదు. అది మనల్ని దేవుని ఇష్టాయిష్టాలకు కట్టుబడి ఉండాలని నిర్ణయిస్తుంది.

మన చుట్టూ నలువైపులా వ్యాపించి ఉన్న ప్రపంచంలో చాలా ఆకర్షణ, మక్కువ లున్నాయి. మన ఆంతర్యం ఎట్టి పరిస్థితిలోనూ దాన్ని పొందాలని కోరుకుంటుంది. దానికి మన విశ్వాసం కుదువపెట్టవలసివచ్చినా అంగీకరిస్తుంది. మనకు మన విశ్వాసమే అన్నింటికన్నా విలువయిన సొత్తు అయినట్లయితే ఈ రుచులు నిండిన ఆకర్షణీయమయిన ప్రపంచం పొందును కోరుకోరాదు, దాని విసర్జన కొరకు అల్లాహ్ ఆదేశాల పాలన చేయడం అవసరం. ఇది వాస్తవంగా నిశ్చయంగా చాలా కష్టసాధ్యమయిన పనే. కాని ఎవరయితే అల్లాహ్‌ను ప్రసన్నునిగా చేసుకోదలుస్తాడో అతను తప్పనిసరిగా ఈ కష్టతర మయిన పనిని నిర్వర్తించవలసే ఉంటుంది. దాన్ని జీవితాంతమూ నిర్వర్తించవలసి ఉంటుంది.

## ధర్మం వైపునకు పిలుపు స్థిరత్వాన్ని కోరుతుంది

ధర్మసందేశం స్థిరత్వాన్ని కోరుతుంది. దీనిగ్గాను మనిషి తన ఆంతర్యంపైన పూర్తిగా పట్టు, అదుపును సాధించాలి. అతని సంకల్పబలం పటిష్ఠమయినదయి ఉండాలి. మనో కాంక్షలు అతన్ని తమ వైపునకు లాగుతున్నా వాటిని తృణీకరించి సత్యానికే అంకితమయి పోవాలి. అతనికి తన విశ్వాసం పట్ల ఎంతో ప్రేమ అభిమానాలుండాలి, ఆ ప్రేమను ప్రపంచం ఎట్టి పరిస్థితిలోనూ, ఏ మూల్యం చెల్లించి అయినా కొనగలిగేలా ఉండరాదు. ఈ స్థిరత్వం, నిలకడలు లేనిదే నోటిపైన ధర్మం పేరు మాటిమాటికీ వస్తూ ఉన్నా దాని మార్గాన్ని అవలంబించడం, ధైర్యంతో స్థిరత్వంతో దానిపైన నడవగలగటం సులభం కాదు.

## స్థిరత్వం - చివరి శ్వాస వరకు

దైవమార్గంలో స్థిరత్వం అన్నది ఏదో తాత్కాలికంగా వాంఛనీయం కాదు. దాన్ని జీవితపు చివరి శ్వాస వరకు కొసాగించవలసి ఉంటుంది. తాత్కాలికమయిన ఉద్వేగం, ఉత్సాహాలను ప్రపంచంలోని అతి అల్పమయిన లక్ష్యం కూడా పుట్టించగలదు. కాని ఇస్లామ్ మానవునిలో పటిష్ఠమయిన సుస్థిరమయిన విప్లవాన్ని కోరుతుంది. అది ఏదో ఒక ప్రత్యేక సమయాన ప్రత్యేక వ్యవహారంలో మటుకే త్యాగాన్ని కోరదు. ప్రతి వ్యవహారంలో అన్ని స్థితుల్లో త్యాగాన్ని కాంక్షిస్తుంది. తాత్కాలికమయిన ఉద్వేగభావం వల్ల పెద్ద పెద్ద త్యాగాలు సులభమే కాని ఏదయినా ఒక చిన్న విషయాన్నే సరి చిరకాలానికిగాను తన జీవితం నుండి వేరుచేసుకోవడం సులభం కాదు.

ఒక వ్యక్తి ఒక తాత్కాలిక వాతావరణం వల్ల ప్రభావితుడయి చిత్రవిచిత్రమయిన త్యాగాలను ప్రదర్శిస్తాడు. కాని కొంత కాలం కూడా గడవకమునుపే అతని ఈ ఉద్రేకం, ఉద్వేగం చల్లారిపోతాయి. తన సొత్తునయినా తన ప్రాణాలనయినా లెక్కచెయ్యని వ్యక్తి ధనప్రాణాల కొరకు చింతాగ్రస్తుడయిపోతాడు. విశ్వాస భావాలతో ఉద్వేగాలతో నిండి ఉండే గుండె దాని వేడిమిని కోల్పోతుంది. ధర్మప్రేమలో రేబవళ్ళు జాగరణ చేసే సిపాయి తన కార్యకలాపాల్లో ఎంతగానో నిమగ్నమయిపోయి ధర్మం కొరకు ఒక గంటనయినా కేటాయించలేని స్థితికి చేరుకుంటాడు. తన కార్యకలాపాల్లో ఎంతగా నిమగ్నమయి ఉన్నప్పటికీ ధర్మం పట్ల ఒక్క క్షణకాలంపాటు కూడా ఏమరుపాటుకు గురికాని వ్యక్తి తన విశ్రాంతి సమయాల్లోనూ అల్లాహ్‌ను, ఆయన ధర్మాన్నీ అతి స్వల్పంగానే గుర్తు చేసుకోగలుగుతాడు. పేదరికంలోనూ లేమిలోనూ ధార్మిక అవసరాలను మరువని వ్యక్తి సుసంపన్నత ప్రాప్తమయిన తరువాత కూడా ఆ అవసరాలను మరచిపోతాడు. ధార్మిక

చింతనలో తన సుఖశాంతులను సయితం మరచిపోయే వ్యక్తి తన దైనందిన కార్య క్రమాలను సయితం మార్చడాన్ని ఇష్టపడడు.

ఇవన్నీ సూచించేదేమిటంటే ఇవన్నీ తాత్కాలికమయిన ఉద్రేకం, ఉద్వేగాల, అస్థిర ప్రేరణల ఫలితాలన్న మాటే కాని అతను వాటిని తన విశ్వాసం పట్లగల ప్రేమ ఫలితమని అనుకునేవాడు. నిజానికి, విశ్వాసం అన్నది వాస్తవంగానే ఆంతర్యంలో పాదుకున్నట్లయితే అడుగడుగునా త్యాగనిరతి పెరుగుతూనే ఉంటుంది. విశ్వాసపు కమ్మదనం రేబవళ్ళ పరిభ్రమణం వల్ల తక్కువ కాదు, వచ్చే ప్రతి దినం అందులో ఆధిక్యతనే కలగజేస్తూ ఉంటుంది.

దైవధర్మం నేడు తన అనుయాయుల్ని పిలుస్తోంది. వారిని ధర్మసందేశాన్ని సర్వ సామాన్యం చేయడానికి, దాని సమున్నతి కొరకు కృషి చేయడానికి అది పిలుపునిస్తోంది. వారు ఈ మార్గాన తమ శక్తినంతటినీ వెచ్చించాలని, తమను ఈ మార్గానికే అంకితం చేసుకోవాలని అది ఆశిస్తోంది. విశ్వాస జీవితం సన్యాసత్వ జీవితం కాదు. మనిషి ఏదయినా మూలన కూర్చొని దైవధ్యానంలో మత్తుగొని, తన అంతర్గత స్థితులలో తప్పి పోయి బయటి ప్రపంచంలో జరుగుతున్నదేమిటో ఎరుగనయినా ఎరుగక జీవించాలని అది కోరదు. విశ్వాసం అంటే ప్రాణాలొడ్డి, మనఃపూర్వకంగా దైవదాస్యంలో నిమగ్న మవడాన్ని అంటారు, అదే మార్గాన నిరంతర కృషి జరపడాన్ని అంటారు. ఎవరయినా తన ఆంతర్య స్థితిగతులలో తప్పిపోయి దైవధర్మం పట్ల చింత కూడా అతనికి కలగకపోతే అతను ఆ స్థితిగతుల ఆరాధనకు లోనయ్యాడని అర్థం. అతను అల్లాహ్ ఆదేశాలకు కాదు తన మానసిక స్థితులకు దాసుడయిపోయాడని అర్థం.

## సందేశం ఒక నిరంతర ప్రక్రియ

అల్లాహ్‌ను విశ్వసించడం, దానంతట అదే ఓ విప్లవాత్మక సందేశాన్ని కలిగి ఉంటుంది. విశ్వసించే వ్యక్తి సహజంగానే ఆ విప్లవానికి ధ్వజవాహకుడయిపోతాడు. మానవుల్లో దైవం కోరే పరివర్తనకు ఆలోచనాత్మకమయిన, ఆచరణాత్మకమయిన మార్పునకు విశ్వాసి మాధ్యమంగా, సాధనంగా రూపొందుతాడు. ఏ మానవుల వరకు సత్యవాక్కు చేరలేదో వారి వరకు దాన్ని చేరవేసే బాధ్యత అతనిదే. దైవాన్ని మరచి నిద్రపోతున్న జనావళిని మేల్కొల్పడం అతనికి విధిగా రూపొందుతుంది. మానవాళి ఏ సత్యాలను, యదార్థాలను గురించి ఎరుగకపోయి నిశ్చింతగా ఉందో దాన్ని ఆ యదార్థా లను గురించి తెలుపడం అతని విధ్యుక్త ధర్మమయిపోతుంది.

విశ్వాసాన్ని ప్రకటించిన మనిషి కొన్ని విషయాలను పొందాడు, మరికొన్ని విషయాలను కోల్పోయాడు. ఇలా పొందడమయినా కోల్పోవడమయినా అతను సచేతనంగా చేసిన క్రియ. అతను పొందినదేదయినా అది అతని సంకల్పం లేనిదే అతనికి దొరకలేదు. అలాగే అతను ఏది కోల్పోయినా అది కూడా అతను దాన్ని ఏమరుపాటు వల్లనో లేక అచేతనావస్థలోనో కోల్పోలేదు. అసంఖ్యాక జనం పిచ్చిగా ఏ ప్రపంచ వ్యామోహంలో పడి రేయింబవళ్ళు గడుపుతున్నారో దాన్ని అతను ఇట్టే, అకారణంగా వదలుకోలేదు. కేవలం దైవప్రసన్నత కొరకే వదలుకున్నాడు. అతను తన మనోకాంక్షలను ఉద్దేశ్య రహితంగా అణచివేయలేదు, దేవుని పట్ల ప్రేమ వల్లనే అణగద్రొక్కాడు. అతను తనకూ తన కుటుంబానికి లభించే ప్రయోజనాలను నిష్కారణంగా నష్టపరచుకోలేదు. దైవ ప్రేమను ఆకాంక్షిస్తూ ఆ నష్టాన్ని కొనిదెచ్చుకున్నాడు.

విశ్వాసి, తాను తీసుకున్న ఈ చర్యలన్నింటినీ సత్యమయినవిగా, ధర్మమయినవిగా భావిస్తే ఈ సత్యం కోరే ఆవశ్యకతననుసరించి అతను దాన్ని ఇతరులకు చేరవేయడం అతని ధర్మం, తనలో ఏర్పడిన విప్లవాన్ని ఇతరుల్లోనూ చెలరేపే అపారమయిన తపన అతని ఆంతర్యంలో కట్టలు తెంచుకుని పారాలి. తాను ఏ ఆలోచనల్ని, ఏ ఆచరణల్ని, పరిత్యజించాడో ప్రపంచం మొత్తం వాటికి దూరమవ్వాలన్న ఆకాంక్ష అతనిలో నెలకొనాలి. ఏ భావాల వల్ల, ఏ సదాచారాల వల్ల అతనిలో వెలుగులు ప్రసరిస్తున్నాయో వాటి ద్వారా ఇతరుల జీవితాలూ దేదీప్యమానమవ్వాలని అతని ఆకాంక్ష కాగలగాలి. మనిషి చెవుల్లో దేవుని పట్ల విద్రోహం, తిరుగుబాటు ధోరణులు ప్రతిధ్వనిస్తూ ఉండగా వాటిని రూపుమాపే ఏ అసహనత, ఏ వ్యాకులత అతనిలో కలగకపోవడం అన్నది అతని విశ్వాసానికి, అభిమానానికి వ్యతిరేకమయిన విషయం. ధర్మాన్ని విశ్వసించిన తరువాత ప్రజలకు ధర్మసందేశం అందజేసే విధి, మనిషిపైన దానంతట అదే విధ్యుక్తమవుతుంది. ఇది బలవత్తర మయిన స్థిరచిత్తాన్ని కోరుతుంది. అల్లాహ్‌ను విశ్వసించడం, ఆయన ధర్మానికి ధ్వజవాహకులవడం సాధారణమయిన విషయం కాదు. ప్రపంచం అంతటా వ్యాపించి ఉండే పైశాచిక శక్తులపైన సవాలు విసరడం వంటిది. ఇది మిథ్యాశక్తులను పోరునకు ఆహ్వానించడం వంటిది. అందువల్ల మిథ్యాశక్తులు తమ శక్తులన్నింటినీ కూడదీసుకుని దీన్ని అణగద్రొక్కడానికి ఆచరణా రంగంలోకి దిగిరావడం అసంభవమేమీ కాదు. ధర్మసందేశకుడు అత్యంత కఠిన పరిస్థితుల్ని ఎదుర్కోవలసి రావచ్చును. సాధ్యమయిన ప్రతి విధానాన్ననుసరించి అతన్ని పరీక్షించడం కూడా సాధ్యమే.

నేడు అన్ని వైపులా ఆలోచన, ఆచరణల స్వేచ్ఛ కావాలన్న రాగాన్ని ఆలపించడం జరుగుతోంది. అయినప్పటికీ దైవధర్మాన్ని దాని నిజరూపంలో చూడటానికి ప్రపంచం ఎంతమాత్రం ఇష్టపడటం లేదు, దాన్ని భరించడానికీ సిద్ధంగా లేదు. ప్రపంచం ధర్మాన్ని, నమాజ్, రోజా, మానవుని వ్యక్తిగత జీవితం వరకు పరిమితం చేయాలని కోరుకుంటోంది. నిత్య జీవన కార్యకలాపాలతో ధర్మానికి సంబంధం కల్పించడానికి ఎట్టి పరిస్థితిలోనూ సిద్ధంగా లేదు. వాస్తవానికి, సత్యాన్ని భరించడం, సహించడం అన్నది మిథ్యాశక్తులకు సహజసిద్ధంగానే, వాటి నైజానికి విరుద్ధమయిన విషయం. దాన్ని ప్రవర్ధమానమయ్యేందుకు అంగీకరించడం కూడానా? తమ నమ్మకానికనుగుణంగా వ్యక్తి సంస్కరణను, సమాజ నిర్మాణాన్ని చేపట్టిన సత్యకాముకులను సుఖంగా నిద్రపోయేందుకు ఎన్నడూ అవకాశం కల్పించదు. దేవుని ఈ సువిశాల భూమి వారి కొరకు కుంచించుకుపోయేలా చేస్తారు. మైత్రిని ప్రకటించేవారు కూడా శత్రువుల శ్రేణిలో నిలుస్తారు. ఇటువంటి సున్నిత పరిస్థితులను గురించి చెబుతూనే ప్రవక్త మహనీయులు (స) తన సన్నిహిత సహచరులు మహనీయ ముఆజ్ (ర)కు ఇలా ఉపదేశించారు:

لاَ تُشْرِکْ بِاللّٰهِ شَيْئًا وَّ اِنْ قُتِّلْتَ اَوْ حُرِّقْتَ (مسند احمد)

**అల్లాహ్‌తోపాటు మరెవరినీ, మరే వస్తువునూ సహవర్తిగా ఎంచకు, నిన్ను హత్య చెయ్యడం జరిగినా, నిన్ను సజీవ దహనం చేసినా సరే. *(ముస్నద్ అహ్మద్)***

ధర్మసందేశకునిలో దృఢసంకల్పం, సాహసోపేత నిర్ణయం ఉండాలి– తాను ఎట్టి పరిస్థితిలోనూ ఒకే ఒక్క దైవానికి దాసదాసుడనయి జీవిస్తానని, బొందిలో ప్రాణం ఉన్నంత వరకు ఆయన ఆదేశాలకు వ్యతిరేకంగా నడవనని, ఫలితంగా తన తల మొండెం నుండి వేరు చేయబడినా సరే, లేక తనను కాల్చి బూడిద చేసివేసినా సరే.

## స్థిరత్వపు దారి కఠినమయినది

స్థిరత్వపు మార్గం కఠినతరమయిన మార్గం. ఇందులో మహా గొప్ప సంకల్ప నిరతుల పాదాలు తడబడుతాయి. మనిషి పైన అన్ని వైపుల నుండి కష్టాలు విరుచుకు పడినప్పుడు, అల్లాహ్ నిర్ణయానుసారం అతన్ని పరీక్షించడం జరిగినప్పుడు, అతను గాభరాపడతాడు, అతను సత్యాన్ని విడవగోరడు కాని త్యాగభావాలు అతనిలో చల్లారి పోతాయి. అతను పరీక్షలు లేకుండానే దేవుని స్వర్గాలను పొందగోరుతాడు. నిజానికి దైవ

నియమానుసారం, ఆయన ఎవ్వరినీ పరీక్షించకుండా ఆ వరాల గృహంలో ప్రవేశించ నివ్వడు. మానవుని సంబంధం సత్యంతో బలహీనపడినప్పుడు అతని ఆలోచనా విధానం మారిపోతుంది. అతని మానసిక స్థితి మారిపోతుంది. అతను భౌతికంగా బ్రతికి ఉన్నా అతని భావనాత్మక మృత్యువు అప్పటికే సంభవించి ఉంటుంది. అతను, తన నుంచి సత్యం కోరేదేమిటని గమనించడు, బదులుగా ఇతరులు చేస్తున్నదేమిటో గమనిస్తాడు. ఇటువంటి వ్యక్తికి అతని బాధ్యతలను గుర్తు చేస్తే అతను ఆ బాధ్యతలను నిరాకరించడు. దానికి బదులుగా తనకు ఉపదేశించే వ్యక్తి జీవితాన్ని విశ్లేషించడం మొదలెడతాడు. తద్వారా ఆ వ్యక్తి కూడా తన బాధ్యతల్ని మరచిపోయాడని, తనకు ఉపదేశాలనందజేస్తూ తన్ను తాను మరచిపోయాడని తెలిపే ప్రయత్నం చేస్తాడు. సత్యం తన ధనప్రాణాల త్యాగాన్ని కాంక్షిస్తుందని ఎవరయినా గుర్తు చేస్తే అతను తన ధనప్రాణాలు సత్యం కన్నా తనకు ప్రియప్రదమయినవని చెప్పడు. అతను సమాధానంగా ఫలానా పెద్ద మనిషి కూడా నిద్రపోతున్నాడుగా అతన్ని ఎందుకు జాగృతపరచరు? అతను తన వ్యాపార కార్య కలాపాల్లో నిమగ్నుడయి ఉంటే నేను మాత్రమే సమయం కేటాయించక తప్పు చేశానా? ఇటువంటి వ్యక్తి సత్యంతో సంబంధం కలిగి ఉన్నా తన కొరకు సాహస మార్గాన్ని, సంకల్ప స్థిరత్వమార్గాన్ని ఎన్నుకోడు. ఇతని జీవితంలో తన స్వంత ప్రయోజనాలు ప్రాధాన్యత పొందుతాయి. అతను సత్యాన్ని సునాయాసంగా వెనక్కి నెట్టివేస్తాడు. అతని దిగజారిన స్థితి ఏ స్థాయికి చేరుకుంటుందంటే అతని నోరు సత్యవాక్కును పలకడానికి బలహీనతతో వివశమయిపోతుంది. అతను సత్యాన్ని పలకడం తనను పరీక్షలకు గురిచేస్తోందన్న విషయం గమనించినప్పుడు, మిథ్య తనపైన ఆగ్రహాన్ని వెళ్ళగ్రక్కుతోందని పరిశీలించి నప్పుడు అతను సత్యాన్ని మిథ్యకు చేరువ చేసే మార్గాలను అన్వేషించడం మొదలెడతాడు. అతను అడుగడగునా మిథ్యాశక్తులను నమ్మింపజూస్తాడు, తాను వాటితోపాటే ఉన్నాడని!

మిథ్యావాదాన్ని కూకటివ్రేళ్ళతో పెకలించడం, దైవధర్మాన్ని సంస్థాపించడం ఇటువంటి వ్యక్తి ఆకాంక్షగా మిగులదు. నిజానికి మిథ్యావాదపు క్రీనీడనే బ్రతకాలన్నది అతని ప్రబల వాంఛయిపోతుంది. అతని ఔచిత్యాలు, శ్రేయ ప్రయత్నాలు అతని సత్యగళాన్ని బలహీనపరుస్తాయి. అతను సత్యమార్గాన నడుస్తూ అలసిపోతాడు. అతని అడుగులు తడబడసాగుతాయి. అతని ధైర్యసాహసాలు, సంకల్ప బలాలు బలహీన పడతాయి. అతను ఏ ధైర్యసాహసాలతో, ఏ సంకల్పాలతో తన ప్రస్థానాన్ని ప్రారంభించాడో

ఆ ధైర్యసాహసాలు, దృఢసంకల్పాలు సమస్తం అణగారిపోతాయి. అతను సుఖాన్ని, విశ్రాంతిని కోరే వాడయిపోతాడు. అతను తన గమ్యస్థానం దూరాన ఉండటాన్ని, మార్గంలో భయానక స్థితిని గమనించి ఆందోళన చెందుతాడు. ఇప్పుడు అతని నోట దృఢ సంకల్పాల మాటలకు బదులు పరిస్థితుల అననుకూలత పట్ల ఆందోళన వినిపిస్తుంది. అతను కొన్ని సందర్భాలలో తన 'వివశత'లను, తన 'బలహీనత'లను సుదీర్ఘంగా పేర్కొని సంతుష్టుడయి, సంతృప్తి చెందుతాడు – ఈ పరిస్థితుల్లో ఏ కాస్త సేవ కొనసాగుతోందో అదే పదివేలని!

## సుస్థిరత - దాని ఆవశ్యకతలు

వాస్తవానికి దైవధర్మం వైపునకు పిలుపు చాలా సహనంతో కూడుకున్న పని. ఇది చాలా కష్టతరమయిన కొండ దారి. దీన్ని ప్రతి ఒక్కరూ దాటలేరు. పాదాలు గాయ పడతాయి, చేతులు, ప్రక్కలు నిర్జీవమయిపోయాయని నిందించని వ్యక్తి మాత్రమే ఈ దారిన నడవగలడు. దారిలో తగిలే ఎదురు దెబ్బలకు వెరువకుండా ప్రతి దెబ్బకు మరింత శక్తిని అనుభవించే వ్యక్తి, ఎదురయ్యే ప్రతి తుఫానులో వెనక్కి తగ్గక కొండలా నిలబడగలిగే వ్యక్తి మటుకే ముందుకు సాగగలడు. శత్రువును చూసి అతని విశ్వాసం తడబడదు, ప్రతి పరీక్షను తన సాఫల్యానికి సోపానంగా భావిస్తాడు.

اَلَّذِيْنَ اسْتَجَابُوْا لِلّٰهِ وَالرَّسُوْلِ مِنْ بَعْدِ مَآ اَصَابَهُمُ الْقَرْحُ ۛ لِلَّذِيْنَ اَحْسَنُوْا مِنْهُمْ وَاتَّقَوْا اَجْرٌ عَظِيْمٌ ۝
(آلِ عمران:١٧٢)

**గాయపడిన తరువాత కూడా దైవం, దైవ ప్రవక్త పిలుపునకు బదులుగా హాజరయిన వారికి, సదాచారులకు, నిష్ఠాగరిష్ఠులకు మహా ప్రతిఫలముంది.**
*(ఆలి ఇమ్రాన్ : 172)*

ధర్మసందేశం దైవప్రవక్తల కర్తవ్యం. ఈ కార్యసాధనకు లేచిన వ్యక్తి, ప్రవక్తలు, వారి సహచరులు ఏ పరిస్థితులనయితే ఎదుర్కొన్నారో, ఏ దశలనయితే దాటవలసి వచ్చిందో అతనూ ఆ పరిస్థితుల్ని, ఆ దశల్ని దాటవలసి ఉంటుంది. ప్రవక్తల జాతులు వారి ఎడల శత్రువుల వలే వ్యవహరించాయి. వారిని అన్ని విధాలా బాధించారు. కష్ట పెట్టారు. వారిని ధర్మభ్రష్టులుగా చిత్రించారు, ఇళ్ళ నుండి వెళ్ళగొట్టారు. వారు గడించిన సంపద సయితం వారి నుండి దోచుకోవడం జరిగింది. కడకు వారిలోని అనేక మంది శిరచ్ఛేదనానికి గురికావలసి వచ్చింది. ఇదంతా కేవలం ఒకే ఒక నేరానికి శాస్తిగా

జరిగింది. ఆ నేరం, ఒకే ఒక్కడయిన దైవాన్ని అల్లాహ్‌ను విశ్వసించడం, ఆయన ధర్మం వైపునకే ఇతరుల్ని పిలువడం.

اَلَّذِیْنَ اُخْرِجُوْا مِنْ دِیَارِهِمْ بِغَیْرِ حَقٍّ اِلَّاۤ اَنْ یَّقُوْلُوْا رَبُّنَا اللّٰهُ (الحج:٤٠)

**ఎవరయితే తమ ఇండ్ల నుండి అధర్మంగా గెంటివేయబడ్డారో (వారి ఈ స్థితికి కారణం) కేవలం వారు దైవాన్నే తమ ప్రభువుగా, స్వామిగా ప్రకటించేవారు.**

***(అల్ హజ్జ్ : 40)***

నేటి కాలం కూడా సూత్రప్రాయంగా దైవప్రవక్త కాలాలకు భిన్నమయినది కాదు. శత్రువు చాలా బలమయినవాడు. ధర్మసందేశకులు, ధర్మసేవకులు శత్రువుకు సదృశంగా చాలా బలహీనులు. అయితే దైవమార్గంలో ఎదురయ్యే పరీక్షలకు వెరసి ఎవరయితే వెనిక్కి అడుగువేస్తాడో అతను తన విశ్వాస ప్రకటనలో అబద్ధం పలుకుతున్నాడు అన్నమాట. అతను తన మాట ద్వారా ఏ విషయాన్నయితే ధ్రువపరిచాడో ఆ విషయాన్ని తన ఆచరణ ద్వారా అబద్ధీకరించాడు. అతను ఒక పరిశుద్ధ విశ్వాసానికి పరాభవం కలగజేసేలాంటి అపరిశుద్ధమయిన వైఖరిని అవలంబించాడు.

ఇటువంటి వ్యక్తి సత్యానికి సదృశంగా ప్రపంచానికి ప్రాధాన్యతనిచ్చి, సత్యం అతని దృష్టిలో, ప్రపంచాన్ని త్యజించగలిగేటంతటి విలువయినది కాదు అన్న విషయాన్ని అతను తన వైఖరి ద్వారా నిరూపించాడు. అతని దృష్టిలో సత్యం ప్రియప్రదమయినది కాదు. ప్రపంచమే ప్రియప్రదమయినది. అతను విశ్వాస ప్రకటన ద్వారా ఈ జీవితం తనది కాదు, దైవానిదన్న విషయాన్ని వ్యక్తం చేశాడు. ఇప్పుడు సత్యమార్గం నుండి వెనక్కి మరలి, ప్రపంచం మహా విలువయిన సొత్తు అని, దాన్ని దైవానికి సయితం అమ్మడానికి తాను ఇష్టపడటంలేదని వ్యక్తం చేస్తున్నాడన్న మాట. దైవసందేశహరులు (స) మహనీయ ముఆజ్‌కు ఉపదేశించినదే మీకూ నాకూ వర్తించే హితవు:

ایّاک والفرار من الزحف و ان هلک الناس

**సమర క్షేత్రం నుండి ఎన్నడూ పారిపోకు, అందరూ అంతమయిపోయినా సరే.**

***(ముస్నద్ అహ్మద్)***

ధర్మసందేశకులు ఒక విషయాన్ని బాగా ప్రబుద్ధం చేసుకోవాలి, పరిస్థితులు ఎంత తీవ్రతరంగా మారినా, కాలగమన దిశయే తారుమారయినా, ప్రజల్లో ధర్మప్రియత్వంపైన

ప్రపంచ వ్యామోహం ఆధిక్యత పొందినా, జ్ఞానసంపన్నులు, మేధా ధురంధరులు, మహా మహిమాన్విత మహనీయులు సయితం ధర్మం కొరకు తమ సుఖభోగాలను వదలుకోవడానికి సిద్ధంకాకపోయినా, పైగా సత్యధర్మం కొరకు సాక్ష్యమిచ్చేవారు ఒక్కొక్కరే అంతరించిపోతున్నా, దైవనామం సంస్మరించేవారు తమ క్షేత్రం వదలి పారిపోతున్నా- ఎట్టి పరిస్థితిలోనూ ధర్మసందేశదాతల సుస్థిరత్వంలో, నిలకడలో ఎంతమాత్రం తడబాటు రాకూడదు. సత్యం కొరకు నిరంతర కృషి సలిపే, త్యాగనిరతి చూపే సౌభాగ్యం వారికి ప్రాప్తమవడం నిజంగా వారి అదృష్టమే. అల్లాహ్ ధర్మమార్గంలో ఎదురయ్యే పరీక్షలు సాఫల్యానికి సోపానాలు. ఇవి ప్రగతికి మెట్లు, వీటి ద్వారా దేవుని నిజమయిన దాసులు, ఆయన ధర్మసేవకులు ఆయన ప్రసన్నతా మార్గంలో అత్యున్నత స్థాయికి చేరుకోగలరు. పరిస్థితులు మారుతుంటాయి. ఎక్కడెక్కడ దైవదాసులు ఆయన ధర్మసందేశ వ్యాప్తి, దాని సమున్నతికి కృషి జరిపే అవకాశాలున్నాయో, వారి దారిన అధికంగా పరీక్షలు ఎదురవడం లేదో, అక్కడ వారంతా దేవునికి కృతజ్ఞతలు అర్పించుకోవాలి. ఆయన వారిని పెద్ద పరీక్షలకు గురిచేయలేదు. పరీక్షలకు దూరంగా సురక్షితంగా ఉంచాడు.

అయితే అలాకాక పరిస్థితులు మాచెడ్డగా మారిపోయాయనుకోండి, మీరు అత్యంత తీవ్రమయిన కష్టాలకు గురికావలసి వచ్చి, కారాగారాల చీకటి కుహరాలు మీ కోసం ఎదురు చూస్తున్నప్పుడు, అగ్ని శిఖల మధ్య నుండి మీరు దాటవలసి వచ్చినప్పుడు, లేక మీ కొరకు ఉరికంబాలు అలంకరించబడినా, మీరు నిశ్చయంగా సాఫల్యానికి చేరువయిపోతున్నారన్న వాస్తవాన్ని తెలుసుకోండి. ఇదంతా, దైవం కరుణాకటాక్షాలు మీ వెంట ఉన్నాయనడానికి ప్రబల సాక్ష్యం. ఆయన తన అపార అనుగ్రహాలనివ్వడానికి మిమ్మల్ని ఎన్నుకున్నాడన్న మాట, ఎంత అదృష్టవంతులు మీరు.

సత్యం అన్నిటికన్నా విలువయిన సంపద. అది మానవునికి లభించనున్నప్పుడు దాని కొరకు ప్రాణాలు అర్పించినా అది అతిసాధారణ త్యాగమే. మీరు సత్యమార్గాన్ని, కేవలం అది అపరిచిత మార్గమని, మరెవ్వరూ మీకు తోడ్పాటునిచ్చేవాడు లేడని మీరు దాన్ని వదలివేస్తున్నట్లయితే మీరు దాని విలువను సరిగ్గా గుర్తించలేదన్నమాట. అలాగే సత్యవిధేయతను, మీరు వాతావరణం సత్యప్రియత్వం నిండినదవటంచేత లేదా మిథ్యాశక్తులు మీ విలువను గుర్తించకపోవడం చేత స్వీకరించినట్లయితే ఇది సత్యవిధేయత కాదు, వాతావరణ విధేయత. బాగా గుర్తుంచుకోండి, సత్యమార్గాన మీరు ఎత్తిన అడుగు వెనిక్కి తీసుకోవడం దైవన్యాయస్థానంలో మహాపరాధం.

దైవధర్మం మీ నుండి మీ జీవితాన్ని కాంక్షిస్తున్నప్పుడు, మీ ప్రియతమ విత్తాన్ని మీరు సమర్పించుకుని పరమ ప్రభువు ప్రేమానుగ్రహాలకు అర్హులయ్యే అవకాశం మీకు దొరుకుతున్నప్పుడు ఈ అవకాశాన్ని జారవిడుచుకోవడం మీ విశ్వాసానికి వ్యతిరేక విషయం. మీ సఫలతకు ఇదొక్కటే మార్గం, మీ వద్దనున్న సకల సంపదల్ని ధారబోసి వట్టిచేతులతో పరమ ప్రభువు సన్నిధిన చేరాలి. అప్పుడే రేపు మీ భాగ్యంగా ప్రాప్తమయ్యే సంపదకు ఆ రోజున అనేక మంది దూరమవుతారు – నిజానికి నేడు వారు తమ అదృష్టానికి ఎంతో ఆనందభరితులయి ఉన్నారు. వారు ఆ రోజున మీ సౌభాగ్యాన్ని చూసి ఎంతో విచారంతో, సంతాపంతో, పశ్చాత్తాపంతో – అయ్యో, మేము కూడా మా స్వామిని ప్రసన్నపరచుకుని ఉన్నట్లయితే ఎంత బావుండేది; అయ్యో, మా ప్రపంచం మన నుండి దోచుకోబడి ఉంటే ఎంత బావుండేది; అయ్యో, మా పరలోకం ఈ విధంగా వినాశమవ కుండా ఉంటే ఎంత బావుండేది – అని రోదిస్తారు!



# సందేశం - సంఘటనం

## సంస్థ అవసరం

ఏ ఉద్యమమయినా, సందేశమయినా దానికి ఓ సంస్థ అవసరమని భావించడం జరుగుతుంది. అందువల్ల ఇంగితం తెలిపే దాని ప్రకారం, ఇస్లామ్ సందేశానికి కూడా సంస్థ తప్పక అవసరమవుతుంది. కాని విచిత్రమయిన విషయం ఏమిటంటే, మన విభిన్న వర్గాలలో ఈ కార్యానికిగాను సంస్థ ఆవశ్యకత, ప్రాముఖ్యతలు గుర్తించబడటంలేదు. ప్రపంచంలోని ఏ సిద్ధాంతం ఆధారంగానయినా వెలిసే సందేశం దాని సంస్థను స్థాపించు కోగలదు. కాని ఇస్లామ్ సందేశానికి ఏదయినా సంస్థ ఏర్పడితే కొందరు దానికి అయిష్టతను వ్యక్తం చేస్తారు. మరికొందరయితే తీవ్ర అభ్యంతరం లేవదీస్తారు.

ఇటువంటి వారి దృష్టిలో ఇస్లామ్ సందేశాన్ని అందజేసే సరయిన విధానం, ఈ రంగంలో ఏ వ్యక్తి ఏ పని చేయగలడో అతను దాన్ని తాను స్వయంగా నిర్వర్తించాలి. లేదా మహా అయితే అవసరం కలిగితే తత్సమయానికి కొందరు వ్యక్తులు కలసి ఇస్లామ్ సేవను దేన్నయినా నిర్వర్తించాలి. అంతేతప్ప కేవలం ఈ ఉద్దేశ్యంతోనే ఒక సంఘటనంగా ఏర్పడటం, అది ఇస్లామ్ సందేశం, దాని ఆధిక్యతను గురించి మార్గాలు ఆలోచించడం, దీనిగ్గాను ఒక పథకం, ప్రణాళిక తయారు చేయడం, ఆ ప్రణాళిక ప్రకారం కార్యకర్తలకు పనులు అప్పజెప్పడం, ప్రపంచంలో ఇతర ఉద్యమాలు పనిచేస్తున్నట్లే పని చేయడం వంటి విషయాన్ని వీరు సరయినదిగా భావించరు. ఇదీ వారి వైఖరి.

కాగా మీరు గమనించగలరు, ఇటువంటి వారిలో చాలా మంది, ఇస్లామ్‌కు సంబంధించిన అపోహలు, అపార్థాలను దూరం చేయాలని, ఇస్లామ్ బాగా వ్యాప్తి చెందాలని మనసారా కోరుకుంటారు. వీరిలో, ఇస్లామ్‌కు సంబంధించిన అనేక విషయాలపైన పరిశోధనలు జరిపే వారు కూడా ఏమీ తక్కువ కారు. విభిన్న అంశాలపైన పరిశోధనా వ్యాసాలు సయితం లభిస్తాయి. ఇస్లామ్ సిద్ధాంతాలను, సూత్రాలను సరయినవని

నిరూపించడానికి తమలోని ఉత్తమ శక్తిసామర్థ్యాలను వినియోగిస్తారు. ఇస్లామేతర ఆలోచనలను విమర్శించడం, వాటి లోపాలను విశదపరచడంలోనూ ముమ్ముందే ఉంటారు. అంతేకాక తమ అభిరుచికనుగుణంగా ఇస్లామ్ సేవలను అందజేసేవారిని ప్రోత్సహించడం, ప్రశంసించడం, తమ స్థాయి మేరకు వారితో సహకరించడంలో కూడా ఏ మాత్రం వెనుదీయరు. అయితే ఇస్లామ్‌కు సంబంధించిన ఇదే సేవ వ్యక్తులకు బదులు ఏదయినా సంఘటనంగా ఏర్పడి చేయగోరితే ఆ కృషి వారి దృష్టిలో సరయినది కాదు. వారు అటువంటి సంఘటనంతో సహకరించడానికీ సిద్ధంకారు. అంటే వ్యక్తులు వ్యక్తిగత స్థాయిలో ఇస్లామ్ కొరకు కృషి చేయడమయితే సరయినదే కాని ఆ వ్యక్తుల శక్తుల్ని సమీకరించి సంఘటనంగా ఏర్పడి అదే మార్గాన ముందుకు సాగడం సరయినది కాదు అన్నమాట.

ఈ ఆలోచనా విధానానికి వారిని ఏదయినా ఆధారం అడిగితే బహుశా వారు ఒకే సమాధానం ఇస్తారు - ఇస్లామ్ సందేశం కొరకు సంఘటనం ఏర్పాటుకు దైవగ్రంథం, ప్రవక్త సంప్రదాయంలోనూ, తొలినాటి చరిత్రలోనూ ఎట్టి ఆధారం దొరకదు అని. మీరు వారి ఈ వాదనను అంగీకరించక, ఆధారాలు, నిదర్శనాలతో సంఘటనం ప్రాధాన్యతను నిరూపించగోరితే మీ మనస్సు ఇస్లామేతర ఉద్యమాలతో ప్రభావితమయి ఉంది అని వెంటనే సమాధానం ఇస్తారు. నేడు ఏ ఉద్యమానికయినా సంస్థ అవసరమని భావించ బడుతోంది గనక, సంస్థ లేకుండా ఇస్లామ్ సందేశకార్యం ఎలా చేయాలన్న విషయం మీకు బోధపడటం లేదు అని ఎత్తి పొడుస్తారు; ఇదీ వారి వాదన.

కాని ఈ ఆలోచనా విధానం హేతుబద్ధంగానూ తప్పయినదే, మేము ముమ్ముందు వివరించనున్నట్లు ఖుర్ఆన్, హదీసు, ఇస్లామీయ చరిత్రలోనూ ఈ పంథాకు ఎటువంటి ప్రామాణికత దొరకదు. ఆధునిక కాలపు ఉద్యమాలు సంఘటనం ఏర్పాటును అవసరమని భావిస్తే ఇస్లామ్ సంఘటనం వ్యవస్థాపనకే విరుద్ధమన్న భావం ఎలా జనిస్తుంది? సందేశం-అది ఇస్లామ్‌కు సంబంధించినదయినా తిరస్కారానికి సంబంధించి నదయినా సంఘటనం అన్నది రెంటికీ అనివార్యమే అన్నదీ సాధ్యమయిన సమీకరణమే. మనిషి నడవ డానికి కాళ్లు, పని చేయడానికి చేతులు లేకుండా ఎంతగా వివశుడో అంతకన్నా అధికంగా సందేశం, దాని విజయం సంఘటనంకు అంతే ఆధారపడి ఉంటుంది; సంఘటనం లేకుండా ఏ ఉద్యమమూ ఎన్నటికీ విజయవంతం కాజాలదు.

ప్రపంచంలో మంచీ చెడు, అన్ని విధాల సిద్ధాంతాలూ ముందుకు వస్తుంటాయి. వాటిలో కొన్ని సిద్ధాంతాల ద్వారా బలవత్తరమయిన విప్లవాలు వెలిశాయి. కాని మానవ

చరిత్ర అంతటిలో అవ్యవస్థీకృత విచ్ఛిన్నమయిన వ్యక్తుల ప్రయత్నాలతో నెలకొన్న ఏ విప్లవాన్నీ సూచించలేము. మీరు విభిన్న ఉద్యమాల ప్రారంభం, ప్రగతుల విశ్లేషణ జరిపి నట్లయితే ఒక విషయాన్ని గమనిస్తారు. సిద్ధాంతాలు ప్రప్రథమంగా వ్యక్తుల మేధలోనే పుడతాయి. వ్యక్తులే వాటి వైపునకు జనుల్ని ఆహ్వానిస్తారు. ఇది యదార్థం. అలాగే మరో యదార్థం ఏమిటంటే, ఒక సిద్ధాంతాన్ని ఆ జనుల్లో కొందరు ఏకీభావంతో అంగీకరించి నప్పుడు వారు ఒక సంఘటనంగా రూపొందుతారు.

ఈ సంఘటనం బలీయమయినదయితే, అందులో చేరే వ్యక్తులు తమ ఆలోచనల్ని దాని ఆలోచనల్లో, తమ ఆచరణల్ని దాని ఆచరణల్లో, కడకు తమ వ్యక్తిత్వాన్ని దాని వ్యక్తిత్వంలో సంవిలీనం చేసుకుంటారు. ఇటువంటి వ్యక్తుల ద్వారానే ఆ సంఘటనం లేదా సంస్థ ముందుకు సాగుతుంది, విస్తరిస్తుంది, ఇతరుల్ని సన్నిహితం చేసుకుంటుంది, వారి పైన ఆధిక్యత పొందడానికి ప్రయత్నిస్తుంది. ఒక సందేశం వెనక ఇటువంటి బలమయిన సంస్థ లేనట్లయితే దాని పిలుపు వాతావరణంలో మటుమాయమయిపోతుంది. అది ఆ సమయాన క్రియాశీలమయిన భావాలు, ఆలోచనలపైన తన ప్రభావాలను వేయజాలదు. అలాగే అంతమయిపోతుంది. కాగా ఇది ఒక చారిత్రక వాస్తవం. తప్పుడు సిద్ధాంతాలు సయితం, వాటిని వ్యాపింపజేసే, ఆధిక్యత కలిగించే సుసంఘటిత కృషి జరిపినట్లయితే విజయవంతమయిపోతాయి. అలాగే సరయిన ఆలోచనలకు సయితం ఆధిక్యత కలగక పోవడానికి కారణం వాటికి మంచి సంఘటిత సంస్థ ప్రాప్తం కాకపోవడమే.

ఒక సందేశం ఆధిక్యతనొందాలంటే, ఏ సమయాన ఏ పని చేయడం దానికి అవసరమో దాన్ని అది నిర్వహించడం సాధ్యం కావాలి. ఏ పథకం చేపట్టాలని అనుకుంటే దాన్ని అవలంబించడం సాధ్యం కావాలి. అందుబాటులో ఉన్న సాధనాసామగ్రిని సర్వోత్త మంగా వినియోగించడం దానికి తెలియాలి. అది ఎంతో బలమయినదిగా ఎదగాలి, శాస్త్రీయ, సాహిత్య రంగాలను, సంస్కృతీ నాగరికతలు, నైతిక వ్యవహారాలను, ప్రభుత్వం, రాజకీయాలను అది దానికి అనువయిన రీతిలో మలచగలగాలి. ఇంత మహత్పూర్వక మయిన కార్యశక్తి నేటి వరకు ఏ ఒక్క వ్యక్తికీ ప్రాప్తం కాలేదు, మున్ముందు కూడా ఇది ప్రాప్తమయ్యే అవకాశం లేదు. కారణం, ఏ వ్యక్తిలోనయినా ప్రతి పనికి అవసరమయిన శక్తిసామర్థ్యాలుండవు. అతను ఏదో ఒక్క పనియో లేదా రెండు పనులో చేయ గలుగుతాడు. అంతేకాదు, అతను ఏ పని చేసినా భారీ ఎత్తున అన్ని కోణాలలో పరిపూర్ణ రీతిలో, అన్ని అవసరాలు తీర్చే రీతిలో నిర్వహించనూలేడు.

కాని ఒక మంచి సంస్థ ఏర్పాటయితే దానికి ఇదంతా సంభవమే. ఒక్క నీటి బొట్టుతో వరద రాదు. కాని ఒక్కొక్క బొట్టు ప్రోగయి నదీ రూపం ధరిస్తే అది భూమిని

చీల్చి, కొండల్ని త్రవ్వి ముందుకు సాగుతుంది. అలాగే వ్యక్తి శక్తిసామర్థ్యాలు పరిమిత మయినవయినా చాలా మంది ఒకే చోట చేరినప్పుడు, ఒకే సిద్ధాంతాన్ని వారు ఆశ్రయించి సుసంఘటితమయినప్పుడు వారిలో ఎంతో బలం ఏకత్రమవుతుంది. వారు తమకు వ్యతిరేక సిద్ధాంతాన్ని పెకిలించివేసి మరో దృష్టితో మరో ఆలోచనతో కొత్త ప్రపంచాన్ని వెలియ జేయగలుగుతారు. ఒక ఉత్తమ స్థాయిలోని పటిష్ఠమయిన సంస్థలో విభిన్న సామర్థ్యాల వ్యక్తులు చేరడం అసాధ్యమేమీ కాదు. ఆ కారణంగా అది, ఏ పనులకు ఏ శక్తిసామర్థ్యాల అవసరం కలుగుతుందో ఆ శక్తిసామర్థ్యాల వ్యక్తుల్ని ఆ పనిలో నిమగ్నం చేయగలదు. ఇంకా ఒక కార్యసాధనకు ఒక వ్యక్తి సరిపోదని భావిస్తే పది మంది కార్యకర్తల్ని పంపడం కూడా సాధ్యమే.

నిజానికి, ఇస్లామీయ సందేశానికి సంస్థ అవసరాన్ని వ్యతిరేకించేవారు ప్రపంచంలో ఏదయినా సందేశం ఎలా విజయవంతం అవుతుందో ఎరుగరు. దాని విజయానికి ఇక్కడ ఏ చర్యలు గైకొనవలసి ఉంటుందో, ఏ విధానాలు అనుసరించవలసి ఉంటుందో వారికి తెలియదు.

## వింతయిన సాకులు

కొందరు ఇస్లామ్ సందేశ వ్యాప్తికి సంస్థ ఏర్పాటును తప్పుగా ఎంచరు. దాని ప్రాముఖ్యతనూ గుర్తిస్తారు. అయినా దాని కొరకు ఆచరణాత్మకంగా ఏ చర్యా తీసుకోరు లేదా ఈ కార్యం కొరకు ఏర్పడిన మరే సంస్థలోనూ చేరడానికి సిద్ధంకారు. తాము ఇలా వేరుగా ఉండటానికి వారి వద్ద కొన్ని కారణాలున్నాయి. ఇక్కడ అటువంటి కారణాలను కూడా చర్చించడం భావ్యమని భావిస్తున్నాము. దీన్నిబట్టి తెలిసిపోతుంది, నిజంగానే ఎవరయినా ఇస్లామ్ సేవ చేయదలిస్తే అతను ఈ కారణాల వల్ల సంస్థ ఏర్పరచకుండా పనిచేయడం ఎంత వరకు సమంజసమో. 1) ఒక కారణం: నిస్సందేహంగా సందేశ వ్యాప్తికి సంస్థ అవసరమే. కాని నేటి పరిస్థితుల్లో ఇలాంటి సంస్థ వల్ల ప్రయోజనంకన్నా హానియే అధికం. మనం జీవిస్తున్న వాతావరణంలో ఇస్లామేతర సిద్ధాంతాలు రాజ్యమేలుతున్నాయి, ఇక్కడ ఇస్లామ్‌కు వ్యతిరేకంగా తీవ్రమయిన భావోద్రేకాలు నెలకొని ఉన్నాయి. ఇటువంటి వాతావరణంలో ఇస్లామ్ వ్యాప్తికి, దాని ఆధిక్యతకు సంఘటిత కృషి జరపడం వల్ల ఆధిక్యతలో ఉండే సిద్ధాంతాలకు ఇది తమ ప్రత్యర్థిగా గోచరించవచ్చు, వాతావరణం దీన్ని సహించడానికే నిరాకరించవచ్చు. ఈ ప్రమాదం నుండి తప్పించుకునేందుకు ఒక్కటే దారి, వ్యక్తులు తమ స్థాయిలో సందేశ కార్యం నిర్వహిస్తూ ఉండాలి, దాన్ని సంస్థాగత సంఘటిత కృషిగా ఎన్నటికీ మార్చరాదు. దీని వల్ల తత్కాల అధికార సిద్ధాంతాలతో సంఘర్షణా రూపం ఏర్పడే ఏ పనీ జరగదు. అందువల్ల విజ్ఞత, వివేకం కోరేదేమిటంటే,

సందేశ వ్యాప్తికి, అది కొనసాగే విధానాన్నే అవలంబించాలి. అసలు పనికే ఎసరుపెట్టే ఏ విధానాన్నీ అనుసరించరాదు. ఆలోచించండి. ఇదేమయినా సమంజసమయిన కారణమేనా? ఇస్లామ్ సందేశానికి సంస్థ ఏర్పాటు అవసరమయితే, సంస్థ లేకుండా దాన్ని సరిగ్గా నిర్వర్తించడం సంభవం కాకపోతే, తప్పనిసరిగా సంస్థను ఏర్పరచవలసిందే, పరిస్థితులు అనుకూలించినా అనుకూలించకపోయినా. పోతే వ్యతిరేకత అన్నది కేవలం సంఘటిత సందేశ కృషికే ఎదురవుతుంది, వ్యక్తిగత కృషికి కాదు అన్న అభిప్రాయం కూడా సరయినది కాదు. ఇస్లామ్ సందేశం ఒక విప్లవాత్మక సందేశం. అదొక విప్లవాత్మకమయిన ప్రకటన. దేవుని ఈ నేలపైన దేవుని అధికారమే చెలామణి అవ్వాలి. ఆయన ఒక్కని అధికారం తప్ప మరెవ్వరి అధికారమూ ఇక్కడ చెల్లనేరదు అన్న ప్రకటన అది.

ఈ మాట ఎప్పుడు పలికినా, అలా పలికే నోరు ఒక్కటే అయినా, తత్కాల అధికార సత్తా దాన్ని తనకు వ్యతిరేకంగా విద్రోహ చర్యగానే భావిస్తుంది. ఒక విద్రోహి పట్ల వ్యవహరించే తీరులోనే దాని పట్ల వ్యవహరిస్తుంది. ఎప్పుడయినా సరే, ఇస్లామ్ సందేశం ముందుకు వచ్చినప్పుడు తత్కాల అధికారం ముందుకు వచ్చి దాన్ని స్వాగతించిన ఒక్క సందర్భాన్నీ పేర్కొనలేరు. వాస్తవానికి ఈ కార్యంలో పరీక్షలు మెండు, ఆ పరీక్షలు సయితం బహుధా కఠినమయినవి. వాటిని తప్పించుకునే దారి లేదు. ఈ సందేశాన్ని అందజేసే సాహసం, సంకల్పం చేసేవారు అందరూ కాజాలరు, ఆ సమయాన ఉన్న అధికారాగ్రహాన్ని భరించగల సత్తా గలవారు మాత్రమే కాగలరు. ధైర్యం లేనివారు ఈ మార్గాన రెండడుగులూ నడవలేరు.

2) రెండవ కారణం, సాధారణంగా చెప్పేది ఏమిటంటే, మాలో చాలా లోపా లున్నాయి. ఇస్లామ్ పిలుపునకై పనిచేసే ఓ పవిత్రమయిన సంస్థలో ఇటువంటి లోపాలతో ప్రవేశించే అర్హత మాకు లేదు, మేము ఈ లోపాలను దూరం చేసుకోనంత వరకు దానికి తోడ్పాటునివ్వడం కుదరదు.

ఈ సాకును కుంటిసాకు అంటే బహుశా సత్యదూరం కాదేమో. మనిషిలో లోపా లుండటం, సందేశ ప్రధానమయిన సంస్థలో చేరకపోవడానికి కారణం కాకూడదు. పైగా ఆ లోపాలను వీలయినంత త్వరగా దూరం చేసుకునే బాధ్యతను మోపుతుంది. ఒక వ్యక్తి బట్టలు పరిశుద్ధంగా లేకపోతే అతను అసలు నమాజ్‌నే వదలుకోవడం సరయినదేనా? అతి త్వరగా దుస్తులు పరిశుద్ధపరచుకుని నమాజ్ ఆచరించడం మొదలుపెట్టడమే అతనికి తగిన వైఖరి. అదే విధంగా ఒక వ్యక్తిలో ఇస్లామీయ సంస్థలో చేరడానికి అయోగ్యంగా చేసే లోపాలేవయినా ఉన్నట్లయితే అతను మిగతా పనులన్నీ వదలిపెట్టి వెంటనే తన సంస్కరణకు పూనుకోవడం అతని బాధ్యత. ఈ విధంగా ఇస్లామ్ సేవకు అతను సంసిద్ధు

డవ్వాలి. అంతేగాని లోపాలున్నాయన్న నెపంతో నిశ్చింతగా, నెమ్మదిగా జీవితం గడపడం అతనికి ఎంతమాత్రం భావ్యం కాదు.

లోపాలను దూరం చేసుకునే ప్రస్తావన వచ్చినపుడు కొందరు, తమకు తమ లోపాల స్పృహ ఉందని, మేము వాటి సంస్కరణ పట్ల ఏమరుపాటుగా లేమని అంటూనే ఉంటారు. కాని వాస్తవమేమిటంటే, ఎంత కాలం గడిచినా వారి స్థితిలో ఎటువంటి మార్పు సంభవించదు. తమ లోపాల సాకు వారిని జీవితాంతం ఇస్లామ్ మార్గంలో తమ పాత్ర నిర్వర్తించకుండా వారిస్తూనే ఉంటుంది. అంటే వాస్తవంగా వారికి తమ లోపాల పట్ల అసలు ధ్యాసే లేదన్నమాట. వారిలా లోపాలను అంగీకరిస్తూ తమను విధుల నిర్వహణ నుండి కాపాడుకునేందుకు వాటిని వినియోగించుకుంటున్నారన్న మాట. నిజమయిన స్పృహ ఉన్నట్లయితే మనిషి స్థిరంగా లోపాలను పట్టుకు వ్రేలాడటం, వాటిని అదుపు చేయలేకపోవడం అన్నది సాధ్యమయిన విషయం కాదు.

3) మూడవ సాకు ఏమిటంటే, సరయిన మార్గాన ఇస్లామ్ సందేశాన్ని అందజేసే సంస్థ ముందు రూపుదిద్దుకోవాలి, అందులో తక్వా, దైవభక్తి, ఉన్నత నైతికత, ధర్మంపట్ల ప్రేమ, దాని కొరకు త్యాగనిరతి, బలిదానాల ఉత్తమ గుణగణాలు తప్పనిసరిగా ఉండాలి. అది దాని ఉత్తమ గుణాల వల్ల ప్రత్యేకంగా కనిపించాలి. దైవధర్మ సందేశ వ్యాప్తికి ఇటువంటి లక్షణాలు, గుణాలున్న సంస్థే అవసరమయి ఉంటుంది. ఈ కాలంలో ఇటువంటి సంస్థ ఏదీ లేదు కాబట్టి ఇస్లామ్ కొరకు సంఘటిత కృషి జరపాలన్నా సాధ్యపడదు.

మా దృష్టిలో ఇది తప్పుడు భావన. నేడు ఇస్లామీయ సంస్థ ఏదీ లేదన్న ఆలోచనే సరయినది కాదు. దైవానుగ్రహం వల్ల ప్రపంచం నలుమూలల్లో ఎన్నో సంస్థలు సరయిన మార్గాన ఇస్లామ్ సేవలు అందజేస్తున్నాయి. ఈ సంస్థలను గురించి మనిషి అకారణంగా అనుమానాలకు గురవకపోతే, వాటిలో ఇస్లామ్ సందేశానికి అవసరమయిన గుణాలు సయితం చాలా మటుకు నిస్సందేహంగా ఉన్నాయి. అందువల్ల ఇస్లామ్ సందేశ వ్యాప్తికి పని చేయగోరే వ్యక్తికి సరయిన విధానం ఏమిటంటే, అతను చిత్తశుద్ధితో చుట్టుపట్ల నున్న పరిస్థితుల్ని పరిశీలించాలి. ఏదయినా సంస్థ ఇస్లామ్ పిలుపునకై విధి నిర్వహణలో నిమగ్నమయి ఉన్నట్లు అగుపిస్తే అందులో చేరిపోవాలి. ఇలాంటి ఓ సంస్థలో చేరకపోవడానికి కారణం, అందులో ఏదయినా కొట్టవచ్చినట్లు కనిపించే చెడుగు ఉండి అది ధర్మసందేశానికి అర్హతే లేనిదిగా కనిపిస్తుందా? కాని అలాకాక అందులో ఏవయినా చిన్న చిన్న కొరతలు కనిపిస్తే, దాని ఆధారంగా దాన్ని మరింత బలహీన పరచడమయినా, దాన్ని పరాభవంపాలు చేయడమయినా, దాన్నుండి దూరంగా ఉండటమయినా ఒక విశ్వాసికి

ఎంత మాత్రం తగని పని. నిజానికి సరయిన వైఖరి ఏమిటంటే, దాని పరిశుద్ధ లక్ష్యంలో దానికి తోడ్పాటు అందజేయాలి, దానితోపాటు దాని లోటుపాట్లను సంస్కరించే ప్రయత్నమూ చేస్తూ ఉండాలి.

ఏ దేశంలోనూ, మొత్తం ప్రపంచంలోనూ స్వచ్ఛమయిన ఇస్లామీయ సంస్థ అనగలిగే సంస్థే లేదని కాస్సేపటికి అనుకుందాం. అయితే దీని కారణంగా, ఇస్లామ్ కొరకు ముస్లిములపైన మోపిన సామూహిక కృషి జరిపే బాధ్యత ఎంతమాత్రం తొలగిపోదు. అది మిగిలి ఉండటమేకాక రెండింతలయిపోతుంది. ఎందుకంటే, అటువంటి పరిస్థితుల్లో రెండు పనులు చేయవలసి ఉంటుంది. ఒకటి, మొదట సరయిన పద్ధతిలో ఇస్లామ్ సేవ చేసే సంస్థను ఏర్పరిచే అలుపెరుగని ప్రయత్నాలు చేయవలసి ఉంటుంది. రెండవది, అలాంటి ఓ వ్యవస్థ ఏర్పడినప్పుడు దానితో కలసి సందేశకార్యం నిర్వర్తించవలసి ఉంటుంది. ఇస్లామ్ సందేశం అందజేయడం ఏ విధంగా విధ్యుక్త ధర్మమో అదే విధంగా ఆ విధి నిర్వహణకు కావలసిన వనరుల్ని సమకూర్చుకోవడం కూడా అవసరమే.

## ఖుర్ఆన్, హదీసుల బోధనలు

ఖుర్ఆన్, హదీసుల్లో ఇస్లామ్ పిలుపునకు సూచించిన విధానమేదో, రండి చూద్దాం. మొదటి విషయం ఏమిటంటే, ఖుర్ఆన్, హదీసులు రెంటిలోనూ పూర్తిగా విశదమయిన పదాలలో ముస్లిములు సంఘటితంగా సమైక్యంగా జీవించాలన్న ఆదేశాలున్నాయి, విభేదాలను, విచ్ఛిన్నమయి, విభిన్నమయిపోవడాన్ని అవి వారించాయి. ఖుర్ఆన్‌లో ఇలా ఉంది:

وَاعْتَصِمُوْا بِحَبْلِ اللّٰهِ جَمِيْعًا وَّلَا تَفَرَّقُوْا (آل عمران:١٠٣)

**అందరూ కలసి దైవధర్మ పాశాన్ని పటిష్ఠంగా పట్టుకోండి, వేర్వేరయిపోకండి.**
***(ఆలి ఇమ్రాన్ : 103)***

ఇదే విషయాన్ని గురించి హదీసులు అనేకమున్నాయి. ఇక్కడ కేవలం ఒక్క హదీసు మాత్రమే అందజేస్తున్నాము. దైవసందేశహరులు (స) ఇలా సెలవిచ్చారు.

عليكم بالجماعة و اياكم والفرقة

**సంస్థను (సంఘటిత వ్యవస్థను) గట్టిగా పట్టుకుని జీవించండి, విచ్ఛిన్నానికి దూరంగా మెలగండి.★**

★ జామి'తిర్మిజి, అబ్వాబుల్ ఫితన్, బాబ్‌మాజాఅ ఫీ లుజూమిల్ జమాఅ' ముస్నద్ అహ్మద్, *5/370, 371.*

ఖుర్‌ఆన్, హదీసుల ఈ ఆదేశాలతోపాటు మరో వాస్తవాన్నీ మీరు దృష్టిలో ఉంచుకోండి. ఇస్లామ్ పిలుపు ముస్లిముల ప్రత్యేకత, ప్రత్యేక ఆచరణ. ఇది ముస్లిములను తిరస్కారాన్నీ, బహుదైవారాధనను ప్రచారం చేసే వారి నుండి వేరుచేసి చూపుతుంది. ప్రపంచాన్ని మార్గవిహీనతకు గురిచేసే వారికీ ముస్లిములకూ మధ్య వ్యత్యాసమేమిటంటే, ముస్లిములు మార్గవిహీనత నుండి జనావళిని కాపాడి ఇస్లామ్ వైపునకు పిలుపునిస్తారు. ఈ రెండు విషయాలను దృష్టిలో ఉంచుకుని కాస్త ఈ ప్రశ్నను పరిశీలించండి, ఇస్లామ్ సందేశానికి సరయిన పద్ధతి ఏమయి ఉంటుంది. ఖుర్‌ఆన్, హదీసుల ప్రకారం ఇది ఒక్కొక్క వ్యక్తి తానుగా చేయవలసిన పనా లేదా దీనికి సంఘటితంగా కృషి జరపడాన్ని అవి అవసరంగా భావిస్తున్నాయా? ఈ ప్రశ్నకు ఒక్కటే సమాధానం. ఇస్లామ్ పిలుపునకు సుసంఘటిత కృషి అనివార్యం. ముస్లిములకు సర్వసామాన్యంగా, సర్వజనీనంగా సమైక్యతను గురించి, సంఘటిత జీవితాన్ని గురించి ఇచ్చిన ఆదేశం సహజంగా, ఈ పనికీ వర్తించడమేకాక ప్రప్రథమంగా ఈ పనికే అది వర్తించాలి. ఈ పనే వీరికీ ఇతరులకూ మధ్య ప్రత్యేకతా రేఖను ఏర్పరుస్తుంది. దీని వల్లనే వీరి ప్రత్యేక స్థానం ఏమిటో తెలుస్తుంది. వారు అందరికీ వేరుగా తమ ప్రత్యేక స్థానం కలిగి ఉండటానికి కారణమేదో తెలిపేదీ అదే. వీరి సంఘటన, ఈ మహత్తర కార్యసాధనకు కాకపోతే మరే ఉద్దేశ్యానికి అవసరమవుతుంది? పైగా తిరస్కారాన్నీ, బహుదైవ వాదాన్ని ప్రచారం చేసే కృషీవళులయితే సుసంఘటిత కృషి జరుపుతూ ఉండగా ఇస్లామ్ పిలుపునిచ్చేవారు మటుకు తమ సందేశ ఆవశ్యకతల్ని నిర్వర్తించడానికి తమ శక్తిసామర్థ్యాలను ఏకత్రం చేయకుండా తమ తమ వ్యక్తిగత ప్రయత్నాలతోనే తృప్తిచెందండని ఆదేశించడం ఎలా సాధ్యం? ఖుర్‌ఆన్ అయితే అతి స్పష్టంగా చెబుతోంది, ఏ విధంగానయితే తిరస్కారులు, బహుదైవారాధకులు ఇస్లామ్‌కు వ్యతిరేకంగా సమైక్యమయి ఉన్నారో అలాగే ముస్లిములు సయితం వారికి ప్రతిగా సమైక్యతతో వారిని ఎదుర్కోవాలని ఆదేశిస్తుంది.

قَاتِلُوا الْمُشْرِكِيْنَ كَافَّةً كَمَا يُقَاتِلُوْنَكُمْ كَافَّةً (التوبة:٣٦)

**బహుదైవారాధకులతో అందరూ కలసి పోరు సలపండి, వారందరూ కలసి మీతో పోరాడుతున్న విధంగానే.**

***(అత్ తౌబా : 36)***

చెప్పవచ్చిందేమిటంటే, ఖుర్‌ఆన్, హదీసులు అతి స్పష్టమయిన పదాలలో,

ముస్లిము లలో సమైక్యత, ఏకీభావం, సుసంఘటిత వ్యవస్థ ఉండాలని ఆకాంక్షిస్తున్నాయి. ఇదంతా నిజానికి సందేశ వ్యాప్తికే కావాలి. అందువల్ల వారు సందేశ కార్యమయితే చేస్తారు కాని దానికి తమ శక్తిసామర్థ్యాలను ఏకత్రం చేసుకోలేకపోతే ఈ మహత్కార్యం, ఖుర్ఆన్, హదీసులు కోరే విధంగా నిర్వర్తించబడదు. అదే విధంగా ముస్లిముల సంస్థ అంటూ ఏర్పడి అది ఇస్లామ్ పిలుపునకు కాక మరే కార్యసాధన చేపట్టినా అది దైవం, దైవ ప్రవక్త (స) నిర్దేశించిన సంస్థ మటుకు కాదు. ఇదే విషయాన్ని ఈ దిగువన పేర్కొన్న రెండు ఖుర్ఆన్ ఆయత్‌లు తెలుపుతున్నాయి:

كُنتُمْ خَيْرَ اُمَّـةٍ اُخْرِجَتْ لِلنَّاسِ تَأْمُرُوْنَ بِالْمَعْرُوْفِ وَ تَنْهَوْنَ عَنِ الْمُنْكَرِ (آل عمران:١١٠)

**మీరు అత్యుత్తమ సముదాయం, మిమ్మల్ని జనుల (మార్గబోధన, మార్గదర్శకత్వం) కొరకు ఆవిర్భవింపజేయడం జరిగింది. మీరు మంచిని ఆదేశించాలి, చెడును నిరోధించాలి. దైవాన్ని విశ్వసించాలి.**
***(ఆలి ఇమ్రాన్ : 110)***

وَ كَذٰلِكَ جَعَلْنَاكُمْ اُمَّةً وَّسَطًا لِّتَكُوْنُوْا شُهَدَآءَ عَلَى النَّاسِ وَ يَكُوْنَ الرَّسُوْلُ عَلَيْكُمْ شَهِيْدًا (التوبة:١٤٣)

**ఇదే విధంగా మేము మిమ్మల్ని అత్యుత్తమ మధ్యస్థ సముదాయంగా రూపొందించాము. తద్వారా మీరు ప్రజలకు (దైవ ధర్మ) సాక్ష్యం పలికేవారయి, దైవప్రవక్త మీ కొరకు సాక్ష్యం పలికేవాడయి మెలగాలని.** ***(అత్ తౌబా: 143)***

ఈ ఆయత్‌ల ద్వారా తెలిసేదేమిటంటే, ముస్లిములు ఒక 'ఉమ్మత్' (సముదాయం)గా జీవించాలి. ఆ సముదాయాన్ని పైన తొలి ఆయత్‌లో 'ఉత్తమ సముదాయం'గా పేర్కొనడం జరిగింది. 'సముదాయం' అన్న పదం ముస్లిములు ఒక సంఘటిత వ్యవస్థలో ఉంటూ వారి జీవితం సుసంఘటిత సామూహిక వ్యవస్థగా రూపొందాలని సూచిస్తోంది. ఎందుకంటే, ఉమ్మత్ అని ఛిన్నాభిన్నంగా ఉండే వ్యక్తులను అనరు. నిజానికి ఈ పదం, ఒక సామూహిక ఆశయంతో ఒక కేంద్రాన ఏర్పరచిన సంస్థ, సంఘం కొరకే ప్రయోగించబడుతుంది. ఖుర్ఆన్ పదాలలో చెప్పాలంటే ఇది ప్రపంచంలోకెల్లా న్యాయశీల ప్రధానమయిన సముదాయం. అది ఏర్పడిన ఆశయం, జనుల్ని మంచి కొరకు ఆదేశించడం, చెడు నుండి నిరోధించడం, వారి మధ్యన దైవధర్మానికి సాక్ష్యంగా నిలువడం దీన్నే మేము చాలా సాధారణ పదాలలో ఇస్లామ్ పిలుపుగా పేర్కొంటున్నాము. ఇస్లామ్ పిలుపు కోసం

ఒక సముదాయాన్ని ఆవిర్భవింపజేయడం వల్ల ఈ పనికి సంస్థ అవసరమన్న విషయం తెలుస్తోంది. ఏ ఉద్దేశ్యానికయినా సంస్థ ఏర్పడుతోందంటే అది దానికి అవసరమయి నప్పుడే ఏర్పడుతుంది. ఏ పనయితే వ్యక్తిగత స్థాయిలో నెరవేరుతుందో దానికి సంస్థ ఏర్పడటం అనవసరం.

## మహనీయ ముహమ్మద్ (స) ఆదర్శం

ప్రవక్త ముహమ్మద్ (స) ఇస్లామ్ పిలుపు విధిని ఎలా నిర్వర్తించారో, ఏ విధానాన్ని అనుసరించారో అన్నదీ చూడదగిన విషయమే. ప్రవక్తశ్రీ (స) ఇష్టపడి అనుసరించిన విధానమే ఈ సందేశానికి అన్నింటికన్నా తగినదనడంలో సందేహమేలేదు. చరిత్ర పరిశీలనతో తెలిసేదేమిటంటే, ఆయన ఒక వైపున ఇస్లామ్ పిలుపునిచ్చారు, మరో వైపున ఈ సందేశాన్ని స్వీకరించిన వారిని సమీకరించి ఒక సముదాయంగా ఏర్పరిచారు. సందేశం వ్యాప్తి చెందిన కొద్దీ దాని పరిధీ విస్తృతమవుతూపోయింది. ప్రారంభంలో ఈ సముదాయం వేళ్ళపైన ఎన్నదగ్గ కొందరితో ఏర్పడింది. ఆ తరువాత, ఆయన పరమ పదించే సమయానికి లక్షలాది మంది అందులో భాగమయిపోయారు.

## ఒక సంఘటిత సముదాయం

ఈ కాలంలో సంస్థలు ఏర్పడే విధానాలలో ఏ విధానం ప్రకారమూ ప్రవక్తశ్రీ (స) సముదాయం రూపకల్పన జరగలేదన్న విషయాన్ని చూసి, ఇంకా ఏ విధంగానయితే నేడు సుసంఘటిత వ్యవస్థ రూపొందుతున్నదో ఆనాడు అటువంటిదేదీ లేకపోయిందన్న విషయాన్ని చూసి ఆయన ఏర్పరచిన సముదాయం అసలు సుసంఘటిత సముదాయమే కాదన్న నిర్ణయానికి వస్తారు కొందరు. కాని ఇది సరయినది కాదు. సుసంఘటిత సంస్థ అంటే దాన్ని గురించి సరయిన అవగాహన లేకపోవడంచేత ఇటువంటి అభిప్రాయం ఏర్పడు తుంది. మహనీయ ముహమ్మద్ (స) ఏర్పరచని సముదాయంలో నేటి సంస్థల్లో మాదిరిగా ప్రవేశ రుసుము వంటిదీ, ఏదయినా దరఖాస్తు ఫారం పూర్తి చేయాలన్నదీ, దానికి ఎటువంటి యూనిఫామ్ కూడా ఆనాడు లేదన్నది వాస్తవమే. కాని ఈ స్థూల విషయాల వల్ల ఆయన (స) సముదాయం సంఘటితమయినది కాదని ఎంత మాత్రం చెప్పలేము. వాస్తవానికి ఈ చిన్న విషయాలకు సంఘటిత వ్యవస్థకూ ఎటువంటి సంబంధం లేదు. ఇవి లేకుండా ఓ ఉన్నత స్థాయి సంస్థను ఏర్పరచడం సాధ్యమే. అలాగే ఇవన్నీ ఉన్నప్పటికీ అసలు పటిష్ఠత అన్నదే లేకపోతే సంస్థ డొల్లగా రూపొందడమూ సాధ్యమే.

వ్యక్తుల్ని సుసంఘటితం చేసేవి రెండు విషయాలు. ఒకటి, లక్ష్యం, దానితో సంబంధం, రెండవది, నాయకత్వం, దాని అనుసరణ. లక్ష్యానికి చుట్టూ జనం సమీకృత మవుతారు. దానితో సంబంధం ఎంత పటిష్ఠమవుతుందో అంతగానే దాన్ని సాధించాలన్న కోరిక బలీయమవుతుంది, అంతగానే వారు దాని కోసం కృషి చేస్తారు, త్యాగాలు చేస్తారు. లక్ష్యమే లేకపోతే విభిన్న వ్యక్తుల్ని ఏకత్రం చేసే విషయమేదీ ఉండదు, దానితో సంబంధమే లేకపోతే దాన్ని సాధించేందుకు, దాని కొరకు ఎటువంటి ప్రయత్నమూ ముందుకురాదు. అదే విధంగా నాయకత్వం లక్ష్యాన్ని సాధించే నిర్ధారిత మార్గం చూపుతుంది. అనుయాయులు దాన్ని అనుసరిస్తారు, వారు ఆ లక్ష్యాన్ని వాస్తవంగా సాధించేందుకే దాన్ని అనుసరిస్తారు. నాయకత్వం లేకుండా సంస్థలో స్తబ్దత ఏర్పడుతుంది, లేదా అరాచకం. నాయకత్వం వల్లనే వ్యక్తుల్లో చలనం ఏర్పడుతుంది, వారి ప్రయత్నాలకు ఒక దిశ ప్రాప్త మవుతుంది.

వ్యక్తుల్ని సంఘటితపరచే ఈ రెండు విషయాలూ ప్రవక్త మహనీయుల (స) సముదాయంలో పరిపూర్ణంగా కానవస్తాయి. అది ఒక సమున్నత లక్ష్యం కొరకు ఏర్పడింది. ఆ లక్ష్యాన్నే మనం ఇస్లామ్ పిలుపుగా పేర్కొంటున్నాము. ఆ లక్ష్యం అంటే దానికి ప్రాణం. దాన్ని వ్యాపింపజేయాలన్న తపన అందులో అపారంగా ఉండేది. దానికి ఆధిక్యత చేకూర్చాలన్న తీవ్రమయిన వాంఛ కానవచ్చేది. దాని కోసం త్యాగాలు సమర్పించే ప్రజల ఆవేశోద్వేగాలుండేవి. ఇదొక వాస్తవం. ఇస్లామీయ చరిత్ర తెలిసిన ఏ వ్యక్తీ ఈ యదార్థాన్ని కాదనలేడు. ఈ సముదాయం ఈ సందేశాన్ని విజయవంతం చేయడానికి తన శక్తినంతా ధారబోసింది. దానికున్న సిరిసంపదలు, శక్తిసామర్థ్యాలు అన్నీ పణంగా పెట్టింది. ఇందులోని ప్రతి వ్యక్తికి దీని వ్యాప్తికి నిరంతరం కృషి సలిపాడు. ఈ సందేశ వ్యాప్తికి ఏ వ్యక్తిలోని ఏ శక్తిసామర్థ్యాలు కావలసి వచ్చినా ఆ వ్యక్తి వాటిని అర్పించు కున్నాడు.

ఈ సముదాయం ముందుంచిన ఆదర్శాలు విచిత్రమయినవి, ఊహాతీత మయినవి. ఈ సముదాయం స్వీకరించిన ధర్మసంస్థాపనార్థం ఆర్థిక అవసరాలు ఏర్పడిన ఓ సందర్భంలో ఒక వ్యక్తి తన సంపదనంతటిలో సగభాగం అర్పించుకుంటే, మరో వ్యక్తి ఇంటిని తుడిచిపెట్టి ఉన్నదంతా అర్పించుకున్నాడు. మరో సందర్భంలో, ఒకే వ్యక్తి మొత్తం సైన్యానికి కావలసిన సామగ్రి, ఖర్చులూ భరించాడు. సముదాయంలో సంపన్నులయిన వారు ఈ విధంగా తమ సొమ్మును ధారబోస్తూ ఉండగా లేని వారు తమ వద్ద ఈ మార్గంలో ఖర్చుపెట్టేందుకు ఏమీ లేకపోయిందే అని వాపోతూ ఉండేవారు.

ఈ సముదాయానికి పిలుపునివ్వగానే అది దాని సస్యశ్యామలమయిన పొలాలను, బాగా సాగుతున్న వ్యాపారాలను, ప్రియప్రదమయిన సంతానాన్ని, ఆత్మీయమయిన భార్యలను సయితం వదలివేసి వీటితో ఎటువంటి సంబంధమే లేనట్లుగా సమర రంగంలోకి ఉరికి వచ్చింది. సముదాయంలోని ఒక్కొక్క వ్యక్తికి ఈ సందేశం పట్ల ప్రేమాభిమానాలకు పరిమితులుండేవి కావు; ఎవరీ సందేశాన్ని ప్రేమించేవారో వారిని ఈ వ్యక్తులూ అమితంగా ప్రేమించారు. మరెవరయితే ఈ సందేశం పట్ల వైరం కనబరుస్తారో వారు ఈ వ్యక్తులకు శత్రువులయ్యారు. రక్తసంబంధీకులు సయితం ఈ సందేశాన్ని రూపుమాపడానికి పూనుకుంటే వారికి వ్యతిరేకంగా నడుంబిగించారు వీరు. ప్రాణశత్రువు సయితం సందేశాన్ని సమర్థించడానికి సమాయత్తమయితే అతన్ని తమ తప్పిపోయిన మిత్రునిగా భావించి గుండెకు హత్తుకున్నారు.

ఒక్క మాటలో, ఈ సముదాయమయినా, దీనికి సంబంధించిన ఒక్కొక్క వ్యక్తి అయినా ఈ సందేశానికి మానవుల వల్ల కాగలిగిందల్లా చేశారు. గొప్ప గొప్ప త్యాగాలు చేశారు. రాత్రిళ్ళల్లో నిద్ర వదలుకున్నారు. పగటి పనులు మానుకున్నారు. ప్రాణాలు కోరితే అర్పించుకున్నారు; ధనం కోరితే తెచ్చి ముందుంచారు. ఏ సమయాన ఎటువంటి సహాయం, సహకారం కావాలన్నా వెనకా ముందు తటపటాయించకుండా సమర్పించుకున్నారు. అదే తమ పరమార్థంగా భావించారు. దీని వల్లనే తమ కామితార్థం ఫలించిందనుకున్నారు. ఇందుకోసమే తాము ఇంతవరకు వేచి ఉన్నట్లుగా వ్యవహరిం చారు, పరమానందాన్ని వ్యక్తం చేశారు.

ఈ మొత్తం కార్యకలాపాలలో మహనీయ ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లమ్) స్వయంగా సముదాయానికి ఆచరణాత్మకంగా నాయకత్వం వహిస్తున్నారు. నిజానికి ఈ సముదాయంలో చేరాలంటే ఒక వ్యక్తి ప్రవక్తశ్రీ (స) దైవసందేశహరునిగా నమ్మి ఆయన ఆదేశం ప్రతిదీ అనుసరణీయం అని భావించడం తప్పనిసరి. ఈ విధంగా ఆయన (స) నేతృత్వంలో రూపొందిన సముదాయంలో జనం నిండు హృదయంతో చేరుతూ ఉండేవారు, ఆయన నిర్దేశాల ప్రకారం ఆచరించేవారు. ఈ సముదాయంలో ఆజ్ఞాబద్ధత, అనుసరణల స్థాయి ఏ మేరకు చేరిందంటే, మహనీయ ముహమ్మద్ (స) ఏ వ్యక్తికి ఏ ఆదేశమిస్తారో అతను దాన్ని నిర్వర్తించడానికి ఆసక్తి ఉత్సాహాలతో పరితపిస్తూ ఉంటాడు. ఆయన వారికి హిజ్రత్ చేసే (వలస పోయే) ఆదేశమిస్తే వారికి తమ స్వస్థలం వదలడం వల్ల ఏ మాత్రం కష్టం కలగలేదు. కుటుంబాన్ని, తెగను, వంశాన్నీ వదలివెళ్ళమంటే సంతోషంతో సిద్ధమయ్యారు. కష్టాలు కలిగినప్పుడు సహనం వహించమని

ఉపదేశిస్తే నోటితో ఎంతమాత్రం ఆవేదనను వ్యక్తం చేయలేదు. శత్రువుతో పోరాడే ఉత్తరవు అయితే జిహాద్‌లో పాల్గొనేందుకు, తలనయినా అర్పించుకునేందుకు సమాయత్త మయ్యారు. దాన్ని గర్వకారణంగా భావించేవారు. ఆజ్ఞాపాలనకు సంబంధించిన ఈ భావం అంతకు ముందు కూడా ఏ సంస్థలోనూ కానరాలేదు, ఆ తరువాత కూడా మరే ఉదాహరణ అలాంటిది ముందుకు రాలేదు.

ఈ విధంగా పరిశీలిస్తే ఆనాటి ఆ సముదాయంలోనూ ఒక ప్రామాణికమయిన సంఘటిత వ్యవస్థలో ఉండవలసిన సకల ప్రత్యేకతలు పరిపూర్ణ స్థాయిలో ఉండేవనడంలో ఎటువంటి సందేహం లేదు. ఈ ప్రత్యేకతలు సముదాయాన్నంతటినీ ఒకే అంగంగా రూపొందించాయి. ప్రపంచంలోని మరే సంస్థలోనూ కానరానంతటి క్రమశిక్షణ, సమైక్య తలు సృష్టించాయి. ఈ సముదాయంలోని ప్రతి వ్యక్తి సముదాయం చేస్తున్న పనినే నిత్యం చేస్తూ ఉండేవాడు. అలాగే సముదాయం కూడా ఒక్కొక్క వ్యక్తి నిర్వర్తించే బాధ్యతలనే నిర్వర్తిస్తూ ఉండేది. సమస్త సముదాయం మహనీయ ముహమ్మద్ (స) నాయకత్వంలో రేబవళ్ళు ఈ విధంగా కృషి చేసినప్పుడే ఇస్లామ్‌కు ఆధిక్యత ప్రాప్తమయింది, దాని సందేశానికి విజయం సమకూరింది.

సందేశం విజయవంతం కావడం అంటే అర్థం, అది ప్రతీపశక్తుల్ని అణచివేసి అధికారాన్ని చేపట్టడం కాదు. అది విజయం సాధించాలంటే అది అధికారం పొందిన తరువాత అది జీవన వ్యవహారాలన్నింటినీ అది ప్రతిపాదించే పథకం, ప్రణాళిక ప్రకారం నడిపి చూపాలి. ఇది సాధ్యం కావాలంటే, అధికారం పొందిన తరువాత దాని మత్తులో తమ సిద్ధాంతాలను మరచిపోని వ్యక్తులు కావాలి. వారు సుఖదుఃఖాలలో, కలిమిలేముల్లో, కష్టసుఖాలలో ఎట్టి పరిస్థితిలోనూ తమ జీవన తత్వాన్ని విడవడానికి సిద్ధంకాని వారు కాగలగాలి. ప్రపంచంలోని ఏ ఆలోచన, ఏ ఆచరణా విధానమయినా తమ ఆలోచన, ఆచరణావిధానంకన్నా ఉత్తమమయిందని, దాన్ని సయితం అనుసరించవచ్చు అని ఎట్టి పరిస్థితి లోనూ అంగీకరించనటువంటి వారయి ఉండాలి. తాము సత్యాన్ని ధర్మాన్ని అనుసరిస్తున్నామన్న కృతనిశ్చయం, ఆ సత్యాన్నే అమలుపరచాలన్న దృఢసంకల్పం, దాన్ని తమ విధ్యుక్త ధర్మంగా భావించే నిశ్చయం చేసుకున్న వారే కావాలి. ఇటువంటి వ్యక్తులు ఒక సంస్థలో లేకపోయినట్లయితే అది రాజకీయ విప్లవాన్ని నెలకొల్పడంలో విజయం సాధించినా ఆలోచనాత్మక, సాంస్కృతిక విప్లవాన్ని సాధించడంలో సఫలత పొందజాలదు. అది ఏ సిద్ధాంతాలనయితే నెలకొల్పాలని ప్రపంచంతో పోరాడేదో వాటిని తన స్వహస్తా లతో రూపుమాపడం మొదలెడుతుంది.

మహనీయ ముహమ్మద్ (స) నాయకత్వంలో రూపుదిద్దుకున్న సంస్థ గొప్పదనం ఏమిటంటే, అందులో కేవలం రాజకీయ విప్లవాన్ని తెచ్చే సామర్థ్యమేకాక అదొక ఆలోచనాత్మక, సాంస్కృతిక విప్లవాన్నీ నెలకొల్పడంలో విజయం సాధించింది. ఇటువంటి విప్లవానికి కావలసిన ఉన్నత స్థాయి వ్యక్తులు ఈ వ్యవస్థ ద్వారా ప్రాప్తమయ్యారు. జీవితపు ఏ రంగంలోనయినా ఈ వ్యవస్థ దాని ఆలోచనా ధోరణిని అమలుపరచడంలో సఫలం కాలేకపోయింది అన్నట్టు ఎన్నడూ కానరాలేదు. ప్రవక్తశ్రీ(స) సందేశం ఆధిక్యత నొందినప్పుడు, దాన్ని నడపడానికి అవసరమయిన పూర్తి స్థాయి సుశిక్షితులయిన బోధనా పటిమగల బోధకులు, న్యాయమూర్తులు, ఉపన్యాసకులు, కవులు, పరిపాలనా దక్షతగల గవర్నర్లు, ప్రభుత్వ ప్రతినిధులు, సేనాపతులు, కమాండర్లు, రాయబారులు, రాజకీయ వేత్తలు, పాలకులు అందరూ ఉన్నారు. ఒక వర్గం సందేశ స్థాయి నుండి పరిపాలనా స్థాయి వరకు కావలసిన అవసరాలను తీర్చగలగడానికి ఉనికిలోకి వచ్చేసింది. కాస్త ఆలోచించండి, ఇదంతా ఎటువంటి సుసంఘటిత సంస్థ లేకుండానే సాధ్యమయిందా? ఇందులోనూ ఎటువంటి సంఘటనా కృషి లేదంటే ఇక ప్రపంచంలో ఎన్నడూ ఎటువంటి సంఘటిత సంస్థ ఏర్పడనే లేదని చెప్పవలసి వస్తుంది.

## సంఘటనం పతనమయిన వైనం

మహనీయ ముహమ్మద్ (స) ఇస్లామ్ సందేశ వ్యాప్తికి అవలంబించిన పద్ధతిని పైన తెలుసుకున్నాము. ఆయన ప్రపంచాన్ని వీడిపోయినప్పుడు ఆయన నెలకొల్పిన సముదాయం అన్ని విధాలా సుసంఘటితం, సమైక్యమయి ఉండింది. దాని ద్వారా ఉన్నత స్థాయి ఇస్లామ్ సేవ ఒనగూడింది. అది సుదూర ప్రాంతాల వరకు ఇస్లామ్ సందేశాన్ని చేరవేసింది. దాన్ని అన్ని విధాలా వ్యాపింపజేసింది. దాని కొరకు నిరంతర కృషి సలిపింది. సతత సమరం జిహాద్ నెరిపింది. ఆనాటి నాగరిక ప్రపంచంలో చాలా ప్రాంతాల వరకు ఇస్లామ్ వ్యవస్థను నెలకొలిపింది. అయితే కాలం గడచిన కొద్దీ సముదాయంలోని ఈ సంఘటిత శక్తిలో పతనం ఏర్పడసాగింది. చివరికి ఓ సమయాన సముదాయం మటుకు మిగిలే ఉండింది కాని అందులోని సువ్యవస్థ, సంఘటన, సమైక్యత మటుమాయమయి పోయాయి. నిజానికి ప్రవక్త మహనీయులు పలుమార్లు, జనం సంస్థతో పటిష్ఠంగా సంబంధాలు కలిగి ఉండాలని గట్టిగా బోధించారు. సంస్థకు దూరమయితే మనిషి ఇస్లామ్‌కు దూరమయిపోతాడు అని కూడా అన్నారు. ఆయన ఇలా ఉపదేశించారు:

ఏ వ్యక్తి అయినా సంస్థ నుండి జానెడు దూరం బయటికి వచ్చినా అతను తన మెడ నుండి ఇస్లామ్ పాశాన్ని తీసిపారేసి నట్లే. ★

انه من خرج من الجماعة قيد شبر فقد خلع ربقة الاسلام من عنقه

ఆయన ఉపదేశం ప్రకారం,ముస్లిములు చిన్న వర్గంగా ఉన్నప్పటికీ సుసంఘటితం గానే ఉండాలి. అడవిలో ముగ్గురు వ్యక్తులే ఉన్నప్పటికీ సుసంఘటితమయి ఉండాలి. కాని ముస్లిములు కోట్ల సంఖ్యలో ఉన్నప్పటికీ తమ మధ్య కలిపి ఉంచే ఏ విషయమూ లేనట్లుగా విచ్ఛిన్నమయిపోయారు. ఆయన ఎంత స్పష్టంగా సెలవిచ్చారో గమనించండి:

అడవిలో, ఎడారిలో ఉంటే ముగ్గురు వ్యక్తులు సయితం (ఎటువంటి వ్యవస్థ లేకుండా జీవించడం ధర్మసమ్మతం కాదు) తమలో ఒకరిని తమ నాయకునిగా ఎన్నుకుని అతనికి లోబడి జీవించాలి. ★★

لا يحل لثلثة نفر يكونون بارض فلاة الا امّروا عليهم احدهم

ఆయన ఒకసారి ఇలా సెలవిచ్చారు: ముస్లిములు సమైక్యంగా ఉన్నప్పుడు, వారు ఒక సంఘంగా ఏర్పడినప్పుడు ఎంతటి గొప్ప వ్యక్తి అయినా సరే వారి సమైక్యతలో, సంఘటనలో ఎటువంటి విచ్ఛిన్నానికి ప్రయత్నించినా అతని శిరచ్ఛేదనం చేసివేయాలి.

ఈ సముదాయం సుసంఘటితమయి ఉన్నప్పుడు అందులో విచ్ఛిన్నాన్ని సృష్టించ గోరే వ్యక్తిని ఖడ్గంతో ఖండించండి, అతను ఎవరయినా సరే.

من اراد ان يفرّق امر هٰذه الامة وهی جميع فاضربوه بالسيف كائنا من كان

విచారకరమయిన విషయం ఏమిటంటే, ఉపదేశాలను పాటించడం జరగలేదు. లేకపోతే ముస్లిముల సముదాయం విచ్ఛిన్నమయ్యేది కాదు. వారి సంస్థ, సువ్యవస్థ ఛిన్నాభిన్నమయినందు వల్ల కలిగిన నష్టాలు కలగకపోయేవి. మీరు కాస్త గమనించండి, ముస్లిముల వ్యవస్థలో విచ్ఛిన్నాన్ని రేకెత్తించే వ్యక్తి ఇంతగా అసహనీయం కావడం, అతని హత్య కూడా ధర్మసమ్మతమయిపోవడం ఎందుకు జరిగిందో ఆలోచించండి. కారణం ఒక్కటే. ఇస్లామ్ ప్రపంచ వ్యవస్థను ఏ విధంగానయితే నడపాలని కోరుకుంటున్నదో అది

★ జామి'తిర్మిజీ, అబ్వాబుల్ అదబ్, బాబ్ మాజాఅ ఫీ మిస్లిస్సలా వస్సియామి, వస్సదకతి; ముస్నద్ అహ్మద్: 1/275, 297.

★★ ముస్నద్ అహ్మద్ : 2 / 177.

★★★ సహీహ్ ముస్లిమ్ కితాబుల్ ఇమార, బాబ్ హుకమ్ మిన్ ఫరకు అమరల్ ముస్లిమీన్.

సాధ్యపడాలంటే ముస్లిములు సుసంఘటితమయి, సమైక్యమయి ఉండటం అవసరం. వారిలో సంఘటన వ్యవస్థీకృత సంస్థ లేకపోయినట్లయితే ఈ వ్యవస్థ నడిచే అవకాశమే లేదు, అందువల్ల ముస్లిముల సమైక్యతను అంతమొందించగోరే వ్యక్తి వాస్తవానికి ఇస్లామ్ స్థాపించే వ్యవస్థను ఛిన్నాభిన్నం చేయదలిచాడు.

మీరు గమనించగలరు, ముస్లిములలో సమైక్యత సమసిపోగానే ఓ సువిస్తర భూభాగాన ఆధిక్యతతో సుస్థాపితమయిన ఇస్లామీయ వ్యవస్థ ఒక్కసారిగా పరాధీనమయి పోయింది. దీనితోపాటు జరిగిన మరో నష్టం ఏమిటంటే, ముస్లిములు ఓ సముదాయంగా సందేశ వ్యాప్తి కార్యక్రమాన్ని వదలిపెట్టారు. అయితే ఆ తరువాత కూడా ఇస్లామ్ పిలుపు పని కొనసాగినా దాన్ని నిర్వర్తించిన వారు అత్యధికంగా వ్యక్తులే. లేదా ముస్లిముల చిన్న చిన్న వర్గాలు. వీరందరి సేవలను అంగీకరించినప్పటికీ సముదాయం పూర్తి స్థాయిలో ఈ పనిని నిర్వహించి ఉన్నట్లయితే ఫలితాలు మరో విధంగా ఉండేవన్న సత్యాన్ని కాదనలేము. ఈ ఫలితాలు, వ్యక్తులు, చిన్న చిన్న వర్గాల ప్రయత్నాల ఫలితాలకన్నా ఎన్నో రెట్లు ఉత్తమంగా ఉండగలిగేవని గట్టిగా చెప్పవచ్చు.

## కర్తవ్యం

సముదాయంలో సంఘటిత వ్యవస్థ ఛిన్నాభిన్నమయినప్పుడు, అది అతిత్వరగా దాని మునుపటి స్థితికి చేరి పునఃస్థాపితమవడమే సరయిన పద్ధతి. సరికొత్తగా అది సుసంఘటితమయి ఇస్లామ్ పిలుపు కార్యంలో నిమగ్నమవవలసింది. కాని విచారకర మయిన విషయం ఏమిటంటే అలా జరగలేదు. ఈ సందర్భంలో కొన్ని ప్రయత్నాలు జరిగినా అవి పూర్తిగా విజయవంతం కాలేకపోయాయి. దానికి కారణాలు ఏవయినా, సముదాయం మటుకు, దాన్ని మహనీయ ముహమ్మద్ (స) ఏ స్థితిలో వదలిపెట్టారో, దాన్ని ఏ స్థితిపైన నిలకడగా సుస్థిరమవ్వాలని ఆదేశించారో ఆ స్థితిలో లేదు. ఇప్పుడు ఎవరికయితే పరిస్థితుల ఈ స్వరూపం పట్ల స్పృహ కలిగిందో వారి అసలు కర్తవ్యం, వారు అన్ని వైపుల నుండి ఏకత్రమయి సుసంఘటితమవడం. ఆ విధంగానే వారి పూర్వీకులు ప్రవక్త మహనీయుల (స) నాయకత్వాన సుసంఘటిత వ్యవస్థగా రూపొందారు. ఆ తరువాత సముదాయంలోని ఇతర వ్యక్తుల్ని, వర్గాలను అదే ఆశయంతో ఏకత్రం చేసే ప్రయత్నం చేయాలి. ఈ సముదాయం నిజంగానే సమైక్యమయి పోయినట్లయితే, అదీ ఇస్లామ్ కొరకు ఈ సమైక్యత ఏర్పడితే ప్రపంచంలో, పదునాలుగు వందల ఏళ్ళకు పూర్వం వచ్చిన విప్లవం తిరిగి ఏర్పడటం ఏమంత అసాధ్యమయిన విషయం కాదు.

وَ مَا ذٰلِكَ عَلَى اللّٰهِ بِعَزِيْزٍ

**ఇది దైవానికి అసాధ్యమయిన విషయమేమీ కాదు.**

# సంస్థ పటిష్టమయ్యేదెలా?

సంస్థకు బలిమి అంతర్గతంగా ఒనగూడుతుంది. అది అంతర్గతంగా పటిష్ఠమయి ఉంటే దాన్ని అంతం చేయడం సులువయిన పని కాదు. కాని లోలోనే గుల్లయి ఉన్న వ్యవస్థ ఎటువంటి ప్రతిఘటన లేకుండానే అంతమయిపోగలదు. సంస్థకు గల వాస్తవ సంపద దాని వ్యక్తులు. వ్యవస్థకు బయట ఉన్న వ్యక్తి దాని శ్రేయోభిలాషి అయితే కాగలడు కాని దాని బలానికి మూలం, ప్రధానాధారం కాజాలడు. అందువల్ల సంస్థను నిలబెట్టడం, దాన్ని పటిష్ఠపరచడం, దాన్ని వృద్ధిపరచడం సంస్థకు బయట నుండే వ్యక్తుల పనికాదు, అందులో చేరి ఉన్న వ్యక్తుల బాధ్యత. దీనితోపాటు మరో వాస్తవమేమిటంటే సంస్థతో సంబంధమున్న ప్రతి వ్యక్తీ దాని పటిష్ఠతకు ఆధారమవజాలడు. కొన్ని ప్రత్యేకతలున్న వ్యక్తుల ద్వారానే సంస్థకు బలం చేకూరుతుంది. ఇక్కడ ఈ ప్రత్యేకతల్ని పేర్కొనే ప్రయత్నం చేస్తున్నాము. దీని సంబోధితులు, దైవధర్మాన్ని అనుసరించడానికి, దాని సర్వతోముఖ సందేశ వ్యాప్తికి తమ్ముతాము సుసంఘటితపరచుకున్న వ్యక్తులు.

## సామూహిక స్పృహ

గతించిన పేజీలలో ఒక విషయం ఆధారాలతో, విపులంగా ముందుకు వచ్చింది. దైవం, దైవప్రవక్త (స)కు, ముస్లిముల వ్యక్తిగత జీవితం కాక, సామూహిక సుసంఘటిత జీవితం ఇష్టమయినది. వారిని విభిన్న సంఘాలుగా ఏర్పడనివ్వలేదు, ఒకే సంఘంగా ఏర్పరచడం జరిగింది. వాస్తవంగా ముస్లిములు చాలా కాలంగా ఈ ఆదేశాన్ని మరచి పోయారు. వారు ఒక సముదాయంగా ఉండేవారు. కాని వారు వర్గాలుగా చీలిపోయారు. వారు ఒక సుసంఘటిత వ్యవస్థగా రూపొందవలసింది. కాని వారు విచ్ఛిన్నమయిన, చిందువందయిన రూపంలోకి పరివర్తించారు. దీనికి కారణం ఒక్కటే. వారిని ఏకత్రం చేసేది, సమైక్యపరచేది ఒకే వస్తువు. అది దైవగ్రంథం. ఈ గ్రంథాన్ని వారు తమ జీవితాల నుండి ఆచరణాత్మకంగా దూరం చేసుకున్నారు. దీని పట్ల వారు, ఈ గ్రంథం తమ కోసం

రాలేదన్నట్టుగా వ్యవహరించారు. తమ వివాదాలలో ఈ గ్రంథాన్ని న్యాయనిర్ణేతగా చేసుకోవాలని వారిని ఆదేశించడం జరిగింది. కాని వారు తమ పరిష్కారాలకు ప్రపంచం లోని ప్రజలందరూ అవలంబించే విధానాలే అవలంబించారు. కాని ఈ గ్రంథం వైపునకు మరలలేదు.

తమ జీవితాలను దైవగ్రంథం ప్రకారం మలచుకోవాలని వారిని ఆదేశించడం జరిగింది. కాని వారు తమ జీవితాల నిర్మాణం కొరకు దైవవిరోధులు తెలిపిన విధానాలనే అవలంబించి ఈ గ్రంథం ఆదేశాలను వదలిపెట్టారు. తమ ఆరాధనలు, నైతికత, సామాజిక నియమాలు, ప్రభుత్వ వ్యవహారాలు- సర్వకార్యకలాపాల్లో దైవగ్రంథాన్ని మార్గదర్శిగా చేసుకోవాలని వారిని ఆదేశించడం జరిగింది. కాని వారు ఈ వ్యవహారా లన్నింటిలో తమ మనోకాంక్షలకు, కుటుంబం, వంశంలోని ఆచారాలకు, సంప్రదాయా లకు, తత్కాల అధికార సత్తాకు, ప్రభుత్వానికీ దాసోహమన్నారు, దైవగ్రంథాన్ని ప్రక్కకు నెట్టివేశారు. ఇటువంటి పరిస్థితుల్లో మీరు దైవగ్రంథం ఆధారంగా ఏకత్రమయ్యారు, అందరూ కలసికట్టుగా దైవధర్మ పాశాన్ని పటిష్ఠంగా పట్టుకుని మెలగాలని సంకల్పించు కున్నారు. ఇది మహా సౌభాగ్యం. సముదాయం నేడున్న విచ్ఛిన్నావస్థలో మీకు లభించిన మహాభాగ్యమిది. దీన్ని మనసారా ఆదరించడం, దీన్ని పటిష్ఠపరచడం మీ విధి.

మీ సాముదాయిక వ్యవస్థకు మరో కోణం కూడా ఉంది. మీరు దైవగ్రంథం ద్వారా, కేవలం మీ జీవితాలను మటుకే చక్కదిద్దుకోవాలనుకోవడం లేదు. ప్రపంచాన్నీ ఈ మార్గబోధనా గ్రంథం వైపునకు పిలుపు నివ్వాలని కోరుకుంటున్నారు. మీకు బాగా తెలుసు, ముస్లిములు దైవధర్మానికి చాలా దూరమయి ఉన్నప్పటికీ నేడు కూడా వారిలో దైవారాధన, దైవవిధేయత, దైవధర్మసేవ చేసే భావాలున్నవారున్నారు, వారిలో లేనిది ఒక్కటే, అది సాముదాయిక వ్యవస్థ. వారు సమైక్యమయి, ఏకగ్రీవమయి, సంఘటితమయి ఈ సేవలు అందజేయడం లేదు. ఈ కారణంగా వాస్తవంగా బయల్పడవలసిన ఫలితాలు బయల్పడటం లేదు. నేడు 'చెడుగు' సుసంఘటితమయి, బలీయమయి పనిచేస్తోంది. దాన్ని అంతమొందించదలిస్తే మహా గొప్ప వ్యక్తిత్వమయినాసరే ఒంటరిగా ఈ పని చేయజాలదు. దీనికి 'మంచి' కూడా సుసంఘటితమయి పని చేయడం అవసరం. ఈ పనే మీరు చేయదలచారు.

దైవధర్మ సేవకులు విచ్ఛిన్నంగా ఉన్న స్థితిలో మీరు దైవధర్మం సేవ చేయ డానికి సామూహిక వ్యవస్థతో చేయాలని నిర్ణయించుకున్నారు. మీ చుట్టూత చెడుగు సుసంఘటిత మయి ఉండగా మీరు మంచి కొరకు సంఘటితమవ్వాలని నిర్ణయించుకున్నారు. మీరు

చేసే ఈ చర్య దేవుని అభీష్టాన్ని, దైవప్రవక్త అభీష్టాన్ని నెరవేర్చే చర్య. దీనికిగాను దేవునికి కృతజ్ఞతలు చెల్లించుకోండి, సుస్థిరత ప్రసాదించమని ఆయన్ని వేడుకోండి.

మీరు, దైవధర్మ సేవ చేయడానికి ఉనికిలోకి వచ్చిన సంస్థతో సంబంధమున్న వారు. అది ప్రపంచం నుండి చెడును రూపుమాపదలచింది. మంచిని వ్యాపింపజేయ కోరుతోంది. దానికి ఏ విధంగా హాని కలగజేయడమయినా అది ధర్మానికి హాని కలగ జేయడమే. అందువల్ల ఏ పని చేయడానికి పూనుకునే ముందు, సంస్థకు నష్టదాయకం కాదు గదా అని చూడటం అవసరం. మీరు మీ కార్యకలాపాలలో సంస్థ మంచీ చెడుల్ని మరచిపోయినట్లయితే మీకు దాని ప్రాముఖ్యత పట్ల స్పృహ లేదన్న మాట.

ఏ సంస్థ లేదా వ్యవస్థ పటిష్ఠమవడం అంటే దాని వ్యక్తులకు దాని పటిష్ఠత పట్ల చింత ఉండటం అవసరం. ఈ చింత సాముదాయిక స్పృహను సృజిస్తుంది. సాముదాయిక స్పృహ ఎంతగా బలవత్తరమవుతుందో సంస్థతో సంబంధమూ అంతే పటిష్ఠమవుతుంది. ఈ స్పృహ బలహీనపడితే సంస్థతో సంబంధమూ బలహీనపడుతుంది. సామూహిక స్పృహ సజీవమయి, శక్తిమంతమయి ఉంటే మనిషి సంస్థ కోసం, ఎంత పెద్ద నష్టాన్నయినా భరించగలడు, అంతేకాక సంస్థలోని సువ్యవస్థను ఛిన్నాభిన్నం చేసే ప్రతి ప్రయత్నాన్నీ బలంగా దెబ్బతీస్తాడు. ఒకవేళ సామూహిక స్పృహలో లోపమున్నట్లయితే అతి సాధారణ విషయంపైనా మనిషి సంస్థకు దూరమయిపోగోరుతాడు. ఇంకా సామూహిక స్పృహ అసలే లుప్తమయిపోయినట్లయితే మనిషి సంస్థ నియమాలకు వెరసి దానితో వేరుపడే సాకులు వెదుకుతూ ఉంటాడు.

అలాగే కొందరు సంస్థలో తమ ఇష్టానికీ, తమ తత్వానికీ భిన్నమయినది చూసినా లేదా సంస్థ చేసే ఏదయినా నిర్ణయం తమ ఇష్టాయిష్టాలకు భిన్నమయినదయినా సంస్థకు దూరమయిపోతారు. అంటే సంస్థతో వారి ఇష్టాయిష్టాల ప్రకారం నిర్ణయాలు జరిగే వరకు మటుకే సంస్థలో వారి సహచర్యం ప్రాప్తమవుతుందన్న మాట. వారు సంస్థ అభిప్రాయం సమక్షంలో తమ వ్యక్తిత్వాన్ని మలచడానికయితే సిద్ధంగా లేరు కాని సంస్థ మాత్రం వారి అభిప్రాయానికనుగుణంగా దాని నిర్ణయాన్ని మార్చుకోవాలని కోరుకుంటారు. ఒక సంస్థలో ప్రతి వ్యక్తి ఈ విధంగా కోరుకున్నట్లయితే సంస్థ ఏ నిర్ణయమూ చేయజాలదు, ఏ వ్యవహారంలోనూ ఎటువంటి చర్యా తీసుకోజాలదు.

కొందరి దృష్టిలో సంస్థతో వేరుపడటానికి, వారికి ఓ వ్యక్తితో ఏదయినా భేదాభిప్రాయం ఉండటమే సరిపోతుంది. వారి ఆరోపణను నూటికి నూరుపాళ్ళు సరయినదిగానే అంగీకరిస్తే దీని భావం ఏమిటీ, వారు సంస్థ కొరకు ఒకరి తప్పుడు వైఖరిని, ఒకరి కఠోర వాక్కును కూడా భరించలేరన్న మాట. ఇటువంటి వారు ఎట్టి పరిస్థితిలోనూ సంస్థతోపాటు

నడవడానికి యోగ్యులుకారు. వారు సంస్థకు భారమయినవారు. వారు సంస్థతో వేరుపడటమే సంస్థకు ప్రయోజనకరం.

కొందరు తమ వ్యక్తిగత లోటుపాట్లను సంస్థతో ముడిబెట్టి దానితో తమ సంబంధ రాహిత్యాన్ని వ్యక్తం చేస్తారు. ఉదాహరణకు వారు సంస్థ ఉద్దేశ్యాలతో దూరమయినప్పుడు, తమ తప్పును తెలుసుకునే బదులు సంస్థ స్వయంగా దాని లక్ష్యానికి, ఆశయానికి దూరమయినట్లు ప్రకటిస్తారు. తమలో ఆచరణ రాహిత్యం ఏర్పడితే దాన్ని దూరం చేసుకునే బదులు సంస్థ స్వయంగా ఆచరణ శూన్యమయినట్లు నిరూపించేందుకు ప్రయత్నిస్తారు. వారిలో దైవభీతి, ధర్మనిష్ఠ, సదాచారం, నిజాయితీ, అమానతు లోపిస్తే తమను సంస్కరించుకోవడానికి బదులు అసలు సంస్థ మొత్తం, దైవభక్తికి దూరమయినట్లు, సంస్థలో నీతి నిజాయితీ లుప్తమయినట్లు రుజువు చేస్తారు. అంటే వారికి స్వయంగా తమ సంస్కరణకు బదులు సంస్థను అప్రదిష్టపాలు చేయడం పట్లనే ఎక్కువగా మక్కువ ఉందన్న మాట. నిజానికి వారు తమను సంస్కరించుకుంటే అది వారి స్వయానికీ శ్రేయస్కరమయ్యేది, వారు కలసి పని చేసే సంస్థకూ ప్రయోజనకరంగా ఉండేది.

ఈ చెడుగులన్నీ ఏర్పడటానికి మూలం, మనిషిలో సామూహిక స్పృహ లేకపోవడమే, ఉన్నా అది అతిబలహీనంగా ఉందన్న మాట. ఒకవేళ సామూహిక స్పృహ ఉండి ధార్మిక సేవకు సామూహిక వ్యవస్థ ఆవశ్యకతను గుర్తించినట్లయితే తనకు ప్రాప్తమయిన సామూహిక వ్యవస్థను మహా వరప్రసాదంగా భావించి దాన్ని ఆదరించేవాడు. ఎన్నడూ దానికి దూరంగా పారిపోయే ప్రయత్నం చేసేవాడు కాడు. ఎట్టి పరిస్థితిలోనూ దానికి అంకితమయి ఉండేందుకే ప్రయత్నిస్తాడు. తనలో ఏదయినా లోపం ఏర్పడినా, అందువల్ల తాను ఆ సంస్థకు తగనని అతను భావించినా తన లోపాన్ని సరిదిద్దుకునే ప్రయత్నం చేస్తాడు, ఆ విధంగా అందులో ఇమిడే ప్రయత్నం చేస్తాడు, ఎట్టి పరిస్థితిలోనూ, ప్రపంచ ప్రయోజనాలనుకాక కేవలం దైవధర్మ సేవ కొరకే ఉనికిలోకి వచ్చిన సంస్థకు హాని కలిగే ఏ చర్యనయినా తీసుకునేందుకు ప్రయత్నించడు. ★

## ఆదేశ పాలన

ప్రతి సంస్థలో ఒక నాయకుడు ఉంటాడు. నాయకుడు లేకుండా సంస్థను ఊహించనూ లేము. ఒక సంస్థ ఏర్పడాలంటే కొందరు వ్యక్తులు ఒకరిని తమ నాయకునిగా ఎన్ను

★ అలాగే సంస్థలో ఏదయినా సూత్రప్రాయమయిన లోపం, ఆచరణాత్మకమయిన వక్రత కానవస్తే దాన్ని సంస్థలోని సంస్కరణా విధానాన్ననుసరించి సామూహిక నిర్ణయాల ద్వారా సంస్కరించే ప్రయత్నమే చేస్తాడు కాని దాన్నుండి పలాయనమయ్యే ప్రయత్నం చెయ్యడు- అనువాదకుడు).

కున్నప్పుడు, అతనికి విధేయత పాటించే సంసిద్ధత వ్యక్తం చేసినప్పుడు మటుకే సాధ్యం. సంస్థ సహజంగానే వాంఛించేది, నాయకుడు ఇచ్చే ఆదేశాన్ని అనుయాయులు పాటించా లన్నది. సంస్థలో ఎవరయినా నాయకుని మాట వినకపోతే సంస్థ అతన్ని భరించజాలదు. అతన్ని భరిస్తే సంస్థ అంతమయినట్లే లెక్క, అందులో ఆదేశమిచ్చేవాడు, ఆదేశ పాలన చేసేవారూ ఎవడూ లేడన్నమాట.

ప్రతి సంస్థకు కొన్ని నియమాలుంటాయి, కొన్ని సిద్ధాంతాలుంటాయి. వాటి కోసమే అది ఉనికిలోకి వస్తుంది. సంస్థ నాయకుడు స్వయంగానూ ఆ నియమాలను, సిద్ధాంతాలను పాటించడం, వాటిని అమలుపరచడం, ఇతరుల్ని వాటి ప్రకారం నడిపించడం అతని విధి. అతను ఆ పని చేస్తున్నంత కాలం సంస్థలోని ప్రతి వ్యక్తి అతని ఆదేశాన్ని పాలించాలి – అది ఆ వ్యక్తికి ఇష్టమయినా కాకపోయినా, అది అతని నైజానికి వ్యతిరేక మయినదయినా అనుకూలమయినదయినా. కొన్ని సందర్భాలలో అతని దృష్టికి రకరకాల విషయాలు వస్తాయి. అవి అతని అభిప్రాయంలో కేవలం తనకే కాదు, సంస్థకు కూడా హానికరమయినవని అతను భావిస్తాడు. అయితే ఈ విషయాలు సంస్థ సూత్రాలు, సిద్ధాంతాలకనుగుణంగా ఉంటే అతను వాటిని భరించవలసి ఉంటుంది. నాయకుని విధేయతకు విముఖుడయ్యే అధికారం అతనికి కేవలం ఒకే సందర్భంలో లభిస్తుంది. అది, ఆ నాయకుని ఆదేశం ఏదయినా సంస్థ సూత్రాలు, సిద్ధాంతాలకు భిన్నమయినదయి నప్పుడు మాత్రమే. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (ర) ఉల్లేఖనం ప్రకారం, దైవసందేశ హరులు (స) ఇలా సెలవిచ్చారు:

السمع والطاعة على المرء المسلم ما احب و كره مالم يؤمر بمعصية فاذا امر بمعصية فلا سمع ولا طاعة

ముస్లిమ్ వ్యక్తికి తన నాయకుని ఆదేశ పాలన తప్పనిసరి అయినది. అది అతనికి ఇష్టమయిన వ్యవహారమయినా, అయిష్టమయిన వ్యవహారమయినా. అయితే పాపపు పనికి ఆదేశమివ్వనంత వరకు దాన్ని పాటించడం తప్పదు. ఇక పాపపు పనిని ఆదేశిస్తే అప్పుడు మాట వినడం, దాన్ని పాటించడం సరయినది కాదు.★

---

★ సహీహ్ బుఖారి, కితాబుల్ జిహాద్, కితాబుల్ అహ్కామ్; సహీహ్ ముస్లిమ్, కితాబుల్ ఇమార, బాబ్ వుజూబు తాఅతిల్ ఉమ్రాఅ ఫీగైరి మఅసియ.

ఇదే భావమున్న మరో హదీసు ఉమ్ముల్ హుసీన్ (ర) కూడా ఉల్లేఖించారు. అందులో దైవసందేశహరులు (స) ఇలా సెలవిచ్చారు:

ان أمـرّ عليـكم عبـــد مجدّع يقودكم بكتاب الله فاسمعوا لـه و اطيعوا

ఒక బానిస, ముక్కు చెవీ కోసివేయబడిన వాడు కూడా మీకు నాయకునిగా చేయ బడితే అతని మాట వినాలి, అతని ఆజ్ఞా పాలన చేయాలి- అతను దైవగ్రంథం ప్రకారం మీ నాయకత్వపు బాధ్యతల్ని నిర్వహిస్తూ ఉన్నట్లయితే.★

హజ్రత్ ఉబాద బిన్ సామిత్ ఇలా చెప్పారు:

بايعنا رسول الله صلى الله عليه وسلم على السمع والطاعة فى العسر واليسر والمنشط والمكره و على أثرة علينا و على ان لا ننازع الامر اهلـه و على ان نقول بالحق اينما كنا لا نخاف فى الله لومة

మేము దైవప్రవక్త చేతి మీదుగా బయత్ (ప్రమాణం) చేశాము - మేము మా నాయ కుని ఆజ్ఞాపాలన చేస్తామని, ఆయనకు విధేయులమయి ఉంటామని, మేము సుఖంలో ఉన్నా, ఇబ్బందుల్లో ఉన్నా ఆ ఆదేశం వల్ల సంకటం కలిగినా, దుఃఖం కలిగినా, మనల్ని ఉపేక్షించినా, మాకు ప్రతిగా ఇతరులకు ప్రాధాన్యత నిచ్చినా సరే. మేము మరో విషయానికీ ప్రమాణం చేశాము, మేము మా అధికారి నుండి ప్రభుత్వాన్ని దోచుకోవడానికి ప్రయత్నిం చము. (దీనితోపాటు) మేము సత్యమయిన వాటినే పలుకుతాము, ఎక్క డున్నా సరే. ధర్మ విషయంలో అధిక్షేపించే వారి అధిక్షేప ణను ఖాతరు చేయము. మరో ఉల్లేఖనంలోని పదాలు ఇలా ఉన్నాయి, మేము నాయకుని నుండి అధి కారాన్ని దోచుకునేందుకు ప్రయత్నించము - అతని ద్వారా స్పష్టంగా దైవతిరస్కార

★ సహీహ్ ముస్లిమ్, కితాబుల్ హజ్జ్, బాబ్ ఇస్తహ్బాబ్ రమీ జమ్రతుల్ అకబ...

لاثم و فى رواية و على ان لا ننازع الامر اهله الا ان تروا كفرا بواحا عندكم من الله فيه برهان

పూర్వకమయిన పని జరుగుతూ ఉండగా చూసినప్పుడు తప్ప, అదీ దైవం పక్షాన మా వద్ద స్పష్ట మయిన ఆధారమున్నప్పుడు మాత్రమే. (అలాంటి పరిస్థితిలో నాయకుడి నుండి అధికారాన్ని దోచుకునే అధికారమూ ప్రాప్తమవుతుంది)★

దీన్నిబట్టి ముస్లిములు చూడవలసింది కేవలం ఒక్క విషయమే. తమ అధికారి ఆదేశం, దైవం, దైవప్రవక్తల ఆదేశాలకు విరుద్ధంగా ఉందా లేదా అన్నది మాత్రమే. అది విరుద్ధంగా లేకపోతే అతని ఆజ్ఞాపాలన ఆ వ్యక్తికి విధ్యుక్తమయిన ధర్మం. కాని ఒకవేళ అతని ఆదేశం దైవం, దైవప్రవక్తల ఆదేశానికి విరుద్ధమయినదయితే అతను ఎట్టి పరిస్థితిలోనూ నాయకుని విధేయత పాటించడు. అంతేకాదు, ఆ నాయకుణ్ణి ఆ హోదా నుండి తొలగించే ఆనతీ అతనికి ప్రాప్తమవుతుంది.

ఈ హదీసులలో మూలతః, ముస్లిములలో ఉనికిలోకి వచ్చే రాజకీయ అధికారం లేని సాధారణ సంస్థ నాయకుని ప్రస్తావన లేదు. ఇందులో ముస్లిమ్ పరిపాలకుని ప్రస్తావన వచ్చింది. ఆ నాయకుడు ముస్లిముల ప్రాపంచిక, ధార్మిక వ్యవహారాలలో వారికి సరయిన మార్గదర్శకత్వం చూపడానికి బాధ్యుడయి, సాధికారంగా ఖుర్‌ఆన్ హదీసుల ప్రకారం నడపగలిగేవాడయి ఉంటాడు. అయినప్పటికీ ఈ హదీసుల ద్వారా అంతకన్నా తక్కువ స్థాయిలోనూ ముస్లిముల నాయకుడు, అతని అనుయాయుల మధ్య ఉండవలసిన సంబంధం ఏ విధంగా ఉండాలో తెలియవస్తుంది. ముస్లిముల రాజకీయ నాయకుడు రాజ్యశక్తి ఆధారంగా తన ఆదేశాలను అమలు జరపగలడు. కాని రాజకీయ అధికారం లేకుండా ఏ వ్యక్తి వారి నాయకుడవుతాడో అతను బలం ఆధారంగా తన ఆదేశాలను వారిపైన చెలాయించలేడు. అతని ఆదేశాల ప్రభావం కేవలం నైతిక ప్రధానమయింది. కాని ఒక వ్యక్తికి ఎవరయినా ధార్మిక నేతృత్వపు స్థానాన్ని కల్పించిన తరువాత ఆ వ్యక్తి మార్గదర్శకత్వం ధర్మవిరుద్ధం కానంత వరకు అతనికి విధేయులయి మెలగటం తప్పనిసరి. లేకపోతే అది ఆ నాయకునికి చేసిన ప్రమాణాన్ని భంగపరచినట్లవుతుంది. ఒక ముస్లిమ్

★ సహీహ్ బుఖారి, కితాబుల్ ఫితన్, బాబ్ కౌలున్నబీ (స) సతరౌన బా'దీ ఉమూరన్ తన్కరూనహా; సహీహ్ ముస్లిమ్ కితాబుల్ ఇమార, బాబ్‌వుజూబు తాఅతిల్ ఉమ్రాఅ ఫీగైరి మఆసియ....

వ్యక్తికి ఇది మహా పరీక్ష. ఒక వ్యక్తిని అతని ఆమోదంతో అనుమోదంతో తన నాయకునిగా పరిగణించడం, ఎటువంటి రాజకీయ ఒత్తిడి లేకుండా, కేవలం దైవం సామూహిక జీవితాన్ని ఇష్టపడిన కారణాన, అతనికి విధేయత చెల్లించడం, అదీ కేవలం వ్యవస్థాగత స్థాయిలో తప్ప ధార్మిక సేవ సాధ్యం కాదన్న కారణం చేతనే చేయడం మరీ కష్టతరమయిన విషయం. ఈ పరీక్ష వాస్తవంగానే కష్టసాధ్యమయినది, సందేహం లేదు. కాని ధర్మసేవ కొరకు ఒక సంస్థగా ఏర్పడిన వారు ఈ పరీక్షలో నెగ్గడం తప్పనిసరి. అలా జరగకపోతే వారు తమ లక్ష్యంలో ఎన్నడూ విజయం సాధించలేరు.

## సదభిప్రాయం

షరీఅత్ ప్రకారం, జనుల ధార్మిక, నైతిక పరిస్థితులను గురించి అనవసరంగా ఊహా ప్రతిపాదనలు చేయడాన్ని, అనుమానాలు వ్యక్తం చేయడాన్ని నిషేధించడం జరిగింది. దాని కారణం–

اِنَّ بَعْضَ الظَّنِّ اِثْمٌ (الحجرات:١٢)

**నిస్సందేహంగా కొన్ని అనుమానాలు పాపము అయినవి. (అల్ హుజురాత్: 12)**

ఎవరయినా అకారణంగా ఒకరి గురించి అనుమానాలు, సందేహాలు వ్యక్తం చేసినట్లయితే అతను ఆ వ్యక్తి గురించి నిరాధారమయిన విషయాలు ఆపాదించడమూ సాధ్యమవుతుంది. ఇలా చేసే అధికారం అతనికి ఎంతమాత్రం లేదు. ఎటువంటి అపరాధం లేకుండానే ఎవరినయినా అపరాధిగా భావించడం ధార్మికంగా, నైతికంగా బలహీనతకు నిదర్శనం. విశ్వాసి ఇటువంటి స్థితికి దూరంగా ఉండటం అవసరం. దివ్యఖుర్ఆన్ పదాలలో విశ్వసించేవారు పరస్పరం సోదరులు. సోదరుల మధ్య ఉండవలసిన సంబంధానికి ఆధారం సదభిప్రాయం. సదభిప్రాయం అంతమయినట్లయితే సోదరుడు తన సోదరునికే శత్రువయిపోతాడు. తండ్రికి తనయునిపైన నమ్మకం మిగులదు. దీనికి భిన్నంగా సదభిప్రాయం వల్ల చెడిపోయిన సంబంధాలు సయితం సరిదిద్దుకుంటాయి. అనుమానాల వల్ల మంచి సంబంధాలూ చెడిపోతాయి.

ఒక ముస్లిమ్ వ్యక్తి మరో ముస్లిమ్ వ్యక్తి పట్ల సూత్రప్రాయంగా విశ్వాసం కలిగి ఉండాలి. అతన్ని తన శ్రేయోభిలాషిగా, సానుభూతిపరునిగా, సన్నిహిత మిత్రునిగా, అమానతుదారుగా భావించాలి. అతని ద్వారా తన ధనమాన ప్రాణాలకు ఎటువంటి ప్రమాదమూ కలగదన్న నమ్మకముండాలి. ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవిచ్చారు, “ముస్లిమ్ మరో ముస్లిమ్ వ్యక్తికి సోదరుడు. అతను అతనికి అన్యాయం చేయడు, అతన్ని

దూషించడు, అతన్ని అవమానించడు. ఒక ముస్లిమ్ వ్యక్తికి మరో ముస్లిమ్ వ్యక్తికి చెందిన ప్రతి వస్తువూ నిషిద్ధమయినదే, ఆదరణీయమయినదే. అతని ప్రాణమయినా, అతని ధన సంపత్తి అయినా, అతని మానాభిమానాలయినా."★

సదభిప్రాయం వల్ల నమ్మకం పుడుతుంది. అనుమానాల వల్ల నమ్మకం వమ్మయి పోతుంది. ఒక వ్యక్తి మరో వ్యక్తి పట్ల అనుమానానికి గురయినట్లయితే అతను చేసే ప్రతి పనీ అతనికి నచ్చదు. ఒక్కోసారి ఈ అనుమానం ఎంతగా పెరిగిపోతుందంటే, మనిషి ఒక వ్యక్తి పట్ల అనుమానానికి గురయినట్లయితే అతని ప్రసంగాన్నీ, అతని రచననూ, అతని సంభాషణనూ, అతని కృషినీ– ప్రతి విషయాన్నీ తనకు నష్టం కలిగించే లేదా తనను అవమానపరచే ప్రయత్నంగా చూస్తాడు. అతను మొదటే ఊహించుకుంటాడు, ఎదుటి వ్యక్తి చేసే ప్రతి పని, ప్రతి మాట తప్పనిసరిగా తనకు వ్యతిరేకంగానే ఉంటుందని. ఈ ఊహ ఆధారంగానే ఆ వ్యక్తి పట్ల తన వైఖరిని నిర్ణయించుకుంటాడు.

ఈ రోగం ఒక సంస్థలో పుట్టినట్లయితే దాని వ్యవస్థనంతటినీ ఛిన్నాభిన్నం చేసి వేస్తుంది. సంస్థలో ప్రతి వ్యక్తి మరో వ్యక్తికి ప్రతిగా కుతంత్రం పన్నుతున్నట్లు అగుపిస్తుంది. సంస్థ ఏదో ఉన్నత ఆశయం కోసంకాక తన సహచరులకు వ్యతిరేకంగా కుట్రలు తయారు చేసేందుకు నిమగ్నమయి ఉన్నట్లు, వారిని నడిబజారులో పరాభవంపాలు చేసేందుకు పనిచేస్తున్నట్లు కానవస్తుంది. ఇది సంస్థ గొప్పదనానికీ, దాని కార్యకలాపాలకూ హాలా హలం లాంటిది, ఇది వాటిని అంతమొందించి తీరుతుంది.

సంస్థలో, ప్రతి వ్యక్తి మరో వ్యక్తిని తన పట్ల ప్రేమాభిమానాలు గలవానిగా, స్నేహితునిగా, శ్రేయోభిలాషిగా, సానుభూతిగల వానిగా ఎంచే వాతావరణం నెలకొనాలి. ఈ వాతావరణం సదభిప్రాయం లేనిదే నెలకొనజాలదు. దీనికిగాను సంస్థలో ప్రతి వ్యక్తి మరో వ్యక్తిని తప్పయినవాడుగా భావించరాదు. సదాచారుడు, చిత్తశుద్ధి గలవాడు అనే భావించాలి. తనకు అతని పట్ల ఏదయినా విరుద్ధ విషయం తెలిసి వచ్చినా వెంటనే దాన్ని విశ్వసించరాదు, దానికి మంచి కారణం ఏదయినా వెదకాలి. లేదా దాన్ని చెప్పేవాని అపార్థంగా భావించి చూపోపు వహించాలి. ఒక వ్యక్తిలోని లోపాలను గురించి తెలుసు కోవడం అవసరమే అయినప్పటికీ పూర్తి విషయాలు ఖచ్చితంగా ప్రాప్తం కానంత వరకు ఆ లోపాలను ఎట్టి పరిస్థితుల్లోనూ చెప్పుకుంటూ తిరగరాదు. ఎందుకంటే నిర్ధారణ లేకుండా ఏ మాటనయినా పలకడం మహాపాపం. ఆ విషయాలను తెలుసుకోవడం ప్రపంచంలోనూ పరలోకంలోనూ ప్రయోజనకరం కాకపోయినట్లయితే మౌనం వహిం చడం ఉత్తమం. ఇందులోనే అతని ఇహపరాల శుభం ఇమిడి ఉంది.

---

★ సహీహ్ ముస్లిమ్, కితాబుల్ బిర్ర్ వస్సిల, బాబ్ తహ్రీమ్ జుల్మిల్ ముస్లిమ్.

సంస్థలోని వ్యక్తుల మధ్య కొన్ని ప్రత్యేక కోణాలలో సద్భావన ఏర్పడటం అవసరం.

1) ధర్మానుసరణకు ఉనికిలోకి వచ్చిన సంస్థలోని వ్యక్తులకు పరస్పరం ధార్మిక, నైతిక, శీలస్వభావాలను గురించి తప్పనిసరిగా సద్భావన ఉండాలి. ఇందులో ప్రవేశించే వ్యక్తులందరూ తమ జీవితాలను ధర్మానికి అనుగుణంగా మలచుకోవాలన్న దీక్షా సంకల్పాలతో ప్రవేశిస్తారు. ఈ సంకల్పంలో వారు చిత్తశుద్ధిగల వారని నమ్మాలి. వారు చిత్తశుద్ధిగల వారు కాదనడానికి మన వద్ద ఆధారాలేవీ లేవు. మరో విషయాన్ని మనం గమనించవలసి ఉంటుంది. సంస్థలో బలహీన సంకల్పం, బలహీన నైజం గలవారున్నూ ఉంటారు. వారు ఎంతగా కోరుకున్నా, ఎంతగా ప్రయత్నించినా ధర్మాన్ని పూర్తిగా అనుసరించలేకపోతారు. కొందరు ఒక ధార్మిక సంస్థలో చేరినప్పటికీ ధర్మవిరుద్ధమయిన భావాలు, ఆలోచనలు, ప్రవృత్తులు అచేతనంగానే కలిగి ఉంటారు. అందువల్ల సంకల్పితంగానయినా అసంకల్పితంగానయినా వారి ద్వారా విభిన్న లోపాలు వ్యక్తమవుతూ ఉంటాయి. ఇదంతా సంస్కరణలోని లోటుపాట్లు. వీటి సంస్కరణ జరిగితే వారు స్వయంగానే తమ లోటుపాట్లూ చక్కదిద్దుకుంటారు.

మనం గమనించవలసిన విషయం ఏమిటంటే, కేవలం మంచిని సంకల్పించుకున్నంత మాత్రాన మనిషి దైవదూతగా మారిపోడు, మానవునిగానే ఉంటాడు. అందువల్ల అతను తప్పుల నుండి పూర్తిగా పరిశుద్ధుడయిపోడు. అతని వల్ల నిశ్చయంగా పొరపాట్లు జరగడం సాధ్యమే. అసలు చూడవలసింది అతనిలో ధర్మావలంబన భావాలున్నాయా లేదా అన్నదే. ఈ భావమే ఉన్నట్లయితే ఎంత పెద్ద తప్పు చేసినా ధర్మానికి దూరంకాడు, ధర్మం వైపునకే మరలుతాడు. ఒక్కోసారి ఎంతో బలంగా మరలుతాడు, తన బలహీనతలన్నింటిపైనా అదుపు సాధిస్తాడు. అందువల్ల ఒక వ్యక్తిలో ధర్మావలంబన భావమున్నట్లయితే, అతను చేసిన ఏ తప్పిదాన్నయినా చూసి మీరు అతని ధార్మికత, విశ్వాసాలను గురించి అనుమానాలకు లోనవరాదు. ఇది మానవ సహజ బలహీనతగా భావించి దాని సంస్కరణకు ప్రయత్నించండి. ఇది అతనికీ శ్రేయస్కరం, మీకూ శ్రేయస్కరమే.

2) సంస్థలో అభిప్రాయభేదాలంటూ పొడసూపడం సహజం. ఇది చిత్తశుద్ధితో ఏర్పడే అభిప్రాయభేదమయితే సంస్థకు నష్టదాయకం కాదు. సంస్థలో ఆలోచనాత్మక ప్రగతికి ఒక పరిమితి మేరకు అనివార్యం కూడా. సంస్థలో భేదాభిప్రాయమే లేదంటే సంస్థలో చింతనా శక్తి క్షీణించిందన్న మాట. ఆలోచించగల వ్యక్తులు నలుగురు ఒక సమస్యను గురించి చర్చించినప్పుడు వారి అభిప్రాయంలో సంపూర్ణమయిన సామరస్యం కుదరడం అసాధ్యం. ఒకే సంస్థకు చెందినవారయితే సూత్రప్రాయంగా వారిలో ఏకాభిప్రాయమున్నప్పటికీ – అది ఎలాగూ తప్పనిసరిగా ఉంటుంది – కాని వివరాలలో సయితం ఏకాభిప్రాయం కుదరడం తప్పనిసరి కాదు. అందులో అభిప్రాయ భేదమూ

ఏర్పడవచ్చు. సూత్రప్రాయమయిన విషయాలలో భేదాభిప్రాయం ఏర్పడితే సంస్థ నిలబడదు. మరి వివరాలలో సయితం భేదాభిప్రాయానికి ద్వారాలు మూసివేసినట్లయితే స్వతంత్రంగా ఆలోచించే సామర్థ్యం అంతమయిపోతుంది. ఈ విధంగా సంస్థలో ఆలోచనాత్మక స్తబ్దత నెలకొంటుంది.

సంస్థలో ఏర్పడే వాతావరణంలో, ఏదయినా విషయంలో ఒకటికి మించి అభిప్రాయాలున్నట్లయితే అప్పుడు ఒకరి అభిప్రాయాన్ని మరొకరు ఆదరించాలి, ఆ విషయంలో ఎటువంటి అనుమానాలకు, శంకలకు తావివ్వరాదు. మీ అభిప్రాయాన్ని సరయినదిగా ఇతరుల అభిప్రాయాన్ని తప్పయినదిగా భావించే అధికారమయితే మీకుంటుంది. కాని మీ అభిప్రాయాన్నయితే చిత్తశుద్ధి గలదిగాను ఇతరుల దాన్ని చిత్తశుద్ధి లేనిదిగా పరిగణించే హక్కు మటుకు మీకుండదు. సంస్థ విషయంలో మీరు చిత్తశుద్ధిగల వారయినట్లే మీరు విభేదిస్తున్న అభిప్రాయం గల వ్యక్తి కూడా చిత్తశుద్ధిగల వాడే. అతని వల్ల సంస్థ వ్యవహారాలలో భావాన్వయ కృషిలో పొరపాటు జరగడం సాధ్యమేకాని, కావాలని, చూస్తూ తప్పుడు త్రోవ తొక్కడం జరగదు. మీరు అతన్ని సంస్థ సిద్ధాంతాలకు దూరంగా పోతున్నట్లు, తిరోన్ముఖం పట్టిస్తున్నట్లు కూడా నిందమోపగలరు, కాని దానికి పటిష్ఠమయిన ఆధారాలు చూపడం అవసరం. కేవలం కుశంకల వల్ల అలా నింద మోపడం సరయినది కాదు.

3) ఆచరణారంగంలోనూ సంస్థలోని వ్యక్తులందరూ ఒకే స్థాయి గలవారుండరు. కొందరు అలసత్వం చూపేవారయితే మరికొందరు చురుకయిన వారుంటారు. కొందరు సంస్థ కార్యకలాపాలలో రేయింబవళ్ళు నిమగ్నులయి ఉంటారు. కొందరు చాలా తక్కువ సమయం ఈ పనులకు కేటాయించగలుగుతారు. సంస్థలో కొందరు తమ సర్వస్వాన్ని ధారపోయగలవారుంటే, మరికొందరిలో సంస్థ కొరకు ఖర్చు పెట్టే త్యాగనిరతి తక్కువ స్థాయిలో ఉంటుంది. సంస్థలోని సమస్త వ్యక్తులు దాని ధ్యేయాన్ని సమాన స్థాయిలో జీర్ణించుకుని ఉండరు, ఈ విషయంలో వారి మధ్య హెచ్చుతగ్గులుండటం సహజం. ఈ హెచ్చుతగ్గులు ఆచరణారంగంలో వ్యక్తమవుతుంటాయి. ఇటువంటి కొరతలు కానవచ్చిన చోట వాటిని దూరం చేసే కృషి జరగాలి. అంతేగాని దాన్ని సంస్థ పట్ల వారి విద్రోహానికీ, వారికి సంబంధం సంస్థతో తగ్గిపోయిందనడానికి మటుకు ఆధారంగా చూపకండి. ఎప్పుడయినా ఇటువంటి బలహీనత సంస్థ పట్ల అపవిశ్వాసాన్ని సృష్టించే కారణంగానూ మారవచ్చు. అలాంటి పరిస్థితుల్లో దాన్ని విమర్శించడం అవసరమే, సంస్థను దాని కీడు నుండి కాపాడటానికి. కాని అలా కానప్పుడు ఏదయినా క్రియా రంగంలోని బలహీనతను ఆ వ్యక్తి సంకల్పంలో చెడుగు దారి చేసుకున్నట్లుగా అనకండి, అలాగే ప్రతి తప్పుడు

పనిని సంస్థ పట్ల విద్రోహంగానూ భావించకండి, అలా భావిస్తే ఆ బలహీనత దూర మయితే కాదు కాని ఆ వ్యక్తి సంస్కరణా ద్వారాలు మూసుకుపోతాయి.

## హితైష్ణత, శ్రేయోభిలాష

హజ్రత్ తమీమ్ దారి (రజి అల్లాహు అన్హు) ఇలా ఉల్లేఖించారు, దైవసందేశ హరులు (సల్లల్లాహు అలైహి వసల్లం) మూడు మార్లు ఇలా అన్నారు:

**ధర్మం అన్నది, హితైష్ణత, శ్రేయోభిలాష...** **الدين النصيحة**

దానికి మేము ఎవరి పట్ల శ్రేయోభిలాష అని అడిగాము. ఆయన ఇలా సెలవిచ్చారు,

**శ్రేయోభిలాష, హితైష్ణత, అల్లాహ్ పట్ల, ఆయన గ్రంథం పట్ల, ఆయన సందేశ హరుని పట్ల, ముస్లిముల నాయకుని పట్ల, వారి సామాన్య జనుల పట్ల.★**

**لله ولكتابه ولرسوله ولائمة المسلمين و عامتهم**

ఇదొక సమగ్రమయిన హదీసు. దీన్నిబట్టి ధర్మసేవ కొరకు, దాని పునరుజ్జీవనానికి ఉనికిలోకి వచ్చిన సంస్థ పట్ల హితైష్ణత, శ్రేయోభిలాషను అమలుపరచడం ఎంత అవసరమో మీరే గమనించగలరు.

హితైష్ణత భావం – పరిమితమయినది కాదు. ఈ పదం సువిస్తర భావం గల పదం. శ్రేయోభిలాషతో కూడుకున్న ఏ సంబంధాన్నయినా మీరు మీ దృష్టిలో ఉంచుకుని చూడండి, అప్పుడు మీకు ఈ పదంలోని విస్తృతి గోచరిస్తుంది. మీకు బాగా తెలుసు, తండ్రి తన తనయుని పట్ల శ్రేయోభిలాష కలిగి ఉంటాడు. అతని శ్రేయోభిలాషను విశ్లేషిస్తే, అతను తన సంతానం సుఖసంతోషాలకు తన సుఖసంతోషాలపైన ప్రాధాన్యతనిస్తాడు. స్వయంగా బాధలు అనుభవిస్తాడు కాని సంతానానికి సుఖం కలిగించే ప్రయత్నం చేస్తాడు. అతని ప్రగతీ వికాసాలు, అతని విద్యాబోధనలు, శిక్షణ, ఆరోగ్యాలను గురించి చింతాగ్రస్తుడయి ఉంటాడు. ఈ విషయాలన్నింటిలో అతను నిస్వార్థపరుడయి, చిత్తశుద్ధి గలవాడయి ఉంటాడు. అతను తన సంతానం కొరకు ఎటువంటి స్వార్థచింతన లేకుండా సేవలందజేస్తాడు. ఏ కోణంలోనూ సంతానానికి హాని కలిగించడానికి ఇష్టపడడు.

ఇటువంటి శ్రేయోభిలాష భావం సంస్థలో చోటు చేసుకుంటే నలువైపులా ప్రేమ,

★ సహీహ్ ముస్లిమ్, కితాబుల్ ఈమాన్, బాబ్: బయాన్ అద్దీనున్న సీహ; ఈ విషయా లన్నిటిని గురించి మరిన్ని వివరాలు రచయిత పుస్తకం మారూఫ్ వ మున్కర్ (ఉర్దూ) చూడవచ్చు.

సానుభూతి, కష్టాల్లో సహాయం, ప్రేమాభిమానాల వాతావరణం నెలకొంటుంది. సంబంధాలు, తండ్రీ తనయుని వంటివిగా మారిపోతాయి. హితైష్టత, సంస్థకు సంపద వంటిది. ఇదే లేకపోతే సంస్థ సజీవమయి మెలగటం కష్టం. సంస్థలోని విభిన్న కోణాలలో శ్రేయోచింతన భావం నెలకొనడం అవసరం.

## సిద్ధాంతాల పట్ల శ్రేయోభిలాష

ప్రతి సంస్థకు ఒక ధ్యేయమంటూ ఉంటుంది. అది దాని ముందు కొన్ని సూత్రాలు, సిద్ధాంతాలు కలిగి ఉంటుంది. ఇవే దానికి ఇతర సంస్థలతో ప్రత్యేకతను ప్రసాదిస్తాయి. దాని ముందు దాని ధ్యేయం ఉన్నంత వరకు, అది దాని సూత్రాలనూ, సిద్ధాంతాలను పాటిస్తున్నంత వరకు సజీవంగా ఉంటుంది, ముందుకు సాగుతుంది. లేకపోతే అంతమయిపోతుంది. ఒకవేళ మిగిలి ఉన్నా అందులోనూ ఇతర సంస్థలలోనూ ఎటువంటి వ్యత్యాసముండదు. ధర్మసందేశాన్ని వ్యాపింపజేయాలని, దాన్ని సమున్నత పరచాలని స్థాపించబడిన సంస్థ పట్ల హితైష్టత అంటే దాని ధ్యేయం, సిద్ధాంతాలను పరిరక్షించాలి. సంస్థ దాని సిద్ధాంతాల నుండి దూరం కానట్లు కాపాడే ప్రయత్నం చేస్తూ ఉండాలి. సంస్థ తన సిద్ధాంతాలను వదలివేసినట్లయితే, దానికి మీరు మౌనం వహించినట్లయితే, మీకు సంస్థ పట్ల ప్రేమాభిమానాలు లేవని రుజువవుతుంది. మీకు దాని సైద్ధాంతిక ఉనికి పట్లనూ ఆసక్తి లేదు, అది లేకున్నా మీకు బాధ కలగదన్న మాట.

మీరు సంస్థ తీసుకునే ప్రతి చర్యనూ గమనించాలి, అది దాని సిద్ధాంతాలకను గుణంగా ఉందా లేదా అని పరిశీలించాలి. ఏ చర్య అయినా సంస్థ సిద్ధాంతాలకు భిన్నమయినదిగా మీరు గమనించగానే దాన్ని సంస్థ సిద్ధాంతాలకు అనుగుణ్యమయినదిగా మలచడం మీ బాధ్యత, విధి. సంస్థలోని వ్యక్తులు సంస్థ సిద్ధాంతాల పరిరక్షణ పట్ల జాగరూకులయి లేకపోయినట్లయితే వారు స్వయంగా దాని సిద్ధాంతాల పట్ల నిలకడ కలిగి ఉండటం కష్టసాధ్యం.

## సంస్థ కార్యకలాపాల పట్ల శ్రేయోభిలాష

సంస్థ పట్ల హితైష్టతకు ఒక రూపం, మీరు సంస్థ కార్యకలాపాలలో సహకారం అందజేయడం, సంస్థ పనుల్ని స్వంత పనులు నిర్వర్తించినట్లు నిర్వర్తించాలి. సంస్థలో ఏ పని మీద మిమ్మల్ని నియోగించడం జరుగుతుందో దాని మీద పూర్తి స్థాయి నిలకడతో, పటిష్ఠతతో స్థిరంగా నిలబడాలి. పనిని అప్పగిస్తే దాన్ని మనఃపూర్వకంగా, ప్రశాంతంగా, సంతృప్తి కరంగా నిర్వర్తించాలి. మీ మనోమస్తిష్కాలలో కేవలం ఆ ఒక్క తపనే పెనవేసుకుని ఉంటే మీరు సంస్థ పట్ల అత్యుత్తమ శ్రేయోభిలాషి కాగలరు, సంస్థ ఏ సందేశాన్ని అంద

జేయగోరుతున్నదో అది ప్రపంచంలో వ్యాప్తి చెందాలని, ఆధిక్యత పొందాలని, సమున్నత మవ్వాలని మీరు కోరుకోవాలి, మీరు ఈ భావనలో కొరత చూపినట్లయితే సంస్థ పట్ల మీ శ్రేయోచింతన అసంపూర్ణమన్న మాట.

## నాయకుని పట్ల శ్రేయోభిలాష

శ్రేయోభిలాషకు మరో రూపం మీరు మీ నాయకుడు, అధికారి పట్ల శ్రేయోభిలాషులయి మెలగాలి. అతని మేలును కోరేవారయి మనగలగాలి. అతను కృతకృత్యుడవ్వాలని కోరుకోవాలి. అతని కోసం ప్రార్థించాలి. అతనికి మంచి సలహాలనివ్వాలి. సంతోషంతో అతనికి విధేయత పాటించాలి. సత్కార్యాల్లో అతడితో సహకరించకపోవడం అతని పట్ల దురభిలాషే అయినట్లు దుష్కార్యాల్లో అతన్ని అడ్డగించకపోవడం కూడా దురభిలాషే.

## అనుయాయుల పట్ల శ్రేయోభిలాష

సంస్థ అధినేత, అధికారులు కూడా తమ అనుయాయుల పట్ల శ్రేయోభిలాషులయి ఉండటం వారి విధి. వారు ధర్మంపైన నిలకడ కలిగి ఉండటానికి వారికి సరయిన మార్గబోధన చేయాలి. వారి మధ్య సమభావంతో మెలగాలి. ఎవరినీ మరొకరి పైన ప్రాధాన్యతనివ్వరాదు. ఎవరి పట్లను దురభిలాష కలిగి ఉండరాదు. ఎవరి పట్లనూ తమ హృదయాలలో వైరభావం కలిగి ఉండరాదు. అందరి పట్లనూ ప్రేమతో మెలగాలి. నాయకుడు, అనుయాయి మధ్యన ఎటువంటి ప్రేమాభిమానాలు, హితచింతన ఉండాలో హజ్రత్ ఔఫ్ బిన్ మాలిక్ అష్జయీ (ర) ఉల్లేఖనంలో ద్యోతకమవుతుంది. దైవసందేశహరులు (స) ఇలా సెలవిచ్చారని ఆయన తెలిపారు:

خِيَارُ اَئِمَّتِكُمُ الَّذِيْنَ تُحِبُّوْنَهُمْ وَ يُحِبُّوْنَكُمْ وَ تُصَلُّوْنَ عَلَيْهِمْ وَ يُصَلُّوْنَ عَلَيْكُمْ وَ شِرَارُ اَئِمَّتِكُمُ الَّذِيْنَ تُبْغِضُوْنَهُمْ وَ يُبْغِضُوْنَكُمْ وَ تَلْعَنُوْنَهُمْ وَ يَلْعَنُوْنَكُمْ

మీరు మీ నాయకుల్ని ప్రేమించగా వారు మిమ్మల్ని ప్రేమించేవారయితే వారే మీ నాయకుల్లో ఉత్తమమయినవారు. వారి కొరకు మీరు దుఆ చేయాలి, వారూ మీ కొరకు దుఆ చేయాలి. మీ దుష్టతమమయిన నాయకులెవరంటే, వారిని మీరు ఇష్టపడరు, వారూ మిమ్మల్ని ఇష్ట పడరు. మీరు వారిని శపిస్తారు, వారూ మిమ్మల్ని శపిస్తారు.★

★ సహీహ్ ముస్లిమ్, కితాబుల్ ఇమార, బాబ్ ఖియారుల్ అయిమ్మ వషిరారుహుమ్.

## సామాన్య వ్యక్తుల పట్ల హితైషుత

సంస్థలోని సాధారణ వ్యక్తుల పట్లనూ శ్రేయోచింతన కలిగి ఉండాలి. వారు ఒకరి నొకరు మంచిని బోధించుకోవాలి, చెడును దూరంగా ఉంచాలి. సన్మార్గాన నడిచేందుకు పురికొలపాలి. ధర్మం పట్ల స్థిరత్వం కలిగి ఉండేలా ప్రయత్నించాలి. ధార్మిక విషయాల్లోనే కాక ప్రాపంచిక కార్యకలాపాల్లోనూ ఒకరికొకరు తోడుగా నిలువాలి, ఉత్తమ సలహాదారు లుగా, సహాయకులుగా మనగలగాలి. ఈ విధంగా వారి మధ్య సోదర సంబంధాలు ఏర్ప డాలి. మనఃపూర్వకంగా పరస్పరం శ్రేయోభిలాషులయి, నిజమయిన సానుభూతి పరులయి జీవించాలి.

మీరు ఒక ధార్మిక సంస్థలో ధర్మసేవ కొరకు చేరినట్లయితే దాని సంస్కరణ, సుశిక్షణల బాధ్యత కేవలం దాని నాయకమన్యులదే కాదు, మీరూ అందులో పాలుపంచు కోవలసి ఉంటుంది. అది మీకూ విధియే. సంస్థలో ఎక్కడ ఏ వ్యక్తిలోనయినా ఏదయినా లోపం చూస్తే దాన్ని దూరం చేసే ప్రయత్నం చేయాలి. ఇది ఎంతో కష్టసాధ్యమయిన పని అనడంలో ఎటువంటి సందేహం లేదు. ఇది సులభతరం కావాలంటే మీలో సంస్థలోని వ్యక్తుల పట్ల శ్రేయోభిలాష పుష్కలంగా ఉండాలి, మీరు వారి పట్ల తప్పులెన్ను వారుగా కాక, విమర్శకులుగా కాక, వారి సానుభూతిపరులయి, శుభచింతకులయి వారిని సంస్క రించే ప్రయత్నం చేయాలి. ఈ భావం లేకుండా మీరు వారి సంస్కరణకు సంబంధించిన సుస్థిర ప్రయత్నమేదీ చేయలేరు. ఏదో తాత్కాలిక భావంతో చేసినా దాని ఫలితాలు ఉత్తమ రీతిలో బయల్పడజాలవు. ఒక వ్యక్తి మిమ్మల్ని తన శ్రేయోభిలాషిగా భావించకపోతే మీ మాటను వినలేడు. విన్నా దాని ద్వారా పొందవలసిన ప్రేరణ పొందలేడు. అలాకాక మిమ్మల్ని తన దురభిలాషిగా భావించినట్లయితే మీ మంచి మాటకు చెడు ప్రభావమే స్వీకరిస్తాడు. శ్రేయోభిలాష అన్నది మీరు ప్రకటించగానే దాన్ని ఎదుటి వ్యక్తి నమ్మే విషయం కాదు. దానికి మీ వైఖరిలో మార్పు అవసరం. మీరు మీ మాట తీరు, ఆచరణా విధానంలో క్రియాత్మకంగా హితైషువులని రుజువు చేసుకోవలసి ఉంటుంది. సంస్కరణకు మనఃక్లేశాన్ని కలిగించే విధానాన్నికాక ప్రేమ, సానుభూతి గల విధానాన్ని అవలంబించవలసి ఉంటుంది. మీరు నిజంగానే సంస్కరణ కోరుకుంటున్నారన్న భావం గట్టిపడాలి. ఒకరిలో ఏదయినా లోపం కానవస్తే బహిరంగంగా వెంటనే దాన్ని వ్యక్తం చేయక ఏకాంతంలో దాన్ని తెలిపే ప్రయత్నం చేయాలి.

ఇమామ్ షాఫియీ ప్రకారం, "ఏకాంతంలో చేసే హితవు వాస్తవంగానే అది హిత వాక్కు. జనుల మధ్య చేసే హితవు అవమాన కారకం." గుర్తుంచుకోండి, ఒకరి తప్పులను బయటపెట్టడం మహాపాపం. ఒకరిని పరాభవంపాలు చేయదలచిన వ్యక్తిని దైవమే పరాభవం పాలుచేస్తాడు. మరెవరిని దైవం పరాభవంపాలు చేస్తాడో అతని మానాభిమానా లను ఎవరూ రక్షించలేరు.

-: సమాప్తం :-